# శ్రీవిద్యా లహరి

(సౌందర్యలహరికి విశేష వ్యాఖ్య)



## స్వామి పరమానందనాథ

(డా॥ క్రోవి పార్థసారథి)

# శ్రీవిద్యా లహరి

## (సౌందర్యలహరికి విశేష వ్యాఖ్య)

గ్రంథకర్త :

**స్వామి పరమానందనాథ**

(డా॥ క్రోవి పార్థసారథి)

# శ్రీవిద్యాలహరి


గ్రంథకర్త :

**స్వామి పరమానందనాథ (డా॥ క్రోవి పార్థసారథి)**

ప్రథమ ముద్రణ : నవంబరు, 2006

ప్రతులు : 1000




**మూల్యము : రూ. 150-00**


ప్రతులకు :

1. **క్రోవి మంజూష**
   23-11/1-10/2, ఓగిరాలవీధి,
   సత్యనారాయణపురం, విజయవాడ-11.
   ఫోన్ : 0866-2530672

2. **శివకామేశ్వరి గ్రంథమాల**
   41-22/4-36, భ్రమరాంబాపురం,
   కృష్ణలంక, విజయవాడ-520 013
   ఫోన్ : 0866-2522824

ముద్రణ :
నిర్మలా ఆఫ్‌సెట్ ప్రింటర్స్,
గాంధీనగర్, విజయవాడ-3.
ఫోన్ : 0866-2574828

# ప్రణతులు

శ్రీవిద్యను గురించి తెలిపే గ్రంథాలలో గౌడపాదుడు వ్రాసిన 'సుభగోదయస్తుతి', పుణ్యానందముని వ్రాసిన 'కామకలావిలాసము', 'యోగినీ హృదయము', 'లలితాసహస్రము', 'సౌందర్యలహరి' ముఖ్యమైనవి. వీటిలో మొదటి నాలుగింటికీ గతంలో వ్యాఖ్య వ్రాసి ప్రచురించటం జరిగింది. అవి 1) శ్రీవిద్యా దర్పణము 2) శ్రీవిద్యా సర్వస్వము 3) శ్రీవిద్యా హృదయము 4) శ్రీవిద్యాసారథి అనే పేర్లతో షాపులలో దొరుకుతున్నాయి. అదే స్ఫూర్తితో, శ్రీవిద్యను అందరికీ అందించాలనే ఉద్దేశ్యంతో ఇప్పుడు 'సౌందర్యలహరి'కి 'శ్రీవిద్యాలహరి' పేరుతో వ్యాఖ్య వ్రాస్తున్నాను. శ్రీవిద్యాపరంగా నేను వ్రాసిన గ్రంథాలన్నింటి పేరులోనూ ముందు 'శ్రీవిద్య' అనే పదం ఉన్నది. అందుచేతనే సౌందర్యలహరికి కూడా 'శ్రీవిద్యాలహరి' అని నామకరణం చెయ్యటం జరిగింది.

వ్యాఖ్య అంటే 1) పదచ్ఛేదము 2) ప్రతిపదార్థము 3) సమాస విగ్రహము 4) వాక్యయోజన (అన్వయము, ఆలోచన) 5 ఆక్షేప సమాధానములు. అనే ఐదు లక్షణాలు ఉండాలి. కాని వీటివల్ల సామాన్యుడికి ఏ ఉపయోగం ఉండదు. అందుచేత 'వ్యాఖ్య' అనే పదానికి కేవలము 'వివరణ' అని అర్థం తీసుకుని లక్ష్మీధర వ్యాఖ్యతో బాటుగా పైన చెప్పిన శ్రీవిద్యాగ్రంథాలు, దేవీ ఉపనిషత్తులు, దేవీ భాగవతాలను జోడించి ఈ గ్రంథం వ్రాయటం జరిగింది.

ఈ గ్రంథరచనలో నాకు అన్నివిధాలా సహకారమందించిన నా భార్య శ్రీమతి రమాదేవికి కృతజ్ఞతలు.

ఈ గ్రంథ ముద్రణకు ఆర్థిక సహాయం చేసిన శ్రీ గండికోట రఘురామశర్మ, వారి భార్య శ్రీమతి రమాదేవి గారికి, వారి కుటుంబసభ్యులకు, ఆ పరమేశ్వరి అఖండ ఆయురారోగ్య ఐశ్వర్యాలు ప్రసాదించాలని ఆకాంక్షిస్తున్నాను. గతంలో నేను వ్రాసిన గ్రంథాలలాగానే దీన్నికూడా ఆదరిస్తారని ఆకాంక్షిస్తూ ....

ఏమీ తెలియని నేను ఈ గ్రంథరచనకు పూనుకొన్నందుకు కోపగించకుండా, పండితులు, పరమేశ్వరి భక్తులు, శ్రీవిద్యా దురంధరులు నా యీ సాహసాన్ని మన్నించి నన్ను ఆశీర్వదిస్తారని భావిస్తూ ...........

భవదీయుడు,

**క్రోవి పార్థసారథి**

వ్యయనామ సంవత్సర
కార్తీక పౌర్ణమి, ఆదివారము
5-11-2006.

# అవధూత దత్తపీఠాధిపతి పరమపూజ్య
# శ్రీ శ్రీ శ్రీ గణపతి సచ్చిదానంద స్వామిజీవారి
# దివ్య ఆశీస్సందేశము

భగవత్ సృష్టి సుందరము (మనోహరము). ఆ సౌందర్యమును పరిపూర్ణముగా ఆస్వాదించి ఆనందించాలంటే ఆ భగవంతుని అనుగ్రహమే కావాలి. ఈ సౌందర్యము దృశ్యములో (విషయములో గానీ, వస్తువులోగానీ) ఉందా ? లేక ద్రష్టలో (చూసేవాడిలో) ఉందా? అని చర్చించి ద్రష్టలోనే ఉంది అని నిర్ణయించారు. ఆధునికులు కూడా ఈ విషయములో పూర్తిగా ఏకీభవిస్తున్నారు.

సృష్టిలోని అణువణువూ, అణువులయొక్క కలయిక (పదార్థములు, వస్తువులు, విషయములు మొదలైన) ఆలోచనలు ఇవన్నీ ఒక్కొక్క రకమైన సౌందర్యముతో కూడియున్నవే. ఎవనికైతే పరమాత్మ కృపాదృష్టి విరివిగా లభిస్తుందో, ఆ వ్యక్తికి మాత్రమే ఈ సౌందర్యమును ఆస్వాదించి, అనుభవించి, ఆనందించే యోగ్యత, శక్తి, యుక్తి మెండుగా ఉంటాయి. అపర శంకరులైన ఆదిశంకరులు ఇటువంటి సాధనము ద్వారా పరిమితిలేని ఆనందాన్ని భక్తులకు పంచి పెట్టే ఉద్దేశ్యముతో చేసిన మహోపకారము సౌందర్యలహరి. ప్రకృతిలోని ప్రతి అంశముయొక్క సౌందర్యమును కనుగొన్న మహాత్ములకు, జీవనమే ఆనందమౌతుంది. ఈ ఆనందమునకు అవధులుండవు. ఇలా ఆనందము అభ్యసించిన వాడికి బయటి ఆనందాన్ని వెతికే అవసరమే ఉండదు. తనయొక్క స్వరూపమే ఆనందము అనే జ్ఞప్తి నిరంతరము ఉంటుంది. ఈ విధానములో పరినిష్ఠితులైన మహాత్ములు నిరంతరము నిరతిశయ ఆనందములో ఉంటారు.

ద్రష్టయొక్క యోగ్యతను బట్టి సౌందర్యములోనూ, ఆనందము లోనూ తారతమ్యాలు అగుపడతాయి. కొన్ని వస్తువులలోనూ,

వ్యక్తులలోనూ మిక్కుటముగా, నిరుపమానముగా వ్యక్తమయ్యే సౌందర్యము అత్యధిక సంతోషాన్ని కలిగిస్తుంది. సామాన్యముగా ఇటువంటి వాటినే అందమైన వస్తువులు, అందమైన మనుష్యులు అని పిలుస్తూ ఉంటాము. ఇటువంటి అందము దృశ్యేంద్రియము ద్వారానేగాక, మరింతగా స్పర్శేంద్రియము, ఇతర ఇంద్రియముల ద్వారా కూడా అధికముగా అనుభవించాలి అనిపిస్తుంది. ఈ కోరిక ఆయా వ్యక్తులలో ప్రసుప్తముగా ఉన్న తామసిక, రాజసిక చిత్తవృత్తుల కలగలుపే. ఇలా ఒక స్వార్థదృష్టితో కాక వస్తుస్థితిని పరికించి అభినందించాలి, అంటే కామదృష్టిని (కోరికను) వీడాలి. ఆ అభ్యాసము మనతో చేయించేందుకు శంకర భగవత్పాదుల విధానమే సౌందర్యలహరి. మూర్తీభవించిన సౌందర్యముగా జగన్మాతను కొనియాడే ఉపాసనా స్థానమే ఈ గ్రంథము.

సౌందర్యము సాధారణముగా స్త్రీలలో ఉంటుందని పురుషులు, పురుషులలో ఉంటుందని స్త్రీలు భావిస్తారు. ఉద్వేగము, ఉద్రేకమునూ, అవివేకమునూ స్ఫుటపరిచే ఈ పరిశీలనకంటే, తల్లి తండ్రులలోనే సద్గుణ - సౌందర్యమును పరిశీలిస్తే కామదృష్టి (స్వార్థబుద్ధి) నశిస్తుంది. అందువల్ల ఆదిదంపతులు, ప్రపంచ మాతాపితరులైన పార్వతీపరమేశ్వరులను శివానందలహరి, సౌందర్యలహరి స్తోత్రములద్వారా జగద్గురువులు విభిన్న కోణములలో చూపించారు. కవితా దృష్టికి బాహ్య సౌందర్య విభవమును చాటిచెప్పే ఎత్తుగడ ఒకటైతే, అంతఃసౌందర్య నిస్సీమశక్తి ప్రాభవమును అనుభవింపచేసే యుక్తి మరియొకటి. ఈ రెంటినీ అద్భుతముగా కలబోసి మంత్ర శాస్త్ర విశేషములు వివిధ ఉపాసన ఫక్కీలను నిబిడితం చేస్తూ, పిల్లకు తల్లియొక్క గొప్పదనమును లలితమైన పదములతో విడమరచి చెప్పే సౌందర్యలహరి స్తోత్రములన్నిటిలో అత్యంత జనప్రియమనుట నిర్వివాదము.

సాహిత్య విద్యార్థులకు పాఠ్యగ్రంథముగానూ, భక్తులకు పారాయణ గ్రంథముగానూ, ఉపాసనాపరులకు మంత్రశాస్త్ర గ్రంథముగానూ, తత్త్వచింతకులకు అద్వైత పరమార్థ బోధికగానూ పలురీతులలో ప్రసిద్ధమైన ఈ గ్రంథమును సమగ్రముగా విశేష్లణ చేయుట బహుకష్ట సాధ్యమే. దత్తపీఠ ఆస్థాన విద్వాంసులైన శ్రీ క్రోవి పార్థసారథి దీనికి పూనుకొనుట, ఈ ప్రయత్నములో సఫలమగుట, వీరియందు గురుమూర్తి, జగన్మాత అవ్యాజదయాపాంగ దృష్టికి నిదర్శనము. పాఠకులు సౌకర్యముకై రచించిన ఈ గ్రంథము, భక్తుల సౌకర్యార్థమై శ్రావ్యరూపముగా (MP 3 CD) గా కూడా ప్రచురించుట ముదావహము. గ్రంథకర్తపై, పాఠకులపై, శ్రోతలపై జగన్మాత చల్లని చూపులు ప్రసరించి వారి హృదయాంతరాళాలలోని భావన సౌందర్యలహరి వర్ధిల్లుగాక !

*జయగురుదత్త !*

విజయదశమి

2-10-2006

# श्री अवधूत दत्त पीठम्

## श्री गणपति सच्चिदानन्द आश्रमः

दत्त नगरम्, नीलगिरि मार्ग, मैसूरु ५७००२५

---

जयतु गुरु दत्त

स्वस्तिश्री चान्द्रमान पार्थिव नाम संवत्सरे वैशाखमासे

कृष्णपक्षे षष्ठ्यां तिथौ भानुवासरे

(२९-५-२००५ दिनाङ्के)

**श्रीविद्या क्षेत्रे**

कृत निरुपमान परिश्रमाः

**श्रीमन्तः डा. क्रोवि पार्थसारथि महोदयाः**

तद्विरचिताभिः सेवाभिः परितुष्टैः

श्रीमदवधूत दत्तपीठाधीशैः जगद्गुरुभिः परमपूज्यैः

**श्री श्री श्री गणपति सच्चिदानन्द स्वामीजी पूज्यपादैः**

# दत्तपीठ आस्थान विद्वान्

इति उपाधि प्रदानेन सम्मानितास्सत्कृता अनुगृहीताश्च ।

| | | |
|---|---|---|
| *कुप्पा वेङ्कट कृष्णमूर्तिः* | | *प्रसाद शर्मा* |
| विद्याधिकारी | पीठमुद्रा | कार्य निर्वाहकः |

# విషయసూచిక

## స్వామి పరమానందనాథ (డా॥ క్రోవి పార్థసారథి) గారి సత్కారాలు

1. 29-05-2005న మైసూరు అవధూత దత్తపీఠ ఆస్థాన విద్వాంసునిగా నియామకము.
2. 21-03-2004న ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వముచే ఉగాది పురస్కారము.
3. 05-09-2004న ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వముచే ఉత్తమ ఉపాధ్యాయ సత్కారము.
4. 15-08-2004న కృష్ణాజిల్లా కలెక్టర్ వారిచే సన్మానము
5. 28-01-2006న "కృష్ణామహోత్సవ్"లో సత్కారము.
6. 05-09-2006న విజయవాడ నగరంలో ఉత్తమ ఉపాధ్యాయునిగా NSUI వారిచే సత్కారము.
7. 05-02-2002న శాతవాహన కళాశాల త్రిదశాబ్ది వేడుకలలో కళాశాల యాజమాన్యము వారిచే రజతపతక ప్రదానము.
8. 23-02-2005న శాతవాహన కళాశాల 34వ వార్షికోత్సవాల సందర్భంగా ఉత్తమ ఉపాధ్యాయునిగా సన్మానము.
9. 28-01-2004న శాతవాహన కళాశాల సెక్రటరీ శ్రీ అండవిల్లి సత్యనారాయణ గారిచే రూ. 500/-ల నగదు ప్రదానము.
10. 13-12-1999న కనకాభిషేకము.
11. 01-08-1998న సువర్ణఘంటాకంకణ ప్రదానము.
12. 03-11-2002న గండపెండేర ప్రదానము
13. 11-01-2004న అవధూత, దత్తపీఠాధిపతి శ్రీశ్రీశ్రీ గణపతి సచ్చిదానంద స్వామివారిచే నవరత్నాంగుళీయ ప్రదానము

**బిరుదులు :**

1. చక్రవిద, శ్రీవిద్యా రత్నాకర, శ్రీవిద్యా విశారద, శ్రీవిద్యానిధి, ఉత్తమ ఉపాధ్యాయ, ఉపాధ్యాయరత్న, విద్యార్థిబంధు.

సన్మానాలు :

1. గౌ॥ శ్రీ నావల్ కిషోర్ శర్మ, గుజరాత్ గవర్నరు వారిచే
2. గౌ॥ శ్రీ టి.ఎన్. చతుర్వేది, కర్ణాటక గవర్నరు వారిచే
3. గౌ॥ శ్రీ డి. శ్రీపాదరావు, స్పీకర్, ఆంధ్రప్రదేశ్ అసెంబ్లీ, వారిచే
4. గౌ॥ జనాబ్ ఎమ్.కె. బేగ్ (ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర సాంకేతిక విద్యాశాఖామాత్యులు) వారిచే
5. గౌ॥ శ్రీ దేవినేని రాజశేఖర్ (నెహ్రూ) (ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర సాంకేతిక విద్యాశాఖామాత్యులు) వారిచే
6. గౌ॥ శ్రీ జలగం ప్రసాదరావు (ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర మాజీ మంత్రివర్యులు) వారిచే
7. గౌ॥ శ్రీ ఉపేంద్రగారు (భారత ప్రభుత్వ మాజీ కేంద్ర మంత్రివర్యులు) వారిచే
8. 08-04-03న "రసభారతి" సాహితీ సంస్థ వారిచే సత్కారము
9. ఆలిండియా వ్యవసాయక పారిశ్రామిక ఎగ్జిబిషన్ సొసైటీ, కృష్ణాజిల్లా, విజయవాడ, వారిచే సన్మానము.
10. అవధూత దత్తపీఠాధిపతి శ్రీశ్రీశ్రీ గణపతి సచ్చిదానంద స్వామి వారిచే
11. కుర్తాళం సిద్ధేశ్వరీ పీఠాధిపతులు శ్రీశ్రీశ్రీ శివచిదానంద భారతీస్వామి వారిచే
12. గన్నవరం భువనేశ్వరీ పీఠాధిపతులు శ్రీశ్రీశ్రీ చిదానంద భారతీస్వామి వారిచే
13. గుంటూరు శృంగేరి శ్రీ విరూపాక్ష పీఠాధిపతులు శ్రీశ్రీశ్రీ శివకల్యాణానంద భారతీ మహాస్వామి వారిచే
14. విశ్వబంధు తపోవనం ట్రస్ట్ అధిపతులు శ్రీశ్రీశ్రీ వాసుదేవానందగిరి స్వామి వారిచే
15. చైతన్య తపోవనం ట్రస్ట్ అధినేత శ్రీశ్రీశ్రీ మాతా శివచైతన్య వారిచే
16. కాళీ గార్డెన్స్ అధిపతులు శ్రీశ్రీశ్రీ చంద్రకాళీ ప్రసాదమాతాజీ వారిచే
17. విజయవాడ లలితా పీఠాధిపతులు శ్రీశ్రీశ్రీ మాతా శివలీల వారిచే
18. విశాఖపట్నం శారదాపీఠాధిపతులు శ్రీశ్రీశ్రీ స్వరూపానందేంద్ర సరస్వతి స్వామివారిచే

# శ్రీవిద్యా లహరి

## ప్రస్తావన

*నమస్కారం గురువుగారూ !*

ప్రశాంతమైన వాతావరణంలో నిర్మలమనస్కుడై తపోనిష్ఠలో ఉన్న రత్నాకరుడు తలెత్తి చూశాడు. ఎదురుగా చేతులు జోడించి నుంచుని ఉన్నారు అతని శిష్యులు కృష్ణశర్మ, నారాయణభట్టు.

చాలా కాలానికి వచ్చిన శిష్యులను చూసి, ఆనందభరితుడై వారికి ఆసనం చూపించి కుశలప్రశ్నలు అడిగి, అనంతరం వచ్చిన పని ఏమిటి ? అన్నాడు.

"గురువర్యా ! ఇప్పటిదాకా విష్ణుసహస్రనామభాష్యము, ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రాలు, ఆత్మసాక్షాత్కారానికి సంబంధించిన విషయాలు చెప్పుకున్నాం. శ్రీవిద్యని గురించి చెప్పాలి అంటే కామకలావిలాసము, యోగినీహృదయము, సుభగోదయస్తుతి, త్రిపురారహస్యము, దేవీభాగవతము, లలితారహస్యనామాలకు భాష్యము, చండీ సప్తశతికి భాష్యము చెప్పుకున్నాం. ఇప్పుడు 'సౌందర్యలహరి'ని మీ నోటిద్వారా వినాలని వచ్చాము. కాబట్టి ఆ సౌందర్యలహరిని మాకు వినిపించి, మమ్ములను కృతార్థులను చెయ్యండి" అన్నారు శిష్యులు.

ఆ మాటలు విన్న రత్నాకరుడు పరమానందం చెందినవాడై, "శిష్యులారా ! రేపు వ్యయనామసంవత్సర వైశాఖబహుళదశమి, పూర్వాభాద్రానక్షత్రం. హనుమజ్జయంతి. మహాపరవడిరోజు. లోకంలో దుష్టశిక్షణ, రాక్షససంహారము చెయ్యటానికి శ్రీమన్నారాయణుడు రాముడుగా జన్మిస్తాడని తెలుసుకుని, **రామకార్యార్థం హనుమాన్ శివః** శ్రీరాముని పనిలో భాగం పంచుకునేందుకు, రాక్షససంహారంలో సాయపడేందుకు ఈశ్వరుడు ఆంజనేయుడిగా అవతరించిన

రోజు. కాబట్టి రేపటినుండి సౌందర్యలహరిని చెప్పుకోవటం ప్రారంభిద్దాం. ఇవాల్టికి సెలవు తీసుకుని రేపు రండి.” అన్నాడు. గురువు గారికి నమస్కారంచేసి సెలవు తీసుకున్నారు శిష్యులు. అనుకున్న ప్రకారం ఆ మరునాడు సాయంసమయాన వచ్చిన శిష్యులు, గురువు గారికి సాష్టాంగ ప్రణామాలర్పించి, ఆయన అనుమతితో సుఖాసీనులైనారు. రత్నాకరుడు అమితానందంతో చెప్పటం ప్రారంభించాడు.

## 1. శంకర భగవత్పాదులు

**శ్రుతిస్మృతి పురాణానామాలయం కరుణాలయం ।**
**నమామి భగవత్పాదశంకరం లోకశంకరం ॥**

**శంకరం శంకరాచార్యం కేశవం బాదరాయణం ।**
**సూత్రభాష్య కృతౌ వందే భగవన్తం పునః పునః ॥**

కేరళ దేశంలో పూర్ణానదీ తీరంలో **‘కాలడి’** అనే గ్రామం ఉంది. ఆ గ్రామంలో ఆర్యాంబ, శివగురువు అనే నంబూద్రిబ్రాహ్మణదంపతులుండేవారు. వారికి చాలా రోజులదాకా సంతానం కలగలేదు. అప్పుడు వారు **‘త్రిచూరు’**లోని వృషాచలేశ్వరుణ్ణి ఆరాధించగా ఆ స్వామిదయ వల్ల వారికి ఒక కుమారుడు కలిగాడు. ఆ పిల్లవాడికి ‘శంకరుడు’ అని నామకరణం చేసి అల్లారుముద్దుగా పెంచసాగారు. శంకరుడికి మూడుసం॥లు వయసు వచ్చేసరికి అతని తండ్రి శివగురువు పరమపదించాడు.

అప్పటి నుంచి అతని తల్లి ‘ఆర్యాంబ’యే కుమారుణ్ణి పెంచి ఐదవ ఏట ఉపనయనం చేసింది. ఆర్యాంబ తన ఇంటివద్ద ఉన్న ఆలయంలో నిత్యం కాత్యాయనీ దేవిని అర్చిస్తూఉండేది. ఒకరోజు తనకు ఆలయానికి వెళ్ళటానికి వీలుపడక బాలశంకరుణ్ణి పంపింది. ఆ బాలుడు దేవినైవేద్యానికి పాలు తీసుకువెళ్ళాడు. ఆలయంలో దేవిని అర్చించి, శంకరుడు దేవికి నైవేద్యంగా పాలు సమర్పించాడు. ఎంతకీ దేవి పాలుత్రాగలేదు. అది చూసి శంకరుడు గుక్కపెట్టి ఏడవటం మొదలుపెట్టాడు. శంకరుడి అవస్థ చూసి ఆ దేవి గిన్నెలోని పాలను త్రాగి వెళ్ళింది. కళ్ళు తెరిచి చూశాడు శంకరుడు. గిన్నె ఖాళీగా కనపడింది. శంకరుడు మళ్ళీ

ఏడవటం మొదలుపెట్టాడు. బాలుడు ఎందుకు ఏడుస్తున్నాడో దేవికి అర్థం కాలేదు. అప్పుడు దేవి ప్రత్యక్షమై అతని ఏడుపుకు కారణం అడిగింది. 'నీకు నైవేద్యం పెట్టిన తరువాత మా అమ్మ గిన్నెలో పాలను నాకు ఇచ్చేది. ఇప్పుడు పాలన్నీ నువ్వే తాగేశావు. నాకు ఆకలివేస్తోంది. నేనేం త్రాగాలి ?' అన్నాడు శంకరుడు. దానికి ఆ దేవి చలించి శంకరుడికి స్తన్యం ఇచ్చింది. ఆ విధంగా దేవిస్తన్యం గ్రోలినందువల్లనే శంకరుడు అంత గొప్పవాడయినాడు అని ప్రతీతి.

శంకరుడు జన్మించటానికి ముందు భారతదేశంలో వేదవిరుద్ధమైన మతాలు బాగా వ్యాప్తిలో ఉన్నాయి. శైవ, వైష్ణవమతాలు చెలరేగి ప్రజలను అశాంతిపాలు చేస్తున్నాయి. వర్ణాశ్రమ వ్యవస్థ తారుమారయింది. బౌద్ధ, జైనమతాలు అహింసను మాత్రం ప్రచారం చేస్తున్నాయి. యజ్ఞయాగాదులను నిరసిస్తున్నాయి. కాపాలికులు భైరవోపాసకులై నరబలులు ఇస్తున్నారు. నాస్తికులు దేవుడులేడు, వేదము ప్రమాణము కాదు అన్నవాదనను లేవదీశారు. శివుడు గొప్పవాడని కొందరు, విష్ణువు గొప్పవాడని కొందరు యుద్ధాలు చేస్తున్నారు. ప్రజలు నిత్యం భయభ్రాంతులై బతుకును ఈడుస్తున్నారు.

అటువంటి సమయంలో కుమారస్వామి ఈ లోకంలో 'కుమారిలభట్టు' అనే పేరుతో అవతరించి అవైదికచర్యలను ఖండిస్తున్నాడు. ఇటువంటి సమయంలో శంకరుడు ఉద్భవించాడు. తల్లి విద్యాభ్యాసం కోసం శంకరుణ్ణి గురుకులంలో చేర్పించింది. మధుకర వృత్తి చేస్తూ శంకరుడు విద్యాభ్యాసం సాగిస్తున్నాడు. 'మధుకరము' అంటే తుమ్మెద అని అర్థం. తుమ్మెద పూవులన్నింటి మీద వాలి, వాటిలోని మధువును త్రాగుతుంటుంది. అలాగే విద్యార్థియైన బ్రహ్మచారి తనకు కావలసిన ఆహారాన్ని పదిళ్ళల్లో భిక్షగా తెచ్చుకోవటం ఆ రోజుల్లో సంప్రదాయం. ఆ సంప్రదాయం ప్రకారమే శంకరుడు కూడా మధుకర వృత్తిచేస్తూ విద్యాభ్యాసం చేయసాగాడు. ఒకరోజున ఒక ఇంటికి వెళ్ళి 'భవతి ! భిక్షాందేహి' అన్నాడు. ఆ ఇంటి ఇల్లాలు తాము కడుపేదవారమని, తన భర్తకూడా బిక్షాటనకే వెళ్ళాడని చెప్పింది. అప్పుడు శంకరుడు 'ఇంట్లో ఏది ఉంటే అది వెయ్యమని' అడిగాడు. ఆ ఇల్లాలు ఇల్లంతా వెతకగా ఒక పండిపోయిన ఉసిరికాయ కనిపించింది. దాన్నే ఆమె శంకరుడికి భిక్షగా వేసింది. అది చూసి చలించిన బాలశంకరుడు.

వందే వందారు మందార మిందిరానందకందలమ్
అమందానంద సందోహబంధురం సింధురాననమ్ ॥

అంగంహరేపులకభూషణ మాశ్రయంతీ
భృంగాంగనేవ ముకుళాభరణం తమాలం ॥

అంగీకృతాఖిల విభూతిరపాంగలీలా
మాంగల్యదాఽస్తు తమ మమంగళ దేవతాయాః ॥

శ్రుత్యై నమోస్తు శుభకర్మ ఫలప్రశూత్యై
రత్యై నమోస్తు రమణీయ గుణార్ణవాయై
శక్త్యై నమోస్తు శతపత్రనికేతనాయై
పుష్ట్యై నమోస్తు పురుషోత్తమ వల్లభాయై ॥

నమోస్తు నాళీక నిభాననాయై
నమోస్తు దుగ్ధోదధి జన్మ భూయై
నమోస్తు సోమామృత సోదరాయై
నమోస్తు నారాయణ వల్లభాయై ॥

అంటూ 21 శ్లోకాలతో లక్ష్మీదేవిని ప్రార్థన చేస్తే వారి ఇంటి ముంగిట బంగారు ఉసిరికాయల వర్షం కురిసింది. అప్పుడు శంకరుడు లక్ష్మీదేవిని చేసిన స్తోత్రమే **'కనకధారాస్తవము'**గా ప్రఖ్యాతి చెందింది.

ఏకసంధాగ్రాహి అయిన శంకరుడు కేవలం రెండుసంవత్సరాలలోనే విద్యాభ్యాసం పూర్తి చేశాడు. శంకరుడి కీర్తి ప్రతిష్ఠలు దశదిశలా వ్యాపించసాగాయి. కేరళరాజ్యాధిపతి శంకరుడికి సాష్టాంగ ప్రణామాలాచరించి కానుకలందించగా శంకరుడు వాటిని పేదలకు పంచి, రాజును ఆశీర్వదించాడు. క్రాంగనూరులో ఉన్న ఆలయంలో దేవి ఉగ్రమూర్తిగా ఉన్నది అని విని, తన తపశ్శక్తితో ఆమెను ప్రసన్నమూర్తిగా మార్చాడు.

ఒకనాడు గౌతముడు మొదలైన మహర్షులు శంకరుని ఆశ్రమానికి వచ్చి, అతని ఆతిధ్యం అందుకుని, అతను చేయవలసిన మహత్కార్యం గురించి గుర్తు

చేశారు. అప్పుడు శంకరుడు తాను నిర్వహించవలసిన మహత్కార్యానికి ముందు గృహత్యాగంచేసి సన్యాసంస్వీకరించాలి అని సంకల్పించాడు.

ఒకరోజున శంకరుడు తల్లితో కలిసి నదీ స్నానానికి వెళ్ళాడు. అక్కడ ఒక మొసలి అతని కాలుపట్టుకుంది. అప్పుడు శంకరుడు తాను ఇంక బ్రతకననీ, సన్యసించటానికి అనుజ్ఞ ఇమ్మనీ వేడుకోగా, తల్లి దుఃఖిస్తూనే సరేనంది. శంకరుడు ఆతురసన్యాసం స్వీకరించాడు. శంకరుడు సన్యసించటానికి తల్లిఒప్పుకోగానే విచిత్రంగా ఆ మొసలి శంకరుడికాలు వదలిపెట్టి వెళ్ళిపోయింది. శంకరుడు నర్మదానదీతీరానికి వెళ్ళి, అక్కడ గోవిందపాదాచార్యులవారి దగ్గర సంప్రదాయ బద్ధంగా సన్యాసం స్వీకరించాడు.

ఒకరోజు నర్మదానదికి వరదవచ్చి ఊరును ముంచేస్తోంది. ప్రజలు భయాందోళనలతో ఉన్నారు. అప్పుడు శంకరుడు నర్మదానదీప్రవాహాన్ని తన కమండలంలోకి ఆవాహనచేసి ప్రజలను రక్షించాడు. అది చూసిన గోవింద భగవత్పాదులవారు అమితానందం పొందారు. గతంలో ఒకసారి వ్యాసమహర్షి గోవిందపాదాచార్యుల వారి ఆశ్రమానికి వచ్చి "నర్మదానదిని కమండలంలో బంధించగల శిష్యుడు నీకు లభిస్తాడు. అతడే బ్రహ్మసూత్రాలకు భాష్యం వ్రాస్తాడు." అని చెప్పాడు. ఆ మాటలు ఇప్పుడు గుర్తుకు వచ్చి శంకరుణ్ణి కాశీనగరానికి వెళ్ళి, విశ్వేశ్వరుని దర్శించి, బ్రహ్మసూత్రాలకు భాష్యం వ్రాయమని ఆశీర్వదించి పంపాడు గోవిందపాదుడు.

గురువుగారి అనుజ్ఞమీద కాశీనగరం బయలుదేరాడు శంకరుడు. మార్గమధ్యంలో ఒక అడవిగుండా వెడుతున్నాడు. చీకటిపడింది. ఒక మర్రిచెట్టు క్రింద విశ్రాంతి తీసుకున్నాడు. ఒకరాత్రివేళ చెట్టుమీద ఉన్న బ్రహ్మరాక్షసుడు శంకరుణ్ణి పట్టి పీడించసాగాడు. అప్పుడు శంకరుడు అతని ప్రశ్నలకు సమాధానాలు చెప్పగా, సంతసించి వ్యాసమహర్షిని దర్శించే ఉపాయంచెప్పి, శాపవిమోచనంపొంది అంతర్ధానమై పోయాడు.

కాశీనగరంలో శంకరుడు కొంతమంది శిష్యులను ఏర్పరచుకొని, బదరికా వనానికి వెళ్ళి, మందాకినీ నదీతీరాన నివసిస్తూ, ప్రస్థానత్రయము అని చెప్పబడే ఉపనిషత్తులు, భగవద్గీత, బ్రహ్మసూత్రాలతో పాటుగా 18 భాష్యాలు, 40 ప్రకరణ

గ్రంథాలు, 74 చిన్న గ్రంథాలు వ్రాశాడు. ఆ సమయంలో వ్యాసమహర్షి వృద్ధ బ్రాహ్మణరూపంలో వచ్చి, బ్రహ్మసూత్రాలకు శంకరుడువ్రాసిన భాష్యంవిని, ఆనందించి, అద్వైతమతస్థాపన చెయ్యమని ఆశీర్వదించి అంతర్ధానమైనాడు.

తరువాత కాలంలో పండితులందరినీ తనవాదనతో ఓడిస్తూ, అద్వైతమత స్థాపన చేస్తూ, ప్రయాగలో కర్మసిద్ధాంతవాది అయిన కుమారిలభట్టును వాదనకు పిలువగా, ఆయన శంకరుడు సాక్షాత్తూ ఆదిశంకరుడని గ్రహించి, ఓటమి నంగీకరించి, తన శిష్యుడైన మండనమిశ్రుని గెలవమన్నాడు. ఇక్కడ మండనమిశ్రుని గురించి మనం కొంత తెలుసుకోవాలి.

మహిష్మతీ నగరంలో ఉండేవాడు మండనమిశ్రుడు. ఇతడు మహాపండితుడు, సాక్షాత్తు బ్రహ్మదేవుడే మండనమిశ్రుడిగా జన్మించాడు. చదువులతల్లి సరస్వతీదేవియే ఉభయభారతి అనే పేరుతో మండనమిశ్రునికి భార్య అయింది. మహిష్మతీనగరం చేరాడు. శంకరుడు తన శిష్య గణంతో. త్రోవలో కనిపించిన వారిని అడిగాడు 'మండనమిశ్రుని ఇల్లు ఎక్కడ?' అని. దానికి వారిచ్చిన సమాధానం చూడండి. ఏ ఇంటిద్వారం దగ్గర చిలుకలు 1) వేదాలు స్వతఃప్రమాణాలా ? 2) సుఖదుఃఖాల ఫలితాన్ని పరమాత్మ ఇస్తాడా ? లేక కర్మ ఇస్తుందా ? 3. ఈ జగత్తు నిత్యమా ? కాదా అనే ప్రశ్నలు వాదిస్తూ ఉంటాయో అదే మండనమిశ్రుని ఇల్లు అన్నారు. అతని ఇంట్లో ఉన్న పండితులే కాదు చిలుకలు కూడా శాస్త్రచర్చ చేస్తాయి. అంటే ఆ మహానుభావుడు మండనమిశ్రుడు ఎంతటి పండితుడో ఆలోచించండి.

మండనమిశ్రుని ఇల్లు చేరాడు శంకరుడు ఆ సమయంలో తండ్రి శ్రాద్ధకర్మ చేస్తున్నాడు మండనమిశ్రుడు. వచ్చిన శంకరుణ్ణి సాక్షాత్తు విష్ణు స్వరూపంగా భావించి గౌరవించాడు. శంకరుడు తాను వచ్చిన పని చెబుతూ, పండితోత్తమా ! నీతో వాదానికి వచ్చాను అన్నాడు. ఆనందంగా అంగీకరించాడు మండనమిశ్రుడు. మధ్యవర్తిగా మండనమిశ్రుని భార్య ఉభయభారతీదేవిని ఉంచటానికి ఒప్పందం కుదిరింది.

ఈ వాదనలో ఓడినవాడు గెలిచినవారికి శిష్యుడు కావాలి. మండనమిశ్రుడు గనక ఓడిపోతే అతడు సన్యసించి శంకరుడికి శిష్యుడయి అద్వైతసిద్ధాంతాన్ని ప్రచారం చేస్తాడు. శంకరుడు గనక ఓడిపోతే సన్యాసంవదలి, వివాహంచేసుకుని కర్మసిద్ధాంతాన్ని ప్రచారం చేస్తాడు. అదీ పందెం. భారతీదేవి రెండు పూలదండలు

తెప్పించి వారి మెడలో వేసి 'వాదనలో ఓడిపోయిన వారి మెడలోని మాల వాడిపోతుంది' అని చెప్పింది.

వాదన ప్రారంభమైంది. అనేక విషయాలమీద వాదన జరిగింది. ఆ శాస్త్రచర్చ వినటానికి దూరప్రాంతాల నుండి పండితులు వచ్చారు. అలా కొన్ని రోజులపాటు చర్చ జరిగింది. చివరకు మండనమిశ్రుని మెడలోని మాల వాడిపోయింది. "మీరు ఉభయులూ భిక్షకు లేవండి" అన్నది భారతీదేవి. అంటే మండనమిశ్రుడు ఓడిపోయాడు. అతడు సన్యాసం స్వీకరించాలి అని చెప్పిందన్న మాట. సన్యాసులు స్వీకరించేది భిక్ష. మండనమిశ్రుడు ఓడిపోయాడు. అప్పుడు భారతీదేవి శంకరునితో 'ఓ ఆచార్యా ! మండనమిశ్రుని మీరు పూర్తిగా గెలవలేదు. ఎందుకంటే ఆయనలో సగభాగం నేను. కాబట్టి నన్ను కూడా గెలవాలి అన్నది. వీరిద్దరి మధ్య 17 రోజులు రాత్రింబవళ్ళు చర్చజరిగింది. శంకరుడు జంకటం లేదు. ఇక లాభం లేదు. శంకరుడు చిన్ననాడే సన్యాసం స్వీకరించాడు. విషయవాసనలు లేనివాడు కాబట్టి కామకళని గురించి ప్రస్తావిస్తే బాగుంటుంది అని తలచి కామశాస్త్రం మీద ప్రశ్నలు వేసింది భారతీదేవి. శంకరుడు నెలరోజులు విరామమడిగాడు ఆమె సరేనన్నది.

ఆ సమయంలో అమరుకమహారాజు హఠాత్తుగా మరణించాడు. అతని శరీరంలోకి ప్రవేశించాడు శంకరుడు. కామశాస్త్రరహస్యాలన్నీ తెలుసుకుని తిరిగి వచ్చి, భారతీదేవి అడిగిన ప్రశ్నలకు సమాధానము చెప్పి ఆమెను కూడా ఓడించాడు. తరువాత మండనమిశ్రునికి సంప్రదాయబద్ధంగా సన్యాసదీక్ష ఇచ్చి 'సురేశ్వరాచార్యులు' అని నామకరణం చేసి తన శిష్యునిగా చేసుకున్నాడు.

మూకాంబాక్షేత్రంలో పుట్టినదగ్గరనుంచీ జడుడుగాఉన్న 'ప్రభాకరుడు' అనే బాలుని అనుగ్రహించి అతడికి సన్యాసమిచ్చి 'హస్తామలకుడు' అని పేరు పెట్టాడు. శంకరుడు శృంగేరి చేరి, ఒక మఠాన్ని స్థాపించి దానికి సురేశ్వరాచార్యుని అధిపతిగా చేశాడు. అక్కడ మందబుద్ధి అయిన ఒక బాలుని కేవలం సంకల్పమాత్రం చేతనే పండితుడుగా చేసి, సన్యాసమిచ్చి 'తోటకాచార్యుడు' అని నామకరణం చేశాడు.

ఎంతకాలమైనా శంకరుడికి దేవితత్త్వం గురించి పూర్తిగా తెలియలేదు. అందుచేత తన గురువుగారైన గోవిందపాదాచార్యుని దగ్గరకు పోయి దేవీతత్త్వాన్ని వివరించమని అడిగాడు. దానికి గోవిందపాదుడు తనగురువైన గౌడపాదుల దగ్గరకు

వెళ్ళమన్నాడు. ఈ రకంగా శంకరాచార్యుడు తన పరమగురువైన గౌడపాదాచార్యుల వారి దగ్గరకు వెళ్ళాడు. గౌడపాదుడు అఖండ ప్రజ్ఞాశాలి. మాండూక్యోపనిషత్తుకు కారికలను వ్రాసిన మహానుభావుడు. గౌడపాదుడు శంకరుని కోరిక విని, తాను వ్రాసిన 'సుభగోదయస్తుతి' అనే 52 శ్లోకాలు గల గ్రంథాన్ని శంకరుడి చేతికిచ్చాడు. ఆ గ్రంథం చదివిన తరువాత శంకరుడు శ్రీశైలానికి వచ్చి **'సౌందర్యలహరి'** అనే గ్రంథం వ్రాశాడని ప్రతీతి.

శంకరుడు జైత్రయాత్ర చేస్తూ ద్వైతులను, శాక్తేయులను, లక్ష్మీఉపాసకులను, వీరశైవులను, వీరవైష్ణవులను, పాంచరాత్రులను, సూర్య, అగ్ని, గణపతి ఉపాసకులను అందరినీ ఓడించి అద్వైతమతాన్ని పునఃప్రతిష్ఠ చేశాడు.

తన జైత్రయాత్రలో భాగంగా 'మగధ' చేరాడు శంకరుడు. అక్కడి ప్రజలు శంకరుడి దగ్గరకు వెళ్ళి "అన్నీ తెలిసిన మీబోటివారికి నిర్గుణోపాసన సరిపోతుంది. కాని మావంటివారి సంగతి ఏమిటి?" అని అడిగారు. శంకరుడు వారి కోరిక మన్నించి సగుణోపాసనకు అనువుగా షణ్మతస్థాపన చేసి, ఉపాసనాపద్ధతులు, బహుదేవతాస్తుతులు వ్రాశాడు. అర్చనలో అందరూ విధిగా అర్చించాలి అని పంచాయతనాన్ని ఏర్పాటు చేశాడు. పంచాయతనం అంటే ఆదిత్యుడు, అంబిక, గణపతి, విష్ణువు, శివుడు. ఈ ఐదుగురు దేవతలను ప్రతివారు అర్చించాలి. అని నియమం. ఈ పంచాయతనము పంచభూతాలకు ప్రతీక. ఇందులో

| | | |
|---|---|---|
| ఆకాశతత్త్వము | – | శివుడు |
| వాయుతత్త్వము | – | సూర్యుడు |
| అగ్నితత్త్వము | – | అంబిక |
| జలతత్త్వము | – | నారాయణుడు (విష్ణువు) |
| పృథివీతత్త్వము | – | గణపతి |

ఈ ఐదుగాక షణ్ముఖుడికి (సుబ్రహ్మణ్యేశ్వరుడికి) కూడా ప్రత్యేకమైన అర్చన చెప్పాడు.

ఆ రోజుల్లో కాశ్మీరదేశంలో సర్వజ్ఞశారదాపీఠం ఉండేది. దానికి ఎనిమిది దిక్కులయందు ఉద్దండులైన పండితులుంటారు. ఆ పండితులను ఓడించి, ఆ పీఠాన్ని

అధిష్ఠించినవాడే జగద్గురువు. శంకరుడు వారందరినీ ఓడించి, ఆ పీఠాన్ని అధిష్ఠించబోతుండగా, సరస్వతీదేవి ప్రత్యక్షమై "నీకు స్త్రీసంగమదోషమున్నది. కాబట్టి నువ్వు ఈపీఠంఎక్కటానికి అర్హుడవు కావు." అన్నది. దానికి, శంకరుడు వేరొక శరీరంతో చేసిన పాపం ఈ శరీరానికి అంటదు అని సమాధానం చెప్పాడు. ఆ మాటలువిన్నసరస్వతీదేవి నివ్వెరబోయింది. శంకరాచార్యుడు సర్వజ్ఞశారదాపీఠాన్ని అధిష్టించి జగద్గురువైనాడు.

అద్వైతమతప్రచారం కోసం శంకరుడు భారతదేశంనలుమూలలా నాలుగు పీఠాలు నెలకొల్పాడు. అవి

| | | |
|---|---|---|
| దక్షిణాన | – | శృంగేరి (కర్ణాటక) |
| పడమర | – | ద్వారక (గుజరాత్) |
| ఉత్తరాన | – | బదరి (ఉత్తరాంచల్) |
| తూర్పున | – | పూరి (ఒరిస్సా) |

ఈ పీఠాలకు వరుసగా సురేశ్వరాచార్యుడు, హస్తామలకుడు, తోటకాచార్యుడు, పద్మపాదులను పీఠాధిపతులుగా నియమించి, కేదారము చేరి, శిష్యులను ఆశీర్వదించి, దత్తాత్రేయుని గుహలోకి వెళ్ళి అదృశ్యమై పోయాడు.

## 2. సౌందర్యలహరి – శ్రీవిద్య

**మననాత్త్రాయత ఇతి మంత్రః** మననము చెయ్యటంవలన, మననము చేసేవాడిని రక్షించేది మంత్రము. మననము అంటే ఒకే అక్షరాన్ని, ఒకే మాటని, ఒకే పదాన్ని లేదా ఒకే వాక్యాన్ని పదేపదే స్మరించటాన్నే మననము అంటారు. ఇలా మననం చెయ్యటంవల్ల కొంత శక్తి పుడుతుంది. ఆ శక్తి మననము చేసేవాడిని రక్షిస్తుంది. సర్వశక్తి సంపన్నులైన దేవతలను ప్రసన్నులుగా చేసుకోవటానికి మంత్రాన్ని ఉపాసించటం జరుగుతుంది. అయితే ఉపాసనాక్రమంలో పురుషదేవతలను ఉపాసించే వాటిని మంత్రాలు అని, స్త్రీ దేవతల ఉపాసనకు ఉపయోగించే మంత్రాలను 'విద్య' అని అంటారు. ఇక్కడ శ్రీవిద్య అనే పదంలో 'శ్రీ' అనే అక్షరం విద్యకు విశేషణంగా చెప్పబడింది. **శ్రీ యన లక్ష్మీ, శ్రీ యన గౌరి, శ్రీ యన సరస్వతి** శ్రీ అంటే లక్ష్మి, శ్రీ అంటే సరస్వతి, శ్రీ అంటే పార్వతి ఇలా చూసినట్లైతే

ఈ సృష్టికి మూలమైనవారు త్రిశక్తులు. వారే మహాకాళి, మహాలక్ష్మి, మహాసరస్వతులు. మానవుడు జీవించటానికి కావలసిన సిరిసంపదలనిచ్చేది లక్ష్మి, శౌర్య పరాక్రమాల నిచ్చేది కాళి, విజ్ఞానాన్నిచ్చేది సరస్వతి. ఇటువంటి త్రిశక్తులను సృష్టించినది ఆదిపరాశక్తి. వీరంతా ఆ దేవియొక్క అంశలే. అందుకే ఆమెను **'ముగురమ్మల మూలపుటమ్మ'** అంటారు. సర్వశక్తిమయమైనది ఆ దేవి. ఈ జగత్తులో ఏం కావాలన్నా ఇచ్చే శక్తి ఆ తల్లికి ఉన్నది. ఈ జగత్తులోనే కాదు. ఆ తరువాత కూడా మన కోరికలు తీర్చగలిగేది ఆ దేవత. ఆమెను గనక అర్చించినట్లైతే ఇహపరాలు అన్నీ ఒనగూడతాయి. ఇహము అంటే ఈ లోకంలో సుఖంగా జీవించటానికి అవసరమైన సిరిసంపదలు, భోగభాగ్యాలు. పరము అంటే మరణానంతరము పొందే స్వర్గము, మోక్షము. సామాన్యంగా మానవుడికి ఇహం అంటే సిరిసంపదలు. భోగభాగ్యాలు కావాలంటే పరాన్ని వదిలెయ్యాలి. అలాగే మోక్షం కావాలంటే ఈ లోకంలో పొందే సుఖాలను వదిలెయ్యాలి. అయితే పరమేశ్వరిని అర్చించే వారికి ఇహం కావాలంటే ఇహం, పరం కావాలంటే పరం, ఏది కావాలంటే అది వస్తుంది. అందుకే

**శ్రీసుందరీ సేవన తత్పరాణాం**
**భోగశ్చ మోక్షశ్చ కరస్థయేవ**

అన్నారు. ఇక్కడ ఇంకొక విషయం ఏమంటే దేవతలు మన కోరికలు తీర్చగలుగుతారు. కాని మోక్షాన్ని ఇవ్వలేరు. అలాగే శాశ్వతత్వాన్ని కూడా ఇవ్వలేరు. హిరణ్యకశ్యపుడు, మహిషాసురుడు ఇలా అనేకమంది రాక్షసులు బ్రహ్మను గురించి తపస్సు చేసి 'చావు లేకుండా వరం కావాలి' అన్నారు. 'అది మాత్రం కుదరదు. నాచేతకాదు. ఆ వరం మాత్రం నేను నివ్వలేను. ఇంకేదైనా వరం కోరుకోండి' అన్నాడు బ్రహ్మ. ఎందుకని ? ఎవరైనా వచ్చి మనల్ని వంద రూపాయలు అడిగారు అనుకోండి. ఆ వందరూపాయలు ఇచ్చే శక్తి మనకు ఉండాలి కదా ! మన దగ్గర అవిలేవు. అలాంటప్పుడు వాళ్ళకి మనం ఏ రకంగా ఇవ్వగలం? అదే బ్రహ్మదేవుడి పరిస్థితి. అతనికే శాశ్వతత్త్వం లేదు. కల్పాంతాన బ్రహ్మకూడా పరబ్రహ్మలో లీనమైపోతాడు. అంతే కాని ఆయన శాశ్వతం కాదు. ఈ కారణంచేతనే రాక్షసులకు శాశ్వతత్త్వాన్ని ప్రసాదించటం తనకు చేతకాదు అన్నాడు. దేవతని ఉపాసించేటప్పుడు ఆ దేవత లక్షణాలు మనక్కూడా వస్తాయి. సాకారమైన దేవతను ఉపాసిస్తే ఆ దేవత

లక్షణాలు వస్తాయి. మరి నిరాకారమైన పరమేశ్వరిని ఉపాసించినట్లైతే ఆ లక్షణాలు వస్తాయి. అంటే మోక్షం వస్తుందన్నమాట. కాబట్టి మోక్షం కావాలంటే ఆ పరమేశ్వరినే అర్చించాలి. ఆమె ఏదైనా ఇవ్వగల సమర్థురాలు. అటువంటి పరమేశ్వరిని ప్రసన్నం చేసుకోవటానికి ఉపయోగించే మంత్ర, యంత్ర, తంత్రాలనే 'శ్రీవిద్య' అంటారు. ఇంతకీ ఈ పరమేశ్వరి ఎవరు ? ... ఆమెని గురించి, ఆవిడ తత్త్వాన్ని, మంత్ర, యంత్ర, తంత్రాలను గురించి చెప్పే ఉపనిషత్తులు తొమ్మిది ఉన్నాయి. అవి

1. త్రిపురోపనిషత్తు
2. త్రిపురతాపినీ ఉపనిషత్తు
3. దేవీ ఉపనిషత్తు
4. బహ్వృచోపనిషత్తు
5. భావనోపనిషత్తు
6. సరస్వతీ ఉపనిషత్తు
7. సీతోపనిషత్తు
8. సౌభాగ్యలక్ష్మి ఉపనిషత్తు
9. లలితా రహస్యోపనిషత్తు

అథర్వణవేదాంతర్గతమైన 'దేవీఉపనిషత్తు'లో ఈ విధంగా ఉన్నది. పూర్వకాలంలో దేవతలంతా ఆ పరమేశ్వరి దగ్గరకు వెళ్ళి "అమ్మా నువ్వెవరవు?" అని అడిగారు. అప్పుడు ఆమె "నేను బ్రహ్మస్వరూపిణిని. నావల్లనే ప్రకృతి పురుషాత్మకమైన జగత్తు ఆవిర్భవించింది. శూన్యము, అశూన్యము, ఆనందము, దుఃఖము, జ్ఞానము, అజ్ఞానము, అంతా నేనే. ఈ జగత్తులో పంచభూతాలు నేనే. వేదము నేనే, అవేదము నేనే. అఖిలజగత్తు నేనే, విద్య నేనే, అవిద్య నేనే. క్రింది భాగము, పైభాగము, మధ్యభాగము అంతా నేనే. నేను రుద్రులలో ఉంటాను. ఆదిత్యులలో ఉంటాను. వసువులలో ఉంటాను. విశ్వేదేవతలలో ఉంటాను. ఇంద్రుడు, అగ్ని, అశ్వనీ దేవతలు, త్వష్ట, పూష, భగుడు మొదలయిన వారందరినీ నేనే ధరిస్తున్నాను. విష్ణువు, వామనుడు, ప్రజాపతి, బ్రహ్మ వీరందరినీ ధరిస్తాను. నాకు కారణము నేనే." అంటుంది. ఆవిడ పరమేశ్వరి.

తారకాసురసంహారం కోసం దేవతలంతా హిమాలయాలకు వెళ్ళి ఆమెను గురించి తపస్సు చేశారు. వివిధ రకాలుగా అర్చించారు, ఆరాధించారు, పూజించారు. చివరకు చైత్రశుద్ధ నవమి శుక్రవారం నాడు ఆమె వారికి దర్శనం ఇచ్చింది. అప్పుడు ఆమె ఎలా ఉన్నది అంటే

**కోటి సూర్యప్రతీకాశం చంద్రకోటి సుశీతలం**

**విద్యుత్కోటి సమానాభమరుణం తత్పరం మహః ।**

**నైవచోర్ధ్వం నతిర్వక్చ నమధ్యేపరిజగ్రభత్**

**ఆద్యంతరహితం తత్తునహస్తాద్యంగ సంయుతం ।**

**న స్త్రీరూప మథవాన పుంరూప మథోభయమ్ ॥**

ఆమెను రూపుదాల్చిన నాలుగు వేదాలు స్తుతి చేస్తుండగా, కోట్లకొలది సూర్యుల యొక్క కాంతులతో, చంద్రులయొక్కచల్లదనంతో, ఆ రూపము కొన్ని కోట్ల మెరుపుతీగలు ఒక్కసారి వచ్చినట్లుగా తళుక్కున్న మెరిసింది. దానికి పైన, క్రింద, అడ్డము అనే తేడా లేదు. ఆద్యంతాలు లేవు. కాళ్ళు చేతులు మొదలైన అంగాలు లేవు. స్త్రీ, పురుష, నపుంసక భేదం లేదు.

ఆ కాంతిని చూడలేక దేవతలు ఒక్కసారిగా కళ్ళు మూసుకుని "తల్లీ ! నీ తేజోరూపాన్ని మేము చూడలేము. కాబట్టి మాకు తెలిసిన రూపంతో ప్రత్యక్షము కావలసింది" అని వేడుకున్నారు. అప్పుడు మంచి యౌవ్వనంలో ఉన్న అందమైన కన్యగా నాలుగు చేతులతో వారికి దర్శనమిచ్చింది. ఆమె పరమేశ్వరి.

మధుకైటభ సంహారం జరిగిన తరువాత ఒక దివ్యమైన విమానం త్రిమూర్తులను ఎక్కించుకుని ఒక ద్వీపానికి తీసుకుపోతుంది. అక్కడ శ్రీచక్రమువంటి ఆసనం మీద ఒక స్త్రీ మూర్తి వారికి దర్శనమిస్తుంది. త్రిమూర్తులు ఆమెను పరిపరి విధాల స్తుతించిన తరువాత బ్రహ్మదేవుడు "అమ్మా ! నీవు స్త్రీవా ? పురుషుడవా ? **ఏకమేవా ద్వితీయం బ్రహ్మ** అనే వాక్యానికి అర్థం నీవేనా? వివరించవలసింది" అన్నాడు దానికి ఆ పరాశక్తి.

ఉపాధి భేదంవల్ల రెండు విధాలయినట్లుగా అద్దంలో కనిపించే ప్రకృతిలాగా క్రియాసమయంలో భిన్నత్వం కనిపించినా, పరమావస్థయందు బ్రహ్మపదార్థం ఒక్కటే. దానికి వైవిధ్యంలేదు. సృష్టిసమయంలోగాని, ప్రళయకాలమందుగాని నాకు స్త్రీ, పురుష, నపుంసక భేదాలు లేవు. ఈ సృష్టిలో నాకన్న వేరైన పదార్థం ఏదీలేదు.

ఈ జగత్తులో బుద్ధి, మతి, ధృతి, శ్రీః, శ్రద్ధ, మేధ, దయ, లజ్జ, కాంతి, నిద్ర అంతా నేనే. పర, పశ్యంతి, మధ్యమా, వైఖరీ మొదలైన వాగ్రూపాలు నేనే. బ్రాహ్మి

మొదలైన అష్టమాతృకలు నేనే మంచులోని చల్లదనాన్ని నేనే. అగ్నిలోని వేడిని నేనే. సూర్యునిలోని తేజస్సునూ నేనే. నేను లేనిది ఏదీ లేదు. ఈ జగత్తంతా నానుంచే ఆవిర్భవించింది.” అని చెబుతుంది. ఆవిడ పరమేశ్వరి.

సుధాసాగరం మధ్యలో, మణిద్వీపంలో చింతామణి గృహంలో శ్రీచక్రాకారమైన ఆసనమునందు భువనేశ్వరుడు కూర్చుని ఉంటాడు.

**వామాంకే షణ్ణిషణ్ణా స్వదేవీ శ్రీభువనేశ్వరీ**

**నవరత్నగణాకీర్ణా కాంచీదామ విరాజితా**

**తప్తకాంచన సన్నద్ధా వైడూర్యాంగదభూషణా**

ఆ భువనేశ్వరుని యొక్క వామాంకము మీద, సకలాభరణ భూషితయై కూర్చుని ఉంటుంది. ఆవిడ పరమేశ్వరి. ఆమెను గురించి చెప్పే మంత్ర, యంత్ర, తంత్ర శాస్త్రము అంతా ‘శ్రీవిద్య’ అనబడుతుంది. శ్రీవిద్యను ప్రతిపాదించే గ్రంథాలలో కామకలావిలాసము, యోగినీ హృదయము, లలితాసహస్రము, సౌందర్యలహరి వంటి గ్రంథాలు ముఖ్యమైనవి. వీటిలో మొదటి మూడింటినీ గతంలో చెప్పుకున్నాం. ఇప్పుడు సౌందర్యలహరిని చూద్దాం.

సౌందర్యలహరి మొత్తం వంద శ్లోకాలు గల గ్రంథం. చూడటానికి ఇది చాలా చిన్న గ్రంథంగా కనిపించినప్పటికీ, విషయ పరిజ్ఞానంలో మాత్రం చాలా పెద్దది. ఇది రెండు భాగాలుగా ఉంటుంది. దీనిలోని మొదటి 41 శ్లోకాలు ‘ఆనంద లహరి’ అని, మిగిలిన 59 శ్లోకాలు ‘సౌందర్యలహరి’ అని చెప్పబడతాయి. ఇందులో మొదటి భాగమయిన 41 శ్లోకాలను సాక్షాత్తు పరమశివుడే వ్రాశాడని, రెండవ భాగాన్ని శంకరులవారు వ్రాశారని కొంతమంది చెబుతారు. ఏది ఏమైనప్పటికీ, ఈ గ్రంథంలో ముఖ్యమైనది మొదటి భాగమే. ఇందులో యంత్ర, తంత్ర, మంత్ర విషయాలన్నీ ప్రతిపాదించబడ్డాయి. రెండవభాగమైన సౌందర్యలహరిలో అమ్మవారిని నఖశిఖ పర్యంతము వర్ణించటం జరిగింది. ఈ గ్రంథం మీద 32వ్యాఖ్యలు ఉన్నాయి. వీటిలో మకుటాయమానమైనది **లక్ష్మీధరవాఖ్య.** ఇది జగత్ప్రసిద్ధి చెందినది. మిగిలిన 31వ్యాఖ్యలు చూసిన తరువాత దీనిని వ్రాయటం జరిగింది అని పండితుల అభిప్రాయము. దీనిని వ్రాసినవాడు **‘లొల్లా లక్ష్మీధరుడు’.**

'సౌందర్య లహరి' వందశ్లోకాలు గల గ్రంథం. దీన్ని శంకర భగవత్పాదులవారు రచించారు. దీనిలో ఆసాంతం పరమేశ్వరి యొక్క తత్త్వాన్ని వివరించటం జరిగింది. ఈ గ్రంథం మొత్తం రెండుభాగాలుగా ఉంటుంది. మొదటి 41శ్లోకాలు 'ఆనంద లహరి' అని, 42 నుంచి 100 శ్లోకాల వరకు సౌందర్యలహరి అని చెప్పబడింది. మొదటి 41 శ్లోకాలలో అంటే ఆనందలహరిలో పరమేశ్వరి యొక్క మంత్ర, యంత్ర, తంత్రశాస్త్రం చెప్పబడింది. ఇంకా చెప్పాలి అంటే శ్రీవిద్య ఈ శ్లోకాలలో పూర్తిగా వివరించబడిందన్న మాట. ఇక 42వ శ్లోకంలో పరమేశ్వరి కిరీటంతో ప్రారంభించి, 91వ శ్లోకంలో ఆమె పాదాలవరకు దేవియొక్క స్థూలరూపాన్ని వర్ణించటం జరిగింది. 92 నుంచి 97 వరకు శ్లోకాలలో దేవీస్వరూపాన్ని, 98వ శ్లోకంలో కవి ప్రార్థన, 99వ శ్లోకంలో ఉపాసకుని ఫలప్రాప్తి, 100వ శ్లోకంలో కవి తన నిరహంకారత్వాన్ని చూపుతూ 'ఆ పరమేశ్వరి దయవల్లనే తాను ఈ గ్రంథాన్ని వ్రాశాను" అని చెబుతాడు. మొత్తంమీద ఇది ఉత్తమోత్తమమైన శ్రీవిద్యా గ్రంథం.

ఈ స్తోత్రాన్ని పరమశివుడే పరదేవతను స్తుతి చేస్తూ చెప్పాడని, దాన్ని శంకరుల వారు గ్రంథస్థం చేశారని కూడా చెప్పటం జరిగింది. సమయమతాచారులకు ఇది ఉత్తమోత్తమమైన గ్రంథం. లోతుగా పరిశీలించినట్లైతే శంకరాచార్యులవారు అద్వైతమతాన్ని ప్రచారం చేసినప్పటికీ, సౌందర్యలహరి వ్రాసిన తీరును బట్టి వారు 'పరమశాక్తేయులు' అనిపిస్తుంది.

**సాధకానాం హితార్థాయ బ్రహ్మణోరూపకల్పనా** అన్నారు. సాధకుడి యొక్క కోరికలననుసరించి భగవంతుని రూపం కల్పించబడిందన్న మాట. ఈ రూపాలు రెండు రకాలు 1. సగుణము 2. నిర్గుణము. సగుణ బ్రహ్మను గూర్చి చెప్పే గ్రంథాలలో 'ఆగమాలు' అని చెప్పబడే తంత్రగ్రంథాలు ముఖ్యమైనవి. వీటి మొత్తాన్ని మంత్ర శాస్త్రము అని కూడా అంటారు. వీటిలో వైష్ణవఆగమాలు, శైవఆగమాలు, శక్త్యాగమాలు విడివిడిగా ఉన్నాయి.

శక్తిని జగన్మాతగా, పరతత్త్వంగా చెప్పే ఆగమాలే శక్త్యాగమాలు. ఇవి మూడు రకాలు కౌళ, మిశ్రమ, సమయ ఆగమాలు. వీటిలో కౌళాచారులు కేవలము అర్థకామాలకే ప్రాధాన్యతనిస్తారు. వీరికి మొత్తం 64 ఆగమాలు వ్యాఖ్యలతో కూడా లభిస్తున్నాయి. మిశ్రమాగమాలలో ధర్మ, కర్మ, ఉపాసనల వివరణ ఉన్నది. ఇవి

కూడా వ్యాఖ్యాసహితంగా లభిస్తున్నాయి. సమయాచారులది కేవలము పారమార్థిక దృష్టి. జీవబ్రహ్మైక్యమే వీరి సిద్ధాంతము. వీరికి 'శుభాగమ పంచకము' అని పిలువబడే సనక, సనందన, సనత్కుమార, వశిష్ఠ, శుక సంహితలు ప్రమాణాలు. కుండలినీ శక్తిని జాగృతం చేసి, షట్చక్రాలను భేదించి, సహస్రారం చేర్చటమే వీరి సాధన. కౌళమతం వారికి షట్చక్రభేదన లేదు. మూలాధారమందే వారి ఉపాసన.

సౌందర్యలహరి స్తోత్రాన్ని గనక చూసినట్లైతే శంకరాచార్యులవారు షట్చక్ర భేదనము చేసిన సమయమతసిద్ధుడు అని తెలుస్తోంది. తన తపఃశక్తినీ, అనుభవాన్ని జోడించి శంకరులు ఈ గ్రంథాన్ని వ్రాశారు.

సౌందర్యలహరికి దాదాపు 36 వ్యాఖ్యలున్నాయి. వీటిలో కొన్ని ఆయా ప్రాంతాల వరకే ప్రచారంలో ఉండగా, యావద్భారత దేశంలోనూ ప్రచారంలో ఉన్న వ్యాఖ్యలు చాలా తక్కువ. అలాంటి వాటిలో ప్రథమంగా చెప్పదగ్గ **'లక్ష్మీధరవ్యాఖ్య'.** ఇది భిన్నసంప్రదాయాలవారి అభిప్రాయాలు క్రోడీకరించి వ్రాయబడింది. మనకు లభించే వ్యాఖ్యలలో లక్ష్మీధరవ్యాఖ్య అత్యాధునికమైనదన్న మాట. ఇంతవరకు ఉన్న వ్యాఖ్యలన్నీ చదివి దీన్ని వ్రాయటం జరిగింది. ఈ రోజుకు కూడా భారతదేశంలోని పండితులందరూ దీన్నే ప్రామాణికంగా అంగీకరిస్తున్నారు. లక్ష్మీధరుడు తన వ్యాఖ్యలో పంచదశి, షోడశీ మహామంత్రాలు, శ్రీచక్రము, చతుర్విధైక్య సంధానము,తంత్ర శాస్త్రము, శ్రీవిద్య, సాదాఖ్య కళ, చంద్రకళ, షట్చక్ర భేదనము, సహస్రార స్వరూపము నిరూపించేటప్పుడు ప్రదర్శించిన పాండిత్యము, ప్రజ్ఞాపాటవాలు అనన్య సామాన్యము, అత్యద్భుతము. వీరి వ్యాఖ్యానం గనక లేకపోయినట్లైతే సౌందర్యలహరిలోని రహస్యాలు చాలా వరకు మనకు తెలిసేవి కావు.

లక్ష్మీధరుడు కృష్ణానదీ తీరంలోని విజయవాడ సమీపంలో గల 'లొల్ల' గ్రామానికి చెందినవాడు. హరితసగోత్రీకుడు. వెలనాటిబ్రాహ్మణుడు. వీరి వంశంలోని వారందరూ వేదవిదులు, పండితులు. వీరి తండ్రి విశ్వనాధ భట్టారకుడు లక్ష్మీధరుడు ఒరిస్సాను పాలించిన వీరభద్రగజపతి ఆస్థానంలో పండితుడుగా ఉండేవాడు. గజపతుల పతనానంతరము శ్రీకృష్ణదేవరాయల ఆస్థానపండితుడైనాడు లక్ష్మీధరుడు. సౌందర్యలహరికి వీరు వ్రాసిన వ్యాఖ్యను మైసూరుప్రభుత్వం వారు ప్రచురించారు.

మిగిలిన వ్యాఖ్యలలో 'గంగహరి' అనేవాడు తాంత్రికదృష్టితో వ్రాసిన 'తత్త్వదీపిక' తంత్రవాదులకు అత్యంత ప్రామాణికమైనది.

'కైవల్యాశ్రమి' అనే పరివ్రాజకుడు వ్రాసిన 'సౌభాగ్యవర్ధని' వ్యాఖ్యానానికి కూడా భారతదేశంలో అత్యంతప్రచారమున్నది. అలాగే 'ప్రవరసేనుడు' వ్రాసిన 'సుధావిద్యోతిని' వ్యాఖ్య కూడా చాలా ముఖ్యమైనది. దీనిలో తాంత్రిక, జ్యోతిష పరమైన విషయాలుకూడా వ్రాయబడ్డాయి.

సౌందర్యలహరికి వ్రాసిన వ్యాఖ్యలన్నీ దేవీపరంగానే వ్రాయటం జరిగింది. కానీ **'నృసింహకృత'** వ్యాఖ్యలో మాత్రం ప్రతిశ్లోకానికీ దేవీపరంగానూ, విష్ణుపరంగానూ కూడా వివరణ ఇవ్వబడింది.

ఇక తెలుగులో చూసినట్లైతే లక్ష్మీధరుని వ్యాఖ్యకు యథాతథంగా శ్రీచదలవాడ జయరామశాస్త్రి గారు, లక్ష్మీధరము, సౌభాగ్యవర్ధని, అరుణామోదిని, డిండిమ వ్యాఖ్యలను ఉదహరిస్తూ శ్రీతుమ్మలపల్లి రామలింగేశ్వరరావుగారు, ఈశ్వర సత్యనారాయణశర్మగారు, డా॥ టి.వి.ఎస్.శర్మగారు, డా॥ జి.ఎల్.ఎన్.శాస్త్రిగారు ఇలాంటివారు వ్రాసిన గ్రంథాలు లభిస్తున్నాయి. శ్లోకానికి తాత్పర్యం మాత్రమే వ్రాసినవి కొన్ని ఉన్నాయి.

అయితే శ్రీవిద్యలో ప్రముఖగ్రంథాలయిన సౌందర్యలహరి, లలితా సహస్రనామాలకు వ్యాఖ్య వ్రాసిన లొల్లాలక్ష్మీధరుడు, భాస్కరరాయలు ఇద్దరూ మనతెలుగువారే కావటం నిజంగా మనఅదృష్టం.

**ఆదినాథ సమారంభం శంకరాచార్య మధ్యమాం**
**విరజానందనాథ పర్యంతాం వందే గురుపరంపరాం ॥**
**దత్తాత్రేయ సమారంభాం వ్యాసశంకర మధ్యమాం**
**సచ్చిదానంద పర్యంతాం వందే గురుపరంపరాం ॥**

ముందుగా నా గురుపరంపర అయిన విరజానంద, సదానంద, శుకానంద నాథులకు నమస్కరించి, ఏమీ తెలియని నన్ను మైసూరుదత్తపీఠ ఆస్థాన విద్వాంసునిగా నియమించి గౌరవించిన సాక్షాత్తు పరమేశ్వరీస్వరూపులు శ్రీశ్రీశ్రీ గణపతి సచ్చిదానందస్వామి వారికి ప్రణమిల్లి, ధర్మ సంస్థాపన కోసం ఏర్పాటయిన శృంగేరి,

పూరి, బదరి, ద్వారక, కంచి పీఠాధిపతులకు నమస్కరించి, పుష్పగిరి, కుర్తాళం పీఠాధిపతులకు వందనాలర్పించి, గన్నవరం భువనేశ్వరీ పీఠాధిపతులకు, గుంటూరు శృంగేరీ శ్రీ విరూపాక్ష పీఠాధిపతులకు, వాసుదేవానందగిరి స్వామివారికి, మాతాశివచైతన్య వారికి, చంద్రకాళీమాతాజీకి నమోవాకములర్పించి, లొల్లా లక్ష్మీధరుల వ్యాఖ్యను ఆధారంగా తీసుకుని, సుభగోదయ స్తుతి, యోగినీ హృదయము, కామకలావిలాసము, ఉపనిషత్తులు, దేవీ భాగవతము, దుర్వాసుని దేవీమహిమ్నా స్తుతి కూడా జోడించి సౌందర్యలహరిలో ఉన్న రహస్యాలు సామాన్యులకు కూడా తెలియచేయాలనే ఉద్దేశ్యంతో **పరమానందనాథ** దీక్షానామం గలిగిన హరితస గోత్రీకుడనైన **క్రోవి పార్థసారథి** అను నేను **శ్రీవిద్యాలహరి** అనే పేరుతో సౌందర్యలహరికి భాష్యం వ్రాసి, దాన్ని ఉపన్యాసాలు చెప్పి సి.డిలుగా తయారుచేసి అవధూత, దత్తపీఠాధిపతి శ్రీశ్రీశ్రీ గణపతి సచ్చిదానందస్వామి వారికి అంకితం చేస్తున్నాను. పండితులు, పరమేశ్వరి భక్తులు శ్రీవిద్యోపాసకులు నా ఈ సాహసాన్ని మన్నించి నన్ను ఆశీర్వదింతురు గాక.

సౌందర్యలహరిలో అనేక మంత్ర, యంత్ర, తంత్ర రహస్యాలున్నాయి. మంత్రోపదేశం లేని మాబోటివారు ఇవన్నీ చదువవచ్చునా ? అని అనుమానం రావచ్చు. అటువంటి వారందరూ కూడా సాక్షాత్తు పరమేశ్వరి స్వరూపులు, అవధూత, దత్త పీఠాధిపతి శ్రీశ్రీశ్రీ గణపతిసచ్చిదానందస్వామి వారిని గురువుగా భావించి వీటిని చదవండి. మీకు ఏ విధమైన ఆపదరాదు. అన్నీ శుభాలే జరుగుతాయి. అని నొక్కి వక్కాణిస్తూ ....

**ప్రణతులు శంకరగురునకు**
**ప్రణతులు యతిమౌళి గౌడపాదార్యునకున్**
**ప్రణతులు గంగాహరునకు**
**ప్రణతులు లక్ష్మీధరునకు పరమాత్మునకున్ ॥**

ముందుగా సౌందర్యలహరిని వ్రాసిన శంకరాచార్యులవారికి, వారి గురువు గారయిన గోవిందపాదాచార్యులవారికి, శంకరుని పరమగురువయిన గౌడపాదాచార్యులవారికి, సౌందర్యలహరికి తాంత్రికదృష్టితో వ్యాఖ్య వ్రాసిన

గంగహరుడికి, ఉత్తమోత్తమమైన వ్యాఖ్య వ్రాసిన లక్ష్మీధరుడికి, సృష్టి స్థితి లయాలకు కారణమైన పరమేశ్వరికి నమస్కరించి ఈ ఉపన్యాసలహరిని ప్రారంభిస్తున్నాను. పండితులు, పరమేశ్వరి భక్తులు నా యీ ప్రయత్నాన్ని మన్నించి, నన్ను ఆశీర్వదింతురు గాక.

**శివ శక్త్యాయుక్తోయది భవతి శక్తః ప్రభవితుం**
**న చే దేవం దేవో నఖలు కుశలః స్పన్దితు మపి ।**
**అతస్త్వా మారాధ్యాం హరిహర విరఞ్చాదిభిరపి**
**ప్రణన్తుం స్తోతుం వా కథ మకృతపుణ్యః ప్రభవతి ॥** 1

అమ్మా ! ఓ పరమేశ్వరీ ! సర్వమంగళకారకుడైన శివుడు కూడా జగన్నిర్మాణ శక్తివైన నీతో కూడితేనే కాని ఈ జగత్తులను నిర్మించలేడు. నీతో కలువకపోయినట్లైతే అతడు కదలటానికి కూడా శక్తి లేనివాడవుతాడు. కాబట్టి త్రిమూర్తులచేత కూడా పూజింపబడే నీకు నమస్కరించాలన్నా, నిన్ను పూజించాలన్నా, నిన్ను స్తుతించాలన్నా, కనీసం నీ పేరు తలచాలన్నప్పటికీ కూడా, గత జన్మలలో పుణ్యం చెయ్యనివాడు సమర్థుడు కాదు. అంటే పూర్వజన్మ సుకృతం లేనిదే నిన్ను అర్చించటం కాదు కదా, కనీసం నీ పేరు తలచటానికి కూడా అర్హత ఉండదు.

'దేవీ భాగవతం'లో ఒక చిన్న కథ ఉన్నది

కృతయుగానికి ముందు అంటే సృష్టిజరగటానికి పూర్వం ఈ జగత్తంతా జలమయంగా ఉండేది. ఆ జలరాసిమధ్య వటపత్రశాయి అయిన శ్రీమన్నారాయణుడు యోగనిద్రలో ఉన్నాడు. ఆయన నాభి నుంచి ఒక కమలం వచ్చింది. అందులో నుంచి బ్రహ్మదేవుడు పుట్టాడు. ఈ రకంగా ఉద్భవించిన బ్రహ్మదేవుడు, తాను ఏ రకంగా పుట్టాను అని ఆలోచిస్తుండగా 'తప, తప' అని వినిపించింది. దాని ప్రకారం తాను పుట్టినపద్మంలోనే కూర్చుని తపస్సు చెయ్యటం మొదలుపెట్టాడు. ఇలా వెయ్యిసంవత్సరాలు గడిచాయి. విష్ణుమూర్తి చెవిలోని మలినపదార్థం నుంచి మధుకైటభులు అనే రాక్షసులు జన్మించి బ్రహ్మదేవునితో యుద్ధానికి సిద్ధపడ్డారు. ఎట్టకేలకు పరమేశ్వరి సాయంతో మధుకైటభ సంహారం చేశాడు విష్ణుమూర్తి. అప్పుడు త్రిమూర్తులలో మూడవవాడైన రుద్రుడుకూడా అక్కడికి వచ్చాడు. ఆ సమయంలో

ఆకాశంనుండి దివ్యమైనవిమానం ఒకటి వచ్చి త్రిమూర్తులను అందులో ఎక్కించుకుని బయలుదేరింది. అలా ఆ విమానం సప్త సముద్రాలు దాటి మణిద్వీపం చేరింది. అందులో కల్పవృక్షాలవనం. ఆవనం మధ్యన చింతామణులతో నిర్మించిన భవనం, అందులో త్రికోణాకార మంచం మీద ఒక దివ్యమంగళవిగ్రహం. ఎర్రని వస్త్రాలు ధరించి, ఎర్రచందనము శరీరానికి పూసుకుని, సర్వాలంకృతయై, కోట్లకొలది సూర్యుల కాంతులతో ప్రకాశిస్తున్నది ఆవిడ. ఆమె కూర్చున్నది శ్రీచక్రము మీద. ఆమె చేతులలో పాశము, అంకుశము, ధనుర్బాణాలు ఉన్నాయి. దేవతలందరూ ఆమెకు సపర్యలు చేస్తూ, హృల్లేఖీ, భువనేశీ అని జపిస్తున్నారు. అక్కడ తిరుగాడే శుకశారికాలు కూడా హ్రీంకార జపం చేస్తున్నాయి. ఆవిడే పరమేశ్వరి. ఆవిడే జగన్మాత.

**హ్రీంకారాసన గర్భితా నలశిఖాం సౌః క్లీం కళాబిభ్రతీం**
**సౌవర్ణాంబరధారిణీం పరసుధాం ధౌతాం త్రినేత్రోజ్వలాం ।**
**వందే పుస్తకపాశ మంకుశధరాం స్రగ్భూషితా ముజ్వలాం**
**త్వాం గౌరీం త్రిపురాం పరాత్పర కళాం శ్రీచక్రసంచారిణీం ॥**

త్రిమూర్తులు ముగ్గురూ ఆమెను పరిపరివిధాల స్తుతి చేశారు. ఆ తరువాత బ్రహ్మదేవుడు – తల్లీ ! నీవు స్త్రీవా ? లేక పురుషుడవా? ఏకమేవా ద్వితీయం బ్రహ్మ అన్న వేదవాక్యానికి అర్థం నీవేనా ? మాకు వివరించవలసినది అన్నాడు. దానికి ఆ పరాశక్తి.

"త్రిమూర్తులారా ! నేనే పరాశక్తిని. పరబ్రహ్మ స్వరూపాన్ని. నాకు నామరూపాలు లేవు. లింగభేదాలు లేవు. ఈ చరాచరజగత్తంతా నాచేతనే సృష్టించబడింది. సర్వకర్తను, సర్వభోక్తను కూడా నేనే. నేను లేనిది ఏ వస్తువూ లేదు. నేను లేకపోతే ఏ శక్తి అయినా సరే అశక్తే అవుతుంది. అంతదాకా ఎందుకు ? నేను లేకుండా మీ ముగ్గురూ కూడా ఏ పనీ చెయ్యలేరు. బ్రహ్మ సృష్టి చెయ్యలేడు. విష్ణువు పోషణ, రుద్రుడు లయము చెయ్యలేరు. శక్తితో కలిస్తేనే బ్రహ్మలోకాలను సృష్టి చేయగలుగుతాడు. విష్ణువు లోకాలను రక్షించగలుగుతాడు. రుద్రుడు లయం చెయ్యగలుగుతాడు. అనంతుడు, ఆదివరాహము, ఆదికూర్మములు కూడా శక్తి ఉంటేనే ఈ భూమిని మోయగలుగుతున్నాయి. అంతదాకా ఎందుకు ? నీరు, నిప్పు, గాలి, వీటికి కూడా శక్తి లేకపోతే కేవలము పేర్లే మిగులుతాయి." అని చెబుతుంది. ఆవిడే పరమేశ్వరి,

పరమాత్మ, పరబ్రహ్మ స్వరూపము, పరంజ్యోతి, పరాత్పరి అని చెప్పబడుతున్నది. పరమేశ్వరి అంటే – పరానికి ఈశ్వరి. పరాన్ని ఇచ్చేది. పరము అంటే మోక్షము. కాబట్టి మోక్షాన్ని ఇచ్చే శక్తి గలది. పరాత్పరురాలైన ఈశ్వరి. జగత్తులో జీవులకు వారి వారి కర్మలననుసరించి దేహము, ఇంద్రియాలు వంటివి ఏర్పడతాయి. కర్మ ఎప్పుడైతే నశిస్తుందో దేహము కూడా అప్పుడే నశిస్తుంది. మరణానంతరము జీవి తానుచేసిన కర్మ ఫలాన్ననుభవించి, కర్మ శేషాన్ననుభవించటం కోసం ఈ లోకంలో మళ్ళీ పుడుతుంది. ఈ రకంగా జీవి ఈ లోకంలో జన్మిస్తూ, కర్మచేస్తూ, కర్మఫలితాన్ని అనుభవించి మరణిస్తూ మళ్ళీ పుడుతూ ఉంటుంది. కర్మ పూర్తిగా క్షయమయ్యేదాకా ఈ రకంగానే జరుగుతుంటుంది. కర్మక్షయం అయితే పునర్జన్మ ఉండదు. అదే సాయుజ్యము. ఈ రకమైన కర్మ సంబంధం లేనటువంటిది పరమేశ్వరి. లలితాసహస్రంలో 396వ నామము **'పరమేశ్వరి'**. పరం అంటే బ్రహ్మ అని అర్థం. అతడే శివుడు. పరబ్రహ్మ నాలుగు రూపాలు కలిగి ఉంటుంది. అవి

1) పురుషుడు 2) వ్యక్తము 3) అవ్యక్తము 4) కాలము. అని విష్ణుపురాణంలో చెప్పబడింది. వీటికన్న గొప్పది పరమేశ్వరి.

కార్యకారణములకన్న వేరైనది అయిన నిత్య శుద్ధ, బుద్ధ, ముక్తస్వరూపము 'పరమ' అనబడుతుంది. నశించేటటువంటి దేహాదులచే నశించనిది. శ్రేష్ఠమైనది. వేదమునందు చెప్పబడినది. ఈ జగత్తును అందంగా ప్రకాశింపచేసే తత్త్వము. అదే 'పరమా' అనబడుతుంది. లలితా సహస్రంలో 618వ నామము **'పరమా'**. ఆవిడే పరంజ్యోతి. పరము అనగా ఉత్కృష్టమైనది. అన్నింటికన్నా గొప్పదైనది. బృహదారణ్యకములో చెప్పినట్లుగా జ్యోతిషులకు కూడా జ్యోతిషుగా ఉన్నది. కఠోపనిషత్తులో చూడండి 'ఆత్మ చాలా ప్రకాశవంతమైనది. అక్కడ సూర్యుడు కాని, చంద్రుడు కాని, నక్షత్రాలు కాని ప్రకాశించవు' అంటాడు. భైరవయామళంలో పరమేశ్వరి కొన్ని వేలకోట్ల సూర్యులకాంతితో ప్రకాశిస్తున్నది. ఆ కాంతి నుండి అగ్ని 108 కిరణాలు, సూర్యుడు 116 కిరణాలు, చంద్రుడు 136 కిరణాలను మాత్రమే తీసుకోగలిగారు. వీటివల్లనే ఈ జగత్తు ప్రవర్తిల్లుతున్నది. ఈ రకంగా కాంతినిచ్చే సూర్య, చంద్రాగ్నులకు కూడా కాంతినీ, ప్రకాశాన్ని ఇచ్చేది ఆ పరమేశ్వరి. అంటే ఆమె పరంజ్యోతి. లలితా సహస్రంలో 806వ నామము **'పరంజ్యోతిః'** ఆమెయే

పరాత్పరి. పరులైన వారికన్నా కూడా పరమైనది. శ్రేష్ఠమైన వారికన్నా కూడా శ్రేష్ఠమైనది. కాలమానంలో అతిపెద్దది బ్రహ్మకల్పము. ఇది బ్రహ్మయొక్క ఆయుష్షు. ఇతడు చతుర్ముఖబ్రహ్మ. అతన్నే కర్మ బ్రహ్మ అని కూడా అంటారు. త్రిమూర్తులలో మొదటివాడు. ఇతడే సృష్టికర్త. ఇతని ఆయువుకన్న ఎక్కువైనది, శాశ్వతమైనది.

పరమేశ్వరికి కాలమానం లేదు. ఆమె ఆదిమధ్యాంత రహితమైనది. జన్మ, మృత్యు, జరాదులు లేనిది. సత్యము, నిత్యము, శాశ్వతము అయినది. వేదంలో చెప్పినట్లుగా

| | | |
|---|---|---|
| ఇంద్రియాలకన్న | – | మనస్సు శ్రేష్ఠమైనది |
| మనస్సుకన్న | – | బుద్ధి శ్రేష్ఠమైనది |
| బుద్ధికన్న | – | మహత్తు శ్రేష్ఠమైనది |
| మహత్తుకన్న | – | అవ్యక్తము శ్రేష్ఠమైనది |
| అవ్యక్తముకన్న | – | పరబ్రహ్మ శ్రేష్ఠమైనది |

పరబ్రహ్మ కన్న శ్రేష్ఠమైనది ఏదీ లేదు. అందుచేతనే ఆమె 'పరాత్పరి' అనబడుతోంది. లలితాసహస్రంలో 809వ నామము **'పరాత్పరా'.**

జీవుల యొక్క కర్మని క్షయం చేసి వారికి మోక్షం ప్రసాదించాలనే ఉద్దేశ్యంతోనే ఈ జగత్తును సృష్టిస్తున్నది. ప్రళయం జరిగినప్పుడు ఈ జగత్తు అంతా నాశనం అయిపోతుంది. ఆ సమయంలో కర్మ క్షయం అయిన జీవరాశికి మోక్షం లభిస్తుంది. కాని కర్మక్షయం కాని జీవరాశి తమ కర్మను తమతోపాటుగా మూట కట్టుకుని ఆ పరమేశ్వరిలో లీనమయిపోతుంది. మళ్ళీ కొంతకాలానికి, అంటే జీవుల కర్మ పరిపక్వమై, అనుభవించే స్థితికి వచ్చిన తరువాత ఈ సృష్టి జరుగుతుంది. ఈ రకంగా సృష్టి, స్థితి, లయాలను చేసేది పరమేశ్వరి. అందుకే లలితా సహస్రంలోని 551వ నామము **'వియదాదిజగత్ప్రసూః'.**

బహ్వృచోపనిషత్తులో సృష్టి ప్రారంభానికి ముందు పరమేశ్వరి ఒక్కతే ఉండేది. ఆమెయే ఈ జగత్తును సృష్టి చేసింది. ఆమెనుంచే బ్రహ్మ, విష్ణువు, రుద్రుడు, మరుద్గణాలు, గంధర్వులు, అప్సరసలు, అందరూ పుట్టారు. అండజాలు, శ్వేదజాలు, ఉద్భిజాలు, జారజాలు మొదలైన ప్రాణులు, స్థావరజంగమములు అన్నీ ఆ పరమేశ్వరి నుంచే ఉద్భవించాయి అని చెప్పబడింది.

దేవీ ఉపనిషత్తులో దేవతలంతా పరమేశ్వరిని సమీపించి 'అమ్మా ! నీవెవరవు?' అని అడుగుతారు. అప్పుడు ఆ దేవి "నేను పరబ్రహ్మస్వరూపాన్ని. నావల్లనే ప్రకృతి, పురుషాత్మకమైనజగత్తు ఆవిర్భవించింది. శూన్యము నేనే, అశూన్యము నేనే. ఆనందము నేనే. అనానందము నేనే. విజ్ఞానము, అవిజ్ఞానము నేనే. పంచభూతములు, అఖిలజగత్తు, వేదాలు, విద్య, అవిద్య అంతా నేనే." అని చెబుతుంది. ఆవిడే పరమేశ్వరి.

శంకరభగవత్పాదులవారు సౌందర్యలహరిలోని మొదటిశ్లోకంలో ఆ పరమేశ్వరిని స్తుతిస్తూ **"ప్రణస్తుం స్తోతుంవా కథమకృత పుణ్యః ప్రభవతి."** సృష్టి, స్థితి, లయాలకు కారణభూతమైన ఓ పరమేశ్వరీ ! నీకు నమస్కరించాలన్నా, నిన్ను స్మరించాలన్నా, నీ గురించి వినాలన్నా, పూర్వజన్మలో చేసిన సుకృతం ఉండాలి, అంటున్నారు. లలితాసహస్రంలో చెప్పిన **'శివశక్త్యైకరూపిణి'** ఈమెయే.

నిరాకారుడు, నిర్గుణస్వరూపుడు పరబ్రహ్మ. అతడు గనక ఒకరూపం పొందినట్లైతే, అదే పరమేశ్వరి. సృష్టి ప్రారంభానికి ముందు నిరాకారుడుగా ఉన్న పరమేశ్వరుడు, సృష్టి చేయాలనే సంకల్పంతో తనను తాను రెండుగా విభజించుకున్నాడు. వారే శివాశివులు. పరమేశ్వరి, పరమేశ్వరులు. శివశక్తులు. వారి సమాగమ ప్రదేశమే శ్రీచక్రము. ఒక్కసారి మంత్రశాస్త్రంలోకి గనక చూసినట్లైతే, శివ అంటే నాలుగు, శక్తి అంటే ఐదు. వెరసి తొమ్మిది చక్రాలతో అలరారేదే శ్రీచక్రము. దీనిని 'నవయోన్యాత్మకము' అంటారు. ఇందులో శివచక్రాలు నాలుగు, శక్తి చక్రాలు ఐదు. వెరసి తొమ్మిది చక్రాలుంటాయి. ఇదే చరాచరజగత్తుకు, విశ్వమానవాళికీ ప్రతీక. దీన్ని గురించి 11వ శ్లోకంలో పూర్తిగా వివరించబడుతుంది.

ఈ శ్లోకంలో శక్తి లేకపోయినట్లైతే సాక్షాత్తు ఈశ్వరుడికి కూడా సృష్టి స్థితి లయాలు చెయ్యటం సాధ్యం కాదు అని చెబుతున్నారు. వామకేశ్వర తంత్రంలో

**పరోఽపి శక్తిరహితః శక్త్యాయుక్తో భవేద్యపి ।**

**సృష్టి స్థితిలయాన్ కర్తు మశక్తః శక్త ఏవహి ॥**

పరుడు కూడా శక్తిరహితుడైనట్లైతే సృష్టి, స్థితి, లయాలు చెయ్యలేడు. శక్తితో కలిస్తేనే వాటిని చెయ్యగలుగుతాడు. మానసోల్లాసము అనే గ్రంథంలో

**యేఽపి బ్రహ్మాదయోదేవా భవంతి వరదాయినః**

**త్వద్రూపం శక్తిమాసాద్యతే భవంతి వరప్రదః**

**తస్మాత్ త్వయేవ సర్వత్ర కర్మణాం ఫలదాయినీ ॥**

శివుడు, శక్తి ఈ ఇద్దరూ వేరు వేరు కాదు. ఇద్దరూ ఒక్కటే. శివుడు లేకుండా శక్తి గాని, శక్తి లేకుండా శివుడుగాని ఉండరు.

**తంతుమాన్ పటః** నూలుపోగులు కలది వస్త్రము. **మృద్వాన్ ఘటః** మట్టితో తయారైనది కుండ. అలాగే శక్తి గలవాడే శివుడు. శివుడే శక్తి. శక్తే శివుడు. ఇద్దరూ ఒక్కటే. ఉపాసకులు కేవలము తమ వాసనాభేదములచేత భేదాలు సృష్టిస్తున్నారు. 'పరిమళ' అనే గ్రంథంలో చెప్పినట్లుగా

**అలేఖ్యవిశేష ఇవ గజవృషభయోర్ద్వయోః ప్రతిభాసమ్ ।**

**ఏకాస్మిన్నేవార్ధే శివశక్తి విభాగ కల్పనాం కుర్మః ॥**

ఒక బొమ్మను చూసి కొందరు శివుడు అన్నారు. మరి కొందరు శక్తి అన్నారు. ఉన్నది మాత్రం ఒకే బొమ్మ. మీ మీ భావనలను బట్టి దాన్ని పిలుస్తున్నారు అంతే. అదే పరమేశ్వర తత్త్వము. 'మాతృకా హృదయము' అనే గ్రంథంలో మనం మాట్లాడే భాషలో కూడా

**కకారాది క్షకారాంతా వర్ణాస్తే శివరూపిణః ।**

**అకారాదివి సర్గాంతాః స్వరాః షోడశ శక్తయః ॥**

అ నుంచి అః వరకు ఉండే అచ్చులు శక్తిరూపాలు. క నుంచి క్ష వరకు హల్లులు శివరూపాలు. ఈ రెండూ కలిస్తేనే కాని అక్షరం పూర్తి కాదు. రుద్రయామళంలో చెబుతారు చూడండి.

**శక్తిః ప్రాణశ్చ జీవశ్చ మంత్రోనాదః శివోరవిః**

మంత్రశాస్త్రంలో కూడా శక్తియే ప్రాణము, జీవము అవుతున్నది. ఉదాహరణకు బాలామంత్రం చూడండి. ఇందులో మొత్తం మూడుబీజాలున్నాయి. అవి

**వాగ్భవం ప్రథమ బీజం । కామరాజం ద్వితీయకం**

**తృతీయం శక్తికూటాఖ్యం । నిగమత్రితయోద్ధృతమ్**

**ఇత్థం కుమారీ విద్యయా బీజత్రయముదీరితమ్ ॥**

మొదటిది వాగ్భవబీజము - ఐం
రెండవది కామరాజబీజము - క్లీం
మూడవది శక్తిబీజము - సౌః

ఇందులో శక్తిబీజమున్నది కాబట్టే ఆ మంత్రానికి సంపూర్ణత్వము సిద్ధిస్తున్నది. 'స్కంద పురాణం'లో

**ప్రణవో బీజమాఖ్యాతం నమఃశక్తి రుదీరితా ।**
**ఋషిః స్వాధ్యాయేదేవోఽస్య పంక్తిశ్ఛంద ఉదాహృతమ్**
**పార్వతీవల్లభః సాక్షాదేవతాత్ర సదాశివః ॥**

శివపంచాక్షరి 'ఓం నమశ్శివాయ.' ఇందులో నమః అనేది శక్తి. ఈ శక్తి లేకుండా మంత్రం పూర్తి కాదు. ఫలించదు.

ఈ రకంగా మొదటి శ్లోకంలో శంకర భగవత్పాదుల వారు శివశక్తుల స్వరూపమైన పరమేశ్వర తత్త్వాన్ని కీర్తించారు. గౌడపాదుల వారు కూడా తమ 'సుభగోదయస్తుతి'లోని మొదటి శ్లోకంలో

**భవాని త్వం వందే భవమహిషి సచ్చిత్సుఖ వపుః**
**పరాకారాం దేవీ మమృతలహరీ మైందవ కళామ్ ।**
**మహాకాలాతీతాం కలితసరణీ కల్పితతనుం**
**సుధాసింధోరంతర్వసతిమనిశం వాసరమయీమ్ ॥**

భవానీ ! శివుని అర్ధాంగి అయిన ఓ పార్వతీ ! నీవు సచ్చిదానంద స్వరూపిణివి. పరాకారమైన దేవివి. అమృతలహరివి. అఖండమైన కాలానికి అతీతురాలవు. నిరాకారవు. అయినప్పటికీ మాయాశక్తి వలన కల్పించబడిన ఆకారముతో ప్రకాశిస్తున్నావు. అటువంటి బిందు స్వరూపిణివైన నీకు నమస్కరిస్తున్నాను అని అంటారు. 'దేవీ మహిమ్నాస్తుతి' అనే గ్రంథంలో దుర్వాసులవారు

**శ్రీమాత స్త్రిపురే ! పరాత్పరతరే ! దేవీ ! త్రిలోకీ ! మహా**
**సౌందర్యార్ణవ మంథనోద్భవసుధా ప్రాచుర్యవర్ణోజ్వలం**
**ఉద్యద్భాను సహస్ర నూతన జపాపుష్ప ప్రభం తే వపుః**
**స్వాస్తేయే స్ఫురతు త్రిలోక నిలయం జ్యోతిర్మయం వాఙ్మయం ॥**

'ఓ తల్లీ ! త్రిపురా ! పరాత్పరీ ! ముల్లోకములందు సౌందర్యమైనదానా; అమృతము వంటిదానా, బాలభానుని అరుణారుణచ్ఛాయతో ప్రకాశించే ఓ దేవీ ! త్రిలోకమయము, జ్యోతిర్మయము, వాఙ్మయము అయిన రూపము గలదానా ! నా ఉపాసనలో నిరంతరము నీ రూపము దర్శనమిచ్చును గాక.' అని ప్రార్థిస్తున్నాడు.

అదే విధంగా శంకరభగవత్పాదులవారు కూడా మొదటిశ్లోకంలో ఆ పరాత్పరిని స్తుతించి ఇక గ్రంథాన్ని ప్రారంభిస్తున్నారు.

**తనీయాంసం పాంసుం తవచరణ పఙ్కేరుహ భవం**
**విరిఞ్చి స్సఞ్చిన్వన్ విరచయతి లోకా నవికలన్ ।**
**వహత్యేనం శౌరిః కథమపి సహస్రేణ శిరసాం**
**హరః సంక్షుద్యైనం భజతి భస్మోద్ధూళనవిధిమ్ ॥** **2**

ఓ తల్లీ ! నీ పాదధూళిని అణుమాత్రం తీసుకున్న బ్రహ్మదేవుడు చరాచర జగత్తును సృష్టిస్తున్నాడు. అతల, వితల, రసాతల, మహాతల, పాతాళ, మత్స్యలోకాలనబడే అధో లోకాలను, భూలోక, భువర్లోక, సువర్లోక, మహాలోక, జనోలోక, తపోలోక, సత్యలోకాలనబడే ఊర్ధ్వలోకాలను మొత్తం పధ్నాలుగులోకాలను సృష్టిస్తున్నాడు. అలాగే విష్ణువు తన వేయితలలతో ఈ భూమిని మోస్తున్నాడు. దానినే ఈశ్వరుడు శరీరమంతా భస్మముగా ధరిస్తున్నాడు.

ఆ పరమేశ్వరి యొక్క పాదధూళియే త్రిమూర్తులకు సృష్టి, స్థితి, లయాలు చేసే శక్తిని ఇస్తున్నది. ఆ దేవి పాదపద్మాల నుండి జారిన రేణువుల యొక్క ప్రభావంచేతనే బ్రహ్మ పధ్నాలుగులోకాలు ఒకదానికి ఒకటి అడ్డుపడకుండా సృష్టించగలుగుతున్నాడు. ఆ పాదధూళిని సంపాదించి 'శూరుడు' అనే యదువంశపు రాజుయొక్క వంశ పరంపరలోనివాడయిన ఆదిశేషుడు, తన వేయిశిరస్సులతోను భూమిని మోయగలుగుతున్నాడు. వామకేశ్వర తంత్రంలో చెప్పినట్లుగా

**శింశు మారాత్మనా విష్ణుః భూరాదీ మూర్ధ్వతస్థితాన్ ।**
**దధ్రే శేషయతాలోకాన్ సప్తలోకాన్ అధస్థితాన్ ॥**

శ్రీ మహావిష్ణువు మొసలిరూపంలో ఊర్ధ్వలోకాలను, ఆదిశేషునిరూపంలో అధోలోకాలను మోస్తున్నాడు. లోకాలను రక్షించవలసిన బాధ్యత విష్ణువుది. ఇక్కడ శేషుడు అంటే శ్రీమహావిష్ణువుకన్న వేరుకాదు అని గుర్తించాలి.

ఇక హరుడు. అంటే త్రిమూర్తులలో మూడవవాడైన రుద్రుడు. **హరతీతి–హరః** ప్రళయ కాలమున ప్రపంచాన్ని హరించేవాడు. అతడు చతుర్దశ లోకాలను భస్మము చేసి ఆ వచ్చిన భస్మాన్ని వంటికి రాచుకుని జపం చేసుకుంటున్నాడు. అంటే ఈ జగత్తుయొక్క సృష్టి స్థితి లయాలన్నీ ఆ పరమేశ్వరి పాదరేణువుల ప్రభావంచేతనే జరుగుతున్నాయి అంటున్నారు భగవత్పాదులవారు.

ఈ శ్లోకంలో శంకర భగవత్పాదులవారు దర్శనశాస్త్రాన్ని మనకు వివరిస్తున్నారు. **దృశ్యతే జ్ఞాయతే అనేనేతి దర్శనమ్ ।**

వస్తుతత్త్వాన్ని తెలిపేది దర్శనము అని చెప్పబడింది. దర్శనాలు అనేకములున్నాయి. కాని వాటిలో

**పాణినేర్జైమినేశ్చైవ వ్యాసస్యకపిలశ్చ చ ।**
**కణాదస్యాక్ష పాదస్యా దర్శనాని షడైవహి ॥**

1. పాణిని వ్రాసిన వ్యాకరణము
2. జైమిని వ్రాసిన పూర్వమీమాంస
3. వ్యాసుడు వ్రాసిన ఉత్తరమీమాంస
4. కపిలుడు వ్రాసిన సాంఖ్యదర్శనము
5. కణాదుడు వ్రాసిన వైశేషికదర్శనము
6. అక్షపాదుడు వ్రాసిన న్యాయదర్శనము

ముఖ్యమైనవి. కాని ప్రస్తుతకాలంలో పదహారుదాకా దర్శనాలున్నాయి.

ఈ శ్లోకంలో శంకరులవారు

కణాదుని – వైశేషికదర్శనము
గౌతముని – న్యాయదర్శనము
కపిలుని – సాంఖ్యదర్శనము
పతంజలి – యోగదర్శనాలను వివరించి

చివరకు వేదాంత దర్శన సిద్ధాంతాన్ని స్థాపించారు. ఇప్పుడు ఈ దర్శనాలను ఒక్కసారి టూకీగా చూద్దాం.

**1. వైశేషికదర్శనము :** దీన్ని కణాదమహర్షి వ్రాశాడు. పరమాణువుల వల్లనే ఈ జగత్తు ఏర్పడింది అంటాడు కణాదుడు. ఈ జగత్తంతా అణువులమయం. కొన్ని పరమాణువులు కలిసి ఈ జగత్తు ఏర్పడింది. వీరు ఈశ్వరుని అనుమాన ప్రమాణంతో నమ్ముతారు.

**2. న్యాయదర్శనము :** దీన్ని వ్రాసినవాడు గౌతముడు, కణాదుడు సృష్టికి మూలపదార్థాలు ఏడు అన్నాడు. కాని గౌతముడు సృష్టికి మూలం పదహారు పదార్థాలు అంటాడు. ఈ పదహారుపదార్థాల తత్త్వాన్ని తెలుసుకోవటమే మోక్షము.

**3. సాంఖ్యదర్శనము :** దీన్ని వ్రాసినవాడు కపిలుడు. ఈ జగత్తు 25 తత్త్వములచే ఏర్పడింది. అవి 1) అవ్యక్తము 2) మహత్తత్త్వము 3) అహంకారము, పంచతన్మాత్రలు, పంచభూతాలు, జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు, మనస్సు, పురుషుడు. వెరసి 25 వీటియొక్క పరిణామమే ఈ జగత్తు. పాలు పెరుగయినట్లుగా, ప్రకృతి పురుషుల కలయికవల్ల ఈ జగత్తు ఏర్పడుతున్నది.

**4. పతంజలి యోగశాస్త్రము :** దీన్ని వ్రాసినవాడు పతంజలిమహర్షి. ఇది నాలుగు భాగాలుగా ఉంటుంది. వీటిలో ఒక్కొక్క భాగాన్ని ఒక్కొక్క పాదము అంటారు. అష్టాంగయోగసాధన ద్వారా కైవల్యప్రాప్తి జరుగుతుంది అంటాడు పతంజలి మహర్షి. అష్టాంగములు అంటే 1. యమ, 2. నియమ 3. ఆసన 4. ప్రాణాయామ 5. ప్రత్యాహార 6. ధారణ 7. ధ్యాన 8. సమాధి

**5. వేదాంతదర్శనము :** శంకరభగవత్పాదులవారు ఈ నాలుగుదర్శనాలను చెబుతూ, వేదాంతదర్శనాన్ని స్థాపించారు. వేదాంతదర్శనము అంటే వ్యాసమహర్షి వ్రాసిన ఉత్తరమీమాంస. వేదముయొక్క ఉత్తరభాగమయిన ఉపనిషత్తులను సమన్వయపరిచే బ్రహ్మసూత్రాలు. సాధనచతుష్టయసంపత్తి కలిగిన తరువాతనే బ్రహ్మను గురించి తెలుస్తుంది. ఇవే మోక్షసాధనాలు. అవి :

**1. నిత్యానిత్య వివేకము :** ఏది సత్యము ? ఏది అసత్యము ? ఏది నిత్యము ? ఏది అనిత్యము ? అనే విషయపరిజ్ఞానము. బ్రహ్మ ఒక్కటే సత్యమైనది. ఈ జగత్తంతా మిథ్య. కంటికి కనిపించే జగత్తంతా అశాశ్వతమైనది. బ్రహ్మ ఒక్కటే శాశ్వతమైనది.

**2. వైరాగ్యము :** ఈ లోకానికి సంబంధించిన సుఖాలపట్ల విముఖత. శరీరం మొదలు బ్రహ్మలోకందాకా ఉండే భోగ్యపదార్థాలయందు విముఖత కలిగి ఉండటము.

**3. షట్సంపత్తి :** ఇవి మొత్తం ఆరు.

**1. శమము :** అంతరింద్రియనిగ్రహము. విషయవాంఛల నుండి బైటపడి అంతరింద్రియాలను దోషదృష్టితో విరక్తి చెంది నిగ్రహించటము.

**2. దమము :** బాహ్యేంద్రియనిగ్రహము. ఇంద్రియాలను వాటి విషయాల నుంచి మళ్ళించి వాటి స్థానాలలో వాటిని నిలపటము.

**3. ఉపరతి :** కర్మలను పరిత్యజించటం. బాహ్యవిషయాలను చిత్తవృత్తులతో ఆశ్రయించకుండా ఉండటం. విహితకర్మలను విధిపూర్వకంగా విసర్జించటం.

**4. తితిక్ష:** శీతోష్ణ, సుఖదుఃఖాలను సహించే శక్తి. చింత, దుఃఖము మొదలైనవి లేకుండా, ప్రతీకారము లేకుండా, సమస్తదుఃఖాలను, కష్టాలను సహించటం. ఎదుర్కొనగల శక్తి సామర్థ్యాలు ఉండి కూడా ఇతరులు చేసిన అపకారాలను సహించటం.

**5. శ్రద్ధ:** గురువునందు, ఆయన చెప్పే విషయాలయందు విశ్వాసము. శాస్త్రాలు, వేదాలు మొదలగు వాటియందు నమ్మకము.

**6. సమాధి :** బుద్ధిని ఎప్పుడూ శుద్ధబ్రహ్మమందే నిల్పి ఉంచటం.

**4. ముముక్షుత్వము :** మోక్షం సాధించాలనే కోరిక. ఆత్మజ్ఞానం ద్వారానే బంధనాలను త్రెంచుకోవాలనే కోరిక.

శంకరులవారు మిగిలిన దర్శనాలన్నీ ఖండించి వేదాంతదర్శనాన్ని పునః ప్రతిష్ఠించారు. శంకర భగవత్పాదులు ఈ శ్లోకంలో 'పాంసు' అనే పదంతో అణువాదాన్ని చెప్పారు.

ఈ రకంగా వేదాంత దర్శనాన్ని, తద్వారా అద్వైత సిద్ధాంతాన్ని వివరించారు భగవత్పాదులు.

**అవిద్యానా మన్తస్తిమిర మిహిరద్వీపనగరీ**
**జడానాం చైతన్యస్తబక మకరన్ద స్రుతి ఝరీ**
**దరిద్రాణాం చిన్తామణిగుణనికా జన్మజలధౌ**
**నిమగ్నానాం దంష్ట్రా మురరిపు వరాహస్య భవతి ॥** 3

అమ్మా ! నీ పాదకమలపరాగరేణువు ఉన్నదే ! అది అజ్ఞానమనే చీకటిలో ఉన్నవారికి సూర్యుడు ఉండే పట్టణము. మందబుద్ధులకు చైతన్యమనే కల్పవృక్ష పుష్పగుచ్ఛముయొక్క తేనె. దరిద్రుడి పాలిట చింతామణులప్రోగు. సంసార సాగరంలో మునిగిపోతున్న వాడికి యజ్ఞవరాహరూపియైన విష్ణువుయొక్క కోర.

ఈ శ్లోకంలో ఆ పరమేశ్వరి కృపాకటాక్షవీక్షణాలు గనక ఉన్నట్లైతే సాధించలేనిది, జరగనిది ఏదీలేదు. అనిచెబుతూ కొన్ని ఉదాహరణలు ఇస్తున్నారు భగవత్పాదులవారు. ముందుగా అవిద్యానాం అంటే విద్యావిహీనులకు అంటున్నారు. విద్యలేనివాడు అంటే చదువులేనివాడు అని అర్థం కాదు. ఇక్కడ విద్య అంటే జ్ఞానము. అవిద్య అంటే అజ్ఞానము.

'ముండకోపనిషత్తు'లో ఒక చిన్న కథ ఉన్నది. పూర్వకాలంలో పాంచాల దేశంలో 'త్రిగర్త' అనే పేరు గల గ్రామం ఒకటుంది. అందులో శునకుడు అనే గొప్ప పండితుడుండేవాడు. ఆయన పాండిత్యంలోనే కాకుండా దానధర్మాలు చెయ్యటంలో కూడా చాలా గొప్పవాడు. ఆ చుట్టుప్రక్కల ప్రాంతాలలో చాలామంది శునకుని దగ్గర విద్యాభ్యాసం చేసినవారే. అందుచేత అతని యశఃశ్చంద్రికలు పాంచాల దేశమంతా వ్యాపించాయి. శునకుడికి ధనంతో బాటుగా దయాగుణంకూడా బాగా ఉండేది. అతిథిసత్కారం నిరంతరం సాగుతూనే ఉండేది. అందుచేత ఆదర్శ గృహస్తుగా పేరు పొందాడు శునకుడు.

శునకుని పెద్దకుమారుడు శౌనకుడు. కఠోరనియమాలతో బ్రహ్మచర్యం పాటించి విద్యాభ్యాసం పూర్తి చేశాడు. అతడు మంచి మేధావి. చాలా మంచివాడు, చురుకైనవాడు. విద్యాభ్యాసం పూర్తయింది. బ్రహ్మచర్యం వదలి, గృహస్థాశ్రమం స్వీకరించాలి. ఆ దశలో ఒకనాడు, అతని గురువైన అంగీరసుడికి నమస్కరించి "గురుదేవా ! దేని గురించి తెలుసుకుంటే సర్వమూ తెలుస్తాయో, దాన్ని నాకు వివరించండి" అన్నాడు. ఆ మాటలు విన్న అంగీరసుడు.

"లోకంలో మనం తెలుసుకోవలసిన విద్యలు రెండు ఉన్నాయి. 1. పరావిద్య 2. అపరావిద్య.

పరమేశ్వరుడికి సంబంధించినది పరావిద్య. ఆత్మతత్త్వాన్ని బోధించేది పరావిద్య. కాగా లౌకికప్రయోజనాలకు ఉపకరించేది అపరావిద్య. వేదాలలో స్వర్గ సాధనాలయిన

యజ్ఞకర్మలు చెప్పబడ్డాయి. కర్మలు చెయ్యటంవల్ల ఫలితము వస్తుంది. దానివల్ల స్వర్గసుఖాలు పొందుతారు. కాబట్టి కర్మఫలం కావాలంటే అగ్నిహోత్రాది కర్మలనాచరించాలి. యజ్ఞయాగాదులు చెయ్యాలి. స్వాహాకారంతో దేవతలకు ఆహుతులు సమర్పించాలి. ఈ రకంగా కర్మలు చెయ్యటంవల్ల స్వర్గసుఖాలు లభిస్తాయి. వాటిని అనుభవించిన తరువాత కర్మఫలశేషాన్ని అనుభవించటానికి మానవుడు భూలోకంలో మళ్ళీ జన్మిస్తాడు. ఈ రకంగా జన్మిస్తూ, కర్మలు చేస్తూ, మరణిస్తూ సంసారమనే గానుగకు కట్టిన ఎద్దులాగా గిరగిరా తిరుగుతుంటాడు. అంతేకాని అతనికి మోక్షం రాదు. వీరు అవిద్యను ఆరాధించేవారు. అజ్ఞానులు.

అలాగే 'ఛాందోగ్యోపనిషత్తు'లో ఒక కథ ఉంది.

పూర్వకాలంలో ఒకసారి ప్రజాపతి ఆత్మతత్త్వాన్ని గురించి ఒక ప్రకటన చేశాడు. అందులో "ఆత్మకు పాపం అంటదు. ముసలితనం రాదు. మృత్యువు దాన్ని కబళించదు. శోకం తాకదు. ఆత్మకు ఆకలి, దప్పికలు ఉండవు. ఆత్మకోసం అన్వేషించినవాడు, ఆత్మను అనుభవించినవాడు, ఆత్మ స్వరూపాన్ని పొందుతాడు." అన్నాడు.

దేవతలు, రాక్షసులు కూడా ఈ మాటలు విన్నారు. "ఆత్మను గురించి మనం కూడా అన్వేషిద్దాం. ఆత్మవల్ల అన్ని కోరికలు తీరతాయని బ్రహ్మ చెప్పాడు కదా ! ఈ ఆత్మతత్త్వాన్ని ఆయన దగ్గరే తెలుసుకుందాం" అని దేవతల రాజయిన ఇంద్రుడు, రాక్షసుల రాజయిన విరోచనుడు ఇద్దరూ బ్రహ్మ దగ్గరకు వెళ్ళారు. బ్రహ్మ వీరిద్దరినీ 12 సంవత్సరాలు బ్రహ్మచర్యదీక్ష వహించమని చెప్పాడు. దీక్ష పూర్తి చేశారిద్దరూ. ఇప్పుడు ప్రజాపతి ఆత్మతత్త్వాన్ని వారికి వివరిస్తూ "మనుష్యుల కనుపాపలలో మెదులుతూ కనిపించే పురుషుడే ఆత్మ. ఆత్మ అభయం. అమృతమయం. అదే పరబ్రహ్మం" అన్నాడు. తమ కనుపాపలలో ఏం కనిపిస్తోందో తమకు తెలియదు కాబట్టి నీళ్ళలో వారి ముఖాలను చూసుకున్నారు ఇంద్ర, విరోచనులిద్దరూ.

నఖశిఖపర్యంతము కేశపాశాలతో దుమ్ము కొట్టుకుపోయిన శరీరం కనిపించింది వారికి. ఆత్మ ఈ రకంగా ఉంటుందా ? అనుకుని ప్రజాపతి దగ్గరకు పోయి అదే ప్రశ్న వేశారు. 'మీ శరీరాలను శుభ్రపరచుకుని, అలంకరించుకుని, అప్పుడు మీ ముఖాలను నీటిలో చూసుకోండి' అన్నాడు ప్రజాపతి.

అలాగే చేశారువారు. ఇప్పుడు వారి శరీరాలు అందంగా కనిపించినాయి. అదే విషయాన్ని బ్రహ్మకు చెప్పారు. "అభయము, అమృతమయము అయిన ఆత్మ అదే. అదే బ్రహ్మము" అన్నాడు ప్రజాపతి.

అది విన్న ఇంద్ర, విరోచనలు ఆత్మతత్త్వం పూర్తిగా తెలిసింది అనుకుని తిరిగి వెళ్లిపోయారు. త్రోవలో 'మనం అందంగా ఉంటే అందంగానూ, వికారంగా ఉంటే వికారంగాను నీటిలో కనిపించింది. మరి ఆత్మ ఈ రకంగా మారుతుండదు కదా' అని అనుమానంతో తిరిగి బ్రహ్మదగ్గరకు వచ్చి, మళ్ళీ బ్రహ్మచర్యదీక్ష తీసుకున్నాడు ఇంద్రుడు. ఈ రకంగా అనేక సంవత్సరాలు దీక్షలో ఉండి చివరకు ఆత్మతత్త్వాన్ని గ్రహించాడు. కాని విరోచనుడు మాత్రం 'నీటిలో కనిపించి తన దేహమే ఆత్మ' అని గ్రహించి 'దేహమే ఆత్మ' అని ప్రచారం చేశాడు. ఈ విధంగా 'దేహమే ఆత్మ' అనుకునేవారు అజ్ఞానులు.

**అంధం తమః ప్రవిశంతి యే విద్యా ముపాసతే**

ఈ రకంగా అవిద్యను ఆరాధించేవారు అజ్ఞానులు, వీరంతా గాఢాంధకారంలో పడిపోతారు. అని చెప్పబడింది ఈశావాశ్యోపనిషత్తులో

వీరందరికీ జ్ఞానం కావాలి. **జ్ఞానాదేవతు కైవల్యం** జ్ఞానమే మోక్షాన్నిస్తుంది. అందుచేత అవిద్యానాం అజ్ఞానుల యొక్క, అంతః – లోపలనున్న, తిమిరము – చీకటి. మానవులలో ఉన్న అజ్ఞానము అనే చీకటికి, మిహిరుడు అంటే సూర్యుడు. మిహిరద్వీపము – సూర్యుడు ఉండే ద్వీపము.

సూర్యుడు స్వయంప్రకాశి. పరమేశ్వర స్వరూపం నుంచి 116 కిరణాలను సూర్యుడు గ్రహించాడు అని యామళ గ్రంథాలు చెబుతున్నాయి.

**అష్టోత్తరశతం వహ్నే షోడశోత్తర శతం రవే ।**
**షట్త్రింశతదుత్తరశతం చంద్రస్య కిరణాశ్శివే ॥**

ఆ పరమేశ్వరి నుంచి వచ్చే కాంతికిరణాలలో అగ్ని 108, సూర్యుడు 116, చంద్రుడు 136 కిరణాలను వెరసి 360 కిరణాలను మాత్రమే గ్రహించగలిగారు. వీటివల్లనే చరాచర జగత్తు ప్రవర్తిల్లుతున్నది.

సూర్యుడు ఎప్పుడూ ప్రకాశిస్తూనే ఉంటాడు. అందుచేతనే సూర్యుడు మండుతున్న అగ్నిగోళము అని చెబుతారు శాస్త్రకారులు. భూమి తనచుట్టూ తాను తిరుగుతూ, సూర్యుని చుట్టూ తిరుగుతుండటంవల్లనే రాత్రింబవళ్ళు, ఉదయాస్తమానాలు ఏర్పడుతున్నాయి. అంతేకాని ఆయనకు ఉదయించటము, అస్తమించటము అనేవి లేవు. సూర్యుడు కనిపిస్తే ఉదయము, కనుపించకుండా పోతే అస్తమయము. అలాగే సూర్యుడు కనుపించిన వైపు తూర్పు, అస్తమించిన వైపు పడమర. అతడు నిత్యప్రకాశి. సూర్యకిరణములవల్లనే జగత్తు జీవిస్తున్నది. జగత్తును ప్రకాశింపచేసే కాంతులతో సూర్యుడు ఎల్లవేళలయందు ప్రకాశిస్తుంటాడు.

అజ్ఞానపు చీకట్లు కమ్ముకొనిన వారికి ఆ దేవి జగత్తును ప్రకాశింపచేసే కాంతులు గల సూర్యబింబము ఉండే పట్టణము వంటిది. అంటే మానవులయొక్క అజ్ఞానపు చీకట్లను పారద్రోలి, జ్ఞానజ్యోతులు ప్రకాశింపచేస్తుంది ఆ దేవి.

**అవిద్యానామంతస్తిమిర మిహిరద్వీపనగరీ** అంటే ఇదీ అర్థం. లలితా సహస్రంలో 993వ నామం **'అజ్ఞానాధ్వాంతదీపికా'**

**జడానాం చైతన్యస్తబకమకరంద స్రుతి ఝరీ**

జడలు అంటే మందబుద్ధులు. బుద్ధిని సక్రమంగా పని చేయించలేనివారు. సత్యాన్ని సత్యమని నమ్మలేనివారు.

ఈ లోకంలో బ్రహ్మ ఒక్కటే సత్యం. ఈ జగత్తు అంతా మిథ్య. కంటికి కనిపించేదంతా అసత్యము, అశాశ్వతము. పెద్ద పెద్ద కట్టడాలు, రాజ్యాలు ఏవీ శాశ్వతం కాదు. కట్టడాలు కూలిపోతున్నాయి. రాజ్యాలు నాశనమయిపోతున్నాయి. అయినా సరే అది నిజమని నమ్మడు. తన కళ్ళ ఎదురుగా జనం చచ్చిపోతున్నారు. పుట్టిన ప్రతిజీవి మరణిస్తుందని తెలుసు. కాని నమ్మలేడు. నమ్మబుద్ధి కాదు. తాను శాశ్వతంకాదని, ఎప్పుడో మరణిస్తానని తెలుసు. అయినప్పటికీ ఆ విషయాన్ని జీర్ణించుకోలేడు. ఎంత సంపాదించినా, ఇంకా సంపాదించాలనే ఆశ. ఏదో చెయ్యాలనే తపన. ఏదో సాధించాలి. ఉన్నతశిఖరాలు చేరుకోవాలి అనే కోరిక. అసలు శిఖరాలే లేవు. ఇంకా ఉన్నతశిఖరాలు ఎక్కడ ఉన్నాయి ? అధికార కాంక్ష, రాజ్యకాంక్ష, ధనకాంక్ష, స్త్రీవాంఛ. భార్యా బిడ్డలయందు అపరిమితమైన అనురాగము. ఈ రకమైన ఐహికబంధనాలలో చిక్కుకుని ఉంటాడు. ఇవి ఏవీ శాశ్వతం కాదని

తెలిసినా, అందులోంచి బయటకు రాలేడు. అటువంటివాడు జడుడు. మందబుద్ధి. అటువంటి మందబుద్ధులకు చైతన్యము అనబడే కల్పవృక్షపుపూవులనుండి జాలువారే మకరందపుధారవంటిది ఆ పరమేశ్వరి.

**దరిద్రాణాం చింతామణి గుణికా**

దరిద్రులు – దారిద్ర్యంతో బాధపడేవారు. ధనంలేనివారు. సంపదలేనివారు. సంతృప్తి లేనివారు. అటువంటి వారికి 'చింతామణి గుణికా' చింతామణి అనేది ఒకమణి. ఇది దగ్గర ఉంటే చాలు కోరిన కోరికలు తీరిపోతాయి. అనగా సంపద లేనివారికి సంపదలిచ్చే దేవత. తృప్తిలేని వారికి తృప్తినిచ్చే దేవత. అలాగే సుఖము, సంతోషము, శాంతి మొదలైనవి ప్రసాదించే తల్లి. అందుచేతనే దరిద్రులకు చింతామణి వంటిది అంటున్నారు. లలితా సహస్రంలో 57వ నామము **'చింతామణి గృహాంతస్థా.'**

**జన్మజలధౌనిమగ్నానాం దంష్ట్రా మురరిపు వరాహస్య భవతి**

సంసారసాగరంలో పడి కొట్టుమిట్టాడుతున్న వారిని వరాహావతారమెత్తి శ్రీమహావిష్ణువు భూమిని రక్షించినట్లుగా ఆ పరమేశ్వరి రక్షిస్తుంది.

శ్రీమన్నారాయణుడే పరమేశ్వరుడు అని వైష్ణవం చెబుతోంది. ఆ పరమ పురుషుని నుంచి హిరణ్యగర్భుడు జన్మించాడు. అతడి నుండి ఆకాశము, వాయువు, తేజస్సు, జలము వచ్చాయి. జలము నుండి ఒక అండము పుట్టింది. అది హిరణ్మయము. ఆ హిరణ్మయమైన అండమే ప్రజాపతి అని వేదాలు చెబుతున్నాయి. పరమేశ్వరుడు ఈ అండాన్ని రెండుభాగాలుగా విభజించాడు. అందులో పైభాగము ఆకాశము, క్రింది భాగము రసాతలము, ఈ అండము నుంచి వచ్చిన మావి జలము నందు పడి మేరుపర్వతమయింది. దానినుంచి భూమి ఏర్పడింది. ఆ భూమి అనేక యోజనాల విస్తీర్ణము గల పర్వతాలతోను, వృక్షాలతోను నిండిపోయి, ఆ బరువును మోయలేక నీటిలో మునిగిపోయింది. అప్పుడు భూదేవి, శ్రీహరిని అనేక విధాల ప్రార్థించి తనను రక్షించమని వేడుకున్నది. ఆమె ప్రార్థన మన్నించిన శ్రీహరి వరాహరూపం దాల్చి నీటిలో మునిగిపోయిన భూమిని తన కోరలమీద ఎత్తి రక్షించాడు. ఈ విషయం అంతా విష్ణుసహస్రంలోని 534–563 నామాలలో వివరించబడింది. (మహావరాహో, గోవిందో, సుషేణ కనకాంగదీ)

అదే విధంగా సంసారసాగరంలో మునిగిపోయిన వారిని ఆ దేవి వరాహావతారంలో శ్రీమహావిష్ణువు భూమిని రక్షించినట్లుగా రక్షిస్తుంది. ఆ పరమేశ్వరి కృపాకటాక్షవీక్షణాలుంటే ఎటువంటి కోరికలైనా తీరతాయి అని ఈ శ్లోకంలో చెబుతున్నారు.

**మూకం కరోతు వాచాలం పంగుం లంఘయతే గిరిం**

**యత్కృపదామహం వందే ॥**

ఓ తల్లీ ! నీ కృప ఉంటే కానిది ఏదీ లేదు.

**దేవదేవ నీదు మహిమ పరుగు తీయుకుంటివాడు మాతయౌను గొడ్రాలే ....**

**త్వదన్యః పాణిభ్యా మభయవరదో దైవతగణః**

**త్వమేకా నైవాసి ప్రకటిత వరాభీత్యభినయా ।**

**భయాత్త్రాతుం దాతుం ఫలమపి చ వాఞ్ఛాసమధికం**

**శరణ్యే లోకానాం తవ హి చరణా వేవ నిపుణౌ ॥** **4**

ఓ తల్లీ ! నీకన్న ఇతరులైన దేవతలంతా చేతులయందు అభయ, వరదముద్రలు కలిగి ఉన్నారు. కాని నీ పాదములే భక్తుల కోరికలు తీర్చి వారిని భయమునుండి కాపాడుతున్నాయి.

దివ్యమైనశక్తి గలవారు దేవతలు. వీరికి మానవులకన్న అతీతమైనశక్తులు ఉంటాయి. లోకంలో మానవులకన్న శక్తి గలవారు అనేకులున్నారు అని పురాణాలు చెబుతున్నాయి. యక్ష, కిన్నెర, కింపురుష, సిద్ధ, సాధ్య, గంధర్వ గణాలన్నీ ఇలాంటివే. వీరందరిలో ఒకరికన్న ఇంకొకరికి ఎక్కువ శక్తులుంటాయి. ఇంద్రజాల మహేంద్ర జాలాది విద్యలన్నీ వీరి సొంతం. అయితే వీరికి వరాలిచ్చే శక్తిలేదు. అటువంటి శక్తి ఒక్క దేవతలకు మాత్రమే ఉన్నది. మానవులకన్నా అత్యంత శక్తిమంతులైన వారు దేవతలు. వీరు మానవుల భయాన్ని పోగొట్టగలరు. కోరిన కోరికలు తీర్చగలరు. అంటే సిరిసంపదలు, భోగభాగ్యాలు ఇవ్వగలరు. సంతానాన్ని ప్రసాదించగలరు. వీరి శక్తికి కూడా ఒకపరిధి ఉన్నది. మానవుల అన్ని కోరికలు తీర్చటం వీరివల్ల కాదు. రామాయణంలో అంజనాదేవి ఒక కుమారుడు కావాలి అని వాయుదేవుని

ప్రార్థిస్తుంది. వాయుదేవుడు శివుని దగ్గరకు వెళ్ళి రుద్రబీజాన్ని తెచ్చి ఆమెకు ఇస్తాడు. అంతేకాని తనకు తానుగా కుమారుని ప్రసాదించడు. దీనికి కారణం రాబోయే రామరావణసంగ్రామంలో అత్యంతశక్తిమంతుడైన హనుమంతుడు రాముడికి బంటుగా కావాలి. అతడే ఆంజనేయుడు. మరి అంత శక్తి వాయుదేవుడికి లేదు. అందుచేత ఈశ్వరుడి దగ్గరకు పోయి, ఆయన్ను ప్రార్థించి, శివబీజం తెచ్చి అంజనాదేవికి సమర్పించాడు. అప్పుడు శివాంశతో ఆంజనేయుడు జన్మించాడు. అందుకే **రామకార్యార్థం హనుమాన్ శివః** అంటారు.

అలాగే హిరణ్యకశ్యపుడు మొదలైన రాక్షసులు బ్రహ్మను గురించి తపస్సు చేసి చావు లేకుండా వరం కావాలి అని అడిగారు. దానికి 'అది మాత్రం నావల్ల కాదు. ఎందుకంటే నాకే శాశ్వతత్వం లేదు. అలాంటిది నేను నీకెలా ఇవ్వగలను ? కాబట్టి ఇంకేదైనా వరం కోరుకో" అన్నాడు బ్రహ్మ ఇక్కడ 'చావు లేకుండా వరమివ్వటం' అనేది బ్రహ్మదేవుని పరిధిలో లేదన్నమాట.

భారతంలో సైంధవుడు శివుని గురించి తపస్సు చేసి పాండవులైదుగురిని ఒక్కసారైనా గెలిచే శక్తి ప్రసాదించమంటాడు. దానికి శివుడు "అర్జునుణ్ణి నేనే గెలవలేకపోయాను. (కిరాతార్జునీయంలో అర్జునిడి చేతిలో ఓడిపోతాడు శివుడు) కాబట్టి అర్జునుడు కాకుండా మిగిలిన నలుగురునీ గెలిచే శక్తి నీకిస్తున్నాను" అంటాడు.

ఈ రకంగా దేవతలకందరికీ ఒక పరిధి ఉన్నది. వారి చేతులయందు అభయ, వరదముద్రలు ధరించి ఉంటారు. అభయము అంటే భయం లేకుండా చెయ్యటం. వరద అంటే కోరిన కోరికలు తీర్చటం. ఈ రెండు పనులు వారు చెయ్యగలరు. అయితే వారి శక్తికి లోబడి మాత్రమే ఈ పనులు చేస్తారు.

భక్తులకోరికలు తీర్చటానికి గుర్తుగా వరద, అభయముద్రలు చేతులయందు ధరించి ఉంటారు.

కాని పరమేశ్వరి చేతులయందు అటువంటి అభయ, వరద ముద్రలుండవు. ఆవిడ చతుర్బాహు సమన్విత. నాలుగు చేతుల కలిగి ఉంటుంది. ఆ చేతులయందు పాశము, అంకుశము, ధనుర్బాణాలు ధరించి ఉంటుంది.

కాళిదాసు శ్యామలాదండకంలో

**చతుర్భుజే చంద్రకళావతంసే కుచోన్నతే కుంకుమ రాగశోణే ।**

**పుండ్రేక్షు పాశాంకుశ పుష్పబాణా హస్తే నమస్తే జగదేకమాతః ॥**

అంటాడు. లలితా త్రిశతి ప్రార్ధనా శ్లోకంలో

**సకుంకుమ విలేపనా మళికచుంబికస్తూరికాం**

**సమందహసితేక్షణాం సశరచాప పాశాంకుశాం**

**అశేషజన మోహినీం అరుణమాల్య భూషాంబరాం**

**జపాకుసుమభాసురాం జపనిధౌ స్మరేదంబికాం ॥**

అంటారు అలాగే లలితా సహస్రంలో

**ఉద్యద్భాను సహస్రాభా చతుర్బాహుసమన్వితా**

**రాగస్వరూపపాశాఢ్యా క్రోధాకారాంకుశోజ్వలా**

**మనోరూపేక్షు కోదండా పంచ తన్మాత్ర సాయకా ॥**

అన్నారు. ఆ పరమేశ్వరి చేతిలో పాశము, అంకుశము, ధనుస్సు, బాణాలు ఉన్నాయి. అంతేకాని వరదాభయ ముద్రలు మాత్రం లేవు.

పరమేశ్వరికి ఎడమవైపున గల పైచేతిలో పాశము ఉంటుంది. ఇది అనురాగ పూరితమైన ఆయుధం. జీవిని కట్టిపడేస్తుంది. రాగము అనేది అరిషడ్వర్గాలకు మూలమైనది. దీన్ని గనక జయించినట్లైతే ముక్తి లభిస్తుంది. ఈ పాశము వశీకరణము. పాశాయుధాన్ని గనక ఉపాసన చేస్తే సకలలోకము వశమవుతుంది. అందుకే శ్రీచక్రనవావరణార్చనలోని ఎనిమిదవఆవరణలో దేవిఆయుధాలను అర్చిస్తూ

**ఓం ఐం హ్రీం శ్రీం హ్రీం ఆం సర్వవశీకరణాభ్యాం**

**కామేశ్వరీ కామేశ్వర పాశాభ్యాం నమః పాశశక్తి**

**శ్రీపాదుకాం పూజయామి తర్పయామి నమః**

అంటారు. అలాగే రాగము అంటే కోరిక. కోరిక గనక బాగా పెరిగినట్లైతే అది ద్వేషం క్రింద మారుతుంది. తాను ఒకటి కావాలనుకున్నాడు. అది తనకు

దక్కలేదు. తనకు దక్కనిది ఇంకెవరికీ దక్కరాదు అనిపిస్తుంది. తనకు దక్కకపోతే దాన్ని నాశనం చెయ్యాలనిపిస్తుంది. అదే ద్వేషము. ఈ క్రోధానికి గుర్తుగానే పరమేశ్వరి పై కుడిచేతిలో అంకుశం ఉంటుంది.

సంకల్ప, వికల్పాలకు కారణమైనది మనస్సు. ఇది పదకొండవ ఇంద్రియము. ఇది మానవుడికి మాత్రమే ఉంటుంది. దీనివల్లనే ఆలోచన చేయగలుగుతాడు. యుక్తాయుక్త విచక్షణ చెయ్యగలుగుతాడు. మోక్షం కావాలంటే మనస్సును అదుపులో ఉంచుకోవాలి. మనస్సును జయించాలి. మనస్సును నశింపచెయ్యాలి. ఆ మనస్సే ధనస్సు రూపంలో పరమేశ్వరి యొక్క ఎడమవైపు క్రింది చేతిలో ఉంటుంది.

ఇక దేవి క్రిందికుడిచేతిలో బాణాలున్నాయి అవి పంచబాణాలు. ఇవే పంచతన్మాత్రలు అని, పంచకోశాలు అని చెప్పబడుతున్నాయి. యామళ గ్రంథాలలో ఇవి

**కమలం కైరవంరక్తం కల్హారే న్దీవరేతథా ।**

**సహకారకమిత్యుక్తం పుష్పపంచకమీశ్వరీ ॥**

| | | | |
|---|---|---|---|
| కమలము | – ఎర్రతామర | ఇందీవరము | – నల్లకలువ |
| రక్తకైరవము | – ఎర్రకలువ | సహకారము | – మామిడిపూవు |
| కల్హారము | – తెల్లకలువ | | |

ఇంకా వీటిని క్షోభణము – క్షోభింపచేసేది. ద్రావణము – కరిగించేది, ఆకర్షణము – ఆకర్షించేది, నశ్యము – వశము చేసేది, ఉన్మాదము పీడించేది. అని అనేక రకాలుగా చెబుతారు. వామకేశ్వర తంత్రంలో

**పాశాంకుశౌ తదీయౌతు రాగద్వేషాత్మకౌ స్మృతౌ**

**శబ్దస్పర్శాదయోబాణాః మనస్తస్యా భవద్ధనుః**

**కర్మేంద్రియ చక్రస్థాం దేవీం సంవిత్స్వరూపిణీం**

**విశ్వాహంకార పుష్పేణ పూజయేత్సర్వ సిద్ధిబాక్ ॥**

దేవియొక్క పాశాంకుశాలే రాగద్వేషాలు. పంచతన్మాత్రలే బాణాలు. మనస్సే ఆమె చేతిలోని ధనుస్సు. అంటే సాధకుడు రాగద్వేషాలను వదలి, మనస్సును

నిశ్చలం చేసి అహంకారమనే పుష్పంతో ఆ పరమేశ్వరిని అర్చించినట్లైతే అనగా అరిషడ్వర్గాలను జయించి ఆ దేవిని ఆశ్రయిస్తే సర్వసిద్ధులూ పొందగలుగుతాడు.

ఈ రకంగా మానవుడికి సర్వసిద్ధులూ ప్రసాదించగలది ఆ దేవి. అందుచేతనే ఆమె చేతులయందు ధనుర్బాణాలు, పాశాంకుశాలు ఉంటాయి. వరదాభయ ముద్రలుండవు.

మానవులకు అభయం ఇవ్వటము, వారి కోరికలు తీర్చటము చాలా చిన్నపని. దీనికి పరమేశ్వరిదాకా అవసరం లేదు. ఏ దేవత అయినా చేయగలదు.

కోరికలు తీరటము అనేది ఆ పరమేశ్వరి పాదపద్మముల నాశ్రయించిన ప్రతివారికీ జరుగుతుంది. ఈ విషయం **'తనీయాం సంపాశుం'** అనే రెండవ శ్లోకంలో వివరించబడింది.

అందుకే దుర్వాసుడు ఆ దేవిని స్తుతిస్తూ

**శింజన్నూపుర పాదకంకణ మహాముద్రా సులాక్షారసా**
**లంకారాంకిత మంఘ్రిపంకజ యుగం శ్రీపాదుకాలంకృతం**
**ఉద్భాస్వన్నఖ చంద్రఖండ రుచిరం రాజజ్జపాసన్నిభం**
**బ్రహ్మాది త్రిదశా సురార్చితమహం మూర్ధ్ని స్మరా మ్యంబికే ॥**

మంజీరములు, కడియములు, లత్తుకరసము మొదలైనవాటితో అలంకరింపబడి బ్రహ్మాది దేవతలచే పూజింపబడు నీ పాదపంకజమును నేను అర్చిస్తున్నాను.

ఆ దేవిపాదాలను ఆశ్రయిస్తేనే అన్ని కోరికలు తీరతాయన్న మాట.

**హరి స్త్వా మారాధ్య ప్రణత జన సౌభాగ్య జననీం**
**పురా నారీ భూత్వా పురరిపు మపి క్షోభమనయత్ ।**
**స్మరోపి త్వాం సత్వా రతినయన లేహ్యేన వపుషా**
**మునీనా మప్యన్తః ప్రభవతి హి మోహాయ మహతామ్ ॥** **5**

ఓ తల్లీ! నీకు నమస్కరించేవారికి, నిన్ను ఆరాధించేవారికి సౌభాగ్యప్రదురాలవు. అటువంటి నిన్ను ఆరాధించి, పూర్వకాలంలో విష్ణువు స్త్రీ రూపం పొంది, త్రిపురాసుర సంహారము చేసిన శివుణ్ణి కూడా మోహింపచేశాడు. అలాగే అనంగుడైన మన్మథుడు

నిన్ను ఆరాధించినవాడై, రతీదేవికి మాత్రమే కనిపిస్తూ, తాపస్తోత్రములైన మహర్షులను కూడా మోహింపచేస్తున్నాడు.

ఈ శ్లోకంలో పరమేశ్వరి యొక్క అనుగ్రహము ఉంటే ఏ పనైనా చాలా తేలికగా అవుతుంది. ఇది మహాద్భుతము అని చెబుతున్నారు శంకరభగవత్పాదులు. ఆ పరమేశ్వరిని అర్చించి, ఆరాధించి, పూజించి విష్ణువు శివుని మోహింపచేశాడు.

పూర్వకాలంలో ఒకసారి దుర్వాసమహర్షి దేశసంచారం చేస్తూ ఉన్నాడు. ఆ సమయంలో ఒకవిద్యాధరకన్య ఎదురు వచ్చి, మహర్షికి నమస్కరించి, దివ్యమైన పూలమాలను ఆయనకు సమర్పించింది. మహర్షి ఆ మాలను శిరసున ధరించి వెడుతున్నాడు. అలా పోతూ ఉండగా త్రోవలో ఇంద్రుడు ఐరావతం మీద వస్తూ కనిపించాడు. దుర్వాసుడు తనవద్ద ఉన్న పూలమాలను ఇంద్రుడికి సమర్పించాడు. దేవేంద్రుడు ఆ మాలను ధరించాలా వద్దా ? తాను దేవరాజు, ఎంతైనా దుర్వాసుడు మానవుడు. ఒక మానవుడు శిరసున ధరించిన మాలను మళ్ళీ తాను ధరించటం అవమానం కదా ! అని భావించి ఆ పూలమాలను ఏనుగుశిరస్సుమీద ఉంచాడు. ఏనుగుకు పూలవాసన తగిలింది. వెంటనే తొండముసాచి ఆ మాలను అందుకుని నేలమీదికి విసిరివేసింది. అది చూసిన దుర్వాసుడు 'దేవేంద్రుడు కావాలనే ఆ పని చేయించాడు అని భావించి "నీ సంపద అంతా నశించుగాక" అని ఇంద్రుని శపించాడు. ఇంద్రుడు మహర్షి పాదాలపై పడ్డాడు. ఏమీ ప్రయోజనం లేకపోయింది. మహర్షి కనికరించలేదు. కాలం గడుస్తోంది.

మహర్షి శాపం ఫలించటం మొదలుపెట్టింది. భూలోకంలో అసురసంపత్తి పెరగసాగింది. యజ్ఞయాగాదులు నశించాయి. దేవతలకు హవిర్భాగము అందటం లేదు. దాంతో దేవతలతేజస్సు తగ్గటం మొదలు పెట్టింది. క్రమంగా ఇంద్రుని సంపద అంతా క్షీణించసాగింది. దిక్పాలకులంతా కలిసి ఆలోచించారు. వారికి ఏ ఉపాయంతోచలేదు. వారంతా కలిసి బ్రహ్మదేవుని దగ్గరకు పోయారు.

బ్రహ్మదేవుడు దేవతలబాధను విన్నాడు కాని ఆ కష్టాలను తను తీర్చలేడు. అందుచేత శ్రీమహావిష్ణువు దగ్గరకు వెళ్ళమని సలహా ఇచ్చాడు.

దేవతలంతా విష్ణువు దగ్గరకు వెళ్ళి, ఆయన్ను పరిపరివిధాల స్తోత్రం చేసి, "దేవాదిదేవా! ఈ లోకంలో మాకు క్షేమంలేదు. భూలోకంలో గోవులకు, బ్రాహ్మణులకు

శుభం కలిగే విధానం మాకు తెలియజెయ్యవలసింది" అని వేడుకున్నారు. ఆ మాటలు విన్న శ్రీహరి వారితో దేవతలారా ! మీ క్షేమం కోసం దానవులతో సంధి చేసుకోండి. తరువాత క్షీరసాగరమథనం చెయ్యండి. ఆ సాగరంలో గడ్డి, తీగలు, ఓషధులు వెయ్యండి. మంథరగిరిని కవ్వంగా, వాసుకిని త్రాడుగా చేసి క్షీరసాగరాన్ని మథించండి. మీకు శుభం జరుగుతుంది" అన్నాడు.

అప్పుడు రాక్షసులకు రాజు బలిచక్రవర్తి. దేవతలందరూ బలిచక్రవర్తి దగ్గరకు వెళ్ళి, క్షీరసాగరమథనానికి ఒప్పించారు. సముద్రంలో పర్వతం మునిగిపోకుండా శ్రీమహావిష్ణువు కూర్మావతారమెత్తి, మందరగిరిని వీపున మోశాడు.

క్షీరసాగరమథనం జరుగుతోంది. ఆ సముద్రంలోంచి ఉచ్చైశ్రవం పుట్టింది. దాన్ని బలిచక్రవర్తి తీసుకుపోయాడు.

ఐరావతం పుట్టింది – ఇంద్రుడు పట్టుకుపోయాడు కౌస్తుభమణి పుట్టింది – విష్ణుమూర్తి తీసుకున్నాడు.

ఇలా కల్పవృక్షము, కామధేనువు, పారిజాతము చివరకు శ్రీమహావిష్ణువు అవతారమైన ధన్వంతరి అమృతభాండంతో ఆవిర్భవించాడు. రాక్షసులు అతనిమీద పడి అమృతభాండం లాక్కోబోయారు. శ్రీమహావిష్ణువు మోహినీరూపం దాల్చి రాక్షసులను మోహింపచేసి, అమృతాన్ని దేవతలకు పంచాడు. ఆ సమయంలో మోహినిసౌందర్యం వర్ణనాతీతం.

దితికశ్యపుల కుమారుడు వజ్రాంగుడు. అతని భార్య వరాంగి. వారి కుమారుడు తారకుడు. బ్రహ్మవరప్రసాది ముల్లోకాలను గడగడలాడించాడు. చివరకు ఉమామహేశ్వరులపుత్రుడు, దేవతలసేనాని అయిన కుమారస్వామి చేతిలో మరణించాడు. అతడికి ముగ్గురుకుమారులు. 1) తారకాక్షుడు 2) కమలాక్షుడు 3) విద్యున్మాలి. వీరు ప్రజాపతిని గురించి ఘోరమైనతపస్సు చేసి కామగమనము గల మూడుపురాలను పొందారు. వాటిలో ఎక్కి గగనవిహారం చేస్తూ, ఒక్కసారిగా నేలమీద వాటిని దింపేవారు. ఆ ప్రాంతంలో ఉన్న గ్రామాలు, జీవులు పూర్తిగా నాశనం అయిపోయేవి. అమితానందంతో మళ్ళీ పైకి ఎగిరిపోయేవారు త్రిపురాసురులు.

త్రిపురాసురుల ఆగడాలు మితిమీరిపోతున్నాయి. దేవతలు, మునులు, సాధువులు, సజ్జనులు ఉన్న చోట ఆ పురాలను దింపి, ఆ ప్రదేశాలను నాశనం చేస్తున్నారు. విష్ణువు సలహా మీద దేవతలు శివుణ్ణి శరణువేడారు. అప్పుడు శివుడు

| | | | | | |
|---|---|---|---|---|---|
| భూమి | – | రథము | బ్రహ్మదేవుడు | – | సారథి |
| రవి, చంద్రుడు | – | రథచక్రాలు | మేరుపర్వతము | – | విల్లు |
| నాలుగు వేదాలు | – | గుర్రాలు | శ్రీహరి | – | శస్త్రము |

ఈ రకంగా పరమేశ్వరుడు త్రిపురాసురులపైన యుద్ధాన్ని ప్రకటించి, పాశుపతాస్త్రంతో వారిని సంహరించాడు.

అటువంటి రౌద్రమూర్తి అయిన శివుడు, శ్రీమహావిష్ణువు యొక్క మోహినీ రూపాన్ని చూడాలి అనుకున్నాడు. అదే కోరికతో శ్రీహరిని ప్రార్థించాడు. మోహిని రూపాన్ని చూసిన రుద్రమూర్తి అయిన శివుడుకూడా మోహంలో పడిపోయాడు. ఈ రకంగా రుద్రమూర్తి అయిన శివునికూడా మోహింపచేయగలశక్తి విష్ణువుకు ఎలా వచ్చింది ? అంటే శ్రీమహావిష్ణువు పరమేశ్వరిని ధ్యానించి ఆ శక్తిని పొందాడు.

పంచదశీ మహామంత్రాన్ని శ్రీమహావిష్ణువు ఉపాసించి, పరమేశ్వరి అనుగ్రహం పొందాడు. ఆ మంత్రాన్నే విష్ణువిద్య అంటారు.

**విష్ణువిద్య :** అస్యశ్రీ విష్ణువిద్యాంబా మహామంత్రస్య । దక్షిణా మూర్తి ఋషిః । పంక్తిఛందః । శ్రీవిష్ణు విద్యాంబాదేవతా । హసకల హ్రీం బీజం । హసకహల హ్రీం శక్తిః । సకల హ్రీం కీలకం । ... జపే వినియోగః ।

**న్యాసము :** 1) హసకల హ్రీం 2) హసకలహల హ్రీం 3) సకల హ్రీం 4) స ఏఈల హ్రీం 5) సహహల హ్రీం 6) సకల హ్రీం

**ధ్యానమ్ :** సకుంకుమ విలేపనా....

**మంత్రం : హసకలహ్రీం । హసకహల హ్రీం । సకలహ్రీం । స ఏఈల హ్రీం। సహహల హ్రీం । సకల హ్రీం ॥**

ఈ రకంగా శ్రీ మహావిష్ణువు పంచదశీమంత్రాన్ని ఉపాసించి, పరమేశ్వరి అనుగ్రహం పొంది, రుద్రమూర్తి అయిన శివుణ్ణికూడా మోహింపచేశాడు. అంతేకాదు. అనంగుడైన మన్మథుడు మహర్షులను మోహింపచేస్తున్నాడు. అంటున్నారు. ఇక్కడ చూడండి.

విష్ణువు యొక్క నాభికమలం నుంచి పుట్టిన బ్రహ్మ కొన్ని వేలసంవత్సరాలు తపస్సు చేసి, ఆ పరమేశ్వరిని మెప్పించి, ఆమె అనుజ్ఞతో సృష్టికార్యక్రమం కొనసాగిస్తూ, అందులో భాగంగా మానసికంగా మరీచి, అంగీరసుడు, అత్రి, వశిష్టుడు, పులహుడు, క్రతువు, పులస్త్యుడు అనే ఏడుగురిని సృష్టించాడు. వీరిని బ్రహ్మమానసపుత్రులు అంటారు. ఆ తరువాత

| | |
|---|---|
| రోషము వల్ల | – రుద్రుడు |
| తొడనుంచి | – నారదుడు |
| కుడిచేతి బ్రొటనవేలు నుంచి | – దక్షుడు |
| ఎడమచేతి బ్రొటనవేలు నుంచి | – వీరిణి అనే కన్య |

పుట్టారు. దక్షుడు వీరిణిని వివాహం చేసుకున్నాడు. ఇక్కడ (శ్రోతలకు) చదువరులకు చిన్న అనుమానం వస్తుంది. దక్షుడు, వీరిణి ఇద్దరూ బ్రహ్మసంతానమే కదా ! మరి వారు ఇద్దరూ వివాహంచేసుకోవటం శాస్త్రసమ్మతం కాదు కదా ? అని. అయితే ఇక్కడ ధర్మసూక్ష్మం ఒకటి ఉన్నది. మనం చెప్పుకునే ఈ శాస్త్రవిషయాలు ఏకోదరులకు మాత్రమే వర్తిస్తాయి. అంతేకాని అయోనిజులకు వర్తించవు. దక్షుడు వీరిణి బ్రహ్మమానస బిడ్డలు. అందుచేత వారికి ఈ నియమాలు వర్తించవు.

వీరికి నలభైమంది కుమార్తెలు కలిగారు. వారిలో దితి, అదితి అనే మొత్తం పన్నెండు మందిని కశ్యపుడు వివాహం చేసుకున్నాడు చంద్రుడు 27 మందిని వివాహం చేసుకోగా దాక్షాయణిని శివుడు వివాహం చేసుకున్నాడు. ఈవిడే సతీదేవి.

ఒకసారి సత్రయాగం జరుగుతోంది. ఆ యాగానికి దేవతలు, దిక్పాలకులు, త్రిమూర్తులు అందరూ వచ్చేశారు. దక్షుడు యజ్ఞశాలలోకి ప్రవేశించగానే సభాసదులందరూ లేచి నిలబడి, ఆయనపట్ల గౌరవం ప్రకటించారు. కాని శివుడు మాత్రం ఆసనంనుంచి లేవలేదు. అది చూసిన దక్షుడు, శివుడు తనను అవమానించాడని భావించాడు జరిగిన అవమానానికి చాలా బాధపడ్డాడు దక్ష ప్రజాపతి.

ఒకసారి దక్షప్రజాపతి ఒక యజ్ఞము చెయ్యాలని సంకల్పించి, ఆ యాగానికి దేవ, గంధర్వ, యక్ష, కిన్నెర, కింపురుష, సిద్ధ, సాధ్య, గణాలన్నింటినీ పిలిచాడు. కాని కుమార్తె సతీదేవికి కనీసం కబురుకూడా పంపలేదు.

సతీదేవి కైలాసంలో చెలులతో కలిసి విహరిస్తూ ఉంది. పైనుండి విమానాలలో దేవతలు, గంధర్వులు అందరూ వెడుతున్నారు. వారందరూ ఎక్కడికి వెడుతున్నారని చెలులను అడిగింది. చెలికత్తెలు "అమ్మా! నీ తండ్రి దక్షప్రజాపతి యజ్ఞం చేస్తున్నాడు. వీరందరూ ఆ యజ్ఞానికి వెడుతున్నారు అని చెప్పారు. తండ్రి చేసే యాగానికి తాను కూడా వెళ్ళాలి అనుకుంది. కాని తండ్రి తనను పిలువలేదు. అయినా తనకు ఆహ్వానమేమిటి ? తండ్రి ఇంటికే గదా వెళ్ళేది. అనుకుని శివుడి దగ్గరకు పోయి తన తండ్రి చేసే యాగాన్ని గురించి చెప్పి, 'మనం కూడా ఆ యాగానికి వెడదాము' అన్నది. 'పిలవని పేరంటానికి వెళ్ళొద్దు' అన్నాడు భర్త. ఒంటరిగానైనా వెడతాను అన్నది సతీదేవి. భార్యమాటను కాదనలేక భూతగణాలను తోడిచ్చి పంపాడు శివుడు. భూతగణాలు తోడురాగా తండ్రి చేసే యజ్ఞానికి వెళ్ళింది సతీదేవి.

అక్కడ ఆమెను ఎవ్వరూ పలకరించలేదు సరి కదా, 'ఈ యాగశాలలో నీకు గాని, నీ భర్తకుగాని ప్రవేశంలేదు. వెంటనే ఇక్కడ నుంచి వెళ్ళిపో' అన్నాడు తండ్రి. ఆ అవమానాన్ని భరించలేక యోగాగ్ని నిరగిల్చి, అందులో దగ్ధమైపోయింది సతీదేవి.

పిశాచగణాలు పరుగెత్తిపోయి ఈ విషయాన్ని శివుడికి తెలియచేశాయి. శివుడు కోపంతో జటాజూటం ఒకటిలాగి నేలమీద కొట్టాడు. అందులో నుంచి వీరభద్రుడు పుట్టాడు. అతడు వికటాట్టహాసం చేస్తూ, పిశాచగణాలను వెంట పెట్టుకుని యజ్ఞవాటికకు పోయి దక్షయజ్ఞాన్ని ధ్వంసం చేశాడు.

సతీదేవి దగ్ధమైపోయిన తరువాత చాలా విచారించాడు శివుడు. శోకసముద్రంలో మునిగిపోయాడు. విరాగియై పోయి హిమాలయాలలో తపస్సు చేసుకుంటూ కూర్చున్నాడు.

దితి, కశ్యపుల కుమారుడు వజ్రాంగుడు. అతని భార్య వరాంగి. వీరి కుమారుడు తారకుడు, బ్రహ్మను గురించి ఘోరతపస్సు చేశాడు. అనేక వరాలు పొందాడు. అసలు అసురుడు. మహాబలశాలి. పైగా బ్రహ్మవరప్రసాది. ముల్లోకాలను జయించాడు. దేవతలను, మునులను రకరకాలుగా బాధించటం మొదలుపెట్టాడు. అతని బాధ పడలేక వారందరూ హిమాలయాలకు పోయి పరమేశ్వరిని పరిపరివిధాల ప్రార్థించారు. చివరకు ఆమె వారికి దర్శనమిచ్చి, అతని అంశ హిమమంతుని

ఇంట హైమావతిగా జన్మిస్తుంది. ఆమెకు శివుడికీ వివాహం జరిపించండి. వారిద్దరికీ పుట్టేవాడు తారకుని సంహరిస్తాడు అని చెప్పి అంతర్ధానమయింది.

కొంత కాలానికి హిమవంతుని భార్య మేనక గర్భవతియై ఆడశిశువును కన్నది. ఆమే హైమావతి. ఆ బాలిక దినదినప్రవర్ధమానమైంది. నారదుడు ఆమె చేతి రేఖలు చూసి, ఈమెకు కాబోయే భర్త ఇంతవరకు పుట్టలేదు. ఈ చెయ్యి ఎప్పుడూ ఎత్తిపెట్టే ఉంటుంది అని చెబుతాడు. ఆ మాటలు విన్న మేనక కంగారుపడి నారదుణ్ణి వివరణ కోరుతుంది. దానికి నారదుడు సమాధానంగా ఈమెకు భర్త కాబోయేవాడికి జననమరణాలు లేవు. సాక్షాత్తు ఆ పరమేశ్వరుడే ఈమెభర్త. ఈమె చేయి ఎప్పుడూ ఎత్తిపెట్టే ఉంటుంది. అంటే ఈమెకు ఇవ్వటమే కాని పుచ్చుకోవటం తెలియదు అని చెబుతాడు.

హైమావతికి పెళ్ళియీడు వచ్చింది. మంచి వరుడి కోసం వెతకటం మొదలు పెట్టాడు హిమవంతుడు. శివుణ్ణి తప్ప వేరేవరినీ వివాహమాడను అని భీష్మించింది హైమావతి. శివుణ్ణి గూర్చి తపస్సు చెయ్యటం మొదలుపెట్టింది. ఆ శివుడు విరాగియై ఉన్నాడు. ఆ సమయంలో విరాగియైన శివుణ్ణి సరాగిగా చెయ్యటానికి మన్మథుడు శివుడిమీద బాణాలు ప్రయోగించాడు. ఈ విషయం తెలిసిన శివుడు మూడవ కన్ను తెరిచి మన్మథుణ్ణి భస్మం చేశాడు.

తరువాత శివపార్వతుల కళ్యాణం జరిగింది. అప్పుడు మన్మథుడి భార్య రతీదేవి పార్వతీదేవి దగ్గరకు వచ్చి, తన భర్తకు జరిగిన అన్యాయం గురించి వివరించి, భోరున విలపించింది. అప్పుడు పార్వతీదేవి కరుణించి మన్మథుడు తన భార్యయైన రతీదేవికి మాత్రమే కనిపిస్తాడు. కాని మిగిలిన వారికి మాత్రం అతడు అనంగుడు అంటే అంగములు లేనివాడు, శరీరం లేనివాడుగానే ఉంటాడు అని వరమిచ్చింది.

అటువంటి అనంగుడైన మన్మథుడు ఆ పరమేశ్వరిని అర్చించినవాడై, తపోధనులైన మునులను కూడా మోహపెడుతున్నాడు. మన్మథుడు పరమేశ్వరిని ఉపాసించాడు. పంచదశీ మహామంత్రాన్ని ఈ లోకంలోకి తెచ్చినవాడు మన్మథుడు. మన్మథుడు ఉపాసించిన మంత్రాన్ని మన్మథవిద్య అంటారు.

**మన్మథ విద్య :**

అస్యశ్రీ మన్మథ విద్యాంబా మహామంత్రస్య। దక్షిణామూర్తి ఋషిః। అనుష్టుప్ ఛందః। శ్రీమన్మథ విద్యాంబాదేవతా। క ఏఈల హ్రీం బీజం। హసకహల హ్రీంశక్తిః సకలహ్రీం కీలకం। ...జపే వినియోగః। మంత్రకూటత్రయముతో న్యాసము చెప్పాలి.

**ధ్యానము : సకుంకుమ విలేపనా ...**

**మంత్రము : కఏఈల హ్రీం। హసకహల హ్రీం। సకలహ్రీం।**

ఈ రకంగా పరమేశ్వరిని ఉపాసించి విష్ణువు శివుణ్ణి, అనంగుడైన మన్మథుడు తపోధనులైన మునులను మోహపెడుతున్నారు. కాబట్టి ఆ దేవి కరుణ గనక ఉన్నట్లైతే ఎంతటి పనులైనా జరుగుతాయి అంటున్నారు శంకర భగవత్పాదులవారు ఈ శ్లోకంలో.

రతీమన్మథులది చాలా అనుకూల దాంపత్యము. రతి అంటే ఆసక్తి. మన్మథుడు అంటే అనుభూతి. ప్రతిమనిషిలోనూ ఆసక్తిని రేకెత్తించేది రతి కాగా అనుభూతిని పొందేది మన్మథుడు. కాబట్టి రతీమన్మథులు ఇద్దరూ ప్రతివ్యక్తిలోని ఆసక్తికీ, అనుభూతికీ సంకేతము.

ఆసక్తి కలిగినవాడు తనకు దేనిమీద ఆసక్తి కలిగిందో, దాన్ని అనుభవించినప్పుడు ఆనందం కలుగుతుంది. ఈ అనుభూతి అనే మన్మథుడు, ఆసక్తి అనే రతీదేవికి తప్ప ఇంకెవరికీ తెలియదు. ఎందుకంటే ఒకరి అనుభూతి ఇంకొకరికి తెలియదు. ఉదాహరణకు ఒక వ్యక్తి పండుతిన్నాడు. దాని రుచి రెండోవాడికి ఏ రకంగా తెలుస్తుంది ? కలలో ఒకవ్యక్తి భయపడ్డాడు. అతడు పడ్డ భయం ప్రక్కనే ఉన్న రెండోవాడికి తెలియదు. ఈ అనుభూతి అనేది ఎవరికి వారే అనుభవించాలి. అది వ్యక్తిగతము. ఈ అనుభూతి అనేది ఆసక్తికి మాత్రమే తెలుస్తుంది. అందుకే మన్మథుడు రతీదేవికి మాత్రమే కనిపిస్తాడు అని చెప్పటం జరిగింది.

ఇలాంటి శ్లోకమే వామకేశ్వర తంత్రంలో కూడా ఉన్నది.

**ఏతాం మే సపుఌ ఉ రారాధ్యా విద్యాంత్రైలోక్య మోహినీం।**

**త్రైలోక్యం మోహయామాస కామారిం భగవాన్ హరిః॥**

**కామదేవో౽పి దేవేశీం దేవీం త్రిపురసుందరీం ।**

**సమారాధ్యా౽భవల్లోకే సర్వసౌభాగ్య సుందరః ॥**

పూర్వము త్రైలోక్యమోహనమైన నా విద్యను ఆరాధించి భగవానుడైన హరి ఈశ్వరుని మోహింపచేశాడు. అలాగే మన్మథుడు లోకంలో సర్వసౌభాగ్య సుందరుడైనాడు అని పరమేశ్వరి శివుడికి చెబుతున్నది.

**ధనుఃపౌష్పం మౌర్వీ మధుకరమయీ పంచవిశిఖాః**

**వసన్త స్సామన్తో మలయమరు దాయోధన రథః ।**

**తథాప్యేకస్సర్వం హిమగిరిసుతే కామపి కృపామ్**

**అపాఙ్గాత్తే లబ్ధ్వా జగదిద మనఙ్గో విజయతే ॥** **6**

ఓ తల్లీ ! హిమవంతుని కుమార్తె అయిన హైమవతీ ! అనంగుడు ఉన్నాడే మన్మథుడు, అతడు పూలతో తయారుచేసిన ధనుస్సు, తుమ్మెదలు వరుసగాగలవింటి త్రాడు, ఐదు పూలబాణాలు తీసుకుని, మలయమారుతము అనే రథమెక్కి, వసంత కాలాన్ని చెలికానిగా చేసుకుని, నీ కృపాకటాక్షవీక్షణాలతో తాపసుల మీదకి యుద్ధానికి వెళ్ళి, వారిని ఓడించగలుగుతున్నాడు.

ఐదవశ్లోకంలో చెప్పినట్లుగానే, ఆ పరమేశ్వరియొక్క కృపాకటాక్షవీక్షణాలుంటే ఎంతటి పని అయినా జరుగుతుంది అంటున్నారు భగవత్పాదులవారు.

ఇక్కడ చూడండి మన్మథుడు అనంగుడు. అంటే అంగములు లేనివాడు. గిరిజా కల్యాణఘట్టంలో శివుని క్రోధాగ్నికి మాడి మసి అయిపోయినాడు మన్మథుడు. ఆ తరువాత పార్వతీదేవి రతీదేవిని కరుణించి ఆమెకు మాత్రమే మన్మథుడు కనిపిస్తాడు అని వరమిచ్చింది. ఈ కథ అంతా ఐదవశ్లోకంలో చెప్పుకున్నాము. అటువంటి మన్మథుడు, శరీరం లేనివాడు – అశరీరి, అంగములు లేనివాడు – అనంగుడు, అసలు రూపమే లేనివాడు – అరూపి, ఇతడు నుంచోలేడు, కూర్చోలేడు, పడుకోలేడు. అసలు రూపం అంటూ ఉంటే కదా ఈ పనులు చెయ్యటానికి, ఇతడు తాపసుల మీదకి యుద్ధానికి పోతున్నాడు. వైరిపక్షం వారు మహాతపస్వులు. తపోధనులు. వారు తలచుకుంటే తమ తపశ్శక్తితో ఏమైనా చెయ్యగలరు. ఈ లోకాలను భస్మం చెయ్యగల సమర్థులు. అటువంటి తాపసులమీదకి యుద్ధానికి వెడుతున్నాడు.

యుద్ధంలో వైరిగణాన్ని ఓడించి తమ ప్రతాపాన్ని చాటుకోవాలి అనో, రాజ్యవిస్తరణ చెయ్యాలనో కోరిక ఉంటుంది. మరి ఇక్కడ ఏముంది ? దోచుకోవటానికి వారు దాచుకున్నది ఏమీలేదు. పోనీ వారి మీద ప్రతాపం చూపటానికా అంటే, వారికి లౌకిక సంబంధాలు పెద్దగా ఉండవు. మరి ఈ యుద్ధం దేనికి ? వారి తపస్సు చెడగొట్టటానికి. విరాగులను సరాగులుగా చెయ్యటానికి. అందుకు ఈ యుద్ధం.

సరే యుద్ధానికి బయలుదేరాడు ఈ కాళ్ళు, చేతులు, కళ్ళు ఏవీ లేని అనంగుడు. యుద్ధం చెయ్యటానికి కత్తి, డాలు, బాణాలు, గదలు ఇలాటి ఆయుధాలు వేలకొద్ది సంఖ్యలో కావాలి. ఒక కత్తి విరిగిపోతే, ఇంకో కత్తి కావాలి. ఒక డాలు పోతే ఇంకొకటి కావాలి. ఇలా అనేక సంఖ్యలో ఆయుధాలు కావాలి. మరి ఇప్పుడు ఈ అనంగుడు యుద్ధం చెయ్యటానికి ఏం తీసుకుపోతున్నాడు ? **'ధనుపౌష్పం'** పూలతో చేసిన ధనుస్సు. పూవులు అతి సుకుమారమైనవి. పట్టుకుంటే నలిగిపోతాయి. గట్టిదనం ఉండదు. ఇటువంటి ధనుస్సు చూడటానికి అందంగా ఉంటుంది కాని, యుద్ధం చెయ్యటానికి మాత్రం పనికిరాదు. ఇక ధనుస్సుకు కట్టిన అల్లెత్రాడును చూద్దామా అంటే, అది **'మౌర్వీమధుకరమయీ'** తుమ్మెదల వరుస. తుమ్మెదలను వరుసగా నుంచోపెడితే, అదే వింటినారి. తుమ్మెదలు ఎలాంటివి ? ఎక్కడైనా పూలు కనిపిస్తే చాలు ఎగిరిపోయి వాటిమీద వాలిపోతాయి. వాటిలోని మకరందాన్ని పీల్చిన తరువాత, ఆ పూవును వదలి ఇంకొక పూవుమీద వాలుతాయి. ఈ రకంగా నిలకడ లేకుండా ఒక పూవు మించి ఇంకొక పూవుమీద వాలుతూ ఉంటాయి. ఏ ఒక్కచోటా నిలకడగా ఉండవు. అలాటి తుమ్మెదల వరుస మన్మథుడికి వింటినారి. యుద్ధానికి ఏ మాత్రం పనికిరానిది.

ఇక బాణాలు చూద్దామా, **పంచవిశిఖాః,** ఐదే బాణాలు, ఎవరైనా యుద్ధానికి పోయేటప్పుడు ఒళ్ళకొద్దీ ఆయుధాలు తీసుకుపోతారు. మరి మన్మథుడి దగ్గర ఉన్నవి కేవలము ఐదు బాణాలు. అవి కూడా ఎలాంటివి ? పూలబాణాలు, అవి

| | | | |
|---|---|---|---|
| కమలము | – ఎర్రతామర | ఇందీవరము | – నల్లకలువ |
| రక్తకైరవము | – ఎర్రకలువ | సహకారము | – మామిడిపూవు |
| కల్హారము | – తెల్లకలువ | | |

ఇవన్నీ వసంతఋతువులో తాపాన్ని రేకెత్తించేవి. అంతేకాని యుద్ధం చెయ్యటానికి పనికి వచ్చేవి మాత్రం కాదు.

ఇక రణరంగంలో అటూ ఇటూ తిరగటానికి వాహనం కావాలి. సామాన్యంగా రథాలు, గుర్రాలు, ఏనుగులు వాహనాలుగా ఉంటాయి. ఇక్కడ ఈ అనంగుడికి రథం వాహనంగా ఉన్నది. రథం అంటే గుర్రాలతో లాగబడే ఒకరమైన బండి కాని ఇక్కడ మన్మథుడి రథము **'మలయమారుతము'** దక్షిణ కొండగాలి. ఆ గాలి ఎప్పుడు వేగంగా వీస్తుందో, ఎప్పుడో నెమ్మదిగా వీస్తుందో తెలియదు. ఎప్పుడు ఆగిపోతుందో అసలు తెలియదు. అదే ఆయన రథము. ఇక వసంతుడు చెలికాడు. సారథి ఎవరూ అంటే వసంతకాలము. అది మాట్లాడలేదు. ఆలోచించలేదు. సలహా చెప్పలేదు. మంత్రాంగానికి ఏ మాత్రం పనికిరానిది ఈ వసంతకాలము. అదే ఈ అనంగుడికి చెలికాడు, సారథి. ఇప్పుడు చూడండి యుద్ధానికి బయలుదేరిన ఈ మన్మథుడికి శరీరం లేదు, రథం లేదు, ధనుస్సు లేదు, బాణాలు లేవు, సారథి అంతకన్నా లేదు. ఒకవేళ ఇవన్నీ ఉన్నాయనుకున్నా యుద్ధానికి ఏ మాత్రం పనికిరావు. ఇన్ని అవలక్షణాలు ఉండి కూడా ఈ అనంగుడు మహాతపోధనులైన మహర్షులతో యుద్ధానికి తలపడి, వారిని మోహింపచేస్తున్నాడు. వారి హృదయాలను క్షోభ పెడుతున్నాడు. చివరకు యుద్ధంలో వారిని గెలుస్తున్నాడు. అంటే వారికి తపోభంగం కలిగిస్తున్నాడు. మళ్ళీ సంసారలంపటంలోకి త్రోసి వేస్తున్నాడు. ఇదంతా ఎలా చెయ్యగలుగుతున్నాడు అంటే **"తదాప్యేకం సర్వం హిమగిరిసుతే కామపి కృపాన్ అపాంగాత్తే లబ్ధ్వా మనంగో విజయతే"** తల్లీ నీ యొక్క కృపాకటాక్ష వీక్షణాలవల్లనే ఈ అద్భుతం జరుగుతోంది.

మన్మథుడి చేతిలో ఉన్న ధనుస్సు మానవుడియొక్క మనస్సు. ఈ మనస్సు అనేది సంకల్పవికల్పాలకు కారణమైనది. ఆత్మజ్ఞానం సాధించాలంటే మనస్సును స్వాధీనంలో ఉంచుకోవాలి. మనస్సును జయించాలి. మనస్సును నశింపచెయ్యాలి. అందుకే పరమేశ్వరి పూజలో చివరకు మంత్రపుష్పం సమర్పిస్తాం. అంటే వేదోక్తంగా సాధకుడు తన మనస్సు అనే పుష్పాన్ని పరమేశ్వరికి సమర్పిస్తున్నాడన్న మాట. ఇక్కడ మనస్సు అనేది ఐదు రేకులు గల పుష్పము.

ఈ ఐదురేకులే జ్ఞానేంద్రియాలు. కన్ను, ముక్కు, చెవి, నాలుక, చర్మము. వీటివల్లనే విషయాన్ని గ్రహించటం జరుగుతుంది. అలాగే కర్మేంద్రియాల ద్వారా విషయాలను అనుభవించటం జరుగుతుంది. మనస్సు ఎక్కడ ఉంటుంది ? శరీరంలో

దానికి ఒకస్థానం అంటూ లేదు. మనం ఏ అవయవంతో పనిచేస్తుంటే, ఆ అవయవంలోనే ఉంటుంది మనస్సు. ఉదాహరణకు ఏదైనా ఒక దృశ్యాన్ని తదేకంగా చూస్తున్నాం అనుకోండి. అప్పుడు మనసు ఆ దృష్టియందు మాత్రమే ఉంటుంది. ప్రక్కన ఏం జరుగుతుందో కూడా మనం గమనించలేము. దేన్నైనా అనుభవించేటప్పుడు, అనుభూతి పొందుతున్న అవయవంలోనే మనస్సుంటుంది. అందుకే కఠోపనిషత్తులో నచికేతుడికి యముడు ఆత్మజ్ఞానాన్ని బోధిస్తూ "శరీరమే రథము. ఇంద్రియాలే గుఱ్ఱాలు. మనస్సే సారథి. సారథి గనక మంచివాడైతే గుఱ్ఱాలు సరిగ్గా నడుస్తాయి. అలాగే మనస్సు సద్భావన కలిగి ఉంటే ఇంద్రియాలు సరిగా పని చేస్తాయి" అంటాడు యమధర్మరాజు. అటువంటి మనస్సుని తన అధీనంలోకి తీసుకున్నాడు మన్మథుడు. లలితాసహస్రంలో **'మనోరూపేక్షుకోదండా'** అని చెబుతాము.

ఇక వింటినారి. ఇది ధనుస్సుకు, బాణానికి మధ్యన ఉన్న సంధానము. మన్మథుడి చేతిలోని ధనుస్సు మనస్సయితే, బాణాలు ఇంద్రియాలకు సంబంధించిన వాసనలు. అవే తన్మాత్రలు. ఇంద్రియాలు గ్రహించిన విషయాలు మనస్సుకు నాడులద్వారా చేరతాయి. ప్రతి ఇంద్రియానికీ ప్రత్యేకమైన నాడి ఒకటి ఉంటుంది. కనులు ఒకరూపాన్ని చూస్తే, అది చక్షుర్నాడి ద్వారా మనస్సుకు చేరుతుంది. అలాగే శబ్దము శ్రోత్రనాడి ద్వారా, గంధము ఘ్రాణనాడి ద్వారా, రసము (రుచి) జిహ్వానాడి ద్వారా, స్పర్శ స్పర్శనాడి ద్వారా మనస్సుకు చేరుతుంది. మనసు అనుభూతిని పొందటానికి ఈనాడులు ఉపకరిస్తాయి. అందుకే మన్మథుడి చేతిలోని ధనుస్సుకు వింటినారి ఈనాడులే.

ఇక బాణాలు. మన్మథుడి చేతిలోని బాణాలు కేవలము ఐదు. అవి జ్ఞానేంద్రియాలకు సంబంధించిన విషయాలు. శబ్దస్పర్శరూపరసగంధాలు. వీటిలో ఒక్కొక్క తన్మాత్ర ఒక్కొక్క ఇంద్రియానికి సంబంధించినది.

| | | | | | |
|---|---|---|---|---|---|
| శబ్దము | – | చెవి | రసము | – | నాలుక |
| స్పర్శ | – | చర్మము | గంధము | – | ముక్కు |
| రూపము | – | కన్ను | | | |

మన్మథుడు మన మనస్సు అనే ధనుస్సును తనచేతిలోకి తీసుకున్నాడు. అంటే మనస్సు మన స్వాధీనంలో లేదు. నాడీమండలము అనే వింటినారిని పట్టుకుని, తన్మాత్ర అనే బాణాన్ని సంధించాడు. ఒక్కొక్క బాణం వదిలినప్పుడు సాధకుడికి ఒక్కొక్క ఇంద్రియం అధీనం తప్పుతుంది. కన్ను మూసి తెరిచేలోగా అతడి ఇంద్రియాలు అదుపు తప్పుతాయి. దీనికి ఒక చక్కటి ఉదాహరణ

**కురంగ మాతంగ పతంగ భృంగమీనాః హతః పంచభిరేవపంచ ।**
**ఏకః ప్రమాదీసకథం వహన్యతే యస్సేవతే పంచభిరేవ పంచ ॥**

ఈ శ్లోకంలో ఐదు రకాలైన జీవులను ఉదాహరణగా చెబుతున్నారు.

**'కురంగము'** అంటే లేడి. వేటగాడు శృంగనాదం చేస్తాడు. ఇదే కొమ్ముబూర. దీని నుంచి వచ్చే శబ్దానికి ఆకర్షితురాలై లేడి వేటగానికి చిక్కుతుంది.

**'మతంగము'** అంటే మగ ఏనుగు. దీన్ని ఆడ ఏనుగు యొక్క స్పర్శకు అలవాటు పడేటట్లు చేసి, పెద్దగోతిలో పడేసి, తరువాత మచ్చిక చేసుకుంటారు.

**'పతంగము'** అంటే మిడత. ఎర్రగా ప్రకాశించే దీపాన్ని పండు అనుకుని, దాని దగ్గరకు పోయి, మాడి, మసి అయిపోతుంది.

**'భృంగము'** అంటే – తుమ్మెద. ఇది పూలమీద వాలి, తేనెను త్రాగుతూ ఉంటుంది. అలా వెళ్ళి, తేనె త్రాగటంలో పడి, పరిసరాలను గమనించదు. అందుచేత ముడుచుకుపోయే పూవులో తేనె త్రాగుతూ అందులోనే మరణిస్తుంది.

'మీనము' అంటే చేప. జాలరివాడు కొక్కేనికి వానపామును గ్రుచ్చి నీటిలో వేస్తాడు. దాని వాసనకు ఆకర్షింపబడిన చేపవచ్చి గాలానికి తగులుకుంటుంది.

ఈ రకంగా ఇంద్రియాలబలహీనత వలన జీవులు పతనం చెందుతాయి. అందుకే మన్మథుడు పంచతన్మాత్రలను బాణాలుగా చేసుకున్నాడు. లలితాసహస్రంలో **'పంచతన్మాత్రసాయకా'** అని చెప్పబడింది.

ఇక మన్మథుడి చెలికాడు వసంతుడు. వసంతకాలము. ఈ కాలంలో చెట్లు చిగురించి పూలు పూస్తాయి. వాతావరణం ఆహ్లాదకరంగా ఉంటుంది. దానివల్లనే సాధకుడి మనస్సు చాలావరకు వికలమవుతుంది. ఈ రకంగా జీవులను మభ్యపెట్టటం మన్మథుడి పని.

ఇక మన్మథుడి రథము మలయమారుతము. ఇది చల్లని పిల్లగాలి. కొండగాలి. ప్రాణానికి హాయిగా ఉంటుంది. మనస్సును మత్తెక్కిస్తుంది. అందుకే మన్మథుడు మలయమారుతమనే రథాన్ని ఎక్కి యుద్ధానికి బయలుదేరతాడు.

ఈ రకంగా పనికిరానట్లుగా కనిపించిన వాటినే ఉపయోగించి యుద్ధంలో సఫలీకృతుడౌతున్నాడు మన్మథుడు. ఇదంతా ఆ దేవియొక్క కృపవల్లనే జరుగుతున్నది.

**క్వణత్కాఞ్చీదామా కరికలభ కుంభస్తననతా**
**పరిక్షీణామధ్యే పరిణత శరచ్చంద్రవదనా ।**
**ధనుర్బాణాన్ పాశం సృణి మపి దధానా కరతలైః**
**పురస్తా దాస్తాం నః పురమథితు రాహో పురుషికా ॥** 7

దివ్యమైనకాంతులతో ప్రకాశిస్తున్న మణులు కూర్చిన గజ్జెలతో చేసిన మొలనూలు గలది, ఏనుగు కుంభస్థలముల వంటి పాలిండ్లు గలది, సన్నని నడుము గలది, శరత్కాలపూర్ణిమ నాటి చంద్రబింబము వంటి మొగము గలది, చేతులయందు ధనుస్సు, బాణములు, పాశము, అంకుశము ధరించి, త్రిపురాసుర సంహారముచేసిన శివుని అహంకారరూపిణియైన ఆ దేవి నాముందు సుఖాసీనయై ప్రత్యక్షమగుగాక.

ఈ శ్లోకంలో పరమేశ్వరి యొక్క స్థూల సూక్ష్మ పరా రూపాలను వర్ణిస్తున్నారు. ముందుగా స్థూలరూపాన్ని చూద్దాం.

**క్వణత్ కాంచీదామా** – వింత శబ్దములు చేసే గజ్జలు కూర్చిన బంగారు మొలనూలు గలది అని అర్ధం. లలితాసహస్రంలో 38వ నామము చూడండి. **"రత్నకింకిణికారమ్యా రశనాదామభూషితా"** రత్నాలు పొదగడబడిన బంగారు గంటలచే అలంకరింపబడిన మొలనూలు గలది.

పూర్వకాలంలో స్త్రీలు మొలనూలు అనబడే బంగారు మొలత్రాడు ధరించేవారు. ఇది ఒక ఆభరణం. పరమేశ్వరి **'సర్వాభరణ భూషితా'.** శరీరాన్ని అలంకరించటం కోసం ధరించేవి ఆభరణాలు. దేవి సర్వాభరణభూషిత. తలమీద పెట్టుకునే చూడామణి దగ్గర నుంచీ కాలిమట్టెలదాకా మొత్తం 44 రకాల ఆభరణాలున్నాయని కాళికా పురాణంలోనూ, పరశురామకల్పంలోనూ చెప్పబడ్డాయి. ఇదే విషయం దత్తాత్రేయ సంహితలో కూడా వివరించబడింది. ఈ ఆభరణాలవివరాలన్నీ నాచే వ్రాయబడిన

**'శ్రీవిద్యా సారథి'** లలితాసహస్రనామభాష్యంలోని 51వ నామము 'సర్వాభరణ భూషితా'లో ఇవ్వబడ్డాయి.

ప్రస్తుతం మనం చెప్పుకుంటున్నది మొలనూలు గురించి మొలత్రాడు లోపల ఉంటుంది. కాగా మొలనూలు బయట ఉంటుంది. ధరించే వారి శక్తిని బట్టి అది వెండి, బంగారము, దానిమీద రత్నాలు, కెంపులు, ముత్యాలు పొదగబడతాయి. అయితే ప్రస్తుత కాలంలో కూడా ఈ రకమైన ఆభరణాలు కనిపిస్తున్నాయి.

ఉపనయనం చేసేటప్పుడు బ్రహ్మచారి నడుముకు ముంజిగడ్డితో చేసిన త్రాడు కడతారు. అప్పుడు చేసే సంస్కారంవల్ల అతడికి మంత్రోపాసన చేసేందుకు అధికారము వస్తుంది. అలాగే వివాహసమయంలో పెండ్లికుమార్తెకు ఈ అధికారం వస్తుంది. పరమేశ్వరి ఓంకారమనే ఈ సూత్రాన్ని ధరించి సదాచారాలను లోకాలకు బోధిస్తుంది. ఆమె నాదమయి. ఓంకారాత్మకసూత్రధారిణి.

**కరికలభకుంభ స్తనతా** – మదించిన గున్నఏనుగులయొక్క కుంభస్థలముల వంటి చనుగన కలది. స్త్రీలను వర్ణించేటప్పుడు సహజంగా చేసే వర్ణన ఇది. లలితా సహస్రంలోని 33వ నామం **'కామేశ్వర ప్రేమరత్నమణి ప్రతిపణస్తనీ'** అన్నారు.

ఈ నామంలో రెండు రకాలయిన రత్నాలున్నాయి.

1. ప్రేమరత్నము 2. స్తనమణి. ఆ కామేశ్వరి తన భర్త అయిన కామేశ్వరుని ప్రేమ అనే రత్నాన్ని స్తనద్వయము అనే రెండు మణులను ప్రతిఫలంగా ఇచ్చికొన్నదట. ఏదైనా వస్తువు చౌకగా దొరికితే దానిమీద శ్రద్ధ ఉండదు. వస్తువు అసలు ధరకే కొన్నప్పటికీ, అది దొరకటంలేదు అని తెలిస్తే దానివిలువ పెరుగుతుంది. అదే వస్తువుని రెట్టింపు ధరకు గనక కొంటే దానిమీద శ్రద్ధ మరీ పెరుగుతుంది. ఇక్కడ కామేశ్వరుని ప్రేమ అనేది ఒక మణి. మణికి మణి సమమూల్యమవుతుంది. కాని దేవి తన స్తనద్వయము అనే రెండు మణులను ఇచ్చి ప్రేమమణిని కొన్నది. రెండు రెట్ల ధర చెల్లించింది కాబట్టి పరమేశ్వరుని మీద ఆమెకు అత్యంతశ్రద్ధ ఉంటుంది. ఇక్కడ ఈ రకంగా దేవియొక్క స్తనద్వయాన్ని వర్ణించటం జరిగింది.

**పరిక్షీణామధ్యే** సన్ననినడుము గలది. పరమేశ్వరి నడుము అతిసన్నగా, నాజూకుగా ఉన్నది అంటున్నారు ఇక్కడ. సన్ననినడుము అనేది ఉత్తమజాతిస్త్రీ

లక్షణము. పైన ఉన్నటువంటి స్తనములయొక్క భారంచేత ఆ నడుము సన్నబడి ఒంగిపోయినట్లుగా కనిపిస్తున్నది. ఇదే విషయాన్ని చెబుతూ లలితాసహస్రంలోని 36వ నామంలో **'స్తనభారదళన్మధ్యపట్టబంధవళిత్రయా'** పరమేశ్వరి నడుము చుట్టూ మూడుముడతలు ఉన్నాయి. అవి ఆమె స్తనములభారముచే వంగిపోయిన నడుముకు చుట్టూ వేసిన మూడుబంగారుకట్లులాగా కనిపిస్తున్నాయి. ఆమె నడుము సన్ననిది. అందులోనూ స్తనభారంతో బాగా వంగి విరిగిపోతుందేమో అనే భయంతో ఆ నడుము చుట్టూ కట్లు బిగించారా అన్నట్లుగా ఉన్నాయి ఆ ముడతలు. మొత్తంమీద ఆమె సింహమధ్య అంటే సింహానికి మల్లేనే ఆమె నడుము కూడా సన్నగా ఉన్నది.

**పరిణితశరచ్చంద్రవదనా** – పరిణితి చెందిన చంద్రబింబము అంటే పున్నమి నాటి చంద్రబింబము వంటి ముఖము గలది. అదికూడా శరత్కాలమునందలి పున్నమినాటి చంద్రబింబము. ఆశ్వయుజ, కార్తీకమాసాలు, శరదృతువు – మంచి వెన్నెలకాయును. ఈ కాలంలో చంద్రబింబము స్వచ్ఛంగా ఉంటుంది. చక్కగా కనిపిస్తుంది. అందుకే అమ్మవారి ముఖాన్ని శరత్కాలపుచంద్రబింబముతో పోల్చటం జరుగుతోంది. చంద్రుడికి పదహారుకళలున్నాయి.

ఆ కళలే తిథులరూపంలో ఉంటాయి. అమావాస్యరోజున చంద్రుని కళలన్నీ సూర్యునిలో చేరి ఉంటాయి. ఆ రోజున చంద్రుడు కళావిహీనుడు. అమావాస్య తరువాత పాడ్యమి నుంచీ రోజుకు ఒక కళ చొప్పున సూర్యుని నుంచి వచ్చి చంద్రునిలో చేరుతుంది. ఈ రకంగా పౌర్ణమి వచ్చేసరికి పదిహేను కళలు చంద్రునిలో చేరతాయి. ఈ రకంగా

**దర్శాద్యాః పూర్ణిమాంతస్తు కళా పంచదశైవతు ।**
**షోడశీతు కళాజ్ఞేయా సచ్చిదానందరూపిణీ ॥**

పాడ్యమి నుంచి పౌర్ణమి వరకు పదిహేను కళలు కాగా, పదహారవది సాక్షాత్తూ పరమేశ్వరియే అయి ఉన్నది. పరమేశ్వరి షోడశకళాప్రపూర్ణ. అందుకే ఆమె ముఖము పూర్ణచంద్రబింబములాగాఉన్నది అంటున్నారు. శ్రీచక్రంలోని రెండవఆవరణ అయిన షోడశదళంలో చంద్రకళలన్నీ ఆకర్షణ దేవతలరూపంలో ఉంటాయి.

చంద్రకళలే తిథులు ఆ తిథులే నిత్యాదేవతలు.

| వ.నెం. | నిత్యాదేవతలు | చంద్రకళలు | తిథులు |
|---|---|---|---|
| 1. | కామేశ్వరి | అమృతా | పాడ్యమి |
| 2. | భగమాలిని | మానదా | విదియ |
| 3. | నిత్యక్లిన్న | పూషా | తదియ |
| 4. | భేరుండ | తుష్టి | చవితి |
| 5. | వహ్నివాసిని | పుష్టి | పంచమి |
| 6. | మహావజ్రేశ్వరి | రతి | షష్ఠి |
| 7. | శివదూతి | ధృతి | సప్తమి |
| 8. | త్వరిత | శశిని | అష్టమి |
| 9. | కులసుందరి | చంద్రికా | నవమి |
| 10. | నిత్య | కాంతా | దశమి |
| 11. | నీలపతాక | జ్యోత్స్నా | ఏకాదశి |
| 12. | విజయ | శ్రీ | ద్వాదశి |
| 13. | సర్వమంగళ | ప్రీతి | త్రయోదశి |
| 14. | జ్వాలామాలిని | అంగదా | చతుర్దశి |
| 15. | చిత్ర | పూర్ణా | పూర్ణిమ |
| 16. | మహానిత్య | పూర్ణామృతా | -- |

ఈ రకంగా షోడశకళాప్రపూర్ణ ఆ పరమేశ్వరి. **ధనుర్బాణాన్ పాశంసృణి** అమ్మవారి నాలుగుచేతులయందు ఉన్న ఆయుధాలను వివరిస్తున్నారు. ఆవిడకు నాలుగుచేతులున్నాయి అని గతంలో చెప్పుకున్నాము. ఆ చేతులయందు వివిధరకాలైన ఆయుధాలున్నాయి. అవి ఎడమవైపున గల పైచేతిలో పాశము, క్రింది చేతిలో ధనుస్సు, కుడివైపున గల పై చేతిలో అంకుశము, క్రింది చేతిలో బాణాలు ఉన్నాయి.

ముందుగా ధనుర్బాణాలను గురించి చెబుతున్నారు. సాధకుని యొక్క మనస్సే ఆమె చేతిలోని ధనుస్సు. పంచతన్మాత్రలే బాణాలు. అమ్మవారి చేతిలో ఉండేవి పంచబాణాలే. గతంలో మనం 'ధనుపౌష్పం' అనే ఆరవ శ్లోకంలో ఈ బాణాలు పంచతన్మాత్రలు అని చెప్పుకున్నాం. ఇక్కడ సాధకుడు తన మనస్సును ధనస్సు

రూపంలో దేవికి అర్పించాలి. అంటే సంకల్ప వికల్పాలకు మూలమైన మనస్సును ఆ దేవిమీద లగ్నం చెయ్యాలి. ఏకాగ్రతతో ఆ పరమేశ్వరిని ధ్యానించాలి. మానవుడు విషయ వాంఛలకు కారణమైన తన్మాత్రలను ఆ దేవికి సమర్పించాలి. అవే పంచబాణాలు. అయితే కొన్నిచోట్ల ఈ బాణాలు ఒకదానిలో ఒకటి ఉన్నట్లుగా కనిపిస్తాయి. అవి పంచకోశాలకు ప్రతీక. 1) అన్నమయ, 2) ప్రాణమయ, 3) మనోమయ, 4) విజ్ఞానమయ, 5) ఆనందమయకోశాలనే పంచకోశాలు అంటారు. అసలు కోశము అంటే – ఒర అని అర్థం.

1. అన్నంతో ఉత్పన్నమైన శరీరాన్ని 'అన్నమయకోశము' అంటారు. ఇది అన్నం ఉంటేనే బ్రతికి ఉంటుంది. లేకపోతే నశిస్తుంది.

2. కర్మేంద్రియాలతో కూడిన ప్రాణమే ప్రాణమయకోశము. ఈ ప్రాణము వల్లనే శరీరం ఆహారం తీసుకుని వృద్ధి చెందుతుంది.

3. జ్ఞానేంద్రియాలు, మనస్సు కలిపి 'మనోమయకోశము' అంటారు. నేను, నాది అనే అహంకారమమకారాలకు, సంకల్పవికల్పాలకు హేతువు ఇదే.

4. జ్ఞానేంద్రియాలతోను, వృత్తులతోను కూడిన బుద్ధియే విజ్ఞానమయకోశము.

5. ఆనందస్వరూపమైన ఆత్మయొక్క ప్రతిబింబంచేత తాకబడినటువంటి, తమోగుణంవల్ల ప్రకటితమైనటువంటి వృత్తిని 'ఆనందమయకోశము' అంటారు.

ఇవన్నీ ఒకదానిలో ఒకటి ఉంటాయి. అందుకే కొన్ని గ్రంథాలలో ఆ పరమేశ్వరి చేతిలోని బాణాలు పంచకోశాలు అని చెప్పబడింది.

క్రింది వైపున ఎడమచేతిలో ధనుస్సు, కుడిచేతిలో బాణాలు ఉంటాయి. ఇక పై చేతులలో చూసినట్లైతే ఎడమచేతిలో పాశము ఉంటుంది. ఇది రాగానికి గుర్తు. అదే పాశము. జీవిని కట్టిపడేస్తుంది. ప్రేమ, అనురాగము, ఆప్యాయత అని వివిధ పేర్లతో పిలువబడుతుంది. కుడిచేతిలో అంకుశముంటుంది. ఇది ద్వేషానికి ప్రతీక. రాగము గనక ఎక్కువైతే, అది ద్వేషంగా మారుతుంది. ఆ ద్వేషము ఇతరులను బాధిస్తుంది.

రాగద్వేషాలను, మనస్సును జయించి, ఇంద్రియాలను అదుపులో ఉంచగలిగినవాడు పరమేశ్వరి సన్నిధికి చేరతాడు. సాధకుడు రాగద్వేషాలను విడిచి,

మనస్సును నిశ్చలంచేసి, అహంకారమనే పుష్పంతో ఆ దేవిని పూజించినట్లైతే, అనగా అరిషడ్వర్గాలను జయించి పరమేశ్వరిని ఆశ్రయించినట్లైతే సర్వసిద్ధి పొందుతాడు అని వామకేశ్వర తంత్రంలో చెప్పబడింది.

ఈ విషయాలన్నీ లలితాసహస్రంలోని **'రాగస్వరూప పాశాఢ్యా, క్రోధాకారాంకుశోజ్వలా, మనోరూపేక్షు కోదండా, పంచతన్మాత్రసాయకా'** అనే నామాలలో వివరించటం జరిగింది.

ఈ రకంగా బంగారుమొలనూలు ధరించి ఏనుగుకుంభస్థలములలాగా ఉన్న చనుగన, సన్నని నడుము, శరత్కాలచంద్రబింబమును పోలు ముఖము కలిగి చేతులయందు పాశము, అంకుశము, ధనుర్బాణాలు ధరించిన ఆ దేవి శివునియొక్క అహంకారస్వరూపిణి అంటున్నారు శంకరభగవత్పాదులవారు. ఇది ఆ దేవి స్థూలరూపము.

ఇక ఈ శ్లోకంలో **'పురమథితుః'** అన్నచోట త్రిపురాలను మథించి, అంటే మాతృకాబీజాలను మథించి, పాలనుండి వెన్నను తీసినట్లుగా ఆ శివుడే 'ఐం క్లీం సౌః' అనే మూడుబీజాక్షరాలను బాలామంత్రంగా లోకానికి అందించాడు అని అర్థం. ఇక్కడ ఐం-వాగ్భవ బీజము, క్లీం-కామరాజ బీజము, సౌః - శక్తిబీజము.

**'అహో పురుషికా'** అన్నచోట 'అహో' అనే పదంలోని అకారము బ్రహ్మ, హకారము శక్తి. ఈ రెండింటికలయికయే 'అహం' అంటే ప్రత్యగాత్మ అనబడే పురుషుడు అని అర్థం. అదే **'శివోహం'** అనగా నేనే శివుడను. **'అహం బ్రహ్మోస్మి'** ఇదే మహావాక్యము.

| | | |
|---|---|---|
| ఈ రకంగా స్థూలరూపము | - | పరమేశ్వరి |
| సూక్ష్మరూపము | - | మంత్రము |
| పరాకారమే | - | కుండలినీ శక్తి |

ఈ విధంగా ఈ శ్లోకంలో పరమేశ్వరి యొక్క స్థూల, సూక్ష్మ, పరారూపాలను వివరించారు భగవత్పాదులవారు

**సుధాసిన్ధోర్మధ్యే సురవిటపివాటీపరివృతే**
**మణిద్వీపే నీపోపవనవతి చిన్తామణిగృహే ।**

**శివాకారే మఞ్చే పరమశివపర్యఙ్క నిలయామ్**

**భజన్తి త్వాం ధన్యాః కతిచన చిదానన్దలహరీమ్ ॥**

ఓ భగవతీ ! పాలసముద్రము మధ్యన రతనాలదీవి. అందులో కల్పవృక్షాల వనం. ఆ మధ్యన కదంబవృక్షాలు. వాటి మధ్యన చింతామణులగృహము. అందులో త్రికోణాకారమంచమునందు, పరమశివుడు అనే శయ్యమీద ప్రకాశించే ఓ జ్ఞానస్వరూపిణీ ! నిరతిశయ సుఖప్రదాయిని అయిన నిన్ను కొందరు ధన్యులు మాత్రమే సేవించగలుగుతున్నారు.

సుధాసింధువు అంటే పాలసముద్రము. అదే అమృతసముద్రం. ఆ సముద్రంలో రతనాలదీవి. అందులో కల్పవృక్షాలు. చూడండి ఆ పరమేశ్వరి పాలసముద్రంలో ఉన్నదట. పాలు అనేవి పౌష్టికాహారం. ఆయుర్వర్ధకం. చిన్న పిల్లలకు పాలే ఆహారం. పెద్దవాళ్ళకు కూడా ఆయుష్షును పెంచేవి పాలే.

**ఘృతేన వర్ధతే బుద్ధి క్షీరేణాయుష్య వర్ధతే ।**

నెయ్యివలన బుద్ధి, పాలవలన ఆయుష్షు పెరుగుతాయి.

**వృద్ధార్క హోమధూమశ్చ బాలస్త్రీ నిర్మలోదకం ।**

**రాత్రిం క్షీరాన్నభుక్తించ ఆయుర్వృద్ధిర్దినేదినే ॥**

రాత్రిపూట పాలన్నం కనక తింటే ఆయుష్షు పెరుగుతుంది అంటున్నారు. అందుకే పాలు అమృతంతో సమానం. ఆ దేవిని తలచినంత మాత్రం చేతనే ముందు శరీరపుష్టి, దారుఢ్యం కలుగుతాయి. ఇక ఆ పాలసముద్రంలో రతనాలదీవి. అవి వెలలేని రత్నాలు. ఒక్కరత్నం చాలు మనజీవితం సుఖంగా వెళ్ళిపోవటానికి అటువంటివి లెక్కలేనన్ని రతనాలు. ఆ దీవిలో కల్పవృక్షాలు. కల్పవృక్షము అంటే కోరిన కోరికలు తీర్చే వృక్షమన్నమాట. ఇది దేవతావృక్షము. ఇటువంటిది ఒక్కటుంటే చాలు మన కోరికలు తీరిపోతాయి. మనకి అంటే మన ఒక్కళ్ళకే కాదు ప్రపంచంలోని వారందరి కోరికలు తీర్చగల శక్తి ఒక్కవృక్షానికే ఉంది. అటువంటి కల్పవృక్షాల వనం. అసలు దేవతా వృక్షాలు ఐదు అవి 1. మందారము 2. పారిజాతము 3. సంతానము 4. కల్పవృక్షము 5. హరిచందనము. వీటిలో కోరిన కోరికలు తీర్చేది కల్పవృక్షము. ఈ కల్పవృక్షసముదాయము మధ్యన మణిద్వీపమున్నది. ఆ పరమేశ్వరి

నివశించే ప్రదేశాన్నే మణిద్వీపము అంటారు. **సుబాలోపనిషత్తులో** బ్రహ్మలోకముపైన సర్వలోకమున్నది అని చెప్పబడింది. ఆ సర్వలోకంలో ఈ మణిద్వీపమున్నది. అన్ని లోకాలకు పైభాగాన ఉండటం చేత దీనికి సర్వలోకమని పేరు వచ్చింది. ఆ పరమేశ్వరి సంకల్పంచేతనే ఇది ఏర్పడింది.

శివరహస్యపురాణంలో "ఓ పరమేశ్వరా ! అన్నిటికన్నా సుందరము, ఆనందామృతసాగరము, అక్కడ ఉండే వారికి ఆకలిదప్పికలు లేనటువంటిది, కైలాసము కన్న సుందరమైన స్థావము నాకోసం నిర్మించవలసినది అని ఆదేవి అడగగా పరమేశ్వరుడు ఈ లోకాన్ని నిర్మించాడు అని చెప్పబడింది. బ్రహ్మాండ పురాణంలోని లలితోపాఖ్యానంలో దేవియొక్క ఆజ్ఞతో విశ్వకర్మ ఈ నగరాన్ని నిర్మించాడు అని చెప్పబడింది.

**తత్రశ్రీ భువనేశానీ పరాశక్తిర్విరాజితే ।**

**బ్రహ్మలోకాధికాలోకః సర్వలోకాధిభిపరః ॥**

బ్రహ్మలోకము కన్న కూడా అధికమైనది సర్వలోకము. దానితో సమానమైన సుందర నగరము ఇంకొకటి లేదు.

**బ్రహ్మలోకాదూర్ధ్వభాగే సర్వలోకోఽస్తియః శ్రుతి**

**మణిద్వీపః న ఏవాస్తి యత్రదేవీ విరాజితే**

బ్రహ్మలోకానికి పైన సర్వలోకమున్నది. దానినే మణిద్వీపము అంటారు. ఆ దేవి దానిని సంకల్పమాత్రముచేతనే నిర్మించింది.

**కైలాసా దధికోలోకో ! వైకుంఠాదపి చోత్తమః**

**గోలోకాదపి సర్వస్యా సర్వలోకోఽధికస్మృతః**

**నతత్సమం త్రిలోక్యాంతు । సుందరం విద్యతే కచిత్ ।**

అది కైలాసము కన్న మిన్న. వైకుంఠముకన్న ఉత్తమము. గోలోకము కన్న శ్రేష్ఠము. ముల్లోకాలలోను దానిని మించిన నగరము ఇంకొకటి లేదు.

ఆ మణిద్వీపానికి నాలుగు వైపులా అమృతసముద్రమున్నది. అందులో గాలికి ఉవ్వెత్తున లేచే కెరటాలు, రతనాల ఇసుకప్రదేశాలు, దక్షిణావృతశంఖాలు, రంగు రంగుల చేపలు ఉన్నాయి.

**ఛత్రీభూతం త్రిజగతో భవసంతాప నాశకమ్ ।**

**ఛాయాభూతం తదేవాస్తి బ్రహ్మాండానాంతు సత్తమ ॥**

అది ముల్లోకాలకు గొడుగువంటిది. సంసారతాపాన్ని నశింపజేస్తుంది. బ్రహ్మాండాలాన్నంతటికీ చల్లని నీడనిస్తుంది.

ఈ మణిద్వీపానికి 25 ప్రాకారాలున్నాయి. రెండుప్రాకారాల మధ్య ఉన్న ప్రదేశాన్ని ఆవరణ అంటారు. ఈ రకంగా మొత్తం 24 ఆవరణాలున్నాయి. దీనిలోని 24వ ఆవరణలో శృంగారశక్తిసహితుడైన మన్మథుడుంటాడు. ఇక్కడే చింతామణి గృహము ఉన్నది.

లలితాసహస్రంలో 55, 56 నామాలు చూడండి **సుమేరు మధ్య శృంగస్థా, శ్రీమన్నగరనాయికా.**

శ్రీనగరము అంటే ఆ పరమేశ్వరి నివశించే ప్రదేశము. అది రెండు రకాలుగా ఉన్నది.

1. మేరుపర్వతం మధ్యన ఉన్నది. 2. సకలబ్రహ్మాండాలకు బయట, క్షీరసాగరంలో రత్నద్వీపము మధ్యన ఉన్నది. ఇప్పటిదాకా క్షీరసాగరంలో ఉన్న మణిద్వీపాన్ని చూశాము. ఇప్పుడు మేరుపర్వతం మధ్యన ఉన్న మణిద్వీపాన్ని చూద్దాం.

"మేరుపర్వతం అనేది బంగారు పర్వతము. ఈ పర్వతం మీద త్రికోణాకారంలో మూడుశిఖరాలున్నాయి. వాటి మధ్యన ఇంకొక శిఖరమున్నది. ఈ మూడు శిఖరాలు త్రిమూర్తులకు నిలయమై ఉండగా, నాల్గవ శిఖరంమీద ఆ పరమేశ్వరి నివసిస్తుంది. ఈ శిఖరము 400 యోజనాల ఎత్తున్నది" అని లలితాస్తవరత్నములో దుర్వాస మహర్షి వ్రాశాడు.

అలాగే లలితాష్టోత్తరశతనామావళిలో ఆ దేవిని **"రజతాచల శృంగాగ్ర మధ్యస్థాయై నమోనమః"** అంటారు. రజతాచలము అంటే వెండి కొండ. వెండిలాగా తళతళా మెరిసే మంచుకొండ. హిమగిరి.

ఆ హిమాలయపర్వతాల మీద కైలాసశిఖరమున్నది. దానిమీద శివాశివులుంటారు అని చెప్పబడుతోంది.

ఈ శిఖరము దేవతలచే పూజించబడుతున్నది. అందుచేతనే మానవులకు కనిపించదు. మానవశరీరంలో చెప్పబడే సహస్రదళపద్మమే 'మేరుపర్వతము' యోగి ఆజ్ఞానచక్రం దాటిన తరువాత మహానాదాన్ని దర్శిస్తాడు. అతడికి వాక్సిద్ధి కలుగుతుంది. ఈ మహానాదము నాగలి రూపంలో ఉంటుంది. అది శాంతమైనది. వరప్రదాయని. దేదీప్యమాన్యమైన కాంతులతో ప్రకాశిస్తుంటుంది. శూన్యమందు విసర్గకు క్రిందుగా సహస్రదళ పద్మమున్నది. అది పూర్ణచంద్రునిలాగా ఉంటుంది. దాని కిరణాలు సూర్యకిరణాలకన్నా ఎక్కువ కాంతులు ప్రసరింపచేస్తుంటాయి. ఇది కేవలము ఆనందరూపమైనది.

సహస్రదళపద్మంలో కళంకరహితుడైన చంద్రుడున్నాడు అతడు కళంక రహితుడు, వృద్ధిక్షయాలు లేనివాడు. ఆ చంద్రమండలము మధ్యన త్రికోణమున్నది. దానియందు మహాశూన్యమున్నది. ఈ శూన్యప్రదేశము అత్యంత రహస్యమైనది. అతిప్రయత్నం మీద గాని సాధకులు దాన్ని పొందలేరు. అది అపరిమితమైన సంతానరాసి. పరమేశ్వరుడు ఇక్కడే ఉంటాడు.

**తదంతః శూన్యం తత్సకల సురగణైః సేవితంచాతిగుప్తం**

ఆ మహాశూన్యాన్ని దేవతలు రహస్యంగా సేవిస్తుంటారు.

**శివస్థానం శైవాః పరమపురుషం వైష్ణవగణాః**

**లపంతీతి ప్రాయోహరిహర పదం కేచిదపరే**

**పదందేవ్యాదేవీచరణ యుగళాంబోజ రసికా**

**మునీ నామప్యంతే ప్రకృతి పురుషస్థామమలం ॥**

ఈ ప్రదేశాన్ని శివస్థానము అని శైవులు, విష్ణుస్థానమని వైష్ణవులు, దేవీస్థానము అని శాక్తేయులు ఇలా రకరకాలుగా చెబుతుంటారు.

**ఇదం స్థానం జ్ఞాత్వా నియతనిజచిత్తో నరవరొ**

**న భూయత్ సంసారే పునరపి నబుద్ధ స్త్రిభువనే ॥**

**సమగ్రాశాక్తః స్వాన్నియమ మనసస్త స్వకృతినః**

**సదాకర్తుం ఖగతిరపి వాణీసువిమలా ॥**

ఈ స్థానాన్ని తెలుసుకున్న సాధకుడికి పునర్జన్మ లేదు. అతడికి ఈ లోకంతో బంధం ఉండదు. పాపపుణ్యాలుండవు. సంసారబంధనాలు ఉండవు. ఇష్టార్థసిద్ధి కలుగుతుంది. అతడికి సాయుజ్యం లభిస్తుంది. పునర్జన్మ ఉండదు. ఈ విషయం అంతా **షట్చక్రనిరూపణం** లో చెప్పబడింది.

ఈ రకంగా పాలసముద్రంలో ఉన్న మణిద్వీపమే మేరుశృంగము. అదే సహస్రదళపద్మము. శ్రీచక్రంలోని ఎనిమిదవఆవరణ 'సర్వసిద్ధిప్రదచక్రము' అదే త్రికోణము. దీనిలో మూడువైపులా మూడుపీఠాలున్నాయి. వీటినే, 1. కామగిరి, 2. పూర్ణగిరి, 3. జాలంధర పీఠాలు అంటారు. ఈ మూడు పీఠాల మధ్యన నాల్గవదైన ఓడ్యాణపీఠమున్నది. అందులోనే పరమేశ్వరి ఉన్నది. యోగినీహృదయంలో దీన్ని వివరిస్తూ, నిరాకారుడు, నిర్గుణస్వరూపుడు పరబ్రహ్మ. అతడు బిందురూపంలో ఉన్నాడు. ఆ బిందువే కాలవశమున భిన్నమై, వివిధరూపాలు పొందింది. **'రహస్యాగమము'**లో ఈ విషయాన్ని వివరిస్తూ 'కాలవశమున భిన్నమైనటువంటి ఆ బిందువు మూడు భాగాలయింది. అవే 1. స్థూల 2. సూక్ష్మ 3. పరములు. అవి కారణబిందువుతో కలిసి నాలుగుభాగాలవుతున్నాయి. అవే 1. కామగిరి, 2. పూర్ణగిరి, 3. జాలంధర, 4. ఓడ్యాణ పీఠాలు. ఆ పరమేశ్వరి ఈ పీఠాలలో ఉంటుంది. ఈ పీఠాలు మానవదేహంలో ఉన్నాయి. ఇవి శ్రీచక్రంలో కూడా నిరూపించబడ్డాయి. ఈ నిరూపణ ఏమిటో ఒక్కసారి చూద్దాం. గౌడపాదులవారు తమ సుభగోదయస్తుతిలోని 10వ శ్లోకంలో మానవశరీరంలో ఉండే షట్చక్రాలకు, శ్రీచక్రంలోని ఆవరణలకు ఐక్యత నిరూపించారు. అంటే ఈ రెండూ ఒక్కటే అన్నారు.

**త్రికోణం చాధారం త్రిపురవినుతే ! ష్టారమనఘే**

**భవేత్స్వాధిష్ఠానం పునరపి దశారం మణిపురం ॥**

**దశారంతే సంవిత్కమల మథమన్వస్రక్రముమే**

**విశుద్ధం స్యాదాజ్ఞా శివ ఇతి తతో బైందవగృహమ్ ॥**

1. ఆధార చక్రానికి – త్రికోణంతో ఐక్యత
2. స్వాధిష్ఠానానికి – అష్టకోణంతో ఐక్యత
3. మణిపూరానికి – అంతర్దశారంతో ఐక్యత

| | | |
|---|---|---|
| 4. అనాహతానికి | - | బహిర్దశారంతో ఐక్యత |
| 5. విశుద్ధి చక్రానికి | - | చతుర్దశారంతో ఐక్యత |
| 6. ఆజ్ఞా చక్రానికి | - | అష్టదళము, షోడశదళములతో ఐక్యత |
| 7. సహస్రారానికి | - | భూపురంతో ఐక్యత |

శ్రీ చక్రంలో ఉండే మూడువృత్తాలు – రుద్రగ్రంథి, విష్ణుగ్రంథి, బ్రహ్మగ్రంథిలతో ఐక్యత పొందుతున్నాయి. ఇందులో బ్రహ్మరంధ్రమే బిందువు. కాబట్టి

| | | | | |
|---|---|---|---|---|
| కామగిరిపీఠం | - | ఆధారచక్రం | - | త్రికోణం |
| పూర్ణగిరి పీఠం | - | అనాహత చక్రం | - | బహిర్దశారం |
| జాలంధర పీఠం | - | ఆజ్ఞాచక్రం | - | అష్టదళ, షోడశదళ పద్మాలు |
| ఓడ్యాణ పీఠం | - | బ్రహ్మరంధ్రం | - | బిందువు |

లలితాసహస్రంలో

| | | |
|---|---|---|
| 375 నామం కామపూజితా | - | కామగిరిపీఠము |
| 376 నామం శృంగారరస సంపూర్ణా | - | పూర్ణగిరి పీఠము |
| 378 నామం జాలంధర స్థితా | - | జాలంధర పీఠము |
| 379 నామం ఓడ్యాణ పీఠనిలయా | - | ఓడ్యాణపీఠము |

ఈ ఓడ్యాణపీఠమే మానవదేహంలోని బ్రహ్మరంధ్రము. శ్రీచక్రంలోని తొమ్మిదవ ఆవరణ బిందువు. అదే సుధాసింధువు. మేరుశృంగము.

అటువంటి సుధాసింధువులో మణిద్వీపమున్నది. ఆ ద్వీపంలో కోరిన కోరికలు తీర్చే కల్పవృక్షాలున్నాయి. మణిద్వీపానికి 25 ప్రాకారాలున్నాయి. రెండు ప్రాకారాల మధ్య ఉన్న స్థలాన్ని ఆవరణ అంటారు. ఈరకంగా మొత్తం 24 ఆవరణాలున్నాయి.

24వ ఆవరణలోనే చింతామణిగృహమున్నది. చింతలను తీర్చే మణి – చింతామణి. ప్రతిరోజూ 20 బారువుల బంగారం పెడుతుంది. అంటే ఈ చింతామణి దగ్గర ఉన్నవాడికి దరిద్రం అనేది లేదన్నమాట. చింతామణి అనేది ఒక మంత్రం. సర్వకామ్యసిద్ధిప్రదము. అటువంటి చింతామణులతో నిర్మించిన గృహము. పరమేశ్వరిని నమ్మినవాడికి ఏ రకమైన బాధలు, కష్టాలు ఉండవన్నమాట. అతని కోరికలన్నీ ఆమె తీరుస్తుంది. ఈ చింతామణిగృహానికి

ఆగ్నేయ భాగంలో - దేవి ఆవిర్భవించిన చిదగ్నికుండము

నైరుతి దిశలో - శ్రీచక్రరథము

వాయువ్యదిశలో - గేయచక్రరథము

ఈశాన్యదిశలో - కిరిచక్రరథము ఉంటాయి.

చింతామణిగృహానికి నాలుగుద్వారాలున్నాయి. ఆ ద్వారాలలో ఆమ్నాయ దేవతలుంటారు. అందుకే పరమేశ్వరిని అర్చించేటప్పుడు

**ప్రాగామ్నాయమయ ప్రాగ్ద్వారే ద్వారశ్రీయై నమః**

**దక్షిణామ్నాయమయ దక్షిణద్వారే ద్వారశ్రీయై నమః**

**పశ్చిమామ్నాయమయ పశ్చిద్వారే ద్వారశ్రీయై నమః**

**ఉత్తరామ్నాయమయ ఉత్తరద్వారే ద్వారశ్రీయై నమః**

**తన్మధ్యే క్షీరసాగరాయ నమః**

**క్షీరసాగరమధ్యే రత్నద్వీపాయ నమః**

**తన్మధ్యేకల్పవృక్ష వాటికాయై నమః**

**తన్మధ్యే రత్న సింహాసనాయై నమః**

**రత్నసింహాసనోపరిస్థితా శ్రీలలితాపరాభట్టారికాయై నమః** ఇతి యోని ముద్రాంపణమేతు అంటాము.

దేవీ భాగవతంలో చింతామణి గృహాన్ని వివరిస్తూ

**నవరత్నమయాదగ్రే చింతామణి గృహం మహత్ ।**

**తత్ర త్యం వస్తు మాత్రంతు చింతామణి నిర్మితం ॥**

**సూర్యోద్గారో ఫలైస్తద్వ చ్ఛంద్రోద్గారోఫలై స్తదా ॥**

**విద్యుత్ ప్రభోఫతైః స్తంభాః కల్పితాస్తు సహస్రశః ।**

**యేషాంప్రభాభిరంతః స్థ వస్తు కించిన్న దృశ్యతే ॥**

నవరత్నాలప్రాకారం దాటిన తరువాత చింతామణిగృహము మహోజ్వలమైన ప్రభలతో ప్రకాశిస్తుంటుంది. దానిలో ప్రతివస్తువు కూడా చింతామణులతో

నిర్మించబడింది. సూర్యకాంతి శిలలు, చంద్రకాంతి శిలలు, మెరుపు కాంతుల మణులతో నిర్మించబడిన స్థంభాలు దీపపు స్థంభాలలాగా ప్రకాశిస్తుంటాయి. ఆ కాంతులలో ఏ వస్తువూ కనిపించదు. ఇటువంటివి వేయిస్థంభాలు గల మంటపాలు ఆ చింతామణిగృహంలో నాలుగున్నాయి.

**తదేవ దేవీ సదనం మధ్యభాగే విరాజితే**

**సహస్ర స్తంభ సంయుక్తా, శ్చత్వా రత్వేషు మంటపా**

**శృంగారమంటపశ్చైకో, ముక్తి మంటప ఏవచ**

**జ్ఞానమంటప సంజ్ఞస్తు, తృతీయః పరికీర్తితః ॥**

**ఏకాంత మంటపశ్చైవ, చతుర్థ పరికీర్తితః**

ఆ చింతామణిగృహంలో వేయిస్తంభాలమంటపాలు నాలుగున్నాయి అన్నాం కదా ! అవి

1. శృంగారమంటపము
2. ముక్తిమంటపము
3. జ్ఞానమంటపము
4. ఏకాంతమంటపము

ఈ మంటపాలన్నీ కూడా ధూపములతోను, పరిమళములతోను విరాజిల్లు తుంటాయి.

వీటిలో ప్రతిమంటపము కొన్ని కోట్లసూర్యకాంతులతో ప్రకాశిస్తూ ఉంటుంది. ఈ మంటపాలకు నాలుగువైపులా కాశ్మీరవనాలున్నాయి. అక్కడ నుండి పరిమళాలు వెదజల్లబడుతుంటాయి. అక్కడ రతనాలమెట్లవరుసలో మహాపద్మాలున్నాయి. వాటిలోని తేనెను తుమ్మెదలు త్రాగుతుంటాయి. ఆ ప్రాంతంలో హంసలు, కారండవ (కన్నె లేడిపిట్ట) పక్షులు తిరుగాడుతుంటాయి. చింతామణిగృహంలో నాలుగు మంటపాలున్నాయి కదా. వాటిలోని

**శృంగారమంటపే దేవ్యో గాయంతీవివిధై స్స్వరైః ।**

**సభాసదో దేవవరా మధ్యే శ్రీజగదంబికా ॥**

శృంగార మంటపంలో దేవతలు మధురస్వరాలతో గానం చేస్తుంటారు. అక్కడ దేవతలంతా సభ తీర్చి ఉంటారు. వారి మధ్యలో సింహాసనం మీద ఆ దేవి **'జగదంబిక'** ఆసీనురాలై ఉంటుంది.

**ముక్తిమంటప మధ్యేతు యోచయత్వనిశంశివా**

ముక్తిమంటపంలో నుండి ఆ దేవి జగత్తులోని భక్తులకు ముక్తిని ప్రసాదిస్తుంటుంది.

**జ్ఞానోపదేశం కురుతే తృతీయే నృపమంటపే**

మూడవదైన జ్ఞానమంటపంలో ఉండి భక్తులకు జ్ఞానాన్ని ప్రసాదిస్తుంటుంది.

**చతుర్థే మంటపం చైవ జగద్రక్షా వివించనం ।**
**మంత్రిణీ సహితానిత్యం కరోతు జగదంబికా ॥**

నాల్గవమంటపం అయిన ఏకాంతమంటపంలో దేవి తన మంత్రులతో కొలువు దీరి, జగద్రక్షణ గురించి ఆలోచిస్తుంటుంది. అటువంటి చింతామణి గృహంలో **శివాకారే మంచే పరమశివపర్యంక నిలయాం** శివాకారము అంటే – త్రికోణాకారమైన మంచంమీద పరమశివుని పర్యంముమీద ఆ దేవి ఆసీనురాలై ఉంటుంది. అంటున్నారు శంకర భగవత్పాదులవారు. ఐతే దేవీ భాగవతంలో చూడండి.

**చింతామణిగృహేరాజన్ శక్తితత్త్వాత్మకై పరైః**
**సోపానైర్దశభిర్యుక్తో మంచకోప్యధిరాజితే ॥**
**బ్రహ్మావిష్ణుశ్చరుద్రశ్చ ఈశ్వరశ్చ సదాశివహః**
**ఏతే పంచఖురాః ప్రోక్తాః ఫలకస్తు సదాశివః ॥**

చింతామణి గృహంలో శక్తితత్త్వాత్మకమైన పదిమెట్లతో, దివ్యకాంతులు ప్రసరించే మంచమున్నది. బ్రహ్మ, విష్ణువు, రుద్రుడు, ఈశ్వరుడు ఆ మంచానికి కాళ్ళుకాగా, సదాశివుడు దానిమీద పలకగా ఉంటాడు. లలితా సహస్రంలోని 249వ నామము **'పంచప్రేతాసనాసీనా'.**

సృష్టి ప్రారంభంలో పరమేశ్వరి త్రిమూర్తులకు తన అంశలయిన మహాకాళి, మహాలక్ష్మి, మహాసరస్వతులను వారికి సహాయకులుగా ఇచ్చి సృష్టికార్యక్రమం కొనసాగించమని చెబుతూ, మీరు ఆ శక్తులను ఎప్పుడూ అవమానించకండి. ఒకవేళ ఆ శక్తులు గనక మిమ్ములను వదలి వెళ్ళిపోతే, మీరు శక్తిహీనులై పోతారు. అని చెప్పింది. కాలక్రమంలో త్రిమూర్తులు ఆ శక్తులను అవమానించారు. వారు అలిగి

వెళ్ళిపోయారు. అప్పుడు త్రిమూర్తులు శక్తిహీనులై పోయారు. శక్తిహీనుడైనవాడు ప్రేతంతో సమానం అందుకే ఆదేవి ప్రేతములవంటి వీరిచే మోయబడుతూ, పంచప్రేతాసనాసీనా అనబడుతోంది.

షట్చక్రాలలో పరమేశ్వరిని అర్చించే సంప్రదాయమున్నది. ఈ సంప్రదాయంలో ఒక్కొక్క చక్రంలో అర్చించే వారికి ఒక్కొక్క రకమైన ముక్తి లభిస్తుంది. విశుద్ధిచక్రంలో ఆ పరమేశ్వరిని అర్చించే వారికి సామీప్యముక్తి కలుగుతుంది. త్రిమూర్తులు ఆ దేవికి అతిదగ్గరగా ఉండి సేవించాలనే తలంపుతో ఆమెను విశుద్ధిచక్రంలో అర్చించి, ఆమె కూర్చునే సింహాసనానికి కోళ్ళు అయినారు. ఈ విషయం అంతా **గతాస్తే మంచత్వం** అనే 92వ శ్లోకంలో వివరించబడింది.

ఆ పరమేశ్వరి **పంచకోశాంతర స్థిత.** ఈ పంచకోశాల గురించి **తైత్తిరీయోప నిషత్తు**లోని భృగువల్లిలో చెప్పబడింది.

వరుణ మహర్షి కుమారుడు భృగుమహర్షి. విద్యాభ్యాసం పూర్తి చేసి బ్రహ్మజ్ఞానం సంపాదించాలనే కోరికతో తన తండ్రి దగ్గరకు వెళ్ళి పరబ్రహ్మతత్త్వం ఉపదేశం చెయ్యమని అడిగాడు. దానికి అతడి తండ్రి "కుమారా ! అన్నము, ప్రాణము, నేత్రము, శ్రోత్రము, మనస్సు, వాక్కు, ఇవన్నీ పరబ్రహ్మసాధనకు మార్గాలే. వీటన్నింటిలోనూ బ్రహ్మతత్త్వం ఇమిడి ఉన్నది. అది దేనిలో నుండి ఉత్పన్నమైనదో, దేనితో పోషింపబడుతున్నదో, దేనియందు లయమవుతున్నదో, అన్నిటికీ మూలవస్తువేదో, దాన్ని తెలుసుకోవాలి. దాన్ని తపస్సుద్వారానే సాధించాలి. కాబట్టి వెళ్ళి తపస్సు చెయ్యి" అన్నాడు.

తండ్రి ఆ దేశాన్ననుసరించి దీక్షతీసుకుని నియమనిష్ఠలతో తపస్సు చెయ్యటం ప్రారంభించాడు భృగువు. కొంతకాలం గడిచింది. ఆ తరువాత 'అన్నమే పరబ్రహ్మ స్వరూపము' అని తెలిసింది. అన్నం మూలంగానే ప్రాణులన్నీ ఉత్పత్తి అవుతున్నాయి. ప్రాణులన్నీ పోషింపబడుతున్నాయి. కాబట్టి అన్నమే పరబ్రహ్మస్వరూపము. అని నిశ్చయించుకుని ఈ విషయం తండ్రికి చెప్పాడు. ఆ మాటలు విన్న వరుణ మహర్షి "నాయనా ! తత్త్వసాధనలో మొదటిమెట్టు మీదనే ఉన్నావు. అన్నం పరబ్రహ్మ స్వరూపమే. కాని అన్నమే పరబ్రహ్మస్వరూపం కాదు. వెళ్ళి మళ్ళీ తపస్సు చెయ్యి అన్నాడు. మళ్ళీ తపస్సు చెయ్యటం ప్రారంభించాడు భృగువు. కొంతకాలం గడిచింది.

ప్రాణమే బ్రహ్మ అనే విషయాన్ని తెలుసుకున్నాడు. లోకంలోని సమస్తజీవరాసి ప్రాణంవల్లనే జీవిస్తున్నది. ప్రాణం పోయినప్పుడు మృత్యువుతో లయమవుతున్నది. అందుచేత ప్రాణమే సర్వసృష్టికీ మూలాధారం అని భావించాడు. అదే విషయం తండ్రికి చెప్పాడు. ఆ మాటలు విన్న తండ్రి "నాయనా ! ఇదివరకటికన్న కొంచెం ముందుకు వెళ్ళావు. ప్రాణంకూడా పరబ్రహ్మస్వరూపమే. అంతే కాని ప్రాణమే పరబ్రహ్మ స్వరూపంకాదు. మళ్ళీ వెళ్ళి తపస్సు చెయ్యి" అన్నాడు.

మళ్ళీ తపస్సు చెయ్యటం ప్రారంభించాడు భృగువు. కొంతకాలం గడిచింది. మనస్సువల్లనే సంకల్పవికల్పాలు కలుగుతున్నాయి. మనస్సుచేతనే స్త్రీపురుషులు ఆకర్షితులౌతున్నారు. దీనివల్లనే జీవకోటి ఉద్భవిస్తున్నది. జన్మించిన తరువాత కూడా ఇంద్రియాల సాయంతోనే జీవనం సాగుతున్నది. చనిపోయిన తరువాత కూడా ఇంద్రియాలకు జ్ఞానం ప్రసాదించే శక్తి పోతుంది. అప్పుడు ఇంద్రియాలన్నీ మనస్సులో లీనమవుతాయి. కాబట్టి 'మనస్సే పరబ్రహ్మ.' అనుకున్నాడు భృగువు. ఈ విషయం తండ్రికి చెప్పాడు. మనస్సుకూడా పరబ్రహ్మమే కాని మనస్సే పరబ్రహ్మ కాదు. మళ్ళీ వెళ్ళి తపస్సు చెయ్యి అన్నాడు తండ్రి.

మళ్ళీ కొంతకాలం తపస్సు చేశాడు భృగువు. అప్పుడు అతడికి అర్ధమయింది. 'విజ్ఞానమే బ్రహ్మ' అని అదే విషయాన్ని తండ్రికి చెప్పాడు కాదన్నాడు తండ్రి. మళ్ళీ తపస్సు చెయ్యమన్నాడు. తండ్రి మాటల ప్రకారం మళ్ళీ తపస్సు చేశాడు భృగువు. అప్పుడు తెలిసింది 'ఆనందమే పరబ్రహ్మ' అని. సర్వమూ ఆనందం నుంచే ఉద్భవిస్తున్నది. ఆనందంలోనే లయమవుతున్నది. ఈ విషయం తండ్రికి తెలియజేశాడు. పరమానందం చెందాడు తండ్రి. అప్పుడు కుమారుడితో "కుమారా! అన్నింటికన్నా ఉత్తమంగా పరమాత్మను వ్యక్తం చేసే తత్త్వం ఆనందం. అన్నము, ప్రాణము, మనస్సు, విజ్ఞానము అన్నీ కూడా పరబ్రహ్మస్వరూపాలే. ఇవన్నీ ఒకదానికన్న మరొకటి సూక్ష్మమైనవి. అన్నింటికీ మించినది ఆనందము. ఈ ఆనందం క్షణికమైనది కాదు శాశ్వతమైనది. పరబ్రహ్మోపాసన క్రమంగా జరగాలి. ఆహారాన్ని వదలకుండా తింటూ ప్రాణాన్ని నిలుపుకుని, మనసును వికసింపచేసుకుని, దానివల్ల విజ్ఞానం పొంది తద్వారా పరబ్రహ్మసాక్షాత్కారం పొందాలి." అంటూ పంచకోశాంతర్గతుడైన పరబ్రహ్మను వివరించాడు వరుణమహర్షి.

కాబట్టి పరబ్రహ్మస్వరూపం పంచకోశములందు ఉంటుంది. కోశము అంటే వర అని అర్థం. మానవ శరీరంలో ఐదు కోశాలున్నాయి.

1. అన్నమయకోశము
2. ప్రాణమయకోశము
3. మనోమయకోశము
4. విజ్ఞానమయకోశము
5. ఆనందమయకోశము

మొదటి నాలుగు కోశముల మధ్యన ఆనందమయకోశంలో పరమేశ్వరి ఉంటుంది. ఈ నాలుగు కోశాలు ఒకదానిలో ఒకటి ఉంటాయి. ఆ లోపల పరమేశ్వరి ఉంటుంది. మానవదేహము 1) స్థూలదేహము 2) సూక్ష్మదేహము 3) కారణదేహము అని మూడు రకాలు.

1. స్థూలదేహము – అన్నమయకోశము
2. సూక్ష్మదేహము – ప్రాణమయ, మనోమయ
3. కారణదేహము – ఆనందమయకోశము

ఈ కోశాలన్నీ ఒకదానిలో ఒకటి ఉంటాయి.

1. అన్నమయకోశంలో – ప్రాణమయకోశము ఉంటుంది
2. ప్రాణమయకోశంలో – మనోమయకోశం ఉంటుంది.
3. మనోమయకోశంలో – విజ్ఞానమయకోశం ఉంటుంది.
4. విజ్ఞానమయకోశంలో – ఆనందమయకోశం ఉంటుంది
5. ఆనందమయకోశంలో – పరమేశ్వరి ఉంటుంది.

కాబట్టి ఆ పరమేశ్వరి ఎక్కడో లేదు. మనలోనే ఉన్నది.

ఇప్పుడు మనం దేవీ భాగవతం చూస్తున్నాం.

**బ్రహ్మ విష్ణుశ్చరుద్రశ్చ ఈశ్వరశ్చ సదాశివః ।**
**ఏతే పంచఖురాః ప్రోక్తాః ఫలకస్తు సదాశివః ॥**

పరమేశ్వరి కూర్చున్న త్రికోణాకార సింహాసనానికి బ్రహ్మ, విష్ణువు, రుద్రుడు, ఈశ్వరుడు కోళ్ళు కాగా, సదాశివుడు దానిమీద పలకగా ఉన్నాడు.

**తస్యోపరి మహాదేవో భువనేశో విరాజితే ।**

**యాదేవీ నిజలీలార్థం ద్విదా భూతా బభూవః ॥**

ఆ సింహాసనం మీద త్రిభువనేశ్వరుడు, మహాదేవుడు అయిన కామేశ్వరుడు ఉంటాడు. ఇక్కడ చిన్న అనుమానం వస్తుంది. ఉన్నది ఒక్కటే కదా ! మరి ఈ భువనేశ్వరుడెవరు ? అందుకే చెబుతున్నాడు **యా దేవీ నిజలీలార్థం ద్విదా భూతా బభూవః** ఆ పరమేశ్వరియే తన లీలావినోదం కోసం రెండురూపాలు ధరిస్తున్నది అంటున్నాడు. నిరాకారమైతే ఉన్నది ఒక్కటే కాని నిరాకారుడైన పరబ్రహ్మ సృష్టి చెయ్యాలని సంకల్పించినవాడై తనను తాను రెండుభాగాలుగా విభజించుకున్నాడు. అదే ప్రకృతి, పురుషులు. భువనేశ్వరి, భువనేశ్వరుడు. కామేశ్వరి, కామేశ్వరుడు.

**వామాంకేషణ్ణి షణ్ణా స్వదేవీ శ్రీభువనేశ్వరీ**

**నవరత్న గణాకీర్ణా కాంచీదామ విరాజితా**

**తప్తకాంచన సన్నద్ధ వైదూర్యాంగద భూషణా ॥**

**కనచ్ఛీచక్ర తాటంక విటంక వదనాంబుజా ।**

**లలాట కాంతి విభవ విజితార్ధ సుధాకరా ॥**

ఆ భువనేశ్వరుడి వామాంకం మీద నవరత్నాలు పొదిగిన మొలనూలుతోను, వైదూర్యములతో చేయబడిన చేతికడియములతోను, ప్రకాశించే భువనేశ్వరి ఉంటుంది. శ్రీచక్రాకారము గల తాటంకములతో ఆ దేవిముఖము ప్రకాశిస్తుంటుంది. దొండపండులాంటి అధరములు, నొసట కస్తూరితిలకముతో ఆ దేవి శోభిల్లుతూ ఉంటుంది. సూర్యచంద్రుల కాంతులను మించిన కాంతిగల చూడామణి ధరించి, నానాభరణములతోనూ  భాసిల్లుతూ, దివ్యమైన సౌందర్యరాసియై, దేవతలసేవలు అందుకుంటూ ఉంటుంది. ఇచ్ఛాజ్ఞానక్రియా శక్తులు ఆమె కన్నుసన్నలలో మెలగుతుంటాయి. లజ్జ, తుష్టి, పుష్టి, కీర్తి, కాంతి, క్షమ, దయ, బుద్ధి, మేధ, స్మృతి, లక్ష్మి అనే వారు ఆమెను సేవిస్తూ ఉంటారు.

**జయాచవిజయాచైవా । ప్యజితా చా పరాజితా ॥**

**నిత్యావిలాసినీ దోగ్ధ్రీ త్యఘోరా మంగళా నవా ।**

**పీఠశక్త యి ఏతాస్తు సేవంతే యా పరాంబికామ్ ॥**

జయ, విజయ, అజిత, అపరాజిత, నిత్య, విలాసినీ, దోగ్ధ్రీ, అఘోరా, మంగళా అనే తొమ్మిది పీఠశక్తులు ఆ దేవిని సేవిస్తుంటాయి.

**యస్యాస్తు పార్శ్వభాగేస్తు నిధీతౌశంఖ పద్మకౌ**
**నవరత్న మహానద్యస్త దావై కాంచనస్రవా ॥**

ఆ దేవికి ఇరుప్రక్కలా శంఖ, పద్మనిధులు ఉంటాయి. బంగారము, రతనాలతో కూడిన నదులు ప్రవహిస్తుంటాయి. అక్కడ రతనాల రాసులుంటాయి. నిధులు మొత్తం తొమ్మిది. వీటినే నవనిధులు అంటారు. అవి 1) కాళ, 2) మహాకాళ, 3) పాండుక, 4) మాణవక 5) వైసర్ప 6) సర్వరత్న 7) శంఖ 8) పద్మ 9) పింగళకము

ఇవన్నీ కుబేరుని అధీనంలో ఉంటాయి. వీటిలో శంఖనిధి, పద్మనిధి మరీ శ్రేష్ఠమైనవి. ఆ రెండు నిధులు పరమేశ్వరి దగ్గరే ఉన్నాయి.

ఈ రకంగా చింతామణిగృహంలో పరమశివుని పర్యంకమందు ఉంటుంది ఆ దేవి అంటున్నారు భగవత్పాదులవారు.

ఆ పరమేశ్వరి ఎక్కడో లేదు శ్రీచక్రంలోనే ఉన్నది అంటున్నారు. శ్రీచక్రము అంటే శివశక్తుల సంగమస్థానమే తప్ప వేరు కాదు. ఇందులో మొత్తం తొమ్మిది ఆవరణలున్నాయి. వీటినే చక్రాలు అని కూడా అంటారు. వీటిలో నాలుగు శివచక్రాలు కాగా ఐదుశక్తి చక్రాలు. బిందువునందే పరమేశ్వరి ఉంటుంది. (శ్రీచక్రాన్ని గురించి **'చతుర్భి శ్రీకంఠై'** అనే 11వ శ్లోకంలో పూర్తిగా ఇవ్వబడుతుంది.) అందుకే భైరవయామళం, వామకేశ్వర తంత్రం మొదలైన గ్రంథాలలో

**బిందుస్థానం సుధాసింధుః పంచయోన్య స్సురద్రుమాః**
**తత్రైవనీప శ్రేణీచ తన్మధ్యే మణిమంటపం ॥**
**తత్ర చింతామణికృతం దేవ్యామందిర ముత్తమమ్**
**శివాత్మకే మహామంచే మహేశానోపబర్హణే ॥**
**అతిరమ్యతరే తత్ర కశిపుశ్చ సదాశివః**
**భృతకాశ్చ చతుష్పాదా మహేంద్రశ్చ పతద్గ్రహః ॥**
**తత్రాస్తే పరమేశానీ మహాత్రిపుర సుందరీ**
**శివార్క మండలం భిత్వా ద్రావయంతేందు మండలం ॥**

**తదుద్భూతామృతస్యందీ పరమానందనందితా**
**కులయోషికులం త్యక్త్వా పరం వర్షణమేత్యసా ॥**

ఇదంతా యోగమార్గం. ఆధారచక్రంలో నిద్రిస్తున్న కుండలినీశక్తిని గనక జాగృతం చేస్తే అది గ్రంథిత్రయాన్ని భేదించి, సహస్రారం చేరి, అమృతపుధారలు కురిపించి మళ్ళీ ఆధారచక్రం చేరి నిద్రావస్థలోకి వెడుతుంది. ఇదంతా **'మహీం మూలాధారే'** అనే తొమ్మిదవ శ్లోకంలో వివరించటం జరుగుతుంది.

పరమేశ్వరి ఎక్కడ ఉంటుంది అని అడిగినప్పుడు పార్వతికి ఈశ్వరుడు చెబుతున్నాడు.

**సుదాబ్దౌనందనోద్యానే రత్నమంటపమధ్యమాం**
**బాలార్కమండలాభాసాం చతుర్బాహుం త్రిలోచనాం ॥**
**పాశాంకుశ ధనుర్బాణం ధారయంతీం శివాం శ్రియే ॥**

సుధాబ్దిలో, నందనోద్యానంలో, రత్నమంటపం మధ్యన చేతులయందు ధనుర్బాణాలు, పాశము, అంకుశములతో బాలభానునిలాగా ప్రకాశిస్తున్నది.

లలితాసహస్రంలో 'సుమేరు మధ్య శృంగస్థా' నుంచి 'సుధాసాగరమధ్యస్థా' వరకు గల నామాలు ఆ పరమేశ్వరి నివాసస్థానాన్ని వివరిస్తున్నాయి.

**మహీం మూలాధారే కమపి మణిపూరే హుతవహం**
**స్థితం స్వాధిష్ఠానే హృది మరుత మాకాశ ముపరి**
**మనోఽపి భ్రూమధ్యే సకలమపి భిత్త్వా కులపథం**
**సహస్రారే పద్మే సహ రహసి పత్యా విహరసే ॥** **9**

ఓ తల్లీ ! భగవతీ ! నీవు మూలాధారంలో ఉన్న భూతత్త్వాన్ని, స్వాధిష్ఠాన చక్రంలోని అగ్నితత్త్వాన్ని, మణిపూరచక్రంలోని జలతత్త్వాన్ని, అనాహతచక్రంలోని వాయుతత్త్వాన్ని, విశుద్ధచక్రంలోని ఆకాశతత్త్వాన్ని, ఆజ్ఞాచక్రంలోని మనస్తత్త్వాన్ని, సుషుమ్నా మార్గం గుండా ఛేదించి, సహస్రారం చేరి, అక్కడ నీ భర్త అయిన సదాశివునితో కలిసి విహరిస్తుంటావు.

ఈ శ్లోకంలో కుండలినీశక్తిని వివరిస్తున్నారు శంకరభగవత్పాదులవారు. అసలు ఎవరీ కుండలినీ శక్తి ? ఈవిడే పరమేశ్వరి. ఆ పరమేశ్వరి ఆధారచక్రంలో కుండలినీరూపంలో ఉంటుంది. **వామకేశ్వర తంత్రం, బహురూపాష్టకాలలో**

**ధ్యాయేత్ కుండలినీందేవీం స్వయంభూలింగవేష్టితాం**

**శ్యామాం సూక్ష్మాం సృష్టిరూపాం సృష్టి స్థితి లయాత్మికాం**

**విశ్వాతీతాం జ్ఞానరూపాం చింతయే దూర్ధ్వ వాహినీం ॥**

**"ధ్యాయేత్ కుండలినీం దేవీం ఇష్టదేవస్వరూపిణీం**

**సదాషోడశ వర్షీయాం పీనోన్నత పయోధరాం**

**నవయౌవ్వన సంపన్నాం సర్వాభరణ భూషితాం**

**పూర్ణచంద్రప్రభాం రక్తాం సదా చంచలలోచనాం"**

కంకాళమాలినీ తంత్రంలో

**కోటిచంద్ర ప్రతీకాశాం పరబ్రహ్మ స్వరూపిణీం**

**చతుర్భుజాం త్రినేత్రాంచ వరదాభయకరాం తథా**

**తథా పుస్తక వీణాంచ ధారిణీం సింహవాహినీం**

**గచ్ఛంతీం స్వాపనాం భీమాం నానారూప ధరాత్మికాం"**

ఆమె స్వయంభూలింగానికి మూడున్నరచుట్లుగా చుట్టుకుని అధోముఖంగా, సూక్ష్మరూపంలో ఉంటుంది. ఆమె నవయవ్వనసంపన్న, సర్వాభరణభూషిత, సృష్టి, స్థితి, లయకారిణి. **రుద్రయామళంలో** కుండలినీ స్తవము ఉన్నది.

**జన్మోద్ధార నిరక్షీయ తరుణీ వేదాది బీజాదిమా**

**నిత్యంచేతసి భావ్యతే భువికథా సద్వాక్య సంచారిణీ**

**మాంపాతు ప్రియదాన భావకపదం సంఘాతయే శ్రీధరే**

**ధాత్రి త్వం స్వయమాది దేవవనితా దీనాతి దీనం పశుమ్ ॥**

ఓ పరాత్పరీ । శివుని అర్ధాంగి అయిన ఓ పార్వతీ ! నీవు సర్వకాల సర్వావస్థల యందు ఉపనిషద్వాక్యములందు సంచరిస్తుంటావు. ఓంకార స్వరూపిణివి.

నిత్యయవ్వనవు. మానవుల జన్మలనుద్ధరించటానికి సదా మెలకువతో ఉంటావు. అటువంటి నిన్ను ఎల్లప్పుడు నేను సేవిస్తూ ఉంటాను.

**రక్తభామృత చంద్రికా లిపిమయీ సర్పాకృతిర్నిద్రితా**
**కుండల్యా కులమార్గ ముక్తనగరీ మాయాకుమార్గాశ్రియా**
**యద్యేవం భజతి ప్రభాత సమయే మధ్యాహ్న కాలేథవా**
**నిత్యం యః కులకుండలీ జప పదాంభోజం ససిద్ధోభవేత్ ॥**

ఓ తల్లీ ! నీవు రక్తవర్ణంతో ప్రకాశిస్తూ సర్పాకృతిలో నిద్రిస్తుంటావు. నేను త్రికాలములందు నిన్ను సేవిస్తుంటాను. నీవు జాగ్రదావస్థలోకి వచ్చినప్పుడు నీ కరుణాదృక్కులు నామీద ప్రసరింపచేయవలసినది. (కుండలినీ అష్టకం కొట్టాలి. రహస్యంలో ఉన్నది) అంటూ ఎనిమిది శ్లోకాలలో కుండలినీశక్తిని ప్రార్థించారు.

పరమేశ్వరి అర్చన రెండువిధాలుగా ఉంటుంది. 1. బాహ్యపూజ 2. అంతః పూజ

బాహ్యపూజ అంటే సాధకుడు తన ఎదురుగా దేవి ప్రతిమనుగాని, శ్రీచక్రంగాని ఉంచి, దేవత వేరు తాను వేరు అని భావించి, ఆమెను సేవించటం. ఇటువంటి పూజలు కేవలము కామ్యసాధన కోసం మాత్రమే చేస్తారు. బాహ్యపూజ చేసేవారికి మోక్షం లభించదు. అంటే బాహ్యవిషయాలయందు ఆసక్తి గల వారికి సాయుజ్యం సిద్ధించదు.

పూర్వకాలంలో ఒకసారి ఇంద్రుడికి బ్రహ్మతత్వాన్ని గురించి తెలుసుకోవాలనిపించింది. ఆ కాలంలో 'దధ్యుడు' అనే మహర్షి బ్రహ్మవిద్యలో, శ్రేష్ఠుడు అని పేరు పొందాడు. నిజంగానే బ్రహ్మజ్ఞాని. అందుకని ఇంద్రుడు దధ్యుడి దగ్గరకు వెళ్ళి "స్వామి ! నీవల్ల నాకు ఒక సహాయం కావాలి" అన్నాడు. వచ్చినవాడు దేవరాజైన ఇంద్రుడు, అందుచేత సరే అన్నాడు మహర్షి. సహాయం చేస్తాను అని మాట తీసుకున్న తరువాత చెప్పాడు ఇంద్రుడు "నాకు బ్రహ్మవిద్య కావాలి" అని

ఆ మాటలు విన్న దధ్యుడు కొంచెంసేపు మాట్లాడలేదు. అది చూసి మహర్షి ఏదో సంశయిస్తున్నాడు అని తెలుసుకుని "మహర్షీ! ఏమిటాలోచిస్తున్నావు ? నాకు బ్రహ్మవిద్యను చెబుతానని మాట ఇచ్చావు. చెబుతావా ! లేదా?" అన్నాడు.

ఆలోచించాడు మహర్షి. ఇంద్రుడు దేవతలరాజు. భోగలాలసుడు. నిరంతరం అప్సరాగణంతో క్రీడిస్తూ ఉంటాడు. అటువంటి వాడికి బ్రహ్మవిద్యా ? చెబితే అపాత్రదానం చెప్పకపోతే అసత్యపాపం. ఏం చెయ్యాలో పాలుపోలేదు మహర్షికి. మళ్ళీ ఇంద్రుడే అన్నాడు. "ఏం మహర్షీ ! బ్రహ్మవిద్య చెబుతానని మాటిచ్చావు. మాట నిలబెట్టుకుంటావా లేదా ?"

చేసేదేమీ లేక మర్నాడు ఉదయం మిగిలిన శిష్యులతో కలిసి రమ్మన్నాడు ఇంద్రుణ్ణి.

మరునాడు ఉదయం కౌపీనం ధరించి, దర్భలు చేత్తో పట్టుకుని, అందరితోపాటే వచ్చి కూర్చున్నాడు ఇంద్రుడు. దధ్యుడు చెప్పటం మొదలుపెట్టాడు.

"ఈ జగత్తంతా మిధ్య. కంటికి కనిపించేదేదీ నిజంకాదు. ఈ రాజ్యాలు, రాజులు, అధికారం, అప్సరసలు, సుఖాలు, భోగాలు ఏవీ నిజంకాదు" అన్నాడు.

ఆ మాటలు విన్న ఇంద్రుడు లేచి 'మహర్షీ ! నువ్వు అబద్ధం చెబుతున్నావు. ఏది అసత్యం ? నా రాజ్యమా ? నా సింహాసనమా ? అప్సరసలా ? కేవలం నన్ను ఎగతాళి చెయ్యటానికే ఈ మాటలు చెబుతున్నావు. ఇలాంటి మాటలు ఇంకొకసారి చెప్పావంటే నీ తల నరికివేస్తాను జాగ్రత్త" అని హెచ్చరించి అక్కడ నుంచి వెళ్ళిపోయాడు.

అతడి దృష్టిలో రాజ్యము, అధికారము, అప్సరసలు, సుఖాలు, భోగాలు ఇవన్నీ నిజమే. అటువంటి వారికి బ్రహ్మవిద్య అంటదు. ఆత్మసాక్షాత్కారం కాదు. వీరికి అధికారము, సుఖాలు మొదలైన ఐహికవాంఛలమీదనే మక్కువ. అందుకే వారు బాహ్యపూజ చేస్తారు. సనత్కుమార సంహితలో

**బాహ్యపూజా నకర్తవ్యా కర్తవ్యా బాహ్యజాతిభిః**
**సాక్షుద్రఫలదా న్రూణాం ఐహికార్థైక సాధనాత్**
**బాహ్యపూజరతాః కౌలాః క్షపణశ్చ కపాలికాః**
**దిగంబరాశ్చేతిహాసాః వామకా స్తంత్ర వాదినః ॥**

క్షుద్రమైన ఐహికఫలితాల కోసం కౌళులు, క్షపణకులు, కాపాలికులు, దిగంబరులు, ఇతిహాసులు, వామాచారులు మొదలైన తంత్రవాదులు మాత్రమే బాహ్యపూజ చేస్తారు అని చెప్పబడింది. వీరిలో

1. క్షపణికులు – స్త్రీ యోనిని పూజిస్తారు. పూర్వాదితంత్రాలు వీరికి ప్రమాణాలు
2. కాపాలికులు – పంచామృతతంత్రం వీరికి ప్రమాణం
3. దిగంబరులు – రూపభేదము, భూతోడ్డారము, నికుంతేశ్వరము మొదలైన ఎనిమిది తంత్రాలు వీరికి ప్రమాణాలు
4. ఇతిహాసులు – భైరవయామళం వీరికి ప్రమాణం గ్రంథం.
5. వామాచారులు– వామకేశ్వరతంత్రం వీరికి ప్రమాణం
6. కౌళాచారులు – పురుషార్ధాలలో అర్ధకామాలకే

ప్రాధాన్యత ఇచ్చేవారు కౌళులు. వీరికి బాహ్యపూజయే కాని అంతఃపూజ లేదు. వీరు ప్రత్యక్షంగా శ్రీచక్రాన్ని పూజిస్తారు. కౌళాగమాలుగా పిలువబడే అరవైనాలుగు తంత్రాలు వీరికి ప్రామాణికాలు. ఈ తంత్రాలను **చతుషష్ట్యాతంత్రైః** అనే 31వ శ్లోకంలో వివరించటం జరిగింది.

కౌళాచారులు షట్చక్రాల్లోని ఆధారచక్రాన్ని మాత్రమే పూజిస్తారు. కుః అంటే పృథివీతత్త్వము. అది షట్చక్రాలలోనూ ఏ చక్రమందుంటుందో, దాన్ని కులము అంటారు. ఇది ఆధారచక్రంలో ఉంటుంది. బాహ్యపూజ చేసే వారు కేవలము కామ్యసిద్ధి కోసమే చేస్తారు. అందుకే వీరు పృథివీతత్త్వాత్మకమైన ఆధారచక్రాన్ని పూజిస్తారు. కాబట్టి వీరి పూజను 'కౌళము' అంటారు. వీరి ఆచారాన్ని కౌళాచారము అంటారు. వీరు శ్రీచక్రాన్ని భూర్జరీపత్రము, పట్టువస్త్రము, బంగారము, వెండి, రాగి రేకులమీద వ్రాసి దాన్ని ఆరాధిస్తారు. లేదా పరమేశ్వరి ప్రతిమను ఎదురుగా ఉంచి దాన్ని ఆరాధిస్తారు. దీన్ని కౌళపూజ అంటారు.

షట్చక్రాల్లోని ఆధార, స్వాధిష్ఠానాలు అంధకారబంధురాలు. వాటియందు కౌళులకు మాత్రమే అధికారమున్నది. భైరవయామళంలో

**చతుర్భి శ్శివచక్రైశ్చ శక్తి చక్రైశ్చ పంచభిః**
**నవ చక్రైశ్చ సంసిద్ధం శ్రీచక్రం శివయోర్వపుః ॥**
**త్రికోణ మష్టకోణంచ దశకోణద్వయం తథా**
**చతుర్దశారం చైతాని శక్తిచక్రాణి పంచచః ॥**

**బిందుశ్చాష్టదళం పద్మం పద్మం షోడశపత్రకం**

**చతురస్రంచ చత్వారి శివచక్రాణ్యనుక్రమాత్ ॥**

నాలుగు శివచక్రాలు, ఐదు శక్తిచక్రాలు ఉన్న యంత్రాన్నే 'శ్రీచక్రము' అంటారు. దీనిలో త్రికోణము, అష్టకోణము, అంతర్దశారము, బహిర్దశారము, చతుర్దశారము అనే ఐదు శక్తిచక్రాలు. కాగా బిందువు, అష్టదళము, షోడశదళము, భూపురము అనే నాలుగు శివచక్రాలు.

గౌడపాదులవారు తమ **'సుభగోదయస్తుతి'**లోని 10వ శ్లోకంలో మానవ శరీరంలోని షట్చక్రాలకు, శ్రీచక్రంలోని తొమ్మిదిచక్రాలకు ఐక్యత ఉన్నది అని వ్రాశారు.

**త్రికోణం చాధారం త్రిపురవినుతే ష్టారమనఘే**

ఇందులో ఆధారచక్రానికి త్రికోణంతో ఐక్యత ఉన్నది అన్నారు. ఈ రకంగా ఆధారచక్రమే త్రికోణము. దానిలో బిందువున్నది. కౌళమతానుసారము త్రికోణమే బిందుస్థానము. ఆ బిందువే త్రికోణమందు ఆరాధింపతగ్గది. అందుకే కౌళులు త్రికోణాన్ని పూజిస్తారు. ఈ త్రికోణము రెండు రకాలుగా ఉంటుంది.

1) శ్రీచక్రంలో మధ్యన ఉన్నది. 2. స్త్రీ యొక్క ప్రత్యక్షయోని. కౌళాచారుల్ని రెండు రకాలుగా చెప్పవచ్చు. 1) పూర్వకౌళులు 2) ఉత్తరకౌళులు

పూర్వకౌళులు శ్రీచక్రాన్ని భూర్జరీ పత్రము, పట్టువస్త్రము, బంగారము, వెండి, రాగిరేకుల మీద వ్రాసి, దానిలోని త్రికోణాన్ని పూజిస్తారు. కొందరైతే ప్రత్యేకంగా త్రికోణము, దానిమధ్యన బిందువు మాత్రమే గీసి, దానిని పూజిస్తున్నారు. ఈ రకంగా త్రికోణము, అందులో బిందువు వేసిన ఉంగరాలు కూడా బయట లభిస్తున్నాయి.

ఉత్తరకౌళులు స్త్రీ యొక్క ప్రత్యక్షయోనిని పూజిస్తారు. వీరిలో కొంతమంది స్త్రీని దిశమొలగా నిలబెట్టి యోనిని పూజిస్తే, మరికొంతమంది స్త్రీని తలక్రిందులుగా నిలబెట్టి యోనిపూజ చేస్తారు.

ఈ రెండురకాల పూజలు బాహ్యపూజలే. అందుచేత వారికి ఆధారచక్రమే పూజనీయము. అందులో ఉండే కుండలినీ శక్తినే 'కౌళిని' అంటారు. త్రికోణ పూజలో కౌళినియే ఉపాస్య.

ఆధారచక్రంలో కుండలినీశక్తి సర్పాకారం ధరించి తోకను నోటితో కరచి పట్టుకున్నట్లుగా నిద్రావస్థలో ఉంటుంది. నిద్రావస్థలో ఉన్నప్పటికీ కౌళాచారంలో కుండలినీశక్తి పూజింపదగినదే. అందుకే పూజను తామిశ్రము అంటారు. ఆధార స్వాధిష్ఠానాలు అంధకారబంధురాలు. వాటి మీద కౌళాచారులకు మాత్రమే అధికారమున్నది. కుండలినీప్రబోధం ఎప్పుడు జరుగుతుందో, ఆ క్షణంలోనే కౌళులకు ముక్తి కలుగుతుంది. అందుకే వీరి నిక్షణముక్తులు అంటారు. కౌళులకు త్రికోణంలో భైరవీభైరవులు పూజనీయులు.

**జపాకుసుమ సంకాసౌ మధుఘూర్ణిత లోచనౌ**

**జగతః పితరౌవందే భైరవీ భైరవాత్మకౌ ॥**

సాధకులు వీరితో ఐక్యము పొందటమనేది ముఖ్యం. అందుచేతనే బిందువును అర్చించేటప్పుడు స్త్రీపురుషులు భైరవాకారమైన దిగంబరత్వాన్ని ఆశ్రయించి మధు, మత్స్య, మాంసాలతో సమారాధన చేస్తారు.

ఉత్తరకౌళులు స్త్రీయోనిలోని మన్మథఛత్రాన్ని బిందువుగా భావించి పూజిస్తారు. అందుచేతనే అవి అవైదికము, నీతిబాహ్యము అని చెప్పబడింది.

కౌళులు పరమేశ్వరుణ్ణి 'నవాత్మకుడు' లేదా 'నవవ్యూహాత్మకుడు' అంటారు. ఈ నవవ్యూహాలను 'కామకలావిద్య'లో వివరించబడ్డాయి.

**కాలవ్యూహ కులవ్యూహో నామవ్యూహ స్తథైవచ**

**జ్ఞానవ్యూహ స్తథా చిత్త వ్యూహస్యా స్తదనంతరమ్ ॥**

**నాదవ్యూహ స్తథా బిందువ్యూహస్యా స్తదనంతరమ్**

**కలావ్యూహ స్తథా జీవవ్యూహ స్యాత్ ఇతితే నవే ॥**

1. కాలవ్యూహము – నిమిషము మొదలు కల్పాంతము వరకు ఉన్న కాలసముదాయము
2. కులవ్యూహము – ఎరుపు, తెలుపు, నీలము మొదలైన రంగులను తెలిపేది
3. నామవ్యూహము – జగత్తులోని ప్రాణులపేర్లను తెలిపేది.
4. జ్ఞానవ్యూహము – ఇంద్రియాల ద్వారా ప్రపంచాన్ని గురించి తెలుసుకునే జ్ఞానము

5. చిత్తవ్యూహము – మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము, మహతత్త్వము అనే అహంకారపంచకమును గురించి తెలిపేది.

6. నాదవ్యూహము – రాగము, ఇచ్ఛ, కృతి, ప్రయత్నము, మాయ, శుద్ధవిద్య, మహేశ్వరుడు, సదాశివుడు, పరా, పశ్యంతి, మధ్యమ, వైఖరిల గురించి తెలిపేది.

7. బిందువ్యూహము – ఆధారాది షట్చక్రాల సంఘము.

8. కళావ్యూహము – యాభైకళలైన వర్ణస్వరూపములైన అక్షరాల గురించి తెలిపేది.

9. జీవవ్యూహము – భోక్తలగు జీవుల సమూహము.

**నవవ్యూహాత్మకో దేవః పరానంద పరాత్మకః ।**
**నవాత్మా భైరవోదేవో భుక్తి ముక్తి ప్రదాయకః ॥**

**పరానంద పరాశక్తిః చిద్రూపానందభైరవీ ।**
**తయోర్యదా సామరస్యం జగదుత్పద్యతే తదా ॥**

పరమానందుడు, పరాత్మకుడు అయిన భైరవుడు నవవ్యూహాత్మకుడు. ఆయనే భుక్తి, ముక్తి ప్రదాత. పరమానందమైన పరాశక్తి చిద్రూప అయిన ఆనంద ఆనందభైరవి అవుతుంది. ఈ భైరవీభైరవులకు సామరస్యము ఎప్పుడు కలుగుతుందో, అప్పుడు జగదుత్పత్తి జరుగుతుంది.

ఇది కౌళాచారము. లలితాసహస్రంలో **కులాంగనా** (92వ నామం) దగ్గర నుంచీ **కులయోగినీ** (95వ నామం) కౌళాచారాన్ని వివరించటం జరిగింది. ఏది ఏమైనప్పటికీ కౌళాచారంలో నీతిబాహ్యము, వేదదూరము అయిన పద్ధతులను ఆచరించరాదు.

దేవీపూజలో రెండు రకాల ఆచారాలున్నాయని చెప్పుకున్నాం. 1) కౌళాచారము 2) సమయాచారము. ఇప్పటిదాకా కౌళాచారాన్ని వివరించాము. ఇక సమయాచారం చూద్దాం. లలితాసహస్రంలోని 868వ నామము **'అంతర్ముఖసమారాధ్యా'.** ఆత్మాభిముఖమైన చిత్తప్రవృత్తి గలవారిచే బాగుగా ఆరాధింపబడేది. అంతఃపూజ

అంటే మన శరీరంలోనే ఆ పరదేవతని అర్చించటం. ఇదే సమయాచారము. అద్వైతసిద్ధాంతంలో **'అహంబ్రహ్మాస్మి'** నేనే పరబ్రహ్మస్వరూపాన్ని అని చెప్పబడుతోంది.

నాలుగు వేదాలకు కలిపి 1180 ఉపనిషత్తులు ఉన్నాయి. వాటిలో ముఖ్యమైనవి 108. వాటిలో అత్యంతముఖ్యమైనవి పది. వీటికి శంకరభగవత్పాదులవారు వ్యాఖ్య కూడా వ్రాశారు. ఉపనిషత్తులలో మొత్తం నాలుగు మహావాక్యాలున్నాయి. అవి

| | | |
|---|---|---|
| 1. ప్రజ్ఞానంబ్రహ్మ | ఐతరేయోపనిషత్తు | ఋగ్వేదము |
| 2. అహంబ్రహ్మాస్మి | బృహదారణ్యకం | శుక్లయజుర్వేదము |
| 3. తత్త్వమసి | ఛాందోగ్యోపనిషత్తు | సామవేదము |
| 4. అయమాత్మాబ్రహ్మ | మాండూక్యోపనిషత్తు | అధర్వణవేదము |

ఈ మహావాక్యాలలో జగత్తంతా పరబ్రహ్మస్వరూపం. ఆ పరబ్రహ్మ ఎవరో కాదు నువ్వే అని ఉపనిషత్తులు పరబ్రహ్మను ప్రతిపాదించాయి.

ఈ రకంగా మహావాక్యాలలో చెప్పబడిన పరబ్రహ్మస్వరూపాన్ని నేనే. చరాచర జగత్తంతా నాలోనే ఉన్నది. నానుంచే సృష్టించబడి, మళ్ళీ నాలోనే లీనమవుతున్నది అని గ్రహించి, తనలోని పరబ్రహ్మను అర్చించేవారే అంతరారాధకులు. సనత్కుమార సంహితలో

**అంతరారాధనపరా వైదికా బ్రహ్మవాదినః ।**
**జీవన్ముక్తాశ్చరంత్యేతే త్రిషులోకేషు సర్వదా ॥**

వైదికవిధానంలో పరమేశ్వరుని ఆరాధించేవారు బ్రహ్మవాదులు. వీరు అంతరారాధన చేస్తారు. వీరు జీవన్ముక్తులై త్రిలోకాలయందు సంచరిస్తుంటారు.

సమయమతంలో ప్రధానమైనది కైవల్యప్రాప్తి. కర్మకాండలవల్ల మోక్షం సిద్ధించదు అని వీరు నమ్ముతారు. జీవబ్రహ్మైక్యమే వీరి సిద్ధాంతము. వీరికి 'శుభాగపంచకము' అని పిలువబడే సనక, సనందన, సనత్కుమార, వశిష్ఠ, శుక సంహితలు ప్రమాణాలు. సమయాచారులకు బాహ్యపూజలేదు. అంటే వారు శ్రీచక్రాన్నిగాని, దేవిప్రతిమనుగాని వేరుగా అర్చించరు. చంద్రజ్ఞానవిద్యలో చెప్పినట్లుగా

**సూర్యమండల మధ్యస్థాం దేవీం త్రిపుర సుందరీం ।**

**పాశాంకుశ ధనుర్బాణాన్ ధారయంతీం ప్రపూజయేత్ ॥**

సూర్యమండలము మధ్యన ఉన్న ఆ త్రిపురసుందరిని, పాశము, అంకుశము, ధనుర్బాణాలు ధరించిన దేవిని అర్చించాలి.

సమయాచారులలో కొందరు బాహ్యపూజ చేస్తారు. అంతఃపూజలో మంత్రానికి ఋషి, ఛందస్సు మొదలైనవి అవసరంలేదు. ఇవన్నీ కేవలము బాహ్యపూజలోనే కావాలి.

సమయాచారులు శివశక్తులను సమయుడు, సమయ అంటారు. సమయ అంటే శివునితో ఐదు రకాలుగా సామ్యము గల శక్తి అని అర్థము. అలాగే శివుడు. సామ్యము అంటే పోలిక. ఈ రకంగా శివశక్తులకు సామ్యము ఉన్నది అని వీరి నమ్మకము. అందుకే వీరి ఆచారాన్ని **'సమయాచారము'** అంటారు. వీరి భావనలో శివశక్తులు ఐదు రకాలుగా పోలిక కలిగి ఉంటారు.

1. అధిష్ఠానసామ్యము – శివశక్తులు ఒకే స్థానాన్ని అధిష్ఠించి ఉండటము
2. అనుష్ఠానసామ్యము – ఇద్దరూ ఒకే పనిలో నిమగ్నం కావటము
3. అవస్థాసామ్యము – ఇద్దరూ ఒకే అవస్థలో ఉండటము
4. రూపసామ్యము – ఇద్దరూ ఒకే రూపంలో ఉండటము
5. నామసామ్యము – ఇద్దరి పేర్లు ఒకే రకంగా ఉండటము

షట్చక్రాల్లోని ప్రతిచక్రంలోనూ శివాశివులకు ఈ రకంగా సామ్యము చెప్పబడింది.

ఆధారచక్రంలో :

1. శివాశివులిద్దరికీ ఆధారచక్రమే అధిష్టానము. ఇది అధిష్టానసామ్యము.

2. ఇద్దరూ ఇక్కడ నాట్యం చేస్తుంటారు. ఇది అనుష్ఠానసామ్యము

3. శివశక్తులిద్దరూ జగత్తును సృష్టించే కార్యక్రమంలో నిమగ్నమై ఉంటారు. ఇది అవస్థాసామ్యము.

4. ఇద్దరూ ఎర్రని రంగులో ఉంటారు. ఇది రూపసామ్యము

5. వీరికి భైరవి, భైరవుడు అని పేర్లు. ఇది నామసామ్యము.

ఇదే విధంగా షట్చక్రాలలోనూ పంచవిధసామ్యము కలిగి ఉంటారు. సహస్ర కమలమే బైందవస్థానము. దాని మధ్య ఉండే చంద్రమండలమే చతుష్కోణము. దాని మధ్య ఉండే బిందువులో శివశక్తులు కలిసి సాదాక్యకళగా ఉంటారు.

సమయాచారుల దృష్టిలో చతుర్విధైక్యసంధానమే భగవతికి సమారాధన, చతుర్విధైక్యసంధానము అంటే

**పిండబ్రహ్మాండయోరైక్యం లింగసూత్రాత్మనోరపి ।**

**స్వాపావ్యాకృతి కారైక్యం క్షేత్రజ్ఞ పరమాత్మనో ॥**

1. పిండబ్రహ్మాండములకు ఐక్యము
2. లింగసూత్రాలకు ఐక్యము
3. స్వాపావ్యాకృతులకు ఐక్యము
4. క్షేత్రజ్ఞపరమాత్మలకు ఐక్యము

చతుర్విధైక్యసంధానము చేసిన యోగి శివశక్తిభావనచేత తాదాత్మ్యము పొందుతాడు. కాదిమతంలో

**మూలాది బ్రహ్మరంధ్రాంతం స్ఫురద్విద్యుల్లతా కృతిమ్ ।**

**ధ్యాయేత్కుండలినీం దేవీం త్వద్విద్యాక్షర రూపిణీం ॥**

**షట్చక్ర భేదినీం దేవీం తాంచ బిందుత్రయాత్మికామ్ ।**

**తాం చాప్యర్ధకలారూపాం చింతయే త్పద్మకాననే ॥**

**ఏవం భావన యాజుష్టః పరమానంద నిర్భరః ।**

**సంసార సాగరం ధీమాన్ గోష్పదీకురుతే శివే ॥**

ఆధారచక్రం నుంచి బయలుదేరి సహస్రారం చేరి ఆ దేవి సాక్షాత్కారం పొందగలిగినవాడు సంసారసాగరాన్ని తేలికగా దాటగలుగుతాడు. సుభగోదయంలో

**మూలాది బ్రహ్మరంధ్రాంతం మూలవిద్యాం విభావయేత్**

**ఉద్యదాదిత్య సంకాశాం తటిత్కోటి సమప్రభాం**

**తత్ప్రభాపటల వ్యాప్తం శరీరమపి చింతయేత్ ॥**

షట్చక్రాలయందు ఎవరైతే ఆ దేవిని ధ్యానిస్తాడో, అతడికి కోట్లకొలది సూర్యుల కాంతితో ప్రకాశిస్తున్న ఆ పరమేశ్వరి సాక్షాత్కరిస్తుంది.

గురుకటాక్షవీక్షణా మహిమవల్ల జనించిన మహావేధ కారణంగా భగవతి, సాధకుడి ఆధారస్వాధిష్ఠానాలను భేదించుకుని మణిపూరం చేరుతుంది. అక్కడ ఆమెకు అర్ఘ్యపాద్యాదులిచ్చి షోడశోపచారవిధిని మానసికంగా పూజించాలి. తరువాత ఆమె అనాహతానికి చేరుతుంది. అక్కడ ఆమెకు ధూప, దీప, నైవేద్య, హస్త ప్రక్షాళన వరకు సేవ చెయ్యాలి. అప్పుడు ఆ దేవి విశుద్ధచక్రం చేరి సింహాసనారూఢయై చెలులతో ముచ్చటిస్తూ ఉంటుంది. అక్కడ దేవిని విశుద్ధచక్రంలోని పదహారు దళాలలోని చంద్రకళలతో పూజించాలి. తరువాత ఆమెను ఆజ్ఞాచక్రం చేర్చి నీరాజనాదులచే సంతోషపెట్టాలి. ఆ తరువాత దేవి విద్యుల్లతలాగా సహస్రారంలో ప్రవేశించి, క్షీరసాగరంలోని మణిద్వీపంలో, కదంబవనంలోని చింతామణిగృహంలో సదాశివునితో కలిసి ఉంటుంది. అప్పుడు తెరను ప్రసరింపచేసి మరల మూలాధారం ప్రసరించే వరకు సాధకుడు వేచి ఉండాలి. ఇది **సమయమత రహస్యము.** యోగసాధ్యము.

లలితా సహస్రంలోని 96, 97, 98 నామాలలో **(అకులా, సమయాంతస్థా, సమయాచార తత్పరా)** సమయాచారాన్ని వివరించటం జరిగింది. ఆధారచక్రంలో నిద్రావస్థలో ఉన్న కుండలినీశక్తిని నిద్రలేపి, సహస్రారానికి చేర్చి, మళ్ళీ ఆశక్తిని ఆధారచక్రానికి చేర్చటమే సమయాచారము.

శరీరంలో షట్చక్రాలున్నాయి. అవి

**మూలాధారం గుదస్థానం । స్వాధిష్ఠానం తు మేహనం**

**నాభిస్తు మణిపూరాఖ్యం । హృదయంచాబ్జు మనాహతం**

**తాలూమూలం విశుద్ధాఖ్యం । ఆజ్ఞాంచ నిటలాంబుజం ॥**

**తస్మాదూర్ధ్వమధోముఖం । వికసితం పద్మం సహస్రచ్ఛదం**

**నిత్యానందమయీ సదాశివపురీ । శక్తే నమశ్శాశ్వతం ॥**

మూలాధారచక్రము – గుదస్థానంలో ఉన్నది

స్వాధిష్ఠానచక్రము – లింగస్థానంలో ఉన్నది

| | | |
|---|---|---|
| మణిపూరచక్రము | – | నాభిస్థానంలో ఉన్నది |
| అనాహతచక్రము | – | హృదయస్థానంలో ఉన్నది |
| విశుద్ధిచక్రము | – | కంఠస్థానంలో ఉన్నది |
| ఆజ్ఞాచక్రము | – | భృకుటి స్థానంలో ఉన్నది |
| సహస్రదళపద్మము | – | వీటన్నింటికీ పైన ఉన్నది |

ఈ చక్రాలలో ఒక్కొక్క దానికి ఒక్కొక్క తత్త్వమున్నది.

| | | | |
|---|---|---|---|
| 1. | ఆధారచక్రము | – | భూతత్త్వాత్మకమైనది |
| 2. | స్వాధిష్ఠానము | – | అగ్నితత్త్వాత్మకమైనది |
| 3. | మణిపూరము | – | జలతత్త్వాత్మకమైనది |
| 4. | అనాహతము | – | వాయుతత్త్వాత్మకమైనది |
| 5. | విశుద్ధిచక్రము | – | ఆకాశతత్త్వాత్మకమైనది |
| 6. | ఆజ్ఞాచక్రము | – | మనస్తత్త్వాత్మకమైనది |

వీటన్నింటిపైన సహస్రదళపద్మమున్నది. అదే సహస్రారము. అక్కడ పరమేశ్వరి పరమశివునితో కలసి ఉంటుంది.

మానవశరీరంలో బ్రహ్మనాడి (సుషుమ్నానాడి)కి రెండువైపులా ఆధారచక్రం నుంచి ముక్కురంధ్రం దాకా ఇడా, పింగళా, నాడులు వ్యాపించి ఉంటాయి. వీటిలో ఎడమవైపు ఉండేది ఇడానాడి. ఇది చంద్రనాడి. పిత్రుయానము, కుడివైపు ఉండేది పింగళానాడి. ఇది సూర్యనాడి. దేవయానము. ఈ నాడులలో సూర్యచంద్రులు ఉచ్ఛ్వాసనిశ్వాసల రూపంలో తిరుగుతుంటారు. ముందుగా చంద్రుడు తన కిరణాల ద్వారా అమృతాన్ని ప్రసరింపచేస్తూ వెడుతుంటాడు. ఆ వెనుక వచ్చే సూర్యుడు ఆ అమృతపుబిందువులను హరించి వేస్తుంటాడు. ఈ రకంగా వీరిద్దరూ తిరుగుతూ ఆధారచక్రంలో కలుస్తారు. చంద్రసూర్యులు కలిసిన రోజు అమావాస్య అంటే వారు ఆధారచక్రంలోకి వచ్చిన రోజు అమావాస్య. ఆ రోజు సమయాచారంలో కుండలినికి అర్చన ఉండదు. కాని కౌళులు మాత్రం ఆ రోజున విశేషఅర్చన చేస్తారు. సూర్యచంద్రులు ఆధారచక్రంలో కలిసిన రోజు అమావాస్య కాబట్టే ఆధార స్వాధిష్ఠానాలు అంధకారబంధురాలు అనబడతాయి.

చంద్రునికిరణాలనుండి జాలువారే అమృతపుబిందువులను ఆహారంగా తీసుకుని కుండలినీశక్తి సుఖంగా నిద్రిస్తూ ఉంటుంది. ఇప్పుడు దాన్ని జాగృతం చెయ్యాలి. ఎప్పుడైతేదానికి ఆహారం దొరకదో అప్పుడు ఆ శక్తి జాగృతమవుతుంది. అంటే చంద్రకిరణాలనుంచి అమృతపుబిందువులు జాలువారకూడదన్న మాట. అలా జరగాలంటే సూర్యచంద్రుల గమనం ఆగిపోవాలి. అంటే ఉచ్ఛ్వాసనిశ్వాసలను బంధించాలి. సాధకుడు ఎప్పుడైతే శ్వాసను బంధించాడో, అప్పుడు చంద్రగమనం ఆగిపోతుంది. దాంతో చంద్రకిరణాల నుండి అమృతపు జల్లులు జాలువారవు. కుండలినీ శక్తికి ఆహారం దొరకదు. నిరాహార అయిన కుండలిని జాగృతమై బుసలు కొడుతూ ఊర్ధ్వముఖంగా ప్రయాణంచేసి, సహస్రారం చేరుతుంది.

మూలాధారచక్రంలో కుండలినీశక్తి నిద్రావస్థలో ఉంటుంది. ఇక్కడ నుంచే సుషుమ్నానాడి బయలుదేరుతుంది. కుండలినీశక్తి నిద్రావస్థలో ఉన్నంతవరకు సిరిసంపదలు, భోగభాగ్యాలు, భార్యాపిల్లలు ఇదే నిత్యము అనిపిస్తుంది. కనిపించని పరబ్రహ్మ కోసం ప్రాకులాడటం అనవసరమనిపిస్తుంది. ఆ కుండలినీశక్తి మేల్కొనగానే మాయ తొలగిపోతుంది. నేను నాది అనే భ్రాంతి నశిస్తుంది.

షట్చక్రాలలో రెండు. రెండుచక్రాల తరువాత ఒక గ్రంథి ఉంటుంది.

ఆధారస్వాధిష్ఠానాల తరువాత - బ్రహ్మగ్రంథి
మణిపూరఅనాహతాల తరువాత - విష్ణుగ్రంధి
విశుద్ధిఆజ్ఞా చక్రాల తరువాత - రుద్రగ్రంధి

ఉంటాయి. వీటినే గ్రంధిత్రయము అంటారు. శ్రీచక్రంలోని మూడు వృత్తాలు, పంచదశి మహామంత్రంలోని మూడు హ్రీంకారాలు ఈ గ్రంధులతో పోల్చబడ్డాయి. 'గ్రంధి' అంటే చిక్కుముడి, కణుపు, అవయవ సంధి అని అర్ధం. చిక్కుముడిగా ఉండి విడదీయటానికి వీలుకాని స్థితిని గ్రంధి అంటారు. జాగృతమైన కుండలినీ శక్తి సుషుమ్నద్వారా బయలుదేరి ఆధారస్వాధిష్ఠానాలు దాటిన తరువాత బ్రహ్మగ్రంధిని చేరుతుంది. బ్రహ్మ అంటే సంకల్పము, సృష్టి, ప్రపంచ వ్యవహారానికి మూలమైన విషయాలు. ఇవన్నీ ఇక్కడ చిక్కుముడిగా పడి ఉంటాయి. మానవుడు నేను నాది అనే మాయలో పడి కొట్టుమిట్టాడుతుంటాడు. కుండలినీ శక్తిని నిద్రలేపి ఊర్ధ్వముఖంగా నడిపిస్తే ముందుగా అది బ్రహ్మగ్రంధిని భేదిస్తుంది. అంటే సాధకుడికి

నేను, నాది, అనే భావం పోగొట్టి స్వస్వరూపజ్ఞానం కలిగిస్తుంది. సృష్ట్యాది సంబంధాలను భేదించి పునర్జన్మరహితమైన ముక్తిని ప్రసాదిస్తుంది. అదే **బ్రహ్మగ్రంథి భేదనము.** ఈ రకంగా బ్రహ్మగ్రంథిని భేదించిన తరువాత మణిపూర, అనాహతా చక్రాలను దాటి విష్ణుగ్రంథిని భేదిస్తుంది. అంటే పోషణకు సంబంధించిన సర్వజీవుల పాలనావ్యవహారము పోషణ అనే భావాలు నశించటమే విష్ణుగ్రంథి భేదన. సాధకుడికి తనవల్లనే ఈ జగత్తంతా నడుస్తోందనే భావన నశిస్తుంది. అహంకారంవల్ల తానే ఈ పనులన్నింటికీ కర్తను అని భావిస్తాడు. ఈ భావన వల్ల ఆత్మానందం పొందటానికి ఆటంకం ఏర్పడుతుంది. ఆ భావనలు వదలటానికే **విష్ణుగ్రంథి భేదన.** విష్ణుగ్రంథిని భేదించిన తరువాత విశుద్ధి, ఆజ్ఞాచక్రాలను దాటి రుద్రగ్రంథిని చేరుతుంది. రుద్రుడు లయకారకుడు. కాబట్టి రుద్రగ్రంథిని భేదించినట్లైతే సర్వాన్నీ లయంచేసి సాధకుడికి ఆ దేవి అమృతత్త్వాన్ని ప్రసాదిస్తుంది. ఈ రకంగా అమృతత్త్వాన్ని పొందటమే రుద్రగ్రంథి భేదన.

మట్టితోను, శిలలతోను, లోహంతోనూ తయారుచేయబడిన విగ్రహాలు కాని, పుణ్యనదీ స్నానాలు కాని, క్షేత్రదర్శనం కాని మానవుణ్ణి ఉద్ధరించటానికి చాలాకాలం పడుతుంది. **యోగీనాం దర్శనం పుణ్యం స్పర్శనం పాపనాశనం** కాని గ్రంథిత్రయాన్ని భేదించిన యోగులను దర్శించినంత మాత్రం చేతనే పుణ్యం కలుగుతుంది. వారిని స్పృశించినంత మాత్రం చేతనే సర్వపాపాలు హరిస్తాయి.

కుండలినీశక్తికి మూడుదశలున్నాయి అన్నారు గౌడపాదులవారు తమ సుభగోదయస్తుతిలోని 6వ శ్లోకంలో

**కుమారీయన్మంద్రం ధ్వనతిచ తతో యోషిదపరా**
**కులం త్యక్త్వా రౌతి స్ఫుటతిచ మహాకాలభుజగీ ।**
**తతః పాతివ్రత్యం భజతి దహరాకాశకమలే**
**సుఖాసీనా యోషా భవసి భవ సీత్కార రసికా ॥**

కుండలినీశక్తికి మూడు దశలున్నాయి. మొదటిది నిద్రావస్థ. ఈ స్థితిలో కుండలిని సర్పాకారం ధరించి తోకను నోటితో కరచి పట్టుకుని ఆధారచక్రంలో నిద్రిస్తూ ఉంటుంది. సాధకుడు ప్రాణాయామం చేసి నిద్రావస్థలో ఉన్న కుండలిని

మేల్కొల్పాలి. అప్పుడు అది మంద్రస్వరంతో ఫూత్కారం చేస్తూ, ఊర్ధ్వముఖంగా బయలుదేరి గ్రంధిత్రయాన్ని భేదిస్తుంది. ఇది రెండవఅవస్థ. రుద్రగ్రంధిని భేదించిన తరువాత సహస్రారం చేరి, ప్రౌఢయై తన పతి అయిన శివునితో కలసి విహరిస్తుంది. ఇదిమూడవ అవస్థ. ఈ రకంగా కుండలినికి మూడు అవస్థలు లేదా దశలున్నాయి. అవి

1. నిద్రావస్థ 2. ప్రయాణావస్థ 3. సుఖావస్థ. వీటినే 1. కౌమారావస్థ 2. యోషిదవస్థ 3. పతివ్రతావస్థ అని కూడా అంటారు.

బ్రహ్మరంధ్రానికి కొద్దిగా దిగువస్థానంలో సహస్రదళపద్మమున్నది. అది పూర్ణచంద్రునిలాగా ప్రకాశిస్తూ ఉంటుంది. దాని కాంతికిరణాలు సూర్యకిరణాలలాగా ప్రకాశిస్తూ ఉంటాయి. అక్కడ అ నుంచి క్ష వరకు సర్వవర్ణములు ఉంటాయి. సహస్రారము అనేది ఎనిమిదిదళాలు కలిగిన పద్మము దీనిలో ఎనిమిది దిక్కులకు ఎనిమిదిదళాలుంటాయి. ఒక్కొక్క దళంలోను నూట ఇరవై ఐదు దళాలుంటాయి. ఈ రకంగా మొత్తం వెయ్యిదళాలుంటాయి. ఇందులోని ఎనిమిదిదళాలు ఎనిమిది దిక్కులకు తిరిగి ఉంటాయి. సహస్రదళపద్మంలోని ఒక్కొక్క భాగము, మానవునిలోని ఒక్కొక్క లక్షణాలనికీ ప్రతీక.

| | | | | | |
|---|---|---|---|---|---|
| తూర్పుదిక్కు | - | సద్బుద్ధి | ఉత్తరం | - | సురతమునందు ఆసక్తి |
| ఆగ్నేయం | - | నిద్ర, దప్పిక | | | |
| దక్షిణం | - | క్రూరబుద్ధి | ఈశాన్యం | - | దానగుణం |
| నైరుతి | - | తాపబుద్ధి | పద్మాంతరాళం | - | ఇహలోక విముక్తి |
| పడమర | - | విలాసము | కేసరములు | - | మెలకువ |
| వాయువ్యము | - | నడచుట మొ॥ విషయములు | తామరదుద్దు | - | కల |
| | | | దుంప | - | నిద్ర |

సహస్రదళపద్మము చంద్రమండలము. అక్కడ కళంకరహితుడైన చంద్రుడున్నాడు. అతడికి వృద్ధిక్షయాలుండవు. అతడు నిత్యము షోడశకళాయుక్తుడు. ఆ చంద్రమండలం మధ్యన త్రికోణమున్నది. దానియందు మహాశూన్యమున్నది. దానిని దేవతలు రహస్యంగా సేవిస్తుంటారు. **'షట్చక్ర నిరూపణం'లో తదంతః శూన్యం తత్సకలసురగణై సేవితంచాతిగుప్తం** ఆ మహాశూన్యాన్ని దేవతలు రహస్యంగా

సేవిస్తుంటారు. ఆ శూన్యము చాలా రహస్యమైనది. అతిప్రయత్నం మీద గాని దాన్ని పొందలేరు. అక్కడే పరమేశ్వరుడుంటాడు. ఆయన సర్వవ్యాపి. సర్వాత్మరూపి. అజ్ఞానము, మోహము పోగొట్టి, సాధకుడికి సుధాధారలచే ఆత్మజ్ఞానం కలిగిస్తాడు. అప్పుడు సాధకుడు, జీవాత్మ పరమాత్మల సమైక్యత సాధించి పరమహంస అవుతాడు.

సహస్రారంలో ప్రవేశించిన కుండలినీశక్తి సాధకుడికి సర్వతోముఖతేజస్సు కలిగించి, అనంతమైన ఆనందాన్నిస్తుంది. అతడికి వాక్సిద్ధి కలుగుతుంది. భూత భవిష్యద్వర్తమానాలు తెలుస్తాయి. అతడి సంకల్పం నెరవేరుతుంది.

ఈ రకంగా ఆధారచక్రంలో నిద్రావస్థలో ఉన్న కుండలినీశక్తి సహస్రారం చేరి అక్కడ తన పతియైన శివునితో కలిసి విహరిస్తుంది అంటున్నారు శంకర భగవత్పాదులవారు ఈ శ్లోకంలో ఈ విషయమంతా లలితాసహస్రంలోని 90వ నామము **'కులామృతైకరసికా'** నుంచి 111వ నామము **'బిసతంతు తనీయసీ'** దాకా వివరించబడింది. వామకేశ్వరతంత్రంలో ఈ విషయాన్ని వివరిస్తూ

**భుజంగాకారరూపేణ మూలాధారం సమాశ్రితా**

**శక్తిః కుండలినీనామ బిసతంతు నిభాశుభా ॥**

**మూలకందం ఫణాగ్రేణ దష్ట్వాకమలకందవత్ ।**

**ముఖేన పుచ్ఛం సంగృహ్య బ్రహ్మరంధ్రం సమాశ్రితా ॥**

అంటూ ఆరుశ్లోకాలలో కుండలినీశక్తి జాగృతం అయి సహస్రదళపద్మం చేరటాన్ని వివరించారు. ఈ విషయమంతా **"సుధాధారాసారై"** అనే పదవశ్లోకంలో వివరించటం జరుగుతుంది.

ఇక తత్త్వాలు గనక చూసినట్లైతే

ఈ తత్త్వాలు 56 అని 31 అని రకరకాలుగా చెబుతారు. కాని గౌడపాదులవారు తను 'సుభగోదయస్తుతి'లోని ఐదవ శ్లోకంలో

**పృథివ్యాపస్తేజః పవనగగనే తత్ప్రకృతయః**

**స్థితా స్తన్మాత్రాస్తా విషయదశకం మానసమితి**

**తతోమాయా విద్యా తదనుచ మహేశః శివ ఇతి**

**పరం తత్త్వాతీతం మిలిత వపురిందోః పరకళా ॥**

పంచభూతాలు-5, తన్మాత్రలు-5, జ్ఞానేంద్రియాలు-5, కర్మేంద్రియాలు-5, మనస్సు-1, మాయ, శుద్ధవిద్య, మహేశ్వరుడు, సదాశివుడు వెరసి 25 తత్త్వాలు. హిరణ్యగర్భుడనే సదాశివునితో కలిసిన శుద్ధవిద్యయే సాదాఖ్యకళ. అదే 26వ తత్త్వము. దీనినే పరా, చిద్రూప, కుండలిని అంటారు.

కాళిదాసు తన లఘుస్తువంలో ఆ కుండలినీశక్తియే పరదేవత, భగవతి, శక్తి, శాంభవి, హ్రీంకారి, త్రిపుర, త్రినయన అంటాడు.

**మాయాకుండలినీ క్రియా మధుమతీ కాళీ కలామాలినీ**
**మాతంగో విజయా జయా భగవతీ దేవీ శివా శాంభవీ**
**శక్తి శ్శంకరవల్లభా త్రినయనా వాగ్వాదినీ భైరవీ**
**హ్రీంకారీ త్రిపురా పరా పరమయీ మాతాకుమారీ త్యపి ॥**

ఈ రకంగా ఆధారచక్రంలో ఉన్న కుండలినీ శక్తి జీవాత్మ అని, సహస్రారంలో ఉన్నది పరమాత్మ అని, జీవాత్మపరమాత్మల ఏకీభావమే ఈ శ్లోకార్థ ఇది **సమయమతరహస్యము.**

**సుధాధారాసారై శ్చరణ యుగళాంతర్విగళితైః**
**ప్రపఞ్చం సిఞ్చన్తీ పునరపి రసామ్నాయ మహసః ।**
**అవాప్య స్వాం భూమిం భుజగనిభ మధ్యుష్ఠ వలయం**
**స్వమాత్మానం కృత్వా స్వపిషి కులకుణ్డే కుహరిణి ॥ 10**

ఓ తల్లీ ! నీ పాదద్వంద్వము నుండి స్రవించిన అమృతధారలచేత సాధకుని శరీరంలోని 72000 నాడీమండలము తడిపిన తరువాత, ఆ చంద్రమండలం వదలి స్వస్థానమైన మూలాధారచక్రం చేరి, అక్కడ నీ అసలురూపంతో పామువలె స్వయంభూలింగానికి మూడున్నరచుట్లు చుట్టుకుని, కుండలినీశక్తివై నిద్రావస్థవలో ఉంటావు.

తొమ్మిదవ శ్లోకంలో ఆధారచక్రంలో నిద్రావస్థలో ఉన్న కుండలినీశక్తి జాగృతమై సహస్రారం చేరటాన్ని వివరించారు. ఇప్పుడు ఆ కుండలినీశక్తి సహస్రారం నుంచి మళ్ళీ ఆధారచక్రం చేరటాన్ని వివరిస్తున్నారు. ఇది **సమయమత రహస్యము.**

బాహ్యపూజ చేసేవారికి ఐహికవాంఛలు తీరతాయి. కాని మోక్షం మాత్రంరాదు. సాయుజ్యం కావాలంటే అంతరారాధన చెయ్యాలి. అంతరారాధన ఏ విధంగా చెయ్యాలి అనేది 'భావనోపనిషత్తు'లో వివరించబడింది. బాహ్యమైన వస్తువులన్నీ విషయవాంఛలకు ప్రతీకలు. కాబట్టి వాటిని వదలివెయ్యాలి. శరీరంలో ఉండే వస్తువులచేతనే పూజ జరగాలి. పూజకు ముఖ్యమైనది జలము. సాధకుని శరీరంలో సత్త్వరజస్తమోగుణాలున్నాయి. వీటిలో సత్త్వగుణాన్ని పెంపొందించి, మిగిలిన వాటిని తగ్గించాలి. సత్త్వగుణమే జలము. అంతఃపూజలో ఉపచారము అంటే నిత్యము కాని వాటిని వదలివేయటము. అలాగే బ్రహ్మ ఒక్కటే సత్యము. మిగిలినవన్నీ మిధ్య. కంటికి కనిపించనంత మాత్రంచేత బ్రహ్మములేదు అనుకోరాదు. ఇది అనుపచారము. ఇక వివిధరకాల ఉపచారాలను చూద్దాం.

**బాహ్యేంతః కరణానాం రూపగ్రహణ యోగ్యతా ఇత్యావాహనమ్**

**ఆవాహన :** ఆత్మ అనేది దేహంలో ఉన్న వివిధ ఇంద్రియాలద్వారానే ప్రకాశిస్తుంది. కాబట్టి వాటియొక్క దేవతారూపాన్ని ఆవాహన చెయ్యటమే, పరమేశ్వరికి ఆవాహన.

**ఆసనమ్ :** శరీరానికి జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు, మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము అనే పద్నాలుగు ధర్మాలున్నాయి. వీటిని వదలి, సర్వమూ బ్రహ్మపదార్ధమే అని భావించటమే ఆసన సమర్పణ.

**పాద్యమ్ :** సాధకుడి శరీరంలో ఆ దేవి ద్వాదశాంతంలో ఉన్నది. బ్రహ్మము (ప్రకాశశక్తి) ఆత్మశక్తిలో ప్రవేశించి శుక్లబిందువయింది. విమర్శశక్తి శుక్లబిందువులో ప్రవేశించి రక్తబిందువయింది. ఈ రెండింటి కలయికవల్లా మిశ్రమ బిందువు ఏర్పడుతున్నది. ఇప్పుడు

దేవియొక్క కుడికాలు – శుక్లవర్ణమైన ప్రకాశాంశ

కాగా ఎడమకాలు – రక్తవర్ణమైన విమర్శాంశ

ఈ రెండుపాదాలనూ ధ్యానిస్తూ వాటికి భేదము లేదు అనుకోవటమే పాద్యము. అలాగే ఆత్మయే శ్రీదేవి అనిగ్రహించి బ్రహ్మానందానుసంధానం చెయ్యటమే.

అర్ఘ్యప్రదానము. ఆత్మరూపమైన పరమేశ్వరి స్వచ్ఛమైనది. ఆ స్వచ్ఛత స్వయం సిద్ధమైనది అని గ్రహించటమే ఆచమనము. కుండలినీశక్తిని సహస్రారానికి చేర్చి, అక్కడ నుంచి స్రవించే అమృతధారలతో 72000 నాడీమండలాన్ని తడపటమే **స్నానము.** శరీరంలోని కాంతి అంతా పరాశక్తితేజస్సే అని గ్రహించి బ్రహ్మానందం పొందటమే **వస్త్రప్రదానము.** సుషుమ్నానాడియే **బ్రహ్మసూత్రము.** సాధకుడు తాను కూడా పరబ్రహ్మస్వరూపమే. మాయాదివస్తువులతో తనకు సంబంధం లేదు అని గ్రహించి వాటిని పరిత్యజించటమే ఆభరణసమర్పణ. 'పరాశక్తి ప్రభావంచేతనే నా శరీరం ప్రకాశిస్తున్నది. కాబట్టి నేను కూడా ఆ పరమేశ్వరిలాగా పవిత్రుడనే అని భావించటమే చందనసమర్పణ. ఇంద్రియవాంఛలకు లోనుగాకుండా మనసును పరబ్రహ్మయందు లయంచేసి, సర్వము బ్రహ్మమయమని తెలుసుకోవటమే **పూజ.** ఇంద్రియచపలత్వానికి లోనుకాకుండా వాటిని తన అధీనంలో ఉంచుకోవటమే **ధూపం.** సాధకుడు ఆకాశమే తనశరీరము అని భావించి, తన శరీరంలో ఉన్న పరాశక్తిని (చిత్కలను) దీపంగా భావించటమే **దీపసమర్పణ.** ఇంద్రియచాపల్యం లేకుండా బ్రహ్మకారవృత్తితో ఉండటమే నైవేద్యము. జాగ్రస్వప్నసుషుప్త్యవస్థలను తురీయంలో విలీనం చెయ్యటమే **తాంబూలసమర్పణ.** కుండలినీశక్తిని మూలాధారం నుండి బ్రహ్మరంధ్రం వరకు, బ్రహ్మరంధ్రం నుండి మూలాధారం వరకు సుషుమ్న గుండా త్రిప్పటమే **ప్రదక్షిణము.**

ఈ రకంగా ఆధారచక్రంలో నిద్రావస్థలో ఉన్న కుండలినీ శక్తిని జాగృతం చేసి, సుషుమ్న గుండా సహస్రారం చేర్చి, తిరిగి ఆధారచక్రలోకి రప్పించటమే సాధకుడమైన యోగి చేయవలసిన పని. ఇది సమయమతరహస్యము. ఈ విషయాన్నే ఈ శ్లోకంలో వివరిస్తున్నారు శంకరభగవత్పాదులవారు.

వామకేశ్వరతంత్రంలో కుండలినీశక్తిని వివరిస్తూ

**భుజంగాకార రూపేణ మూలాధారం సమాశ్రితా**

**శక్తిః కుండలినీ నామ బిసతంతు నిభాఽఽశుభా ॥** 1

**మూలకందం ఫణాగ్రేణ దష్ట్వా కమలకందవత్**

**ముఖేన పుచ్ఛం సంగృహ్య బ్రహ్మరంధ్రం సమాశ్రితా ॥** 2

**పద్మాసనగత స్వస్థో గుదమాకుంచ్య సాధకః**
**వాయుమూర్ధ్వగతిం కుర్వన్ కుంభకావిష్ఠ మానసః ॥** **3**

**వాయ్వాఘాతవశాదగ్నిః స్వాధిష్ఠాన గతోజ్వలన్**
**జ్వలనాఘాత పవనఘాతై రున్నిదతో ఽహిరాట్ ॥** **4**

**రుద్రగ్రంథిం తతోభిత్వా విష్ణుగ్రంథిం భినత్త్యతః**
**బ్రహ్మగ్రంథించ భిత్త్యైవ కమలాని భినత్తిషట్ ॥** **5**

**సహస్రకమలేశక్తిః శివేన సహమోదతే**
**సాచావస్థా పరాజ్ఞేయా సైవ నిర్వృతి కారణమ్ ॥** **6**

1. భుజంగాకారం ధరించి ఆ పరమేశ్వరి కుండలినీశక్తిగా పిలువడుతూ మూలాధారమును ఆశ్రయించి, తామరతూడులోని సన్ననిదారములాగా, (కేసరములాగా) మెరుపుతీగవలె ప్రకాశిస్తున్నది.

2. ఆ శక్తి ఆధారకమలమూలకం దాన్ని నోటితో కరచి పట్టుకుని బ్రహ్మరంధ్రాన్ని ఆశ్రయించి ఉన్నది.

3. సాధకుడు పద్మాసనంలో కూర్చుని మడమను గుదస్థానంలో సంధించి కుంభకం చెయ్యాలి.

4. ఆ వాయువు తాకిడికి స్వాధిష్ఠానంలో ఉన్న అగ్ని ప్రజ్వరిల్లి, కుండలిని జాగృతమవుతుంది.

5. 6. జాగృతమైన కుండలినీశక్తి గ్రంధిత్రయాన్ని భేదించుకుని, సహస్రారం చేరి, సదాశివునితో కలిసి సుఖిస్తుంది. ఈ స్థితిలో ఉన్న ఆమె పరాశక్తి నిత్యసుఖ కారిణి.

గౌడపాదులవారు తమ సుభగోదయస్తుతిలోని నాల్గవశ్లోకంలో

**యదాతౌ చంద్రార్కౌ నిజసదన సంరోధనవశా**
**దశక్తౌ పీయూష స్రవణహరణే సా చ భుజగీ**
**ప్రబుద్ధా క్షుత్క్రుద్ధా దశతి శశినం బైందవగతం**
**సుధాధారాసారైః స్నపయతి తనుం బైందవకళే ॥**

సాధకుడు ప్రాణాయామం చేసి ఉశ్వాసనిశ్వాసలను బంధించగా, ఇడపింగళ నాడులలో సూర్యచంద్రుల గమనం ఆగిపోయినప్పుడు, నిద్రావస్థలో ఉన్న కుండలినికి ఆహారం దొరకక అది నిద్రలేచి ఊర్ధ్వముఖంగా ప్రయాణమై, గ్రంథిత్రయాన్ని ఛేదించుకుని, సహస్రారం చేరుతుంది. అప్పుడు అక్కడ నుండి అమృతధారలు కురిసి సాధకుని శరీరంలోని 72000 నాడీమండలము తడుపబడుతుంది.

ఈ శ్లోకంలోని నాల్గవపాదంలో గౌడపాదులవారు **సుధాధారసారైః** అని పదప్రయోగం చేస్తే, శంకరులవారు సౌందర్యలహరిలోని పదవశ్లోకంలోని మొదటి పాదంలోనే ఆ పదప్రయోగం చేశారు.

ఆధారచక్రంలో నిద్రావస్థలో ఉన్న కుండలినికి ఆహారం అందకపోవటంతో అది మేల్కొని బుసలుకొడుతూ ఊర్ధ్వముఖంగా, సుషుమ్నామార్గం గుండా బయలుదేరుతుంది. అప్పుడు స్వాధిష్ఠానంలో ఉన్న అగ్ని ప్రజ్వరిల్లి సుషుమ్న గుండా సహస్రదళం చేరుతుంది. కుండలినీశక్తి గ్రంథిత్రయాన్ని దాటి సహస్రదళ పద్మముయొక్క కర్ణికను తననోటితో కరిచి పట్టుకుంటుంది.

సహస్రదళం చంద్రమండలం. అక్కడ పరిపూర్ణుడైన చంద్రుడుంటాడు. ఆ చల్లదనానికి అక్కడి అమృతం అంతా గడ్డకట్టి ఉంటుంది. ప్రాణాయామం చేసినప్పుడు స్వాధిష్ఠానంలో అగ్ని ప్రజ్వరిల్లి సుషుమ్నగుండా ప్రసరిస్తుంది. ఈరకంగా స్వాధిష్ఠానము నుంచి వచ్చిన వేడి తగిలి సహస్రదళపద్మంలో ఉన్న అమృతం ద్రవరూపం దాలుస్తుంది. సర్పాకారంలో ఉన్న కుండలిని ఎప్పుడైతే సహస్రదళపద్మము యొక్క కర్ణికను కరిచి పట్టుకున్నదో, అప్పుడు దాని పంటిగాట్ల ద్వారా, అక్కడ ద్రవీభవించిన అమృతం క్రిందికి స్రవించి యోగియొక్క శరీరంలోని 72000 నాడీమండలాన్ని తడుపుతుంది. ఆ సమయంలో యోగి పొందే ఆనందం అనిర్వచనీయము. అది అనుభవైకవేద్యము. ఇదే జీవాత్మపరమాత్మల అనుసంధానము

పరమేశ్వరి చరణయుగము అంటే చరణద్వంద్వము. ఇవి రక్తవర్ణము, శుక్లవర్ణము కలిగి ఉంటాయి. ఇవే ప్రకాశాంశ, విమర్శాంశలు. దీనిలో ప్రకాశశక్తి శుక్లవర్ణముకాగా విమర్శశక్తిరక్తవర్ణము. శక్తితో కలిసిన శివమూర్తికి **'పరాపాదుక'** అని పేరు.

**స్వప్రకాశ శివమూర్తి రేకికా తద్వమర్శతనురేకికా తయోః ।**

**సామరస్యవపురిష్యతే పరాపాదుకా పరశివాత్మనో గురుః ॥**

ఇది పాదుకా నిర్వచనము. మంత్రశాస్త్రంలో **'పాదుకాంతదీక్ష'** తీసుకోవటం అనే ఆచారమున్నది. పాదుకాంతదీక్ష అంటే ప్రకాశవిమర్శశక్తుల లేదా శివశక్తులకు సహస్రారంలోచేసే అభిషేకము. ఇది పూర్ణాభిషేకము కేవలము మంత్రోపదేశాన్ని పొందటం, పాదుకాంతదీక్ష కాదు. శివశక్తులకు సుధాధారలతో సహస్రారంలో అభిషేకం చేయటమే పాదుకాంత దీక్ష.

ఆధారచక్రంలో కుండలిని నిద్రావస్థలో ఉంటుంది. అది జాగృతమై సహస్రారం చేరుతుంది. ఈ విషయం ఇప్పటిదాకా చెప్పుకున్నాం. ఐతే భ్రూమధ్య భాగం నుండి సహస్రారంవరకు తొమ్మిది సూక్ష్మచక్రాలున్నాయి. అవి

**బిందో తదర్ధం రోదిన్యాం నాదోనాదాంత ఏవచ ।**

**శక్తిః పునర్వ్యాపికాయాం సుమన, ఉన్మన గోచరే ॥**

| | | |
|---|---|---|
| 1. బిందువు | 4. నాదము | 7. వ్యాపిక |
| 2. అర్ధచంద్రము | 5. నాదాంతము | 8. సుమన |
| 3. రోదిని | 6. శక్తి | 9. ఉన్మన |

సాధకుడు భ్రూమధ్యము నుండి సహస్రారముదాకా గల సూక్ష్మచక్రాలలో సంచరించేటప్పుడు కొన్ని దృశ్యాలుకనిపిస్తాయి. అలాగే కొన్ని ధ్వనులు వినిపిస్తాయి.

సాధకుడు షణ్ముఖీముద్రతో తన చెవులను మూసుకుని, జాగ్రత్తగా విన్నట్లైతే ఓంకారము మొదటగా 'చిణి' అని వినిపిస్తుంది. తరువాత ఆ శబ్దము హెచ్చి 'చిణి చిణి' అని ఘోష పెడుతుంది. తరువాత అది **ఘంటానాదం**లాగా వినిపిస్తుంది. ఘంటానాదము క్రమంగా విజృంభించి **శంఖనాదము**గా మారుతుంది. ఆ శంఖనాదం మనోహరంగా మారి వీణ మీటినట్లవుతుంది. ఆ **వీణానాదము** క్రమంగా **వేణునాదముగా** మారుతుంది. ఆ తరువాత అరిషడ్వర్గాలను జయించామని గుర్తుగా **భేరీనాదం** మ్రోగుతుంది. ఆ తరువాత అది **మృదంగనాదంగా** మారుతుంది. ఆ తరువాత ఆనందవర్షపాతము జరుగుతున్నట్లు **మేఘనాదము** వినిపిస్తుంది.

ఈనాదాలన్నీ క్రమంగా పరానాదంలో కలిసిపోతాయి. ఆ స్థితిలో సాధకుని మనస్సు, ప్రాణాలు నాదబిందు కళలో లీనమైపోతాయి. దీనినే **తురీయావస్థ** 'ఉన్మని' అంటారు. ఈ స్థితిలో ఇంద్రియాలు పనిచేయవు. సంకల్పవికల్పాలకు కారణభూతమైన మనస్సు కూడా పనిచెయ్యటం మానివేస్తుంది. అదే **ఉన్మనస్థితి**. ఈ స్థితిలో యోగి పొందే ఆనందము అనుభవైకవేద్యము. ఇదే అమనస్కయోగము, రాజయోగము అని చెప్పబడింది.

ఈ రకంగా సహస్రారం చేరిన కుండలిని తిరిగి ఆధారచక్రం చేరి సుఖంగా నిద్రిస్తుంది.

**చతుర్భిః శ్రీకణ్ఠైః శ్శివయువతిభిః పఞ్చభిరపి**
**ప్రభిన్నాభి శమ్భోర్నవభి రపి మూలప్రకృతిభిః ।**
**చతుశ్చత్వారింశ ద్వసుదళ కలాశ్రత్రివలయ**
**త్రిరేఖాభి స్సార్థం తవ శరణకోణాః పరిణతాః ॥** 11

ఓ తల్లీ ! నాలుగుశివచక్రాలు, ఐదుశక్తిచక్రాలు, తొమ్మిది మూలప్రకృతికలతోను, అష్టదళము, షోడశదళము, వృత్తత్రయము, భూపురము అనే వాటితోను శ్రీచక్రము అలరారతున్నది.

ఈ శ్లోకంలో శ్రీచక్రాన్ని వివరిస్తున్నారు. శంకరభగవత్పాదులవారు శ్రీచక్రాన్నే చక్రరాజము అని కూడా అంటారు. ఆ పరదేవత శ్రీచక్రసంచారిణి. అంటే శ్రీచక్రంలో సంచరిస్తూ ఉంటుంది. శ్రీచక్రరాజనిలయా శ్రీచక్రమందే నివసిస్తుంది. శ్రీచక్రనగర సామ్రాజ్ఞి – శ్రీచక్రమనే మహానగరానికి సామ్రాజ్ఞి. వీటివల్ల శ్రీచక్రము అంటే పరమేశ్వరినివాసస్థానము అని అర్థమవుతున్నది. శ్రీచక్రమనేది శివశక్తుల విహారస్థానము. ఇది తొమ్మిదిభాగాలుగా ఉంటుంది. వాటిని విడిగా చక్రాలు అని, ఆవరణలు అని అంటారు. ఇందులో నాలుగుశివచక్రాలు కాగా ఐదు శక్తి చక్రాలు.

**బిందు త్రికోణ వసుకోణ దశారయుగ్మ**
**మన్వస్ర నాగదళ షోడశపత్ర యుక్తం**
**వృత్తత్రయం చ ధరణీ సదనత్రయంచ**
**శ్రీచక్రరాజ ఉదితః పరదేవతాయాః ॥**

బిందువు, త్రికోణము, అష్టకోణము, దశారయుగ్మము (దశకోణచక్రములు రెండు) పద్నాలుగుకోణములుగల చక్రము, అష్టదళము, షోడశదళము, వృత్తత్రయము, భూపురత్రయము. ఇవన్నీ ఆవరణలుగా కలిగి ఉన్న దాన్ని శ్రీచక్రము అంటారు. అయితే వృత్తత్రయాన్ని మాత్రం ఆవరణగా లెక్కించరు. ఇదే విషయాన్ని వివరిస్తూ యామళగ్రంథాలలో ఈ విధంగా చెప్పారు.

**బిందు త్రికోణ వసుకోణ దశారయుగ్మ**

**మన్వస్రష్టదళ సంయుత షోడశారమ్**

**వృత్తత్రి భూపురయుతం పరిత శ్చతుర్ద్వాః**

**శ్రీచక్రమేత దురితం పరదేవతాయాః ॥**

ప్రపంచసారసంగ్రహంలో శ్రీచక్రాన్ని వివరిస్తూ

**బిందు త్రికోణ కాష్టావతారయుగ లోకకోణ వృత్తయుతమ్ ।**

**వసుదళవృత్త కళాదళవృత్త త్రిమహీగృహం భజేచక్రమ్ ॥**

గౌడపాదులవారు తమ **సుభగోదయస్తుతి**లోని 17వ శ్లోకంలో శ్రీచక్రాన్ని వివరిస్తూ

**త్రికోణైరష్టారం త్రిభిరపి దశారం సముదభూ**

**ర్దశారం భూగేహాదపిచ భువనాశ్రం సమభవత్ ।**

**తతో భూన్నాగారం నృపతిదళ మస్మా స్త్రివలయం**

**చతుర్ద్వాః ప్రాకార త్రితయ మిదయేవాంబ శరణమ్ ॥**

అన్నారు. భైరవయామళంలో శ్రీచక్రాన్ని వివరిస్తూ

**చతుర్భి శ్శివచక్రైశ్చ శక్తిచక్రైశ్చ పంచభిః**

**శివశక్త్యాత్మకం జ్ఞేయం శ్రీచక్రం శివయోర్వపుః ॥**

శివచక్రాలు నాలుగు. శక్తిచక్రాలు ఐదు. వెరసి తొమ్మిదిచక్రాలతో శ్రీచక్రము శివశక్తులస్వరూపమై ఉన్నది. అయితే ఇందులో శక్తిచక్రాలు ఏవి ? శివచక్రాలు ఏవి ? అనేది ప్రశ్న.

**త్రికోణ మష్టకోణంచ దశకోణ ద్వయం తథా**

**చతుర్దశారం చైతాని శక్తి చక్రాణి పంచశః ॥**

త్రికోణము, అష్టకోణము, దశకోణములు రెండు, ఇందులో ఒకటి అంతర్ద శారము, రెండవది బహిర్దశారము. తరువాత పద్నాలుగుకోణములు గల చక్రము. ఈ ఐదుశక్తిచక్రాలు. ఇక్కడ గుర్తించవలసిన విషయం ఏమిటి అంటే – శక్తిచక్రాలన్నీ కోణాకారంలోనే ఉంటాయి.

**బిందుశ్చాష్టదళంపద్మం పద్మం షోడశపత్రకమ్ ।**

**చతురస్రంచ చత్వారి శివచక్రాణ్యను క్రమాత్ ॥**

బిందువు, అష్టదళము, షోడశదళము, భూపురము ఈ నాలుగు శివచక్రాలు.

శక్తిచక్రాలన్నీ కోణాకారంలో ఉండగా, శివచక్రాలు మాత్రం బిందువు, ఎనిమిది, పదహారుదళాలపద్మాలు, మూడురేఖలు గల చతురస్రాకారమైన భూపురము. ఈ రకంగా మొత్తం తొమ్మిదిచక్రాలుంటాయి.

అయితే ఈ చక్రాలు విడివిడిగా ఉన్నాయా ? అంటే లేదు ఇవి విడివిడిగా ఉండటమనేది హిందూకుటుంబవ్యవస్థకు వ్యతిరేకము. శివశక్తులను పతి, పత్ని అని చెబుతాం. కాబట్టి భార్యాభర్తలు విడివిడిగా ఉండరు. కలిసే ఉంటారు. అందుచేతనే శివ, శక్తి చక్రాలు కూడా కలిసే ఉంటాయి. శక్తిచక్రాలకు రెండువైపులా శివచక్రాలుంటాయి. ఒకవైపున బిందువు, రెండవవైపున భూపురము. అంతే కాకుండా శివ, శక్తిచక్రాలు ఒకదానితో ఒకటి అవినాభావసంబంధము కలిగి ఉంటాయి.

**త్రికోణే బైందవమ్ శ్లిష్టమ్ అష్టారే ష్టదళాంబుజమ్ ।**

**దశారయో షోడశారమ్ భూగృహమ్ భువనాశ్రకే ॥**

| | | |
|---|---|---|
| త్రికోణమునందు | – | బిందువు |
| అష్టకోణము నందు | – | అష్టదళము |
| దశారయుగ్మమందు | – | షోడశదళము |
| చతుర్దశారమందు | – | భూపురము |

సంయోగం చెందిఉంటాయి. ఇదే విషయాన్ని గౌడపాదులవారు తమ **సుభగోదయస్తుతి**లోని 11వ శ్లోకంలో

**త్రికోణే వృత్తత్రయ మిభకోణే వసుదళం**
**కలాశ్రం మిశ్రారే భవతి భువనాశ్రే చ భువనమ్**
**చతుశ్చక్రం శైవం నివసతి భగే శాక్తికముయే**
**ప్రధానైక్యం షోఢాభవతిచ తయోః శక్తి శివయోః ॥**

| | | |
|---|---|---|
| త్రికోణంతో | – | వృత్తత్రయము |
| అష్టకోణంతో | – | అష్టదళపద్మము |
| దశారయుగ్మంతో | – | షోడశదళపద్మము |
| చతుర్దశారంతో | – | భూపురము |

చేరుతున్నాయి అన్నారు. అయితే గౌడపాదులవారు వృత్తత్రయాన్నే బిందువుగా పరిగణించారు. ఈ రకంగా శివ, శక్తి చక్రాలు సంయోగం చెందుతున్నాయి. ఇది హిందూకుటుంబవ్యవస్థకు ప్రతీక.

శ్రీచక్రంలో మొత్తం తొమ్మిదిచక్రాలున్నాయి. వాటినే ఆవరణలు అని కూడా అంటారు అని చెప్పుకున్నాం కదా ! ఇప్పుడు వాటి పేర్లుచూద్దాం.

**1. ప్రథమావరణ :** ఇది భూపురము. దీనిలో మూడురేఖలు ఉంటాయి. దీని పేరు **'త్రైలోక్యమోహనచక్రము'**

**2. ద్వితీయావరణ :** షోడశదళము. పదహారు దళాలు గల పద్మము. దీని పేరు **'సర్వాశాపరిపూరకచక్రము'**

**3. మూడవ ఆవరణ :** అష్టదళము. ఎనిమిదిదళాలు గలపద్మము.దీనిపేరు **'సర్వసంక్షోభణచక్రము'**

**4. నాల్గవ ఆవరణ :** చతుర్దశారము. పద్నాలుగుకోణములు గల చక్రము. దీనిపేరు **'సర్వసౌభాగ్యదాయకచక్రము'**

**5. ఐదవ ఆవరణ :** బహిర్దశారము. పదికోణములు గల చక్రము. దీన్ని పేరు **'సర్వార్థసాధకచక్రము'**

**6. ఆరవ ఆవరణ :** అంతర్దశారము. పదికోణములు గల చక్రము. దీనిపేరు **'సర్వరక్షాకరచక్రము'**

**7. ఏడవ ఆవరణ :** అష్టకోణము. ఎనిమిదికోణాలుగల చక్రము. దీనిపేరు **'సర్వరోగహరచక్రము'**

**8. ఎనిమిదవ ఆవరణ :** త్రికోణము, మూడుకోణాలు గల చక్రము. దీనిపేరు **'సర్వసిద్ధిప్రదచక్రము'**

**9. తొమ్మిదవ ఆవరణ :** బిందువు. దీనిపేరు **'సర్వానందమయచక్రము'**

**నవధాతువులు :**

మూలప్రకృతి అంటే ఈ జగత్తుకు మూలాధారమైనది ఈ మూలప్రకృతులు ప్రపంచానికి మూలకారణం కాబట్టి, వీటిని **యోనులు** అని **ధాతువులు** అని కూడా అంటారు. **కామికాతంత్రంలో**

**త్వగసృఙ్మాంస మేధోస్థిధాతవ శ్శక్తిమూలకాః**
**మజ్జా శుక్ల ప్రాణ జీవ ధాతవ శ్శివమూలకాః ॥**
**నవధాతురయం దేహో నవయోని సముద్భవః**
**దశమీ యోనిరేకైవ పరాశక్తి స్థధీశ్వరీ ॥**

చర్మము, రక్తము, మాంసము, మెదడు, ఎముకలు శక్తిమూలకాలు. మజ్జ, వీర్యము, ప్రాణము, జీవము, శివమూలకాలు. ఈ దేహము నవయోనుల నుంచి జన్మించి నవధాతుమయమై ఉన్నది. ఇందులో పదవయోని లేదా పదవధాతువు సాక్షాత్తు ఆ పరమేశ్వరియే. జీవధాతువు అంటే, జీవుడధిష్టించి ఉన్న 'ఓజోధాతువు' ఇది బలరూపమైన మాంసలేశము.

**తత్త్వాలు :**

**ఏవంపిండాండముత్పన్నం తద్వద్ బ్రహ్మాండముద్భవౌ**
**పంచభూతాని శాక్తాని మాయాదీని శివశ్శృతు ॥**
**మాయా చ శుద్ధ విద్యా చ మహేశ్వర సదాశివౌ**
**పంచవింశతి తత్త్వాని తత్రైవాంతర్భవంతితే ॥**

ఈ రకంగా అండపిండబ్రహ్మాండాలు ఉద్భవించినాయి. పంచభూతాలు శక్తికి సంబంధించినవి. మాయాదులు శివసంబంధాలు. ఈ మొత్తం కలిసి ఇరవైఐదు తత్త్వాలవుతున్నాయి. ఇవన్నీ నవయోనులయందు అంతర్భావం పొందుతున్నాయి.

చరాచరజగత్తుకు మూలమైనది ప్రకృతి అంటే ఈ జగత్తుకు కారణమైనది ఆ పరమేశ్వరి. తత్త్వము అంటే తత్, త్వం. అదే నీవు. కాబట్టి ఇక్కడ తత్త్వము అంటే సృష్టికి ప్రధమావయకభూతమగు ప్రకృతి మొదలగు పదార్ధాలు. ఈ పదార్ధాలు మతభేదము చేత అనేకవిధాలుగా ఉన్నాయి.

| మతస్థులు | తత్త్వములు |
|---|---|
| 1. బౌద్ధులు | 1 శూన్యము |
| 2. చార్వాకులు | 4 పృథివి, అప్పు (నీరు), తేజస్సు, వాయువు |
| 3. ఆర్హతులు (జైనులు) | 2 జీవము, అజీవము |
| 4. ఆర్హతులలో కొందరు | 5 అస్తికాయము. ఇది ఐదువిధాలు జీవము, ఆకాశము, ధర్మము, అధర్మము, దేహము |
| 5. ఆర్హతులలో మరికొందరు | 7 జీవము, అజీవము, అస్రవము, బంధము, సంవరము, నిర్జరము, మోక్షము |
| 6. ద్వైతులు | 2 స్వతంత్రము, అస్వతంత్రము |
| 7. విశిష్టాద్వైతులు | 3 చిత్తు, అచిత్తు, ఈశ్వరుడు |
| 8. శైవులు | 3 పశువు, పతి, పాశము |
| 9. సాంఖ్యులు | 25 పంచభూతాలు -5, తన్మాత్రలు-5, ఇంద్రియాలు-11, ఆత్మ, అవ్యక్తము, బుద్ధి, అహంకారము |
| 10. యోగులు | 26 సాంఖ్యులు చెప్పిన 25, ఈశ్వరుడు |
| 11. అద్వైతులు | 1 బ్రహ్మము |

ఈ సృష్టి చెయ్యటం కోసం పరబ్రహ్మ అనేక రకాలుగా రూపాంతరం చెందింది.

**పంచభూతాని తన్మాత్రపంచకం చేంద్రియాణి చ ।**

**జ్ఞానేంద్రియాణి పంచైవ తథా కర్మేంద్రియాణి చ ॥**

**త్వగాది ధాతవస్సప్త పంచప్రాణాది వాయువః ।**

**మనశ్చాహంకృతిః ఖ్యాతిర్గుణాః ప్రకృతి పూరుషౌ ॥**

**రాగోవిద్యా కలాచైవ నియతిః కాలయేవచ ।**

**మాయా చ శుద్ధవిద్యా చ మహేశ్వర సదాశివౌ ॥**

**శక్తిశ్చ శివతత్త్వంచ తత్త్వాని క్రమశోవిదుః ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| పంచభూతాలు | – | 5 | రాగము | – | 1 |
| తన్మాత్రలు | – | 5 | విద్య | – | 1 |
| జ్ఞానేంద్రియాలు | – | 5 | కళలు | – | 1 |
| కర్మేంద్రియాలు | – | 5 | నియతి | – | 1 |
| త్వగాదిధాతువులు | – | 7 | కాలము | – | 1 |
| (చర్మము, రక్తము, మాంసము, | | | మాయ | – | 1 |
| ఎముకలు, మెదడు, మజ్జ, శుక్లము) | | | శుద్ధవిద్య (మోక్షజ్ఞానము) | – | 1 |
| ప్రాణాలు | – | 5 | మహేశ్వరుడు | – | 1 |
| మనస్సు | – | 1 | (రజోగుణుడైనపుష్టికర్త) | | |
| అహంకారము | – | 1 | సదాశివుడు (సృష్టికర్త) | – | 1 |
| ఖ్యాతి | – | 1 | శక్తి (సృష్టిస్థితిలయకారిణి) | – | 1 |
| గుణములు | – | 3 | శివతత్త్వము | – | 1 |
| మూలప్రకృతి | – | 1 | (శుద్ధబుద్ధముక్తిస్వరూపము) | | |
| పురుషుడు | – | 1 | **మొత్తం** | **–** | **51** |

అయితే కాశ్మీరదేశశాక్తేయుల ప్రకారం తత్త్వాలు - 36

| | | | | | |
|---|---|---|---|---|---|
| పంచభూతాలు | - | 5 | ప్రాక్, పశ్చిమ, దక్షిణ, ఉత్తర వాయువులు | - | 4 |
| తన్మాత్రలు | - | 5 | మనస్సు | - | 1 |
| జ్ఞానేంద్రియాలు | - | 5 | మాయ, శుద్ధవిద్య, మహేశ్వరుడు సదాశివుడు | - | 4 |
| కర్మేంద్రియాలు | - | 5 | | | |
| త్వగాదిధాతువులు | - | 7 | **మొత్తం** | - | **36** |

గౌడపాదులవారు వీటిని కాదన్నారు. ఒకవేళ తత్త్వాలు పైన చెప్పినట్లుగానే ఉన్నప్పటికీ కొన్ని తత్త్వాలు కొన్నింటియందు కలసి ఉంటాయి. ముందుగా 51 తత్త్వాలలో

| | | | |
|---|---|---|---|
| 1. | త్వగాదిధాతువులు | - | పంచభూతాలయందు |
| 2. | పంచప్రాణాలు | - | వాయువునందు |
| 3. | అహంకారము | - | మనస్సునందు |
| 4. | ఖ్యాతి | - | విద్యయందు |
| 5. | గుణములు | - | ప్రకృతియందు |
| 6. | ప్రకృతి | - | శక్తియందు |
| 7. | పురుషుడు | - | మహేశ్వరునియందు |
| 8. | కళ | - | శుద్ధ విద్యయందు |
| 9. | కాలము | - | మహేశ్వరునియందు |
| 10. | నియతి | - | శక్తియందు |
| 11. | శక్తి | - | శుద్ధవిద్యయందు |
| 12. | శివతత్త్వము | - | సదాశివతత్త్వమందు కలసి ఉన్నాయి. |

ఈ మొత్తం 26. 51 తత్త్వాలలో 26 తీసివేయగా మిగిలేది **25 తత్త్వాలే.**

అదేవిధంగా శాక్తేయులు చెప్పిన 36 తత్త్వాలలోను కొన్ని తత్త్వాలు అంతర్భావం చెందుతాయి. అవి

1. త్వగాదిధాతువులు – పంచభూతాలయందు

2. ప్రాక్, పశ్చిమ, దక్షిణ, ఉత్తర, వాయువులు – వాయువునందు

36 తత్త్వాలలో పదకొండు తీసివేయగా మిగిలేది **25 తత్త్వాలే.** అవి

**పృథివ్యాపస్తేజః పవనగగనే తత్ప్రకృతయః**
**స్థితాస్తన్మాత్రాస్తా విషయదశకం మానసమితి**
**తతో మాయా విద్యా తదనుచ మహేశః శివ ఇతి**
**పరం తత్త్వాతీతం మిలిత వపురిందోః పరకళా ॥**

| | | |
|---|---|---|
| పంచభూతాలు | – | 5 |
| తన్మాత్రలు | – | 5 |
| జ్ఞానేంద్రియాలు | – | 5 |
| కర్మేంద్రియాలు | – | 5 |
| మనస్సు | – | 1 |
| మాయ, శుద్ధవిద్య, మహేశ్వరుడు, సదాశివుడు | – | 4 |
| **మొత్తం** | | **25** |

శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాలు – 5 మనస్సుతో కలిసి – 6. ఇవి షట్చక్రాల యందు ఉన్నాయి. షట్చక్రాలకు పైన మాయ, శుద్ధవిద్య, మహేశ్వరుడు, సదాశివుడు ఉన్నారు. హిరణ్యగర్భుడనే సదాశివుడితో కలిసిన శుద్ధవిద్యయే సాదాఖ్యకళ. అదే 26వ తత్త్వము దీన్నే పరా, చిద్రూప, కుండలిని అంటారు.

ఈ తత్త్వాలన్నీ శ్రీచక్రంలో ఉన్నాయి. ఇవే జగన్నిర్మాణానికి హేతువులు. ఇవన్నీ శ్రీచక్రంలో ఉన్నాయి. కాబట్టి శ్రీచక్రము చరాచరజగత్తుకూ ప్రతీక.

**శ్రీచక్రం త్రిపురసుందర్యా బ్రహ్మాండాకారమీశ్వరీ** ఓ పరమేశ్వరీ ! శ్రీచక్రము అంటే సామాన్యమైన యంత్రం కాదు. అది బ్రహ్మాండానికి ప్రతీక. ఎందుచేతనంటే బ్రహ్మాండంలో ఉన్న తత్త్వాలన్నీ శ్రీచక్రంలోనే ఉన్నాయి.

**పంచభూతాత్మకం చైవ తన్మాత్రాత్మక మేవ చ**

సృష్టికి మూలమైనవి పంచభూతాలు, వీటియొక్క లక్షణాలే తన్మాత్రలు. వీటి కలయికతోనే జగత్తు సృష్టించబడుతోంది. అటువంటి పంచభూతాలు, తన్మాత్రలు ఈ శ్రీచక్రంలోనే ఉన్నాయి. అంటే శ్రీచక్రము బ్రహ్మాండానికి ప్రతీక. అంతేకాదు.

**ఇంద్రియాత్మక మేవం చ మనస్తత్త్వాత్మకం తథా ।**

ఇంద్రియాలు అంటే జ్ఞానేంద్రియాలు - 5. కర్మేంద్రియాలు-5, ఈ పది ఇంద్రియాలు జగత్తులోని ప్రాణికోటికంతటికీ ఉంటాయి. ఈ పదిఇంద్రియాల తత్త్వాలు శ్రీచక్రంలో ఉండటంవల్ల, శ్రీచక్రం సృష్టిలోని ప్రాణికోటికంతటికీ ప్రతీక అవుతోంది.

**మనస్తత్త్వాత్మకం తథా** మనస్సు అనేది మానవులకు మాత్రమే ఉండేది. యుక్తాయుక్తవిచక్షణా జ్ఞానాన్ని, ఆలోచింపచేసే శక్తిని ఇచ్చేది మనస్సు. ఆ మనస్తత్త్వము కూడా శ్రీచక్రంలోనే ఉన్నది. కాబట్టి శ్రీచక్రము విశ్వమానవాళికీ ప్రతీక. అందుకే శ్రీచక్రాన్ని గనక అర్చించినట్లైతే చరాచరజగత్తునూ అర్చించినట్లే విశ్వమానవాళిని అర్చించినట్లే. జగత్తులోని జీవకోటిని అర్చించినట్లే.

ఇవేకాక మాయ, శుద్ధవిద్య, మహేశ్వరుడు, సదాశివుడు అనే తత్త్వాలు కూడా శ్రీచక్రంలో ఉన్నాయి. ఈ రకంగా 25 తత్త్వాలున్నాయి. 26వ తత్త్వమే సాదాఖ్యకళ. అదే త్రిపురసుందరి.

**మానవదేహము - శ్రీచక్రము :**

అసలు శ్రీచక్రము అంటే ఎక్కడో విడిగా లేదు. మానవదేహమే శ్రీచక్రము. అందుకే శ్రీచక్రంలోని వివిధఆవరణలు, మానవదేహంలోని వివిధభాగాలతో పోల్చబడ్డాయి.

**బైందవం బ్రహ్మరంధ్రం చ మస్తకంచ త్రికోణకమ్**
**లలాటేష్టార పత్రంచ భృవోర్మధ్యే దశారకమ్**
**బహిర్దశారం కంఠేతు మన్వస్రం హృదయం భవేత్**
**నాభౌచ వసుపత్రం చ కట్యాం షోడశపత్రకమ్**
**వృత్తత్రయం చ ఊరుభ్యాం పద్భ్యాం భూపురత్రయమ్ ॥**

| | | |
|---|---|---|
| బైందవం బ్రహ్మరంధ్రం చ | - బిందువు | - బ్రహ్మరంధ్రము |
| మస్తకంచత్రికోణమ్ | - త్రికోణము | - మస్తకము |
| లలాటేష్టారపత్రం చ | - అష్టకోణము | - లలాటము |
| భృవోర్మధ్యే దశారకమ్ | - అంతర్దశారము | - భ్రూమధ్యము |
| బహిర్దశారం కంఠేతు | - బహిర్దశారము | - కంఠము |
| మన్వస్రం హృదయం భవేత్ | - చతుర్దశారము | - హృదయము |
| నాభౌ చ వసువపత్రం చ | - అష్టదళపద్మము | - నాభి |
| కట్యాం షోడశపత్రకమ్ | - షోడశదళపద్మము | - కటి |
| వృత్తత్రయం చ ఊరుభ్యాం | - వృత్తత్రయము | - ఊరువులు |
| పద్భ్యాం భూపురత్రయమ్ | - భూపురము | - పాదాలు |

మానవదేశంలో షట్చక్రాలున్నాయి. అవి ఎక్కడున్నాయి అంటే

**మూలాధారం గుదస్థానం స్వాధిష్ఠానంతు మేహనమ్**
**నాభిస్తు మణిపూరాఖ్యం హృదయం చాబ్జమనాహతమ్**
**తాలుమూలం విశుద్ధాఖ్యం ఆజ్ఞాం చ నిటలాంబుజమ్**
**తస్మాదూర్ధ్వమధోముఖమ్ వికసితమ్ పద్మం సహస్రచ్ఛదమ్**

| | |
|---|---|
| మూలాధారం గుదస్థానం | - ఆధారచక్రము గుదస్థానంలో ఉన్నది. |
| స్వాధిష్ఠానంతు మేహనం | - స్వాధిష్టానము లింగస్థానములో ఉన్నది |
| హృదయం చాబ్జమనాహతమ్ | - అనాహతము హృదయమందున్నది |
| తాలుమూలం విశుద్ధాఖ్యం | - విశుద్ధిచక్రము కంఠస్థానమందున్నది |
| ఆజ్ఞాంచ నిటలాంబుజమ్ | - ఆజ్ఞాచక్రము భ్రూమధ్యమందున్నది |

వీటన్నింటికీపైన సహస్రదళపద్మమున్నది.

మానవదేహమే శ్రీచక్రము అని చెప్పినప్పుడు మానవదేహంలో ఉండే షట్చక్రాలకు శ్రీచక్రంలోని ఆవరణలకు ఐక్యత చెప్పబడింది. గౌడపాదులవారు తమ **సుభగోదయస్తుతి**లోని 10వ శ్లోకంలో

**త్రికోణం చాధారం త్రిపుర వినుతే ష్టార మనఘే**

**భవేత్స్వాధిష్ఠానం పునరపి దశారం మణిపురమ్ ।**

**దశారంతే సంవిత్కమల మథ మన్వస్ర క్రముమే**

**విశుద్ధం స్యాదాజ్ఞా శివఇతి తతో భైందవ గృహమ్ ॥**

| | | |
|---|---|---|
| ఆధారచక్రానికి | – | త్రికోణంతో ఐక్యత |
| స్వాధిష్ఠానానికి | – | అష్టకోణంతో ఐక్యత |
| మణిపూరానికి | – | అంతర్దశారంతో ఐక్యత |
| అనాహతానికి | – | బహిర్దశారంతో ఐక్యత |
| విశుద్ధిచక్రానికి | – | చతుర్దశారంతో ఐక్యత |
| ఆజ్ఞాచక్రానికి | – | అష్టదళము, షోడశదళములతో ఐక్యత, |
| సహస్రారానికి | – | భూపురం, బిందువులతో ఐక్యత |

అయితే ఈ విషయంలో కౌళసమయాచారులకు భేదమున్నది. ఈ రకంగా షట్చక్రాలకు, శ్రీచక్రంలోని ఆవరణలకు ఐక్యత ఉన్నది కాబట్టి మానవదేహమే శ్రీచక్రము అని చెప్పబడుతున్నది.

**సంధులు - మర్మస్థానాలు :**

శ్రీచక్రంలో 28 మర్మస్థానాలు, 24 సంధులు ఉంటాయి. అసలు సంధి అంటే ఏమిటి ?

**ద్విరేఖా సంగమస్థానం సంధి రిత్యభిధీయతే**

రెండురేఖలు కలిసే చోటును × సంధి అంటారు.

**త్రిరేఖా సంగమస్థానం మర్మం మర్మవిదోవిదుః**

మూడురేఖలు కలిసే చోటును మర్మస్థానము ⋇ అంటారు. ఇక్కడ ముఖ్యమైన విషయం ఏమిటి అంటే సంధులు, మర్మస్థానాలు శ్రీచక్రంలోని కోణాలలోనే ఉంటాయి. అందుకే

**మన్వస్ర ద్విదశార అష్టకోణ వృత్త చతుష్టయమ్ ।**

**అష్టావింశతి మర్మాణి చతుర్వింశతి సంధయః ॥**

మన్వస్రము, దశారయుగ్మము, అష్టకోణము అనే నాలుగు చక్రాలయందు 28 మర్మస్థానాలు, 24 సంధులు ఉంటాయి. కాని శ్రీచక్రాన్ని గీసి లెక్కపెడితే మర్మస్థానాలు 24 మాత్రమే ఉంటాయి. అయితే శివచక్రాలకు సంగమస్థానాలు లేకపోయినప్పటికీ వాటిని కూడా మర్మస్థానాలుగానే లెక్కపెట్టాలి. అప్పుడు మర్మస్థానాలు 28 అవుతాయి.

**కోణాలు :** శ్రీచక్రంలో శక్తిచక్రాలన్నీ కోణాకారంలోనే ఉంటాయి. అలాంటప్పుడు శ్రీచక్రంలో మొత్తం ఎన్ని కోణాలుంటాయి అంటే త్రికోణంలో–3, అష్టకోణంలో–8, అంతర్దశారంలో–10, బహిర్దశారంలో–10, మన్వస్రంలో–14 వెరసి శ్రీచక్రంలో 45 కోణాలుంటాయి.

**బీజాక్షరాలు :** శ్రీచక్రము కేవలము రేఖానిర్మితము. ఇందులో దేవతపేరు గాని, మంత్రంపేరు గాని ఉండవు. అయితే బీజాక్షరాలుంటాయా ? అనేది ప్రశ్న. ఇక్కడ సంప్రదాయభేదమున్నది.

**బీజాక్షరయుతం చక్రం యతీనా ముత్తమోత్తమమ్ ।**
**బీజాక్షర విహీనంతు గృహస్థానాం ప్రశస్తకమ్ ॥**

బీజాక్షరములున్న శ్రీచక్రము యతులకు శ్రేష్ఠమైనది. కాగా బీజక్షరాలు లేని శ్రీచక్రము గృహస్తులకు ప్రశస్తము అయితే ఇంకొక సంప్రదాయం ప్రకారము.

**బీజం వినాతునిర్జీవం । శవవత్పరికీర్తితమ్ ।**
**బీజహీనంతు యచ్ఛక్రం । తచ్చక్రం సిద్ధిదంనచ ॥**

బీజాక్షరాలు లేని శ్రీచక్రము ప్రాణములేని దానితో సమానము. అటువంటి శ్రీచక్రపూజ నిరర్థకము. ఆ పూజ సిద్ధించదు. ఇది కేవలము సంప్రదాయభేదము. ఈ రకంగా భేదాలున్నప్పుడు **గురుసంప్రదాయాన్నే పాటించాలి** అనేది ఆర్యోక్తి.

**ప్రస్తారాలు :** ఇప్పుడు శ్రీచక్రంలోని ప్రస్తారాలను చూద్దాం. శ్రీచక్రం ఉండే ఆకారాన్ని ప్రస్తారము అంటారు. ఇది మూడు రకాలుగా ఉంటుంది అని **శ్రీవిద్యార్ణవ తంత్రం**లో చెప్పబడింది.

**ప్రస్తారో త్రివిధాప్రోక్తః శ్రీచక్రస్య తథేశ్వరీ ।**
**మేరుకైలాస భూసంజ్ఞా భేదాస్య త్రిధాభవేత్ ॥**

శ్రీచక్రం మూడుప్రస్తారాలుగా ఉంటుంది. అవి

**1) భూప్రస్తారము :** ఇది బల్లపరుపుగా ఉంటుంది. బంగారము, వెండి, రాగి రేకులమీద గాని, పట్టువస్త్రము, భూర్జరీ పత్రము, చివరకు నేలమీద కాని శ్రీచక్రాన్ని గీసి పూజిస్తారు. ఇందులో యంత్రముయొక్క పొడవు వెడల్పులు సమానంగా ఉంటాయి.

**2. మేరుప్రస్తారము :** ఇది బోర్లించిన గరాటులాగా ఉంటుంది. ఆవరణలన్నీ ఒకదానిమీద ఒకటిగా, మొత్తం తొమ్మిదిఅంతస్థులుగా ఉంటాయి. ఇందులో యంత్రముయొక్క పొడవు, వెడల్పు, ఎత్తు సమానంగా ఉంటాయి. 3×3×3 అంగుళాలు.

**3. కైలాసప్రస్తారము :** ఇది కూడా మేరువులాగానే ఉంటుంది. ఇందులో పొడవు, వెడల్పు సమానంగానే ఉన్నా, ఎత్తు మాత్రం 1/4 వంతు మాత్రమే ఉంటుంది. 4×4×1 అంగుళాలు.

అసలు ప్రస్తారాలలో ప్రత్యేకత ఏమిటి అంటే ....

**మేరుప్రస్తారకం యంత్రం నిత్యాతాదాత్మ్యకం స్మృతం**
**మాతృకాయస్తు కైలాస ప్రస్తారాఖ్యా సురేశ్వరీ**
**భూప్రస్తారం మహాదేవి వశిన్యాత్మకముత్తమమ్ ।**

1. భూప్రస్తారంలో – వశిన్యాది దేవతల తాదాత్మ్యము చెప్పబడింది.
2. మేరుప్రస్తారంలో – షోడశనిత్యల తాదాత్మ్యము చెప్పబడింది
3. కైలాస ప్రస్తారంలో – మాతృకా తాదాత్మ్యము చెప్పబడింది.

మాతృకలు అంటే అక్షరాలు. అకచటతపయశ వర్గులు. శక్తిసంగమతంత్రంలో శ్రీచక్రంలోని మూడుప్రస్తారాలలోను మళ్ళీ భేదము చెప్పబడింది.

**భూప్రస్తారోద్వివిధా దేవీ పాతాళోర్ధ్వక్రమేణతు**
**కైలాసాఖ్యస్తు ప్రస్తారో ద్వివిధ ప్రకీర్తితః**
**అర్ధకైలాస సంజ్ఞస్తు పూర్ణకైలాస కస్తథా**
**తదైవ మేరుప్రస్తారః । కీర్తియస్తు మయాతవ ॥**

1. భూప్రస్తారము రెండు విధాలుగా ఉంటుంది.

**1. ఊర్ధ్వభూప్రస్తారము :** నేలమీద ముగ్గుతో యంత్రాన్ని వేసినప్పుడు, అందులోని రేఖలు (గీతలు) ఉబ్బెత్తుగా వస్తాయి.

**2. పాతాళ భూప్రస్తారము :** రేకుమీద యంత్రాన్ని గీసినప్పుడు గీతలు లోతుగా ఉంటాయి.

2. మేరుప్రస్తారము రెండు రకాలుగా ఉంటుంది.

**1. అర్ధమేరువు :** ఇందులో అష్టదళము వరకు అంటే మూడుఆవరణలు మాత్రమే అంతస్థులుగా ఉండి తరువాతవన్నీ కోణాలుగా ఉంటాయి.

**2. పూర్ణమేరువు :** ఇందులో మొత్తం తొమ్మిదిఆవరణలు అంతస్థులుగానే ఉంటాయి. పూర్ణమేరువులో మళ్ళీ రెండురకాలున్నాయి.

**1. ఊర్ధ్వదళము :** ఇందులో అష్టదళము, షోడశదళాలు పైకి లేచి ఉంటాయి.

**2. అధోదళము :** ఇందులో అష్టదళ షోడశదళపద్మాలు అధోముఖంగా క్రిందికి వాలి ఉంటాయి.

అధోదళము సంసారలంపటంలో చిక్కుక్కున లౌకికులకు, ఊర్ధ్వదళము జ్ఞానులకు ప్రతీకగా చెబుతారు. ఈ రెండురకాలు తక్కువగానే ఉంటాయి. కాని సమదళం ఎక్కువగా ఉంటుంది. అంటే ఈ రకమైన చక్రంలో అష్టదళషోడశదళ పద్మాలరేఖలు పైకి, క్రిందికీ కాక, సమానంగా ఉంటాయి. ఇవి కాకుండా వాడుకలో అనేక రకాలైన శ్రీచక్రాలున్నాయి.

**1. భూప్రస్తారంలో 12 దళాలున్న చక్రము :** అష్టదళము షోడశదళాల మధ్య ద్వాదశదళం ఉంటుంది. ఇది ద్వాదశాదిత్యులకు ప్రతీక అంటారు.

**2. భూప్రస్తారంలో 32 దళాలున్న చక్రము :** ఇవి భూపురం తరువాత ఉంటాయి. వీటిపైన షోడశదళం ఉంటుంది. షోడశిమహామంత్రంలోని శివశక్తి స్వరూపాలకు ఈ 32 దళాలు ప్రతీక అని చెబుతారు.

**3. కూర్మప్రస్థారము :** ఇందులో మేరువు కూర్మం మీద ఉంటుంది. దీన్ని వైష్ణవులు అర్చిస్తారని చెబుతారు.

**4. శివకామేశ్వరము :** శివలింగం పైన మేరువు చెక్కి ఉంటుంది. దీన్ని శైవులు పూజిస్తారు.

విశాఖపట్టణం **కనకమహాలక్ష్మిఆలయంలో** అమ్మవారి ఎదురుగా శిలా నిర్మితమైన శ్రీచక్రం ఉంది. దాన్ని **మండూకప్రస్తారము** అని చెబుతున్నారు. అయితే శక్తిసంగమతంత్రంలో

**కైలాసాఖ్యస్తు ప్రస్తారో । ద్వివిధ పరికీర్తితః ।**

**అర్ధకైలాస సంజ్ఞస్తు । పూర్ణకైలాస కస్తథా ॥**

కైలాసప్రస్థారము, అర్ధకైలాసము, పూర్ణకైలాసము అని రెండు రకాలుగా చెప్పబడింది. అయితే అర్ధ కైలాసము చిత్రాలు ఎక్కడా లభించలేదు.

ఈ రకంగా శ్రీచక్రంలో అనేక ప్రస్థారాలున్నాయి. మరి ఇలా అనేక రకాల శ్రీచక్రాలున్నప్పుడు ఏ రకమైన శ్రీచక్రాన్ని పూజించాలి ? అనే ప్రశ్న వస్తుంది. అలాంటప్పుడు గురుసంప్రదాయాన్నే పాటించాలనేది ఆర్యోక్తి. అంటే గురువుగారు ఏ రకమైన శ్రీచక్రాన్ని అర్చించమంటే, దాన్నే అర్చించాలి.

**నవావరణలు :** ఆవరణ అంటే ప్రాకారము అని అర్థం. శ్రీచక్రంలో శివచక్రాలు నాలుగు, శక్తిచక్రాలు ఐదు. వెరసి తొమ్మిదిచక్రాలున్నాయి. వీటినే నవావరణలు అంటారు. వీటిలో ప్రతి ఆవరణకు కొన్ని దళాలు లేదా కోణాలు ఉంటాయి. శ్రీచక్రానికి అధిదేవత పరమేశ్వరిపరమేశ్వరులు. వారే శివశక్తులు. శ్రీచక్రంలోని ఆవరణలను రత్నాయర్షి తన **'ఆవరణదేవతాస్తుతి'**లో వివరించాడు.

**త్రైలోక్య మోహనం వందే । సర్వాశాపరిపూరకమ్**

**సర్వసంక్షోభణం చక్రం । సర్వసౌభాగ్యదాయకమ్**

**సర్వార్థసాధకం వందే । సర్వరక్షాకరం పరమ్**

**సర్వరోగహరం చక్రం । సర్వసిద్ధి ప్రదాయకమ్**

**సర్వానందమయం చక్రం । ఇతి చక్ర క్రమం భజే ॥**

శ్రీచక్రంలో తొమ్మిదిఆవరణలున్నాయి అన్నాము కదా. వాటి వివరాలు ఈ విధంగా ఉన్నాయి.

| | | |
|---|---|---|
| 1. భూపురం | – | త్రైలోక్యమోహనచక్రము |
| 2. షోడశదళము | – | సర్వాశాపరిపూరకచక్రము |
| 3. అష్టదళము | – | సర్వసంక్షోభణచక్రము |
| 4. చతుర్దశారము | – | సర్వసౌభాగ్యదాయకచక్రము |
| 5. బహిర్దశారము | – | సర్వార్థసాధకచక్రము |
| 6. అంతర్దశారము | – | సర్వరక్షాకరచక్రము |
| 7. అష్టకోణము | – | సర్వరోగహరచక్రము |
| 8. త్రికోణము | – | సర్వసిద్ధిప్రదచక్రము |
| 9. బిందువు | – | సర్వానందమయచక్రము |

నవావరణలను చెప్పేటప్పుడు వృత్తాలను అందులో చేర్చలేదు. వృత్తాలకు పూజలేదు.

**ప్రథమావరణ :** దీన్ని త్రైలోక్యమోహనచక్రము అంటారు. ఇది లకార ప్రకృతికము. భూతత్త్వాత్మకము. ఇందులో మూడురేఖలుంటాయి. ఈ మూడు రేఖలూ భూలోక, భువర్లోక, సువర్లోకాలకు ప్రతీక. ఇవి శుక్ల, పీత, అరుణ (తెలుపు, పసుపు, ఎరుపు) వర్ణాలతో ఉంటాయి. ఈ ఆవరణకు నాలుగుద్వారాలుంటాయి. ఆ నాలుగు ద్వారాలు నాలుగువేదాలకు ప్రతీక. ఈ ద్వారాలలో గనక ప్రవేశించగలిగినట్లైతే, పరదేవత సాక్షాత్కారం కలుగుతుంది.

**శ్రీచక్రస్య చత్వారి ద్వారాణి చతుర్వేద రూపాణి**
**ద్వార ప్రవేశనైవ భవతి పరదేవతా సాక్షాత్కారః**

ఈ చక్రాన్ని అర్చించినవారు ముల్లోకాలను సమ్మోహింపచేయ గలుగుతున్నారు. ఈ ఆవరణలోని మూడురేఖలలోను విడివిడిగా దేవతలున్నాయి. ఇప్పుడు మెల్లిగా ఆ రేఖలలోకి ప్రవేశిద్దాం. ముందుగా

**శుక్లపీతారుణ వర్ణరేఖాత్రయస్య లకార ప్రకృతిక**
**పృథివ్యాత్మకస్య, చతురస్ర ప్రవేశరీత్యా**

అంటూ ప్రథమరేఖలోకి ప్రవేశిస్తున్నాము. ఈ రేఖలో అణిమాదిఅష్టసిద్ధులు దేవతల రూపంలో ఉంటాయి.

**ప్రథమరేఖ :**

**నిధివాహన సమారూఢా వరదాభయ కరాంబుజా ।**
**పద్మరాగ ప్రతీకాశాః ప్రసీదత్వం అణిమాదయః ॥**
**గరిమాణం లఘిమాణం వశిత్వమణి మహిమానౌ ।**
**ప్రాకామ్యం భక్త్యాహం వందే ప్రాప్తిం చ సర్వకామదమ్ ॥**

1. అణిమాసిద్ధి – శరీరాన్ని అతిచిన్నదిగా చెయ్యటం
2. మహిమాసిద్ధి – శరీరాన్ని అతిపెద్దదిగా చెయ్యటం
3. గరిమాసిద్ధి – శరీరం బరువు విపరీతంగా పెంచటం
4. లఘిమాసిద్ధి – శరీరాన్ని అతితేలికగా చెయ్యటం
5. ప్రాప్తిసిద్ధి – కావలసినవస్తువులు పొందటం
6. ప్రాకామ్యసిద్ధి – ఆకాశగమనము
7. ఈశిత్వసిద్ధి – సమస్తముపై అధికారము పొందటము
8. వశిత్వసిద్ధి – అన్ని భూతాలను లోబరచుకోవటము

భూపురంలోని ప్రథమావరణను అర్చించినట్లైతే ఈ ఫలితాలన్నీ సాధించ గలుగుతాము. వీటినే 'అష్టసిద్ధులు' అంటారు.

**ద్వితీయరేఖ :** ఇక రెండవరేఖలో చూసినట్లైతే

**చతుర్భుజా త్రినయనాః పద్మశూలాది హేతయః**
**విచిత్రాభరణాదేవ్యాః ప్రసీదత్వ మష్టమాతరః ॥**

ఇక్కడ నాలుగుభుజములు, మూడుకనులు కలిగి, పద్మము, శూలము మొదలైన ఆయుధాలు, చిత్రవిచిత్రమైన ఆభరణాలు ధరించిన అష్టమాతృకలుంటారు. వారు

**బ్రాహ్మీ మాహేశ్వరీ కౌమారీ వైష్ణవీ వారాహీ ।**
**మాహేంద్రీ చాముండా శ్రీమహాలక్ష్మీః పాండూ ద్వితీయ భూగృహే ॥**

1. బ్రాహ్మీ - బ్రహ్మయొక్కశక్తి
2. మహేశ్వరి - ఈశ్వరునిశక్తి
3. కౌమారి - కుమారస్వామిశక్తి
4. వైష్ణవి - విష్ణుమూర్తిశక్తి
5. వారాహి - వరాహరూపునిశక్తి
6. మాహేంద్రి - ఇంద్రునిశక్తి
7. చాముండ - చండముండులను వధించినశక్తి
8. మహాలక్ష్మి - లక్ష్మీదేవిశక్తి

**తృతీయరేఖ :** ఈ రేఖలో ముద్రాదేవతలుంటారు.

**సర్వసంక్షోభిణి, సర్వవిద్రావిణి, సర్వాకర్షిణి, సర్వవశంకరి, సర్వోన్మాదిని, సర్వమహాంకుశే, సర్వఖేచరి, సర్వబీజే, సర్వయోని, సర్వత్రిఖండ** అనబడే శక్తులుంటాయి. కాగా

**ఏతాః ప్రకటయోగిన్యః త్రిపురా చక్రనాయకా**

ఇక్కడ ఉండే యోగిని పేరు ప్రకటయోగిని. అందుకే **త్రైలోక్యమోహనచక్ర స్వామిని ప్రకటయోగిని** అంటారు. ఇక ఈ ఆవరణకు అధిదేవత 'త్రిపుర'

**ద్వితీయావరణ :** ఇది సర్వాశాపరిపూరక చక్రము. పదహారుదళాలు గల పద్మము. సకారప్రకృతికము. చంద్రకళాస్వరూపము. దీని పదహారుదళాలలోను చంద్రునియొక్క పదహారుకళలుంటాయి. చంద్రకళలు అంటే

**ప్రతిపన్నామ విజ్ఞేయా చంద్రస్య ప్రథమాకళా ।**
**ద్వితీయాద్యా ద్వితీయాద్యాః పక్షయో శుక్లకృష్ణయోః ॥**

పాడ్యమి నుంచి పౌర్ణమి వరకు తిథులు పదిహేను. ఈ రకంగా శుక్లకృష్ణపక్షాల రెండింటియందుంటాయి. అయితే

**దర్శాద్యాః పూర్ణిమాంతస్తు కళా పంచదశైవతు ।**
**షోడశీతు కళాజ్ఞేయా సచ్చిదానందరూపిణీ ॥**

దర్శ అంటే పాడ్యమి. పాడ్యమి నుండి పౌర్ణమి వరకు తిథులు పదిహేను. ఈ పదిహేనుతిథులు పదిహేనుకళలు. కాగా పదహారవకళ సచ్చిదానందరూపిణి అయిన పరమేశ్వరి. తిథులు నిత్యాస్వరూపాలు. నిత్యలు కళాస్వరూపాలు. ఈ నిత్యాదేవతల గురించి వశిష్ఠసంహితలో వివరించటం జరిగింది.

**శృణుదేవీ ప్రవక్ష్యామి నిత్యాషోడశకం తవ ।**
**నకస్య చిన్మయాఖ్యాతం సర్వమంత్రేషు గోపితం ॥**

**తత్రాదౌ ప్రథమా నిత్యా మహాత్రిపురసుందరీ ।**
**తతః కామేశ్వరీ నిత్యానిత్యాచ భగమాలినీ ॥**

**నిత్యక్లిన్నా తథాచైవ భేరుండా, వహ్నివాసినీ ।**
**మహావజ్రేశ్వరీ, రౌద్రీ, త్వరితా, కులసుందరీ ॥**

**నిత్యా, నీలపతాకా చ విజయా సర్వమంగళా ।**
**జ్వాలామాలినీ, చిద్రూపాచ ఏతానిత్యాస్తు షోడశః ॥**

వీరందరూ నిత్యాదేవతలు. ఖడ్గమాలలో వీరంతా కనిపిస్తారు. చంద్రకళలు పదహారు అవి

| | | | |
|---|---|---|---|
| 1. అమృతా | 5. పుష్టి | 9. చంద్రికా | 13. ప్రీతి |
| 2. మానదా | 6. రతి | 10. కాంతా | 14. అంగదా |
| 3. పూషా | 7. ధృతి | 11. జ్యోత్స్నా | 15. పూర్ణా |
| 4. తుష్టి | 8. శశిని | 12. శ్రీ | 16. పూర్ణామృతా |

**కామకలావిలాసం**లోని నిత్యాప్రకరణంలో "కామేశ్వరి మొదలైన నిత్యలు తిథుల రూపంలో ఉన్నాయి. ఆ తిథులు పగలు, రాత్రి రూపంలో ప్రకాశవిమర్శలుగా పంచదశీమహామంత్రంలో బీజములయి శక్తులరూపంలో ఉన్నాయి. కాగా పదహారవనిత్య మహాత్రిపురసుందరి." అని చెప్పటం జరిగింది.

శ్రీచక్రంలోని ద్వితీయావరణలో చంద్రునియొక్క కళలు పదహారు ఆకర్షణ దేవతల రూపంలో ఉంటాయి. అవి

1. కామాకర్షిణి
2. బుధ్యాకర్షిణి
3. అహంకారాకర్షిణి
4. శబ్దాకర్షిణి
5. స్పర్శాకర్షిణి
6. రూపాకర్షిణి
7. రసాకర్షిణి
8. గంధాకర్షిణి
9. చిత్తాకర్షిణి
10. ధైర్యాకర్షిణి
11. స్మృత్యాకర్షిణి
12. నామాకర్షిణి
13. బీజాకర్షిణి
14. ఆత్మాకర్షిణి
15. అమృతాకర్షిణి
16. శరీరాకర్షిణి.

వీరంతా అకారాది స్వరూపంలో అ నుంచి అః వరకు పదహారుదళాలయందు ఉంటారు. **ఏతాస్తు గుప్తయోగిన్యః త్రిపురేశీ పదాంతికే**

ఇక్కడ ఉండే యోగిని పేరు గుప్తయోగిని. ఈ ఆవరణకు అధిదేవత 'త్రిపురేశి'

**తృతీయావరణ :** ఇది సర్వసంక్షోభణ చక్రము. ఎనిమిదిదళాలు గల పద్మము. హకారప్రకృతికము. అష్టమూర్త్యాత్మకము.

**అనంగకుసుమాద్యాశ్చ పాంతు మాం రక్తకంచుకా**
**వేణీకృత కరోన్నమ్ర శరకార్ముకపాణయః**

అష్టమూర్తులు అంటే : 1. భవుడు, 2. శర్వుడు, 3. ఈశానుడు, 4. పశుపతి, 5. రుద్రుడు, 6. ఉగ్రుడు, 7. భీముడు, 8. మహాదేవుడు

వీరు ఎనిమిదిదళాలలోనూ అనంగకుసుమా మొదలైన దేవతల రూపంలో ఉంటారు. వీరు

**అనంగకుసుమానంగ మేఖలాచద్వితీయకా**
**అనంగమదనా అనంగమదనాతుర మాసహ**
**అనంగరేఖా చానంగవేగానంగాకుశాపి చ**
**అనంగమాలినీ పాండునాగ ప్రతష్ఠితా ఇమాః ॥**

1. అనంగకుసుమ
2. అనంగమేఖలా
3. అనంగమదనా
4. అనంగమదనాతురా
5. అనంగరేఖా
6. అనంగవేగినీ
7. అనంగాంకుశా
8. అనంగమాలిని.

**ఏతాస్తు గుప్తతరాభిఖ్యా త్రిపురసుందరీ పదాంతికే**

ఇక్కడ ఉండే యోగిని పేరు 'గుప్తతరయోగిని' ఈ ఆవరణకు అధిదేవత 'త్రిపురసుందరి'.

**4. చతుర్థావరణ :** ఇది సర్వసౌభాగ్యదాయక చక్రము. చతుర్దశారము. పద్నాలుగుకోణాలు గల చక్రము. ఈకార ప్రకృతికము. శ్రీచక్రంలో ఇప్పటిదాకా శివచక్రాలను గురించి చెప్పటం జరిగింది. ఇప్పుడు శక్తిచక్రాలను వివరిస్తున్నారు. ఇందులోని పధ్నాలుగు కోణాలు, పధ్నాలుగు లోకాలకు ప్రతీక. వీటిలో ఊర్ధ్వలోకాలు ఏడు. అధోలోకాలు ఏడు.

**అనేక కోటి బ్రహ్మాండానాం ఏకతమే । అతల, వితల, సుతల, తలాతల, రసాతల, మహాతల, పాతాళ లోకాది అథోలోకానాం ఊర్ధ్వభాగే**

**భూలోక, భువర్లోక, సువర్లోక, మహాలోక, జనోలోక, తపోలోక, సత్యలోకాది ఊర్ధ్వలోకానాం అథోభాగే...**

ఈ రకంగా అథోలోకాలకు పైన, ఊర్ధ్వలోకాలకు దిగువన భూలోకమున్నది. ఈ పధ్నాలుగు లోకాలే చతుర్థావరణలో పద్నాలుగు కోణాలకు ప్రతీక. వీటిలో

**క్షోభిణ్యాద్యాః ప్రసీదంతు బాణకార్ముక పాణయః**<br>
**సర్వాభరణ సంపన్నాః పృదురుకర్మసురోచిషః ॥**

క్షోభిణి మొదలైన శక్తులు ధనుర్బాణాలు చేతులయందుధరించి, సర్వాభరణాలంకృతలై ఉంటారు వారు

**సర్వసంక్షోభిణీశక్తి సర్వవిద్రావిణీ తథా**<br>
**సర్వాకర్షిణీశక్తిశ్చ సర్వాహ్లాదికా తథా**<br>
**సర్వసమ్మోహనశక్తిశ్చ సర్వస్తంభినికా తథా**<br>
**సర్వజృంభిణి శక్తిశ్చ సర్వవశంకరీ తథా**<br>
**సర్వరంజనీ శక్తిశ్చ సర్వోన్మాదినికా తథా**<br>
**సర్వార్థసాధినీ శక్తిశ్చ సర్వసంపత్తిపూరిణీ తథా**<br>
**సర్వమంత్రమయీశక్తిశ్చ సర్వద్వంద్వ క్షయంకరీ ॥**

1. సర్వసంక్షోభిణీ
2. సర్వవిద్రావిణీ
3. సర్వాకర్షిణీ
4. సర్వాహ్లాదినీ
5. సర్వసమ్మోహినీ
6. సర్వస్తంభిని
7. సర్వజృంభిణీ
8. సర్వవశంకరీ
9. సర్వరంజనీ
10. సర్వోన్మాదిని
11. సర్వార్ధసాధినీ
12. సర్వసంపత్తిపూరిణీ
13. సర్వమంత్రమయి
14. సర్వద్వంద్వ క్షయంకరి

ఇక్కడ ఉండే యోగినిపేరు సంప్రదాయయోగిని. ఈ ఆవరణకు అధిదేవత 'త్రిపురవాసిని'.

**5. పంచమావరణ :** ఇది సర్వార్ధసాధకచక్రము. బహిర్దశారము. పదికోణాలు గల చక్రము. దశావతారాత్మకము. అంటే దశావతారాలు పదికోణాలలోను ఉన్నాయన్న మాట.

**దశదేవ్యాః ప్రసీదంతు సర్వసిద్ధి ప్రదాయకాః ।**
**రక్తాస్సుపుష్పహారాఢ్యా వరదాభయ పాణయః ॥**

ఇక్కడ పదికోణాలలోను సర్వసిద్ధిప్రదా మొదలైన దేవతలు ఎర్రనిపూలమాలలు ధరించి వరదాభయ ముద్రలతో ఉంటారు వారు

**సర్వసిద్ధిప్రదాదేవీ సర్వసంపత్ప్రదా తథా**
**సర్వప్రియంకరీ దేవీ సర్వమంగళకారిణీ**
**సర్వకామప్రదా దేవీ సర్వదుఃఖవిమోచనీ**
**సర్వమృత్యు ప్రశమనీ దేవీ సర్వవిఘ్న నివారిణీ**
**సర్వాంగసుందరీ దేవీ సర్వసౌభాగ్యదాయనీ**

1. సర్వసిద్ధిప్రద
2. సర్వసంపత్ప్రద
3. సర్వప్రియంకరి
4. సర్వమంగళకారిణీ
5. సర్వకామప్రద
6. సర్వదుఃఖవిమోచనీ
7. సర్వమృత్యుప్రశమనీ
8. సర్వవిఘ్ననివారిణీ
9. సర్వాంగసుందరీ
10. సర్వసౌభాగ్యదాయనీ

**ఏతాదేవ్యాః కుళోత్తీర్ణా స్త్రి పురాశ్రీ చక్రనాయకా**

ఇక్కడ ఉండే యోగినిపేరు కుళోత్తీర్ణయోగిని. ఈ ఆవరణకు అధిదేవత "త్రిపురాశ్రీ"

**6. షష్ఠావరణ :** ఇది సర్వరక్షాకరచక్రము. అంతర్దశారము. పదికోణములు గల చక్రము. రకార ప్రకృతికము. దశకళాత్మకము. అగ్నియొక్కకళలు పది ఈ కోణాలలో ఉంటాయి. అగ్నికళలు అంటే

1. ధూమ్ర
2. ఊష్మ
3. జలిని
4. జ్వాలిని
5. విస్ఫులింగినీ
6. సుశ్రీ
7. సురూప
8. కపిల
9. హవ్యవాహిని
10. కవ్యవాహిని

**సుప్రసీదంతు దేవ్యశ్చ పుస్తకాక్షాది పాణయః**

**శుద్ధస్ఫటిక సంకాశా సర్వజ్ఞాద్యాశ్చ దేవతాః ॥**

ఇక్కడ సర్వజ్ఞ మొదలైన దేవతలు పుస్తకము, అక్షమాల మొదలైనవి చేతుల యందు ధరించి శుద్ధస్ఫటికములాగా ప్రకాశిస్తుంటారు.

**సర్వజ్ఞా సర్వశక్తి సర్వైశ్వర్యప్రదాయినీ**

**సర్వజ్ఞానమయీదేవి సర్వవ్యాధివినాశినీ**

**సర్వాధారాస్వరూపా చ సర్వపాపహరా తథా**

**సర్వానందమయీదేవీ సర్వరక్షాస్వరూపిణీ**

**సర్వేప్సితప్రదా హేతా యోగిన్యో గర్భసంజ్ఞకా**

1. సర్వజ్ఞ
2. సర్వశక్తి
3. సర్వైశ్వర్యప్రదాయినీ
4. సర్వజ్ఞానమయీ
5. సర్వవ్యాధివినాశినీ
6. సర్వాధారస్వరూపా
7. సర్వపాపహరా
8. సర్వానందమయీ
9. సర్వరక్షాస్వరూపిణీ
10. సర్వేప్సితఫలప్రదా

**ఏతాదేవ్యాః నిగర్భయోగిన్యాః త్రిపురమాలినీ చక్రనాయికా**

ఇక్కడ ఉండే యోగినిపేరు నిగర్భయోగిని. ఈ ఆవరణకు అధిదేవత 'త్రిపురమాలిని'

**7. సప్తమావరణ:** ఇది సర్వరోగహరచక్రము. అష్టకోణము. కకార ప్రకృతికము. అష్టమూర్త్యాత్మకము. దీనిలోని ఎనిమిదికోణాలయందు అష్టవసువులు వాగ్దేవతల రూపంలోఉంటారు. అష్టవసువులు

| | |
|---|---|
| 1. ఆపుడు | 5. అనిలుడు |
| 2. ధృవుడు | 6. అనలుడు |
| 3. సోముడు | 7. ప్రత్యూషుడు |
| 4. ధరుడు | 8. ప్రభాసుడు |

**వాగ్దేవతాః ప్రసీదంతు సింధూర కనకాంబరా**

**పుస్తకాక్షాది విలసత్ వరదాభయపాణయః**

వాగ్దేవతలు ఈ ఆవరణలో సింధూరము కనకాంబరము కలిసిన రంగులో వస్త్రాలు ధరించి పుస్తకము, అక్షమాల వరద, అభయ ముద్రలు ధరించి ఉంటారు. వారు

**వశిని కామేశ్వరి మోదినీమలా విరుణా జయ న్యశ్చ**

**సర్వేశ్వరీ కౌళిన్యశ్చేతాస్తు రహస్యయోగినీ దేవ్యః**

| | |
|---|---|
| 1. వశిని | 5. అరుణ |
| 2. కామేశ్వరి | 6. జయ |
| 3. మోదిని | 7. సర్వేశ్వరి |
| 4. విమల | 8. కౌళిని |

**ఏతాః రహస్యయోగిన్యః త్రిపురాసిద్ధాంబా చక్రనాయికా**

ఇక్కడ ఉండే యోగినిపేరు రహస్యయోగిని. ఈఆవరణకు అధిదేవత 'త్రిపురాసిద్ధాంబ'

**8. అష్టమావరణ :** ఇది సర్వసిద్ధిప్రదచక్రము. త్రికోణము. త్రిగుణాత్మకము. ఇక్కడ కామేశ్వరి, వజ్రేశ్వరి, భగమాలిని అనే దేవతలు ఆయుధ బీజధారులై ఉంటారు.

**రక్తవర్ణా రక్తభూషా వరదాభయ పాణయః**
**సాయుధామకుటోపేతా ధ్యాయే ద్యాయుధ దేవతా ॥**

ఎర్రనివర్ణము కలిగి, ఎరుపు వస్త్రములు ధరించి, చేతులయందు ఆయుధములు ధరించి కామేశ్వరి, వజ్రేశ్వరి, భగమాలినీ అనే దేవతలుంటారు.

**ఏతాః అతిరహస్య యోగిన్యః త్రిపురాంబా చక్రనాయికా**

ఇక్కడ ఉండే యోగినిపేరు అతిరహస్యయోగిని. ఈ ఆవరణకు అధిదేవత 'త్రిపురాంబా'.

**9. నవమావరణ :** ఇది సర్వానందమయచక్రము బిందురూపము. అదే పరబ్రహ్మస్వరూపము. ఇక్కడ శివశక్తులు ఉంటారు.

**శ్రీశ్రీశ్రీ పరాభట్టారికే సర్వానందయ చక్రస్వామినీ పరాపర రహస్యయోగిని**

ఈ ఆవరణలో ఉండేది పరాభట్టారిక. ఆమెయే పరమేశ్వరి.

**ఏతాః పరాపర రహస్యయోగిన్యః మహాత్రిపురసుందరీ చక్రనాయికా**

ఇక్కడ ఉండే యోగినిపేరు పరాపరరహస్యయోగిని. ఈఆవరణకు అధిదేవత మహాత్రిపురసుందరి.

**వృత్తాలు :** ఇప్పటిదాకా ఆవరణలు చూశాం కదా ! ఇప్పుడు శ్రీచక్రంలోని వృత్తాలను చూద్దాం.

శ్రీచక్రంలో మూడు వృత్తాలున్నాయి అని ముందే చెప్పుకున్నాం. అయితే నవావరణలలో వృత్తాలు చెప్పబడలేదు. అసలు శ్రీచక్రంలో వృత్తాలు ఉన్నాయా ? లేదా ? అని చూసినట్లైతే, హయగ్రీవ సంప్రదాయంలో అసలు వృత్తాలే లేవు. ఆనందభైరవసంప్రదాయంలో వృత్తత్రయం ఉన్నది. కాని దానికి పూజమాత్రం లేదు. దక్షిణామూర్తిసంప్రదాయంలో వృత్తత్రయానికి పూజ ఉన్నది అని చెప్పబడింది. ఆ పూజ ఏ రకంగా ఉన్నదో మాత్రం తెలియదు.

**వృత్తాలు ఎన్ని? :** శ్రీచక్రలేఖనంలో కోణాలు గీయటానికి వృత్తాలు అవసరం లేదు. ఒకవృత్తంగీసి, అందులోనే కోణాలుగీయటం జరుగుతుంది. అంటే ఇందులో త్రికోణము అష్టకోణము, దశారయుగ్మము, చతుర్దశారము వస్తాయి. దీనినిబట్టి చతుర్దశారము వెలుపల ఒకవృత్తముగీసి అందులో అష్టదళపద్మము, ఇంకొక వృత్తముగీసి అందులో షోడశదళపద్మము ఏర్పాటు చేయటం జరుగుతుంది. ఈ రకంగా శ్రీచక్రంలో మూడు వృత్తాలున్నాయి. అని తెలుస్తోంది. అయితే గౌడపాదుల వారు, శంకరులవారు, లక్ష్మీధరుడు మొదలైన వారంతా చెప్పిన దాన్నిబట్టి శ్రీచక్రంలో మూడు వృత్తాలున్నాయి.అయితే కొన్నిచోట్ల ప్రతిఆవరణకు ఒకవృత్తంచొప్పున శ్రీచక్రంలో ఎనిమిదివృత్తాలున్నాయని చెప్పబడింది. దీనికి అనుగుణంగానే మేరువును పరిశీలించినట్లైతే అందులో ఎనిమిదివృత్తాలు కనిపిస్తాయి. ఈరకంగా ప్రతిఆవరణకు ఒకవృత్తాన్ని ఏర్పాటుచేసుకున్నట్లైతే, అందులో దళాలు, కోణాలు చెక్కటం తేలిక. అందుచేతనే శ్రీచక్రంలోని వృత్తాలు దాని తయారీలోని సులువు కోసం ఏర్పాటయినవే కాని వేరుకాదు అంటారు. అయితే పండితాభిప్రాయాన్ననుసరించి శ్రీచక్రంలో మూడువృత్తాలున్నాయి.

**వృత్తాలు ఎక్కడ ఉన్నాయి? :** శ్రీచక్రంలోవృత్తాలు మూడు అని రూఢి అయింది. కాని అవి ఎక్కడ ఉంటాయనే విషయంలోనే భేదాభిప్రాయమున్నది. కొన్ని తంత్రాల ప్రకారము మూడు వృత్తాలు ఒకేచోట అంటే షోడశదళపద్మానికీ, భూపురానికీ మధ్యన ఉంటాయి. మరికొన్నింటి ప్రకారము భూపురంపైన ఒకటి, షోడశదళంపైన ఒకటి, అష్టదళంపైనఒకటి ఉంటాయి. ముందుగా వృత్తాలు మూడు ఒకేచోట ఉంటాయనటానికి ఆధారాలు చూద్దాం.

**బిందుత్రికోణ వసుకోణ దశారయుగ్మ**
**మన్వస్రష్టదళ సంయుత షోడశారమ్ ।**
**వృత్తత్రి భూపురయుతం పరితశ్చతుర్ద్వాః**
**శ్రీచక్రమే తే దురితం పరదేవతాయాః ॥**

ఈ శ్లోకం ప్రకారం వృత్తాలు మూడు ఒకేచోట అదికూడా భూపురానికి, షోడశదళానికి మధ్యన ఉంటాయి.

**బిందు త్రికోణ వసుకోణ దశారయుగ్మ**

**మన్వస్ర నాగదళ షోడశపత్రయుక్తం**

**వృత్తత్రయంచ ధరణీ సదనత్రయం చ**

**శ్రీచక్రరాజ ఉదితః పరదేవతాయాః ॥**

ఇదేవిషయాన్ని గౌడపాదులవారుకూడా తమ సుభగోదయస్తుతిలో వివరించారు.

**త్రికోణై రష్టారం త్రిభిరపి దశారం సమదభూ**

**ర్దశారం భూగేహాదపిచ భువనాశ్రం సమభవత్ ।**

**తతోఽభూన్నాగారం నృపతిదల మస్మా త్రివలయం**

**చతుర్ద్వాః ప్రాకారత్రితయ మిదమేవాంబ శరణమ్ ॥**

శంకర భగవత్పాదాలవారు కూడా **'చతుర్భిశ్రీకంఠై'** అనే 11 శ్లోకంలో **'వసుదళ కలాశ్రత్రివలయ'** అన్నారు. ఈ శ్లోకాలను బట్టి మూడువృత్తాలు షోడశదళానికి, భూపురానికి మధ్యనే ఉన్నాయి. శ్రీచక్రన్యాసంలో

**బైందవం బ్రహ్మరంధ్రం చ మస్తకం చ త్రికోణకమ్**

**లలాటేష్టారకం పత్రం భ్రువోర్మధ్యే దశారకమ్**

**బహిర్దశారం కంఠేతు హృదయే చతుర్దశారకమ్**

**నాభౌచ వసుపత్రం చ కట్యాం షోడశ పత్రకమ్**

**వృత్తత్రయం చ ఊరుభ్యాం పద్భ్యాం భూపురత్రయమ్ ।**

దీని ప్రకారము మానవదేహంలోని

| | | | | | |
|---|---|---|---|---|---|
| బ్రహ్మరంధ్రము | – | బిందువు | హృదయము | – | చతుర్దశారము |
| మస్తకము | – | త్రికోణము | నాభి | – | అష్టదళము |
| లలాటము | – | అష్టకోణము | కటి | – | షోడశదళము |
| భ్రూమధ్యము | – | అంతర్దశారము | ఊరువులు | – | వృత్తత్రయము |
| కంఠము | – | బహిర్దశారము | పాదాలు | – | భూపురము |

వీటన్నింటినీ ఆధారంగా చేసుకుని వృత్తాలుమూడు ఒకేచోట అదికూడా షోడశ దళానికి, భూపురానికి మధ్యన ఉన్నాయి అని తెలుస్తోంది.

అయితే ఈవృత్తాలు విడివిడిగాఉన్నాయని చెప్పటానికి కూడా తగినంత ఆధారమున్నది. ప్రపంచసారసంగ్రహంలో

**బిందు త్రికోణ కాష్టావతారయుగ లోకకోణ వృత్తయుతమ్ ।**

**వసుదళ వృత్త కళాదళ వృత్త త్రిమహీగృహం భజే చక్రమ్ ॥**

అని చెప్పబడింది. దీన్నిబట్టి ఈ వృత్తాలు చతుర్దశారము – అష్టదళము మధ్యన ఒకటి, అష్టదళము–షోడశదళము మధ్యన ఒకటి, షోడశదళము – భూపురము మధ్యన ఒకటి ఉన్నాయి. శ్రీచక్రన్యాసంలో

**కుక్షౌతు ప్రథమవృత్తం । నాభ్యామష్టదళాంబుజమ్**

**కట్యాం ద్వితీయం వలయం । స్వాధిష్ఠానే కలాశ్రకమ్**

**తస్యాధస్త్వాత్ తృతీయం । మూలాధారే చతురస్రకం**

| | | | |
|---|---|---|---|
| కుక్షి భాగము | – ప్రథమవృత్తము | స్వాధిష్ఠానము | – షోడశదళము |
| నాభి | – అష్టదళము | స్వాధిష్ఠానము క్రింద | – తృతీయవృత్తము |
| కటి | – ద్వితీయవృత్తము | మూలాధారము | – భూపురము |

ఈ రకంగా వృత్తాలుమూడు విడివిడిగానే ఉంటాయి. శ్రీచక్రాన్ని చెప్పేటప్పుడు మానవదేహంలోని బ్రహ్మగ్రంధి, విష్ణుగ్రంధి, రుద్రగ్రంధులే వృత్తత్రయము అని చెప్పబడింది. అలాగే పంచదశిమహామంత్రంలోని మూడుహ్రీంకారాలు శ్రీచక్రంలోని మూడువృత్తాలు. హ్రీంకారాలు, గ్రంథులు విడివిడిగానే ఉంటాయి కాబట్టి శ్రీచక్రంలోని వృత్తాలు కూడా విడివిడిగానే ఉంటాయి. అయితే శ్రీచక్రంలో వృత్తాలు ఎక్కడ ఉన్నప్పటికీ వాటిని నవావరణలలో చేర్చలేదు. వాటికి పూజకూడా లేదు. మరి ఆ వృత్తాలలో దేవతలున్నారా ? అంటే ఉన్నారు అని చెబుతోంది. **'శ్రీవిద్యా విలాసము'** అనే గ్రంథం.

ప్రృథమవృత్తంలో ఏడుగురు దేవతలుంటారు. వారు

| | | |
|---|---|---|
| 1. శంకరీ | 4. అఘోరస్వరూపిణి | 6. హాలహలధారిణీ |
| 2. ఇందుశేఖరీ | 5. హనదహనయనా | 7. భూరిభవా |
| 3. అర్ధనారీశ్వరీ | | |

ద్వితీయ వృత్తంలో పన్నెండు మంది దేవతలుంటారు. వారు

| | | |
|---|---|---|
| 1. నారాయణా | 5. గోవిందా | 9. శ్రీధరా |
| 2. త్రివిక్రమా | 6. దామోదరా | 10. హృషీకేశా |
| 3. కేశవా | 7. మధుసూదనా | 11. పద్మనాభా |
| 4. మాధవా | 8. వామనా | 12. కమలనయనా |

తృతీయవృత్తంలో పన్నెండుమంది దేవతలుంటారు. వారు

| | | |
|---|---|---|
| 1. చతుర్ముఖా | 5. చతురశ్రగేహినీ | 9. త్రికమలా |
| 2. చతురాననా | 6. చతుర్దశఫలప్రదా | 10. త్రిరేఖా |
| 3. చతురాంగీ | 7. త్రయీమయి | 11. త్రిగుణా |
| 4. చతురశ్రా | 8. త్రిముఖదేవి | 12. త్రిమూర్తిదేవి |

ఏదిఏమైనప్పటికీ ఈవృత్తాలను ఆవరణలలోచేర్చలేదు. వాటిలో దేవతలున్నప్పటికీ ఎందుచేతనో వారికి పూజకూడాలేదు. కాబట్టి ఈవిషయం మీద వాదోపవాదాలుమాని, గురుసంప్రదాయాన్ని పాటించటం మంచిది.

**శ్రీచక్రము-భావనోపనిషత్తు :** అమ్మవారిని గురించి చెప్పే ఉపనిషత్తులలో భావనోపనిషత్తు ప్రధానమైనది. ఇందులో మొదట శ్రీచక్రాన్ని వివరించి, ఆ తరువాత అంతర్యాగాన్ని వివరించారు. భావనోపనిషత్తులో అంతర్యాగాన్ని ఇంతకుముందు పేజీలలో చూశాం. ఇప్పుడు శ్రీచక్రాన్ని గురించి చూద్దాం.

**తేన నవరంధ్రరూపో దేహః నవచక్రరూపం శ్రీచక్రం**

మానవదేహము నవరంధ్రాలతో కూడినది. శ్రీచక్రములో తొమ్మిది ఆవరణలున్నాయి. త్వగాదిధాతువులుతొమ్మిది. బిందువు దగ్గర నుంచి భూపురందాకా

ఉన్న చక్రాలన్నీ మానవదేహంలో ఉన్నాయి. ఇవన్నీ మానవదేహంలో వివిధాంగాలు. అలాగే సాధకుని దేహంలో గల షట్చక్రాలు, శ్రీచక్రంలోని నవావరణలతో ఐక్యత చెందుతున్నాయి. ఈ విషయాలన్నింటినీ ఇంతకుముందు చెప్పుకున్నాం. వీటిని బట్టి మానవదేహమే శ్రీచక్రము అని తెలుస్తుంది.

**వారాహీ పిత్రురూపా కురుకుళ్ళావతీ దేవతామాతా ।**

శ్రీచక్రానికి అధిదేవత పరాత్పరి. అలాగే సాధకుడికి తండ్రి వారాహి. తల్లి కురుకుళ్ళావతి. ఇక్కడ మాతా అంటే సాధకుని యోగ్యతను బట్టి కోరికలు తీర్చేది. ఐహికవాంఛలు, మోక్షములనుప్రసాదించేది. మానవదేహంలో ఉన్న సుషుమ్నానాడినే 'కురుకుళ్ళా' అంటారు. సుధాసింధువు మధ్యన ఉన్న శ్రీదేవిపట్టణమైన మణిద్వీపానికి, చిత్తము, అహంకారము అనే రెండు ప్రాకారాల మధ్య, విమర్శరూపాత్మకమైన బావియందుండేది కురుకుళ్ళావతి అనే దేవత.

'లలితాస్తవరత్నము'లో కురువింద రత్నములపై నివసించునది. కులపర్వతములకు మించిన స్తనములచే వంగిననడుముగలది. కుంకుమ పూయబడిన దేహముకలది అయిన కురుకుళ్ళాదేవిని మనసా ధ్యానించుచున్నాను. అని చెప్పబడింది. **లలితాసహస్రం**లో 438వ నామము 'కురుకుళ్ళా'

**పురుషార్ధస్సాగరాః** పురుషార్థాలే సప్తసముద్రాలు.

**దేహోనవరత్న ద్వీపః :** సాధకుని శరీరమే నవరత్నమయమైన ద్వీపము. ఇదే మణిద్వీపము. మానవుని సంకల్పవికల్పాలే మణిద్వీపంలో ఉండే కల్పవృక్ష సముదాయము. షడ్రుచులే షడ్రుతువులు. మానవదేహము త్రిశక్తిమయము. 1. ఇచ్ఛాశక్తి 2. జ్ఞానశక్తి 3. క్రియాశక్తి. ఈ శక్తులవల్లనే పనులు జరుగుతాయి. ఇచ్ఛాశక్తి విశ్వరూపము. జ్ఞానశక్తి మందిరము. క్రియాశక్తి పీఠము. ఈ రకంగా శ్రీచక్రమేమానవదేహము అని చెబుతూ శ్రీచక్రంలోని నవావరణలను వివరిస్తున్నారు.

**ప్రథమావరణ :** సాధకుని శరీరంలోని నవరసాలే ప్రథమావరణ అయిన భూపురంలోని ప్రథమరేఖ ఇందులో ఉండే దేవతలు.

**వియతిసహిత శృంగారాదయో నవరసాద్యణిమాదయః**

| శరీరంలోని నవరసాలు | ప్రథమరేఖలోని దేవతలు |
|---|---|
| 1. శృంగారరసము | అణిమాసిద్ధి |
| 2. హాస్యరసము | లఘిమాసిద్ధి |
| 3. కరుణరసము | గరిమాసిద్ధి |
| 4. రౌద్రరసము | మహిమాసిద్ధి |
| 5. వీరరసము | ఈశిత్వసిద్ధి |
| 6. భయానకరసము | వశిత్వసిద్ధి |
| 7. బీభత్సరసము | ప్రాకామ్యసిద్ధి |
| 8. అద్భుతరసము | ప్రాప్తిసిద్ధి |
| 9. శాంతరసము | సర్వకామసిద్ధి |

**కామక్రోధలోభమోహమదమాత్సర్య పుణ్యపాపమయీ బ్రాహ్మ్యాద్యష్టశక్తయః**

భూపురంలోని రెండవరేఖలో ఉన్న ఎనిమిదిమంది దేవతలు సాధకుని శరీరంలోని మనోవికారాలు మొదలైన దేవతలు. వారే బ్రాహ్మి

| మనోవికారాలు | ద్వితీయ రేఖలోని దేవతలు | మనోవికారాలు | ద్వితీయ రేఖలోని దేవతలు |
|---|---|---|---|
| 1. కామము | బ్రాహ్మి | 5. మదము | వారాహి |
| 2. క్రోధము | మహేశ్వరి | 6. మాత్సర్యము | మహేంద్రి |
| 3. లోభము | కౌమారి | 7. పుణ్యము | చాముండ |
| 4. మోహము | వైష్ణవి | 8. పాపము | మహాలక్ష్మి |

**ఆధారనవకంముద్రాశక్తయః**

సాధకుని శరీరంలోని మూలాధారంనుంచి ద్వాదశాంతంవరకు గల తొమ్మిది స్థానాలు, భూపురంలోని తృతీయరేఖలో గల ముద్రాశక్తులు. వారు

| సాధకుని శరీరంలోని స్థానాలు | ముద్రాశక్తులు |
|---|---|
| 1. మూలాధారము | సర్వసంక్షోభిణి |
| 2. స్వాధిష్ఠానము | సర్వవిద్రావిణి |
| 3. మణిపూరము | సర్వాకర్షిణి |
| 4. అనాహతము | సర్వవశంకరి |
| 5. విశుద్ధిచక్రము | సర్వోన్మాదిని |
| 6. లంబికాగ్రము | సర్వమహాంకుశ |
| 7. ఆజ్ఞాచక్రము | సర్వఖేచరి |
| 8. సహస్రారము | సర్వబీజ |
| 9. ద్వాదశాంతము | సర్వయోని |

**ద్వితీయావరణ :**

**పృథివ్యాపస్తేజో వాయ్వాకాశ శ్రోత్ర త్వక్ చక్షుర్జిహ్వా ఘ్రాణవాక్పాణి పాదపాయు ఉపస్థ మనోవికారా షోడశశక్తయః**

ద్వితీయావరణలో పంచభూతాలు, జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు, మనస్సుల యొక్క స్వరూపాలే ఆకర్షణ దేవతలు

| పంచభూతాలు ఇంద్రియాలు | ఆకర్షణదేవతలు | పంచభూతాలు ఇంద్రియాలు | ఆకర్షణదేవతలు |
|---|---|---|---|
| 1. పృథివి | కామాకర్షిణి | 9. నాలుక | చిత్తాకర్షిణి |
| 2. జలము | బుద్ధ్యాకర్షిణి | 10. చర్మము | ధైర్యాకర్షిణి |
| 3. నిప్పు | అహంకారాకర్షిణి | 11. వాక్కు | స్మృత్యాకర్షిణి |
| 4. వాయువు | శబ్దాకర్షిణి | 12. పాణి (చేయి) | నామాకర్షిణి |
| 5. ఆకాశము | స్పర్శాకర్షిణి | 13. పాదము (కాలు) | బీజాకర్షిణి |
| 6. కన్ను | రూపాకర్షిణి | 14. పాయువు (గుదము) | ఆత్మాకర్షిణి |
| 7. ముక్కు | రసాకర్షిణి | 15. ఉపస్థ (రహస్యాంగము) | అమృతాకర్షిణి |
| 8. చెవి | గంధాకర్షిణి | 16. మనస్సు | శరీరాకర్షిణి |

**తృతీయావరణ :**

**వచన దానాగమన విసర్గానంద హానోపాదానోపేక్షాబద్ధయో అనంగకుసుమాది శక్తియోష్ఠా**

తృతీయావరణలో ఉండే అనంగకుసుమ మొదలైన దేవతలంతా శరీరంలోని కర్మేంద్రియాల ధర్మాలు, ప్రవృత్తి, నివృత్తి, ఉపేక్ష.

| | **ఇంద్రియధర్మాలు** | **తృతీయావరణ దేవతలు** |
|---|---|---|
| 1. | వచనము | అనంగకుసుమ |
| 2. | దానము | అనంగమేఖల |
| 3. | గమనము | అనంగమదన |
| 4. | విసర్గము (మూలవిసర్జన) | అనంగమదనాతురా |
| 5. | సంభోగము | అనంగరేఖా |
| 6. | ప్రవృత్తి | అనంగవేగినీ |
| 7. | నివృత్తి | అనంగాంకుశా |
| 8. | ఉపేక్ష | అనంగమాలిని |

**చతుర్థావరణ :**

**అలంబుసా, కుహూ, విశ్వోదరి, వరుణా, హస్తిజిహ్వా, యశస్వతీ, అశ్వనీ, గాంధారీ, పూషా, శంఖినీ, సరస్వతీ, ఇడా, పింగళా, సుషుమ్నా చేతి చతుర్దశ నాద్యః సర్వసంక్షోభిణ్యాది చతుర్దశ దేవతా**

ఈ ఆవరణలో ఉండే పద్నాలుగు మంది దేవతలు శరీరంలోని వివిధ నాడులు అవి

| | **శరీరంలోని నాడులు** | **చతుర్థావరణలోని దేవతలు** |
|---|---|---|
| 1. | అలంబుసా | సర్వసంక్షోభిణి |
| 2. | కుహూ | సర్వవిద్రావిణి |
| 3. | విశ్వోదరి | సర్వాకర్షిణి |
| 4. | వరుణా | సర్వాహ్లాదినీ |

| | | |
|---|---|---|
| 5. | హస్తిజిహ్వా | సర్వసమ్మోహిని |
| 6. | యశస్వతీ | సర్వస్తంభినీ |
| 7. | అశ్వనీ | సర్వజృంభిణీ |
| 8. | గాంధారీ | సర్వవశంకరీ |
| 9. | పూషా | సర్వరంజనీ |
| 10. | శంఖినీ | సర్వోన్మాదినీ |
| 11. | సరస్వతీ | సర్వార్ధసాధినీ |
| 12. | ఇడా | సర్వసంపత్తిపూరిణి |
| 13. | పింగళా | సర్వమంత్రమయీ |
| 14. | సుషుమ్నా | సర్వద్వంద్వక్షయంకరీ |

**పంచమావరణ :**

**ప్రాణా, పాన, వ్యానో, దాన, సమాన, నాగ, కూర్మ, కృకర, దేవదత్త, ధనుంజయాది దశవాయవః సర్వసిద్ధిప్రదాది దేవ్యో బహిర్దశారదేవతా**

బహిర్దశారంలో ఉండే పదిమంది దేవతలు దశవిధ వాయువులు. అవి

| | వాయువు | ఆవరణ దేవత |
|---|---|---|
| 1. | ప్రాణవాయువు | సర్వసిద్ధిప్రదాదేవి |
| 2. | అపానవాయువు | సర్వసంపత్ప్రదాదేవి |
| 3. | వ్యానవాయువు | సర్వప్రియంకరీదేవి |
| 4. | ఉదానవాయువు | సర్వమంగళకారిణీదేవి |
| 5. | సమానవాయువు | సర్వకామప్రదాదేవి |
| 6. | నాగవాయువు | సర్వదుఃఖవిమోచనీదేవి |
| 7. | కూర్మవాయువు | సర్వమృత్యుప్రశమనీదేవి |
| 8. | కృకరవాయువు | సర్వవిఘ్ననివారిణీదేవి |
| 9. | దేవదత్తవాయువు | సర్వాంగసుందరీదేవి |
| 10. | ధనుంజయవాయువు | సర్వసౌభాగ్యదాయినీదేవి |

**షష్ఠావరణ :**

**ఏతద్వాయుదశక సంసర్గోపాధిబేధేన రేచక, పూరక, శోషక, దాహక, ప్లావకామృతమితి ప్రాణముఖ్యత్వేన పంచవిధోస్తి మనుష్యాణాం మోహకో, దాహకో, భక్ష్య, భోజ్య, లేహ్య, చోష్య, పేయాత్మకం చతుర్విధమన్నం పాచయంత్యేతాః దశవిధకళా సర్వజ్ఞత్వాది అంతర్దశార దేవతాః**

అంతర్దశారంలో ఉండే పదిమంది సర్వజ్ఞ మొదలైన దేవతలు, రేచకము మొదలైన వాయువుల గుణములు, భక్ష్యము మొదలైన వివిధాన్నములు.

| **దశవిధవాయువుల గుణాలు** | **షష్ఠావరణ దేవతలు** |
|---|---|
| 1. రేచకము (ఊపిరి విడచుట) | సర్వజ్ఞాదేవి |
| 2. పూరకము (ఊపిరి పూరించుట) | సర్వశక్తిదేవి |
| 3. శోషకము (శోషిల్లుట) | సర్వైశ్వర్యప్రదాయనీదేవి |
| 4. దాహకము (దాహకగుణము) | సర్వజ్ఞానమయీదేవి |
| 5. ప్లావకము (పావకగుణము) | సర్వవ్యాధినివారిణీదేవి |
| వివిధాన్నములు | |
| 6. భక్ష్యము (తినదగినది) | సర్వాధారస్వరూపిణీదేవి |
| 7. భోజ్యము (భుజింపతగినది) | సర్వపాపహరాదేవి |
| 8. లేహ్యము (నాకి భుజింపతగినది) | సర్వానందమయీదేవి |
| 9. చోష్యము (పీల్చుతగినది) | సర్వరక్షాస్వరూపిణీదేవి |
| 10. పేయము (త్రాగతగినది) | సర్వేపిసత్ఫలప్రదాదేవి |

**సప్తమావరణ :**

**శీతోష్ణసుఖదుఃఖేచ్ఛా సత్వరజస్తమో గుణా వశిన్యాది శక్తయోష్టౌ**

సప్తమావరణలోని ఎనిమిది కోణాలయందు ఉండే వశిన్యాది దేవతలే శీతము, ఉష్ణము మొదలైన శరీరలక్షణాలు.

| శరీర లక్షణాలు | సప్తమావరణలోని దేవతలు | శరీర లక్షణాలు | సప్తమావరణలోని దేవతలు |
|---|---|---|---|
| 1. శీతము | వశినీ | 5. ఇచ్ఛ | అరుణా |
| 2. ఉష్ణము | కామేశ్వరి | 6. సత్త్వగుణము | జయనీ |
| 3. సుఖము | మోదిని | 7. రజోగుణము | సర్వేశ్వరీ |
| 4. దుఃఖము | విమలా | 8. తమోగుణము | కౌళినీ |

**శబ్దస్పర్శ రూపరసగంధాః పంచతన్మాత్రా పంచపుష్పబాణాః**

దేవిచేతిలో ఉన్న బాణాలను చెబుతున్నారు. శబ్ద, స్పర్శ, రూప,రస, గంధాలనబడే పంచతన్మాత్రలే పరమేశ్వరి చేతిలో బాణాలు.

**మనః ఇక్షుధనుః, వశ్యోబాణః, రాగః పాశో, ద్వేషోంకుశః**

పరమేశ్వరి చేతిలోని ఆయుధాలు సాధకునిలో గల రాగద్వేషాలు.

చెరకువిల్లు – సాధకుని మనస్సు

బాణము – వశ్యము

పాశము – అనురాగము

అంకుశము – ద్వేషము

**అష్టమావరణ :**

**అవ్యక్త, మహత్తత్త్వాహంకారాః కామేశ్వరీ, వజ్రేశ్వరీ, భగమాలినీ త్రికోణాగ్ర దేవతాః**

ఎనిమిదవ ఆవరణలో ఉండే దేవతలు అవ్యక్త, మహతత్త్వ, అహంకారాలు.

1. అవ్యక్తము – కామేశ్వరి
2. మహత్తత్త్వము – వజ్రేశ్వరి
3. అహంకారము – భగమాలిని

**పంచదశతిథిరూపేణ కాలస్య పరిమాణావలోకనం పంచదశ నిత్యాః**

ఎనిమిదవ ఆవరణ త్రికోణము. దాని మూడు రేఖలయందు ఐదుగురు చొప్పున పదిహేను మంది దేవతలున్నారు. వీరే నిత్యాదేవతలు. కామేశ్వరీ, భగమాలినీ మొదలైనవారు. వీరిని ఈ శ్లోకంలోనే వివరించటం జరిగింది.

**నవమావరణ :**

**శబ్దానురూపాధీర్దేవతాయోః కామేశ్వరీ సదానంద ఘనాపూర్ణా స్వాత్మైకరూపా దేవతా ॥**

శ్రీచక్రంలో తొమ్మిదవ ఆవరణ బిందువు. దీనిలో ప్రధానదేవతలు కామేశ్వరీ, కామేశ్వరులు. సాధకుడి ఆత్మయే కామేశ్వరి. బుద్ధి కామేశ్వరుడు. కాబట్టి సాధకుడి ఆత్మ, దేవి రెండూ ఒక్కటే. ఎప్పుడైతే తన ఆత్మ దేవి స్వరూపం అయిందో, అప్పుడు అతడు పరబ్రహ్మ అవుతాడు. దీనినే బ్రహ్మాత్మైకాను సంధానము అంటారు. ఇదే జీవన్ముక్తి.

**శ్రీచక్రము - బిందువు త్రికోణము :**

శ్రీచక్రంలో ప్రధానమైనది బిందువు. ఇది తొమ్మిదవ ఆవరణ. సర్వానందమయ చక్రము. ఇక్కడ శివశక్తులు విహరిస్తుంటారు. **'యోగినీ హృదయం'లో త్రికోణరూపిణీ శక్తిః బిందురూప పరశ్శివః** అని చెప్పటంవల్ల ఈ రెండు ప్రకాశ విమర్శలుగా చెప్పబడ్డాయి.

లలితా త్రిశతి ఫలశృతి, భైరవయామళం వంటి గ్రంథాలలో **త్రికోణే బైందవమ్ శ్లిష్ఠమష్టారేష్ట దళాంబుజమ్** అని చెప్పబడింది. అంటే బిందువు త్రికోణంలోనే ఉన్నది అని అర్థం. ఈ విషయాన్ని అందరూ అంగీకరిస్తున్నారు. కౌళసమయాచారాల్లో అర్చనా భేదం మాత్రమే ఉన్నది. కాని బిందువు మాత్రం త్రికోణంలోనే ఉన్నది. అయితే లొల్లా లక్ష్మీధరులు మాత్రం శ్రీచక్రలేఖనంలోనే భేదం చెబుతున్నారు. వీరి ప్రకారం కౌళాచారంలో బిందువు త్రికోణంలో ఉంటుంది. కాని సమయమతంలో బిందువు చతుష్కోణము లేదా షట్కోణంలో ఉంటుంది. బిందువు చంద్రమండలంలో ఉంటుంది. ఆ చంద్రమండలం చతుష్కోణంలో ఉంటుంది అంటారు లక్ష్మీధరులు. అయితే భాస్కరరాయలతోపాటు మిగిలిన వారందరూ కౌళసమయాచారాలు రెండింటి యందు కూడా బిందువు త్రికోణాలలోనే ఉంటుంది అంటున్నారు. మరి ఆ త్రికోణం ఎక్కడ ఉంటుంది ?

కౌళాచారులు పురుషార్థాలలోని అర్థకామాలకే ప్రాధాన్యత ఇస్తారు. వారికి పారమార్థిక దృష్టి లేదు. షట్చక్రాలలో ఆధార స్వాధిష్ఠాన చక్రాలయందే దేవిని

పూజిస్తారు. వీరిలో ఒకతెగవారు ప్రత్యక్ష త్రికోణాన్ని పూజిస్తారు. అంటే స్త్రీ యోనిని ప్రత్యక్ష త్రికోణంగా భావిస్తారు. అందులో ఉన్న మన్మథఛత్రమే బిందువు అని వీరి నమ్మకం. అందుచేతనే వీరి పూజ ఆచారాలు అవైదికము నీతిబాహ్యాము. వీరి మతానుసారము ఆధారచక్రంలోనే త్రికోణమున్నది.

కౌళసమయాచారాలను తరచి చూసినట్లైతే, మానవదేహంలో రెండు చోట్ల త్రికోణమున్నదని తెలుస్తోంది. కౌళాచారులు ఆధారచక్రంలో త్రికోణమున్నదని చెప్పగా, సమయాచారులు మస్తకమే త్రికోణము అన్నారు. ఈ రెండు చోట్లా అంటే త్రికోణంలో బిందువున్నదని చెబుతున్నారు. మానవదేహంలో సహస్రదళ పద్మాలు రెండున్నాయి. ఒకటి ఆధారచక్రానికి క్రిందగా, రెండవది ఆజ్ఞాచక్రానికి పైభాగాన

శ్రీచక్రాన్ని షట్చక్రాలతో అనుసంధానం చేసినప్పుడు **'భైరవయామళం'**లో ఈ విధంగా చెప్పారు.

**త్రికోణ మష్టకోణం చ దశకోణద్వయం తథా**
**మనుకోణం చతుష్కోణం చ కోణచక్రాణి షట్క్రమాత్**
**మూలాధారం తథాస్వాధిష్ఠానం చ మణిపూరకమ్**
**అనాహతం విశుద్ధాఖ్యా మాజ్ఞాచక్రం విదర్బుధాః ॥**

శ్రీచక్రంలోని త్రికోణము మొదలైన చక్రాలు మూలాధారము మొదలైన షట్చక్రాలతో అంతర్భావం పొందుతున్నాయి. గౌడపాదులవారు కూడా తమ **'సుభగోదయస్తుతి'**లో ఇదే విషయాన్ని వివరిస్తూ

**త్రికోణంచా ధారం త్రిపురవినుతేష్టారమనఘే**
**భవేత్స్వాధిష్ఠానం పునరపి దశారం మణిపురం**
**దశారంతే సంవిత్కమల మథ మన్వస్రక్రముమే**
**విశుద్ధం స్యాదాజ్ఞా శివ ఇతి తతో బైందవగృహమ్ ॥**

ఈ శ్లోకాన్ని మానవదేహము శ్రీచక్రము అన్నచోట వివరించాం. కాని చదువరుల సౌలభ్యంకోసం మళ్ళీ చెప్పుకుంటున్నాం.

| | | |
|---|---|---|
| 1. ఆధారచక్రానికి | – | త్రికోణంతో ఐక్యత |
| 2. స్వాధిష్ఠానానికి | – | అష్టకోణంతో ఐక్యత |
| 3. మణిపూరానికి | – | అంతర్దశారంతో ఐక్యత |
| 4. అనాహతానికి | – | బహిర్దశారంతో ఐక్యత |
| 5. విశుద్ధిచక్రానికి | – | చతుర్దశారంతో ఐక్యత |
| 6. ఆజ్ఞాచక్రానికి | – | అష్టదళము, షోడశదళములతో ఐక్యత |
| 7. సహస్రారానికి | – | భూపురంతో ఐక్యత |

దీనిని బట్టి ఆధారచక్రంలోనే త్రికోణమున్నదని తెలుస్తున్నది. కాని సమయాచారులు **బైందవం బ్రహ్మరంధ్రంచ మస్తకంచ త్రికోణగం** అన్నారు. అంటే బ్రహ్మరంధ్రమే బిందువు. వీరి మతానుసారం మస్తకమే త్రికోణము. అలాగే సమయాచారులలో కొందరి ప్రకారం చంద్రమండలం వృత్తాకారంలో ఉంటుంది. కాబట్టి బిందువు వృత్రంలోనే ఉంటుంది. ఈ విధంగా బిందువు వృత్తంలో ఉన్నదని, చతుష్కోణంలో ఉన్నదని, త్రికోణంలో ఉన్నదని భిన్నవాదనలున్నాయి. భిన్న సంప్రదాయాలున్నప్పుడు గురుసంప్రదాయాన్ని మాత్రమే పాటించాలనేది ఆర్యోక్తి.

**మహాచతుష్షష్టి యోగినులు :**

శ్రీచక్రముయొక్క బిందువునందు పరదేవత ఉంటుంది. ఆ దేవత ఒక్కొక్క ఆవరణయందు ఎనిమిదిమంది చొప్పున మొత్తం అరవై నాలుగు మంది యోగినులతో సేవించబడుతూ ఉంటుంది. వీరిలో ఒక్కొక్కరికి ఎనిమిదిమంది సేవకులుంటారు. వీరందరూ పరదేవతతో సమానమైన రూప లావణ్యాలు, శక్తులు గలవారు. వీరిలో ఒక్కొక్కరికి కోటిమంది సేవకాగణమున్నది. వీరందరూ పరమేశ్వరిని సేవిస్తుంటారు. ఈ రకంగా పరమేశ్వరి అరవైనాలుగు కోట్లమంది యోగినులతో ఒక ఆవరణలో సేవించబడుతూ ఉంటుంది. మొత్తం మీద 9×8×8=576 కోట్ల యోగినీదేవతలతో సేవించదుతుంటుంది. అందుకే ఆవిడ **'మహాచతుష్షష్టి కోటియోగినీ గణసేవితా'** అనబడుతోంది.

శ్రీచక్రార్చన చేసేటప్పుడు 'అష్టాష్టకార్చన' కూడా చెయ్యాలి అని కులార్ణవ తంత్రం, శ్రీవిద్యార్ణవ తంత్రాలలో చెప్పబడింది. అష్టాష్టకార్చన అంటే ప్రతి

ఆవరణలోనూ ఎనిమిది దిక్కులయందు యోగినీ ద్వంద్వాన్ని పూజించాలి. అంటే భైరవులు ఎనిమిదిమంది, శక్తులు ఎనిమిది. ఇది ద్వంద్వము. వీరికి సేవకుల ఎనిమిది మంది చొప్పున అరవైనాలుగు మంది ఇక యోగినులు వివరాలకు వచ్చినట్లైతే

**1. ప్రథమావరణ :** ప్రధానయోగిని **బ్రాహ్మీ.** ఇతర యోగినులు

1. అక్షోంబా, 2. ఋక్షకర్ణాంబా, 3. రాక్షసాంబా, 4. క్షపణాంబా, 5. క్షపాంబా, 6. పింగళాక్ష్యంబా, 7. అక్షపయాంబా, 8. క్షమాంబా

**2. ద్వితీయావరణ :** ప్రధానయోగిని **మహేశ్వరి.** ఇతర యోగినులు

1. లీలాంబా, 2. లోలాంబా, 3. లుత్థాంబా, 4. లుబ్దాంబా, 5. లూకాంబా, 6. లంకేశ్వరాంబా, 7. లోలసాంబా, 8. విమలాంబా

**3. తృతీయావరణ :** ప్రధానయోగిని **కౌమారి**. ఇతర యోగినులు

1. హుతాశనంబా, 2. విశాలాక్ష్యంబా, 3. బడబాముఖ్యాంబా, 4. హర్షంబా 5. హారయాంబా, 6. క్రోధిన్యంబా, 7. క్రోధిన్యంబా, 8. వరయాంబా

**4. చతుర్థావరణ :** ప్రధానయోగిని **వైష్ణవి.** ఇతర యోగినులు

1. సంఖ్యాపీఠ సిద్ధాంబా, 2. కరలాంబా, 3. తారాంబా, 4. హృష్టాంబా, 5. హృల్లేకాంబా, 6. దశకుందరాంబా, 7. నవరసాంబా, 8. రససంగ్రాహిణ్యంబా

**5. పంచమావరణ :** ప్రధానయోగిని **వారాహి**. ఇతర యోగినులు.

1. తాలజంఘాంబా, 2. రక్తాక్ష్యంబా, 3. విద్యుజ్జిహ్వాంబా, 4. కరంకాంబా, 5. మేఘనాదాంబా, 6. ప్రచండౌఘాంబా, 7. కాలకర్ణాంబా, 8. బలప్రదాంబా

**6. షష్ఠావరణ :** ప్రధానయోగిని **మహేంద్రి.** ఇతర యోగినులు

1. శసాంబా, 2. చంపావళ్యంబా 3. ప్రవాయంబా, 4. శూలసాదికాంబా, 5. పిచువక్త్రాంబా, 6. పిశాచాక్ష్యంబా, 7. పిశితజ్ఞానాంబా, 8. లోలుపాంబా

**7. సప్తమావరణ :** ప్రధానయోగిని **చాముండ.** ఇతర యోగినులు

1. చామనాసాంబ, 2. వానరాంబ, 3. వాసనాంబా, 4. వికటాస్యాంబా, 5. వాయువేగాంబా, 6. బృహత్కాలాంబా, 7. వికనాంబా, 8. విశ్వరూపిణ్యంబా

**8. అష్టమావరణ :** ప్రధానయోగిని **మహాలక్ష్మి.** ఇతర యోగినులు

1. యమజిహ్వాంబా, 2. జయన్త్యంబా, 3. దుర్జయాంబా, 4. యమాంతకాంబా, 5. బిడాలాంబా, 6. రేవత్యంబా, 7. పూనాంబా, 8. విజయాంబా

ఈ రకంగా వివిధ ఆవరణలయందు మొత్తం 576 మంది యోగినీ గణాలతో సేవించబడుతూ ఉంటుంది కాబట్టే ఆ పరమేశ్వరి. **'మహాచతుష్షష్టి కోటియోగినీ గణసేవితా'** అనబడుతోంది.

**పంచదశీ మహామంత్రము - శ్రీచక్రము :**

పరదేవతయొక్క యంత్రరూపం శ్రీచక్రమైతే, మంత్రరూపము పంచదశీ మహామంత్రము. కాబట్టి ఈ రెండూ ఒక్కటే కాని వేరు కాదు. పంచదశీ మహామంత్రము నందలి బీజాక్షరాలవల్లనే శ్రీచక్రము పుట్టింది.

1. మూడు క కారములు, ఈ కారమువలన – శ్రీచక్రంలోని బిందువు
2. మూడు హ్రీంకారాలవల్ల – త్రికోణము
3. రెండు హకారములు, ఏకారమువల్ల – దశారయుగ్మము, చతుర్దశారము
4. రెండు సకారములవల్ల – అష్టదళము, షోడశదళము
5. మూడు ల కారములవల్ల – భూపురత్రయము పుట్టినాయి

ఈ రకంగా శ్రీచక్రము పంచదశీ మహామంత్రము నుంచే పుట్టింది.

పంచదశీ మహామంత్రంలో ఉండే అక్షరాలు అసలు తొమ్మిదే. అంటే ఒకసారి వచ్చిన అక్షరాన్ని మళ్ళీ లెక్కించకుండా ఉండాలి. అవి

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1. భూమి | – | ల | 6. కృష్ణమాద్య | – | రేఫ |
| 2. చంద్ర | – | స | 7. మాదన | – | క |
| 3. శివ | – | స | 8. అర్ధచంద్ర | – | నాదము |
| 4. మాయా | – | ఈ | 9. బిందువు | – | బిందువు |
| 5. శక్తి | – | ఏ | | | |

ఈ తొమ్మిది అక్షరాల సముదాయమే పంచదశీ మహామంత్రము. ఈ అక్షరాలవల్లనే శ్రీచక్రం ఆవిర్భవించింది.

1. లకారము పృథివీబీజము. దీనివల్ల భూపురము పుట్టింది.

2. సకారము చంద్రబీజము. దీనివల్ల షోడశదళం పుట్టింది.

3. హకారము శివ బీజము, అష్టమూర్త్యాత్మకము. దీనివల్ల అష్టదళం పుట్టింది.

4. ఈకారము మాయాబీజము. దీనివల్ల చతుర్దశారము పుట్టింది.

5. ఏకారము శక్తిబీజము. దీనివల్ల బహిర్దశారము వచ్చింది.

6. రకారము అగ్నిబీజము. దీని నుంచి అంతర్దశారము వచ్చింది.

7. కకారము మన్మథబీజము. దీని నుంచి అష్టకోణము వచ్చింది.

8. నాదము త్రిగుణాత్మకము. దీనినుంచి త్రికోణం వచ్చింది.

9. బిందువు పరబ్రహ్మాత్మకము. దీని నుంచి తొమ్మిదవ ఆవరణ అయిన బిందువు వచ్చింది. ఈ రకంగా పంచదశీ మహామంత్రంనుంచే శ్రీచక్రము పుట్టింది.

**శ్రీచక్రము-గణేశాది రూపాలు :**

పంచదశీ మహామంత్రానికి వివిధ రకాలయిన అర్థాలను వివరిస్తూ భాస్కరరాయల వారు కౌళికార్థంలో శ్రీచక్రానికి గణేశాది రూపాలున్నాయని వివరించారు.

**1. గణేశరూపము :**

**రేఖా దశకోణ గణైర్ఘటనా చక్రే గణేశత్వమ్**

శ్రీచక్రానికి గణేశరూపము చెబుతున్నారు. గణములకు అధిపతి కావటంచేత శ్రీచక్రానికి గణేశత్వం వచ్చింది. గణములు అంటే భూపురంలోని మూడు రేఖలు, అష్టదళము, షోడశదళములోని దళాలు, శక్తి చక్రాలలో ఉన్న 45 కోణాలు, ఈ గణాలన్నీ సమూహంగా కలది కాబట్టి శ్రీచక్రానికి గణేశరూపం చెప్పబడింది.

**2. యోగినీరూపము :**

**స్థితిసంహృతి చక్రే ద్వే పద్మే ద్వే వృత్త భూగృహే చ ద్వే**
**ఏవం షడ్భిర్యోగాత్ శ్రీచక్రం యోగినీ రూపకమ్ ॥**

శ్రీచక్రం మూడురకాలుగా విభజించబడుతోంది. 1. సృష్టిచక్రము 2. స్థితిచక్రము3. సంహారచక్రము. ఇందులో

1. అష్టదళము, షోడశదళము, భూపురము – సృష్టిచక్రము
2. అంతర్దశారము, బహిర్దశారము, చతుర్దశారము – స్థితిచక్రము
3. అష్టకోణము, త్రికోణము, బిందువు – సంహారచక్రము

వీటిలో 1. స్థితిచక్రము 2. సంహారచక్రము, 3. అష్టదళము, 4. షోడశదళము, 5. వృత్తాలు, 6. భూపురము. ఈ మొత్తం కలిసి ఆరు. యోగినుల సంఖ్య ఆరు. శరీరంలో షట్చక్రాలున్నాయి. వాటి అధిదేవతలు ఆరుగురు. వారు

1. వజ్రేశ్వరి, 2. వామదేవి, 3. వయోవస్థావివర్జితా, 4. సిద్ధేశ్వరీ, 5. సిద్ధవిద్యా, 6. సిద్ధమాతా వీరినే యోగినులు అంటారు. వారు

1. డాకినీ, 2. రాకినీ, 3. లాకినీ, 4. కాకినీ, 5. సాకినీ, 6. హాకిని

ఈ రకంగా చక్రాలు ఆరు. అక్కడ ఉన్న యోగినులు ఆరు. కాబట్టి శ్రీచక్రానికి యోగినీరూపం చెప్పబడింది.

**3. నవగ్రహత్వము :**

**త్రైలోక్యమోహనాద్యై ర్నవభిశ్చక్రై ర్గ్రహత్వం చ**

శ్రీచక్రంలో తొమ్మిది చక్రాలున్నాయి. వీటినే విడివిడిగా ఆవరణలు అంటారు. అవి

1. భూపురము – త్రైలోక్య మోహన చక్రము
2. షోడశదళము – సర్వాశాపరిపూరక చక్రము
3. అష్టదళము – సర్వసంక్షోభణ చక్రము
4. చతుర్దశారము – సర్వసౌభాగ్యదాయక చక్రము
5. బహిర్దశారము – సర్వార్థసాధక చక్రము
6. అంతర్దశారము – సర్వరక్షాకర చక్రము
7. అష్టకోణము – సర్వరోగహర చక్రము
8. త్రికోణము – సర్వసిద్ధిప్రద చక్రము
9. బిందువు – సర్వానందమయ చక్రము

అలాగే గ్రహాలు తొమ్మిది. రవి, చంద్రుడు, కుజుడు, బుధుడు, గురుడు, శుక్రుడు, శని, రాహువు, కేతువు. కాబట్టి శ్రీచక్రానికి గ్రహత్వం వచ్చింది.

**4. రాశిస్వరూపము :**

**పంచ చతుశ్శక్త్యనలాబిందుః వృత్తంచ భూబింబమ్ ।**
**ఏవంద్వాదశ సంఖ్యైర్ఘటనా చ్ఛక్రస్య రాశిత్వమ్ ॥**

శ్రీచక్రంలో క్రిందివైపు కోణాలు ఐదు, పైవైపు కోణాలు నాలుగు, వృత్తాలు, భూపురము, బిందువు వెరసి పన్నెండు. మేషాదిరాశులు పన్నెండు.

| | | |
|---|---|---|
| 1. మేషం | 5. సింహం | 9. ధనుస్సు |
| 2. వృషభం | 6. కన్య | 10. మకరం |
| 3. మిధునం | 7. తుల | 11. కుంభం |
| 4. కర్కాటకం | 8. వృశ్చికం | 12. మీనం |

ఈ రకంగా శ్రీచక్రానికి రాసి స్వరూపం చెప్పబడింది.

**5. నక్షత్ర స్వరూపం :**

**వృత్తత్రయ ధరణీత్రయ మన్వశ్రాణాం విభజ్య గణేన సప్తభిరితరై శ్చక్రై శ్చక్రే నక్షత్రరూపత్వమ్ ॥**

శ్రీచక్రంలో వృత్తాలు మూడు, భూపురంలో రేఖలు మూడు, చతుర్దశారంలో కోణాలు పద్నాలుగు, ఇతర చక్రాలు ఏడు. అవి బిందువు, త్రికోణము, అష్టకోణము, అంతర్దశారము, బహిర్దశారము, అష్టదళము, షోడశదళము. వెరసి ఇరవై ఏడు. అశ్వని మొదలైన నక్షత్రాలు ఇరవై ఏడు. ఈ రకంగా శ్రీచక్రానికి నక్షత్రరూపం చెప్పబడింది.

ఇలా చెప్పటంచేత చరాచర జగత్తులోని గణాలు, గ్రహాలు, రాశులు, నక్షత్రాలు, శరీరంలోని షట్చక్రాలలోని యోగినులు అన్నీ శ్రీచక్రంతో పోల్చబడ్డాయి. అంటే శ్రీచక్రం ఈ విశాలవిశ్వానికి, విశ్వమానవాళికీ ప్రతీక అని మరోసారి చెప్పబడుతోంది.

**శ్రీచక్రము-పూజాఫలం :** శ్రీచక్రంలో ఉన్న తొమ్మిది ఆవరణలలోని దేవతలను విడిగా పూజించటాన్నే 'చక్రార్చన' అంటారు అయితే ఏ లోహంతో తయారుచేసిన శ్రీచక్రాన్ని పూజించాలి? అనే అనుమానంకూడా వస్తుంది. **రుద్రయామళం**లో ఈ విషయాన్ని చెబుతూ

**తతః కుంకుమసింధూరైః కార్యంయత్నంతు యోగినః**

**సౌవర్ణే రాజితే తామ్రే స్పాటికే వైద్రుమే తథా ।**

**చక్రే చోక్త విధానేన పూజ్య దేవీ పరోత్తమైః ॥**

కుంకుమ సింధూరాలతో గీసిన శ్రీచక్రాన్ని పూజించినట్లైతే కార్యసిద్ధి కలుగుతుంది. వెండి, బంగారము, రాగి, స్పటికము మొదలైన వాటితో తయారుచేసిన శ్రీచక్రాన్ని కూడా అర్చించవచ్చును. **తంత్రరాజం**'లో

**రత్నహేమనిరూప్యేవా తామ్రే వృషథి చక్రమాత్**

**కృత్వా చక్రస్య నిర్మాణం స్థాపయేత్ పూజయేదపి**

**లక్ష్మీకాంతి యశః పుత్ర ధన ఆరోగ్యాది సిద్ధయే ॥**

బంగారము, వెండి, రాగి, గండకీశిల (సాలగ్రామాశిల)లతో చేసిన శ్రీచక్రాన్ని అర్చించనట్లైతే పుత్ర, ధన ధాన్యాభివృద్ధి, కీర్తి, ఆరోగ్యము సిద్ధిస్తాయి.

**'రత్నసాగరం'** అనే గ్రంథంలో

**యావజ్జీవం సువర్ణే స్యాద్రూప్యే ద్వావింశతి ప్రియే**

**తామ్రే ద్వాదశకం వర్షం తదర్ధం భూర్జపత్రకే ॥**

బంగారంతో చేసిన శ్రీచక్రాన్ని జీవితాంతం పూజించవచ్చు. అది ఎంత కాలమైనా పనికి వస్తుంది. వెండితో చేసిన చక్రాన్ని ఇరవైరెండు సంవత్సరాలు అర్చించవచ్చు. రాగితో చేసిన దాన్ని పన్నెండు సంవత్సరాలు అర్చించవచ్చు. భూర్జరీ పత్రంమీద వ్రాసిన చక్రాన్ని ఆరు సంవత్సరాలు అర్చించవచ్చు. **'లక్షసాగరం'** అనే గ్రంథంలో ఏ రకమైన చక్రాన్ని అర్చిస్తే ఏ ఫలితం వస్తుందో చెప్పబడింది.

**భూమౌసింధూర రజసారచితం సర్వకామదమ్ ।**

**సువర్ణరచితం యంత్రం సర్వరాజవశంకరమ్ ॥**

**రజతేనకృతం యంత్రం ఆయురారోగ్య కామదమ్ ।**

**తామ్రేతురచితం యంత్రం సర్వైశ్వర్య ప్రదమ్ మతమ్ ॥**

**క్లుప్తం మరకతేయంత్రం సర్వశత్రు వినాశనమ్ ।**

**లోహత్రయోద్భవం యంత్రం సర్వసిద్ధికరమ్ మతమ్ ॥**

నేలమీద సింధూరంతో శ్రీచక్రాన్ని గీసి అర్చించినట్లైతే సర్వకార్యసిద్ధి కలుగుతుంది. బంగారంతో చేసిన యంత్రాన్ని అర్చిస్తే రాజవశ్యం కలుగుతుంది. వెండి యంత్రాన్ని అర్చిస్తే ఆయురారోగ్యాలు కలుగుతాయి. రాగి యంత్రమైతే సర్వైశ్వర్య ప్రదము. మరకతం (పచ్చ)తో చేసిన యంత్రం శత్రునాశనము. మూడు లోహాలతో (వెండి, బంగారము, రాగి) చేసిన యంత్రాన్ని అర్చిస్తే సర్వకార్యసిద్ధి కలుగుతుంది.

శ్రీచక్రాన్ని అర్చిస్తే అన్ని కోరికలు తీరతాయి. లోకంలో సిరిసంపదలతోను, అధికారంతోను ఉన్నవారందరూ శ్రీచక్రాన్ని అర్చించినవారే. ఇది మహాలక్ష్మీపురము. సర్వదేవతామయమైన శ్రీచక్రాన్ని అర్చిస్తే అష్టసిద్ధులు, సర్వశక్తులు, జ్ఞానము, మోక్షము అన్నీ లభిస్తాయి. శ్రీచక్రంలోని నవావరణలు, జగత్తులోని ఒక్కొక్క దానికి ప్రతీక.

1. భూపురం – భూలోక, భువర్లోక, సువర్లోకాలకు
2. షోడశదళం – చంద్రకళలు
3. అష్టదళం – అష్టమూర్తులు
4. చతుర్దశారం – చతుర్దశభువనాలు
5. బహిర్దశారం – దశావతారాలు
6. అంతర్దశారం – అగ్నికళలు
7. అష్టకోణము – అష్టవసువులు
8. త్రికోణం – త్రిమూర్తులు, త్రిశక్తులు, త్రిగుణాలు, షోడశ నిత్యలు, తిథులు, అక్షర సమామ్నాయము. ఈరకంగా జగత్తంతా త్రికోణంలోనే ఉంది.
9. బిందువు – పరమేశ్వరస్వరూపం తేజోమయమైన కాంతిబింబం.

ఈ రకంగా శ్రీచక్రము చరాచర జగత్తుకూ, విశ్వమానవాళికీ ప్రతీక. శ్రీచక్రాన్ని అర్చిస్తే చరాచర జగత్తునంతటినీ అర్చించినట్లే విశ్వమానవాళినంతటినీ అర్చించినట్లే. అందుచేతనే శ్రీచక్రాన్ని అర్చించినవారికి ఇహము, పరము ఏది కావాలంటే అది లభిస్తుంది.

**త్వదీయం సౌన్దర్యం తుహినగిరికన్యే తులయితుం**
**కవీన్ద్రాః కల్పంతే కథమపి విరిఞ్చి ప్రభృతయః ।**
**యదాలోకౌత్సుక్యా దమర లలనాయాన్తి మనసా**
**తపోభి ర్దుష్ప్రాపామపి గిరిశ సాయుజ్య పదవీమ్ ॥** **12**

ఓ దేవీ ! నీ శరీరలావణ్యమును వర్ణించటానికిగాని, నీ చక్కదనాన్ని చాటి చెప్పటానికిగాని, బ్రహ్మాది దేవతలు, కవిశ్రేష్ఠులు కూడా సమర్ధులు కాలేకపోయారు. నీ సౌందర్యాన్ని వర్ణించటం వారికి వీలుపడటం లేదు. దేవలోకంలో అతిసుందరాంగులైన అప్సరాంగనలు కూడా నీ చక్కదనాన్ని చూచి, విభ్రాంతులై, అదేపనిగా నిన్ను చూడాలనుకుంటున్నారు. నీ సౌందర్యముతో వారు కొంచెము కూడా సరిపోక, పరమశివునితో సాయుజ్యము పొంది, నీ సౌందర్యాన్ని అలా చూస్తూ ఉండిపోవాలని కోరుతున్నారు.

ఆ పరమేశ్వరి అపురూప లావణ్యవతి. అతిలోక సౌందర్యవతి. ఆమెను మించిన సౌందర్యం పద్నాలుగు లోకాలలోను మరెక్కడా లేదు. లలితా సహస్రంలోని ఆరవ నామం **'ఉద్యద్భానుసహస్రాభా'**నుంచి 54వ నామం **'స్వాధీనవల్లభా'** దాకా 49 నామాలలో ఆమె సౌందర్యాన్ని వర్ణించటం జరిగింది. జగత్తులో ఉన్న సౌందర్యమంతా ఆ దేవి దగ్గరే ఉన్నది. అంతకుమించిన సౌందర్యం ఇంకెక్కడా లేదు. అందుకే దుర్వాసుడు తన **'దేవీ మహిమ్నస్తుతి'**లోని 30వ శ్లోకంలో పరమేశ్వరి సౌందర్యాన్ని వర్ణిస్తూ ...

**ఆతామ్రార్క సహస్ర దీప్తి పరమా సౌందర్య సారై రలం**
**లోకాతీత మహోదయై రుపయుతా సర్వోపమాఽగోచరైః ।**
**నానాఽనర్ఘ్య విభూషణై రగణితై ర్జాజ్వల్యమానాఽభితః**
**శ్రీమాత స్త్రిపురారి సుందరి । కురుస్వాంతే నివాసం మమ ॥**

త్రిపురాసుర సంహారం చేసిన పరమేశ్వరుని యొక్క అర్ధాంగియైన ఓ దేవీ ! ఉదయిస్తున్న బాలభానుని లాగా దివ్యమైన కాంతులతో ప్రకాశించే ఓ దేవీ ! క్షీర సాగరమథనం చేసినప్పుడు పుట్టిన అమృతంలాగా, నీ సౌందర్యము ఏ పోలికకు

అందదు. అట్టి నీవు నానాలంకార భూషితవై తేజోమయమైన కాంతులతో ప్రకాశిస్తూ నా హృదయస్థానమునందు నివసించవలసినది అంటున్నాడు.

ఆమె సౌందర్యాన్ని బ్రహ్మాది దేవతలు కూడా వర్ణించలేకున్నారు. అంటున్నారు శంకరులవారు. ఈ సృష్టిలో మొదటగా వచ్చినవాడు బ్రహ్మ. అతడే సృష్టికర్త. ప్రజాపతి. ఈ జగత్తులోని సౌందర్యమంతా అతను సృష్టించినదే. కాబట్టి ఈ సౌందర్యం అంతా బ్రహ్మకు తెలుసు. కాని బ్రహ్మను కూడా సృష్టించింది ఆ పరమేశ్వరి. ఆవిడ సౌందర్యం ఈ జగత్తులోది కాదు. జగత్తుకు అతీతమైనది. సృష్టికర్త అయిన బ్రహ్మయొక్క ఊహకు కూడా అందనిది. అందుకే బ్రహ్మకూడా ఆ పరమేశ్వరి సౌందర్యాన్ని వర్ణించలేడు. ఇక కవులంటారా ! జగత్తులో ఉన్న దృశ్యాలను చూసి, లేనిచోట వాటిని ఊహించుకుని కవిత్వం చెబుతారు. వారి కవిత్వానికి ఆధారం జగత్తులో కంటికి కనిపించే సౌందర్యమే. అందుచేతనే లోకాలకు అతీతమైన సౌందర్యాన్ని వారు వర్ణించలేరు.

జగత్తులో సౌందర్యరాశులు అని చెప్పదగ్గవారు అప్సరాంగనలు. వీరు బ్రహ్మ యొక్క అవయవాలనుండి పుట్టారని, క్షీరసాగరమథనం చేసినప్పుడు అందులోనుంచి వీరు ఉద్భవించారని చెప్పబడింది. వీరు దేవవేశ్యలు. అతిలోకసౌందర్యరాశులు. ఋషీశ్వరుల తపస్సు భంగం చెయ్యటానికి వీరిని పంపుతుంటాడు ఇంద్రుడు. పూర్వకాలంలో నరనారాయణులు తపస్సు చేస్తుండగా వారి తపస్సును భంగం చెయ్యటానికి ఇంద్రుడు అప్సరసలును పంపించాడు. అప్సరసలు తాను సౌందర్యాన్ని ఒలకబోస్తూ అలజడి సృష్టించారు. అది చూసిన నారాయణుడు చేత్తో తన తొడమీద చిన్నగా రాచాడు. వెంటనే అతని తొడనుంచి అపురూప సౌందర్యవతి, ఉద్భవించింది. ఊరువునుంచి ఉద్భవించింది కాబట్టి ఆమె ఊర్వశి అనబడింది. అప్సరాంగనలను మించిన సౌందర్యవతి. ఈమెను చూసి, వచ్చిన అప్సరసలంతా సిగ్గుపడ్డారు. అప్సరసలందరిలోనూ సౌందర్యవతి ఊర్వశి. ఆ పరమేశ్వరియొక్క సౌందర్యం ముందు అప్సరసల సౌందర్యం సాటిరాలేదు. ఎలా వస్తుంది ? అప్సరసలది లౌకికసౌందర్యము. ఆ పరమేశ్వరిది అలౌకిక సౌందర్యం. అందుచేతనే అప్సరసలు ఆ పరమేశ్వరి సౌందర్యాన్ని అలా చూస్తూ ఉండిపోవాలి అనుకున్నారు. కాని అది ఎలా సాధ్యం ? ఈ కారణంచేతనే పరమశివునిలో సాయుజ్యం పొంది, తద్వారా

పరమేశ్వరి సౌందర్యాన్ని చూస్తూ ఉండిపోవాలి అనుకున్నారట. ఆమె అతిలోక సౌందర్యవతి. ఆ దేవియొక్క సౌందర్యము స్త్రీలను కూడా మోహింపచేస్తుంది. అని చెబుతున్నారు శంకర భగవత్పాదులవారు ఈ శ్లోకంలో.

**నరం వర్షీయాంసం నయనవిరసం నర్మసు జడం**
**తవాపాఙ్గాలోకే పతిత మనుధావన్తి శతశః**
**గలద్వేణీబంధాః కుచకలశ విస్రస్త సిచయాః**
**హఠాత్త్రుట్యత్కాంచ్యో విగళిత దుకూలా యువతయః ॥ 13**

ఓ తల్లీ ! పురుషుడు ఎంత ముసలివాడైనా, నడవటానికి ఓపిక లేనివాడైనా, అనాకారి అయినా, కళ్ళు కనుపించకపోయినా, జడుడయినప్పటికి, నీ కృపకు గనక పాత్రుడైనట్లైతే మదనవతులు తమ పయ్యెదలు జారిపోతున్నా, ఆభరణాలు చెదరి పోతున్నా, కట్టిన బట్టలు ఊడిపోతున్నప్పటికీ పట్టించుకోకుండా అతని వెంటపడతారు.

ఈ శ్లోకంలో కూడా దేవియొక్క మహిమను వర్ణిస్తున్నాడు శంకర భగవత్పాదుల వారు. గతంలో **'ధనుః పౌష్పం'** అనే ఆరవ శ్లోకంలో పరమేశ్వరి కృపతోనే మన్మథుడు అనంగుడైనప్పటికీ, తపోధనుల మీద యుద్ధానికి వెళ్ళి, వారిని గెలుస్తున్నాడు అని చెప్పి ఇప్పుడు ఈ శ్లోకంలో పరమేశ్వరి కరుణ ఉన్నట్లైతే జడుడైనా సరే సుందరాంగుల మనసు గెలవగలుగుతాడు అంటున్నారు. సామాన్యంగా స్త్రీలు, అందులోనూ సుందరాంగులు పురుషులలో ఉన్న ప్రత్యేకమైన లక్షణాలను ఇష్టపడతారు. ఆ వ్యక్తి మంచి వీరుడైతేనో, మంచి పదవిలో ఉంటేనో, బాగా స్థితిమంతుడైతేనో ఇష్టపడతారు. అంతేగాని ముసలివగ్గును, అనాకారిని, బికారిని, జడుని ఇష్టపడరు. కాని ఇక్కడ ముసలివాడు, వంగి కూడా నడవలేడు. కూర్చున్నచోట నుంచి కదల్లేడు, ముక్కులో నుంచి చీమిడికారుతుంటే తుడుచుకోలేడు. కళ్ళు కనిపించవు. కళ్ళలో పుసులుకట్టి ఉన్నాయి. అనాకారి, బికారి. రసికత ఏ మాత్రం లేనివాడు. ఇక న్నెవరు వరిస్తారు? ఏ స్త్రీ ఇతన్ని ఇష్టపడుతుంది ? ఇన్ని అవలక్షణాలున్నప్పటికీ ఇతడు పరమేశ్వరి కృపకు పాత్రుడు కాబట్టి, అనంగుడు తపస్సు చేసుకునే మునీశ్వరులను ఎలా గెలిచాడో, అలాగే ఇతడు నిండు జవ్వనులమనసులను గెలవగలుగుతున్నాడు. దీనికి కారణము పరమేశ్వరికృప. అది అతడికి పుష్కలంగా ఉన్నది. అందుచేతనే

నిండుజవ్వనులు మదవతులు తాము ఏ స్థితిలో ఉన్నామో గమనించకుండా అతని పొందుకోసం పరుగులెడతారు. ఈ శ్లోకానికి శ్రీ కాటూరి వెంకటేశ్వరరావు గారు తెలుగులో మంచి పద్యం వ్రాశారు చూడండి.

**పరువంబేటికి, ప్రాయమేమిటికి, రూపంబేల నర్మక్రియా**
**సరసత్వంబది ఏల, నీదగు కటాంక్షంబున్నచో వృద్ధవా**
**నరుడేని మరులూని ప్రాయపు నెలంతల్ పయ్యెదల్ జార**
**న్నెరి కొప్పుల్ విర బార, కాంచికలున్ జీరాడవెన్నాడరే ॥**

ఇలాగే ఈ పద్యం చూడండి. ఇదికూడా ఈ శ్లోకానికి అనువాదమే ॥

**ముసలివగ్గును, నేత్రముల దోషభరితుని**
**రతికళాకేళినీరసుండైన మూఢుని**
**నీదు కటాక్షవీక్షదయ కలిగిన**
**వెనువెంట వత్తురు వేలాది యువతల్**

ఎలావస్తారట ? అంటే ?

**జడలముడులువీడి జారిపోవుచునుండ**
**పాలిండ్లపైనుండి పయ్యెదల్ తొలుగ**
**మొలనున్న రతనాల మొలనూలు జారగ**
**కోకముడులు వీడిపుట్టముల్ పడిపోవ**
**పరువులెత్తుచు వెంటబడుదురు మద వతుల్ ॥**

ఈ రకంగా పరమేశ్వరికృప గనక ఉంటే జరగనిది లేదు అంటున్నారు భగవత్పాదులు.

**క్షితౌ షట్పఞ్చాశ ద్ద్విసమధిక పంచాశదుదకే**
**హుతాశే ద్వాషష్టి శ్చతురధిక పంచాశ దనిలే**
**దివి ద్విష్షట్త్రింశ న్మనసి చ చతుష్షష్టి రితి యే**
**మయూఖాస్తేషా ముప్యపరి తవపాదంబుజ యుగమ్ ॥** **14**

ఓ తల్లీ ! పృథివీతత్త్వముతో కూడిన మూలాధార చక్రమందు యాభైఆరు, జలతత్త్వాత్మకమైన మణిపూర చక్రమందు యాభైరెండు, అగ్నితత్త్వాత్మకమైన స్వాధిష్ఠాన చక్రమందు అరవైరెండు, వాయుతత్త్వాత్మకమైన అనాహన చక్రమందు యాభైనాలుగు, ఆకాశతత్త్వాత్మకమైన విశుద్ధి చక్రమందు డబ్భైరెండు, మనస్తత్త్వాత్మకమైన ఆజ్ఞాచక్ర మందు అరవైనాలుగు, వెరసి మూడు వందల అరవై కిరణాలు. ఈ మొత్తం చంద్ర మండలంలోని సహస్రారచక్రంలో ఉన్న నీ పాదాల నుంచే ప్రసరిస్తున్నాయి.

ఈ శ్లోకంలో పరమేశ్వరుడు జీవియొక్క శరీరంలో వ్యాపించి ఉన్నాడు. అనే విషయాన్ని వివరిస్తున్నారు. అసలు పరమేశ్వరరూపం అంటే ఏమిటి ? నిరాకారుడు నిర్గుణ స్వరూపుడు పరబ్రహ్మ. అతడు ఈ జగత్తంతా వ్యాపించి ఉన్నాడు. చరాచర జగత్తంతా పరమేశ్వరస్వరూపమే. ఈ విషయం ఉపనిషత్తులలో అనేకసార్లు ప్రతిపాదించబడింది. **ఛాందోగ్యోపనిషత్తు**లో సత్యకామ జాబాలికథ ఇందుకు చక్కని ఉదాహరణ. వేదవేదాంగవిదుడు, బ్రహ్మ జ్ఞాని అయిన గౌతముడి దగ్గరకు సత్యకాముడు అనే బాలకుడు వెళ్ళి బ్రహ్మవిద్యను బోధించమని అడుగుతాడు. సరేనంటాడు గౌతముడు. ఆశ్రమ నియమాల ప్రకారం గురువుకు సేవ చేస్తూ బ్రహ్మజ్ఞాన సముపార్జనకు సిద్ధమవుతాడు సత్యకాముడు. కాలం గడుస్తోంది. తనతో వచ్చిన వారంతా విద్యాభ్యాసం పూర్తి చేసుకుని వెళ్ళిపోతున్నారు. కాని గురువుగారు తనకు మాత్రం బ్రహ్మవిద్యను బోధించలేదు. కారణం తెలియదు. ఈ పరిస్థితిలో ఒకరోజున గౌతముడు సత్యకాముణ్ణి పిలచి బక్కచిక్కి, వట్టిపోయిన ఆవులను, ఆబోతులను నాలుగు వందలు అతనికి ఇచ్చి, అడవిలోకి పోయి వీటిని మేపుకునిరా. వీటి సంఖ్య వేయి అయ్యేవరకు తిరిగి రావద్దు అంటాడు.

గురువు దగ్గర విద్య నేర్చుకోవటానికి మూడు మార్గాలున్నాయి. అవి

**గురుశుశ్రూషయావిద్యా పుష్కలేన ధనేన వా ।**

**అథవా విద్యయా విద్యా చతర్థో నోపలభ్యతే ॥**

1. గురువుకు సేవచేసి విద్యనభ్యసించటం
2. గురువుకు తగినంత ధనమిచ్చి విద్యనభ్యసించటం.
3. తనకు వచ్చిన విద్యను గురువుకు చెప్పి, అతనిదగ్గర విద్య నభ్యసించటం.

వీటిలో మొదటి పద్ధతిలో విద్యాభ్యాసం చేస్తున్నాడు సత్యకాముడు. అందుకే గురువుగారి ఆజ్ఞ ప్రకారం ఆవులని తోలుకుని అడవికి వెళ్ళాడు. అక్కడ పశువులను మేపుతూ కాలం గడుపుతున్నాడు. బక్కచిక్కిన ఈ ఆవులు బాగా తిని బలిసేదెప్పుడు? అవి పిల్లలు పెట్టేదెప్పుడు ? వాటిసంఖ్య వేయి అయ్యేదెప్పుడు ? ఇలా ఆలోచిస్తున్నాడు. కాలం మాత్రం గడిచిపోతోంది. ఇంతలో ఒకరోజు సాయంత్రం సత్యకాముడు దీర్ఘాలోచనలో ఉన్న సమయంలో ఒకముసలి ఆబోతు అతనివద్దకు వచ్చి "సత్యకామా! నీ కర్మ పరిపక్వమైంది. నువ్వు గురువుగారి దగ్గరకు వెళ్ళే సమయం ఆసన్నమైంది. బ్రహ్మజ్ఞానం చెబుతాను వినవలసింది. పరబ్రహ్మతత్త్వము నాలుగుపాదాలుగా ఉంటుంది. అందులో మొదటి పాదాన్ని నేను చెబుతాను.

"సత్యకామా ! ఈ విశాల విశ్వంలో తూర్పు, పడమర, ఉత్తరం, దక్షిణం. నాలుగు దిక్కులూ ఆ పరబ్రహ్మ తత్త్వంలో ఒక భాగము. రెండవ పాదాన్ని అగ్నిదేవుడు చెబుతాడు." అని చెప్పింది. ఆ మాటలు విన్న సత్యకాముడు గౌతముని ఆశ్రమానికి తిరుగు ప్రయాణం కట్టాడు. త్రోవలో సంధ్యాసమయమయింది. సత్యకాముడు అగ్నిహోత్రం వెలిగించి దాని ఎదురుగా కూర్చున్నాడు. అప్పుడు అగ్నిదేవుడు ప్రత్యక్షమై "సత్యకామా ! ఆకాశము, సముద్రాలు, పర్వతాలు, నదులు అన్నీ పరబ్రహ్మలోని రెండవ భాగము" అని చెప్పాడు. ఆ మరునాడు ఒక హంస ఎగిరివచ్చి సత్యకాముడి దగ్గరవాలి "కుమారా ! సూర్యుడు, చంద్రుడు, అగ్ని, విద్యుల్లతలు అన్నీ పరబ్రహ్మలోని మూడవ భాగము" అని చెప్పింది. ఆ మరునాడు ఒకనీటి పక్షి వచ్చి "సత్యకామా ! ప్రాణంబ్రహ్మ, దృష్టిబ్రహ్మ, శ్రవణంబ్రహ్మ" ఇదే పరబ్రహ్మతత్త్వంలోని నాల్గవపాదము. అని చెప్పింది.

అలాగే ఉపకోశలుడికి అగ్నులు బ్రహ్మతత్త్వాన్ని ఉపదేశిస్తూ "హృదయమందే బ్రహ్మతత్త్వముంటుంది. ఆనందమే ఆ తత్త్వము యొక్క నిజస్వరూపము. భూమి, చంద్రుడు, సూర్యుడు, అన్నీ ఆ పరబ్రహ్మ యొక్క రూపాంతరాలే. ఆ పరబ్రహ్మ తత్త్వము ఈ జగత్తంతా వ్యాపించి ఉన్నది" అని చెబుతాయి. ఈ రకంగా పరబ్రహ్మ సర్వాంతర్యామి. ఈ జగత్తంతా పరమేశ్వర స్వరూపమే. **బృహదారణ్యకోపనిషత్తు**లో "సృష్టి ప్రారంభానికి ముందు ఈ జగత్తంతా శూన్యంగా ఉండేది. పరబ్రహ్మ ఆ శూన్యాన్ని ఆశ్రమించి ఉన్నది" అని చెప్పటం జరిగింది. కాబట్టి పరబ్రహ్మ

సర్వాంతర్యామి. ఈ జగత్తునంతటినీ ఆక్రమించి ఉన్నాడు అని ఉపనిషత్తులు చెబుతున్నాయి. అదే మాటను శంకర భగవత్పాదులవారు ఈ శ్లోకంలో వివరిస్తున్నారు. ఇక్కడ పరమేశ్వరి అంటే పరబ్రహ్మ స్వరూపం. ఆమెనుంచి వచ్చే కాంతి కిరణాలు ఈ శరీరమంతా వ్యాపించి ఉన్నాయి అంటున్నారు.

పరమేశ్వరుడు ఈ జీవరాశిని సృష్టించిన తరువాత ఆ దేహంలో ప్రవేశించాలను కున్నాడు. అనుకున్నదే తడవుగా బ్రహ్మరంధ్రంద్వారా ఈ శరీరంలో ప్రవేశించాడు. ఈ రకంగా జీవరాశిలో పరమేశ్వరుడు ప్రవేశించాడు. అని **ఐతరేయోపనిషత్తు**లో చెప్పటం జరిగింది. అయితే పరమేశ్వరుడు అంటే అఖండమైన జ్ఞానం. అది తెల్లటికాంతి. తేజోమయమైన కాంతిపుంజము. ఇదే విషయాన్ని **దేవీభాగవతం**లో చెబుతారు.

తారకాసురుని బాధలు పడలేక, దేవతలందరూ హిమాలయ పర్వతాలకు వెళ్ళి ఆ పరమేశ్వరిని పరిపరి విధాల అర్చించారు. అలా కొన్ని సంవత్సరాలు గడువగా, ఒకరోజున చైత్రశుద్ధ నవమి, శుక్రవారం వేదసమ్మతమైన పరంజ్యోతి వారి ఎదుట ప్రత్యక్షమైంది. అది ఎలా ఉన్నది అంటే ....

**కోటిసూర్యప్రతీకాశం చంద్రకోటి సుశీతలమ్ ॥**

**విద్యుత్కోటి సమానాభమరుణం తత్పరం మహః ।**

**నైవచోర్ధ్వం నతిర్యక్చ నమధ్యే పరిజగ్రభుత్ ॥**

**ఆద్యంత రహితం తత్తునహస్తా ద్యంగసయుతం ।**

**న స్త్రీరూపం అథవా నపుంరూప మథోభయమ్ ॥**

ఆ పరమేశ్వర స్వరూపం ఎలా ఉన్నది అంటే నాలుగు వేదాలు రూపం దాల్చి ఆ స్వరూపాన్ని స్తుతిస్తున్నాయి. కొన్నివేల కోట్ల సూర్యులయొక్క కాంతితో, చంద్రుల యొక్క చల్లదనంతో, కోట్లకొలది విద్యుల్లతలు ఒక్కసారి మెరిసినట్లుగా ప్రకాశిస్తున్నది. దానికి క్రిందపైన మధ్య అనేవి లేవు. ఆద్యంతాలు అసలే లేవు. కాలుచేతుల లేవు. ఏ విధమైన అంగాలు లేవు. అది స్త్రీ కాదు. పురుషుడు కాదు. రెండూ కానిది (నపుంసకుడు) అంతకన్నా కాదు. అంటే ఆద్యంతములు లేనటువంటిది. అఖండమైన తేజోమయమైన కాంతిపుంజము. అది పరమేశ్వర స్వరూపం. అది స్త్రీ కాదు. పురుషుడు అంతకన్నా కాదు. ఆ శక్తిని మనం స్త్రీ మూర్తిగా ఆరాధిస్తున్నాం ఆవిడే

పరమేశ్వరి ఆ శక్తి ఎక్కడో లేదు. మానవదేహంలోనే ఉన్నది. ఆ శక్తి నుంచి వచ్చే కాంతిపుంజములచేతనే చరాచర జగత్తంతా ప్రకాశిస్తున్నది.

పరమేశ్వరుడు నిరాకారుడు, నిర్గుణస్వరూపుడు అయిన పరబ్రహ్మ. అతడు బిందురూపంలో ఉన్నాడు. ఇక్కడే చిన్న అనుమానం వస్తుంది. పరమేశ్వరుడు బిందురూపంలోనే ఎందుకున్నాడు ? చతురస్రంగానో, దీర్ఘచతురస్రంగానో, షట్కోణం గానో, ఇంకొక రూపంలోనే ఎందుకు లేడు ? దీనికి సమాధానం ఇది వరకే చెప్పాం. పరమేశ్వరుడు చరాచర జగత్తంతా ఆక్రమించి ఉన్నాడు. జగత్తు అంటే నదీనదాలు అడవులు కొండలు ఎడారులు, సముద్రాలతో కూడిన భూమండలం. ఈ భూమి గుండ్రంగా ఉన్నది. కాబట్టి దీనిని ఆక్రమించి ఉన్న పరమేశ్వరుడు కూడా గుండ్రంగా అంటే బిందురూపంలోనే ఉన్నాడు. ఈ జగత్తు అంతా ఆక్రమించి ఉండాలి అంటే అతడు బిందురూపంలోనే ఉండితీరాలి. ఈ బిందువు అతిచిన్నదై సూక్ష్మరూపం ధరించగలదు. అతిపెద్దదై జగత్తంతా ఆక్రమించనూ గలదు. అదే పరమేశ్వర తత్త్వం. బిందువు అంటే గుండ్రంగా ఉండేది. వృత్తాకారము గలది. మూడువందలఅరవై డిగ్రీలు గలది. అంతకు ఒక డిగ్రీ ఎక్కువా కాదు తక్కువా కాదు. అదే వృత్తము. బిందువు పరమేశ్వర స్వరూపము. అది జ్యోతిర్మయము. జ్ఞానమయము. ఆ పరమేశ్వర స్వరూపంనుంచి వచ్చే కాంతి కిరణాలవల్లనే చరాచర జగత్తంతా ప్రకాశిస్తున్నది.

**బృహదారణ్యకోపనిషత్తు**లో చిన్న కథ ఒకటుంది. ఒకసారి యాజ్ఞవల్క్యుడు విదేహాధిపతి అయిన జనకమహారాజు ఆ స్థానానికి వెళ్ళాడు. గురువుగారిని ఉచిత రీతిన గౌరవించాడు జనక మహారాజు. కుశల ప్రశ్నలు అయిన తరువాత జనక మహారాజు యాజ్ఞవల్క్యునితో "గురుదేవా ! నాకు ఒక చిన్న అనుమానం ఉన్నది. దాన్ని తీర్చి పుణ్యం కట్టుకోండి" అని అడిగాడు. అదేమిటో చెప్పమన్నాడు యాజ్ఞవల్క్యుడు. ఇప్పుడు మహారాజు అడుగుతున్నాడు.

**జ** : మహర్షీ! మానవుడు ఏ వెలుగులవల్ల నిత్యకృత్యం కొనసాగిస్తున్నాడు?

**యా** : సూర్యుని వెలుతురువల్ల. ఆ వెలుతురువల్లనే మానవుడు పనిపాటలు నిర్వహిస్తున్నాడు. దూరతీరాలకు పోతున్నాడు. చేయాలనుకున్న పని చేయగలుగుతున్నాడు.

**జ** : మహర్షీ ! మరి సూర్యుడు అస్తమించిన తరువాత పనులు ఎలా జరుగుతాయి?

**యా** : సూర్యుడు అస్తమించిన తరువాత చంద్రుని కాంతులలో ఈ పనులు జరుగుతాయి.

**జ** : మహాత్మా ! మరి సూర్యుడు, చంద్రుడు ఇద్దరూ లేనప్పుడు పనులు ఏ విధంగా జరుగుతాయి ?

**యా** : రాజా ! సూర్యుడు, చంద్రుడు ఇద్దరూ లేనప్పుడు, సంధ్యా సమయంలో, వ్యవహారాలన్నీ దీపపు కాంతిలో అంటే అగ్నియొక్క వెలుగులో జరుగుతాయి.

**జ** : గురుదేవా! అగ్ని కూడా లేకపోతే, సూర్యుడు లేడు, చంద్రుడు లేడు, అగ్నిలేదు. మరి అలాంటప్పుడు పనులు ఏ విధంగా జరుగుతాయి?

**యా** : రాజా ! ఆ వెలుగుల స్థానంలో వాక్కు వ్యవహారాలకు సహకరిస్తుంది. చీకటిలో ఏమీ కనిపించదు. కానీ ఏదో ధ్వని వినిపిస్తుంది. దాని ప్రకారం వ్యవహారాలు జరుగుతాయి.

**జ** : దేవా ! మరి వాక్కు కూడా లేకపోతే ? అప్పుడు ఏం జరుగుతుంది ?

**యా** : జనకమహారాజా ! ఈ వెలుగులకన్నింటికీ అవతల ఆత్మజ్యోతి ఉన్నది. అది వెలుగులకు వెలుగు. కాంతులకు కాంతి. అటువంటి ఆత్మవల్లనే మానవుడు మనుగడ సాగిస్తాడు. అంటూ ఆత్మతత్త్వాన్ని వివరిస్తాడు యాజ్ఞవల్క్యుడు.

ఇదే విషయాన్ని **భాగవతం**లోని 'గజేంద్రమోక్షం' ఘట్టంలో పోతనగారు ఒక్క పద్యంలో వివరించారు చూడండి.

**లోకంబులు లోకేశులు**
**లోకస్థులు తెగిన తుదిన లోకంబగుపెం**
**జీకటి కవ్వలనెవ్వడు**
**నేకాకృతివెలుగు నతని నేసేవింతున్ ॥**

అదే ఆత్మతత్త్వం. పరమేశ్వర స్వరూపం. అది ఎక్కడో లేదు. మనలోనే ఉన్నది. దాని వెలుగులవల్లనే చరాచర జగత్తుతోబాటు ఈ దేహం కూడా ప్రకాశిస్తున్నది.

నిరాకారుడైన పరమేశ్వరునిమీద సాధకుని దృష్టి నిలవదు కాబట్టి పరమేశ్వరుడికి ఒక ఆకారం కల్పించారు. అంతేకాదు **సాధకానాం హితార్థాయ బ్రహ్మణోరూపకల్పనా** సాధకుని కోరికలు తీరటంకోసం, అతడికి ఏంకావాలో, దాన్ని భగవంతుని దగ్గర ఉంచటం జరిగింది. ఈ రకంగా నిరాకారుడైన పరమేశ్వరుడికి ఒక ఆకారాన్ని ఆపాదించారు. ఈ జగత్తంతా సృష్టించబడుతోంది. అలా సృష్టించే శక్తి, ప్రసవించేశక్తి స్త్రీ మూర్తికే ఉన్నది కాబట్టి ఆ పరమేశ్వరి స్వరూపం స్త్రీమూర్తి అంటున్నాం. అదే పరమేశ్వరి. ఆ పరమేశ్వరి స్వరూపం ఎలా ఉంటుంది అంటే **సకుంకుమ విలేపనా** .... అరుణారుణఛాయతో, నాలుగు బాహువులయందు, ధనుర్బాణాలు, పాశము, అంకుశము ధరించి ఉంటుంది. అనేక వేల కోట్ల కాంతి కిరణాలతో ప్రకాశిస్తూ ఉంటుంది. **'భైరవయామళం'**లో శివుడు పార్వతీ దేవికి చంద్రజ్ఞాన విద్యను ఉపదేశిస్తూ

**సాధుసాధు మహాభాగే పృష్టం త్రైలోక్య సుందరీ**
**గుహ్యాద్గుహ్యతమం జ్ఞానం నకుత్రాపి ప్రకాశితమ్ ॥ 1**

**కలావిద్యా పరాశక్తిః శ్రీచక్రాకార రూపిణీ ।**
**తన్మధ్యే బైందవస్థానం తత్రాస్తే పరమేశ్వరి ॥ 2**

**సదాశివేన సంపృక్తా సర్వతత్త్వాత్మికాసతీ ।**
**శ్రీచక్రం త్రిపురసుందర్యా బ్రహ్మాండాకారమీశ్వరీ ॥ 3**

**పంచభూతాత్మకం చైవ తన్మాత్రాత్మక మేవ చ ।**
**ఇంద్రియాత్మకమేవం చ మనస్తత్త్వాత్మకం తథా ॥ 4**

**మాయాది తత్త్వరూపం చ తత్త్వాతీతం చ బైందవమ్ ।**
**బైందవే జగదుత్పత్తి స్థితి సంహారకారిణీం ॥ 5**

**సదాశివేన సంపృక్తా తత్త్వాతీతా మహేశ్వరీ ।**
**జ్యోతిరూపా పరాకారా యస్యాదేవోద్భవాశ్శివే ॥ 6**

**కిరణాశ్చ సహస్రంచ ద్విసహస్రంచ చ లక్షకమ్ ।**
**కోటిరర్బుదమే తేషాం పరాసంఖ్యా న విద్యతే ॥** 7

ఒకానొక రోజున పార్వతీదేవి మహేశ్వరుడికి నమస్కరించి, స్వామీ ! పరమేశ్వరి అంటే ఎవరు ? ఈ లోకాలన్నీ ఏ విధంగా కాంతివంతము అవుతున్నాయి ? ఈ విషయాన్ని నాకు తెలియజేయవలసినది. అని అడిగింది. దానికి ఈశ్వరుడు.

1. ఓ మహాభాగా ! త్రిలోకసుందరియైన ఓ పార్వతీ ! నువ్వు చాలా మంచి ప్రశ్న వేశావు. ఈ విషయము గుహ్యాతి గుహ్యామైనది. అతిరహస్యమైనది. ఇప్పుడు నీకు చెబుతున్నాను. వినవలసింది అంటున్నాడు.

ఇక్కడ విచిత్రం చూడండి. వారిద్దరూ పార్వతీ పరమేశ్వరులు. ఆదిదంపతులు. వీరే కామేశ్వరీ కామేశ్వరులు. పరమేశ్వరుడు శ్రీవిద్యను లోకంలో వ్యాప్తి చెయ్యటం కోసం తాను **"ఊర్ధ్వదేవనాథ"** అనే దీక్షా నామం ధరించి కామేశ్వరీ దేవికి శ్రీవిద్యను ఉపదేశించి, ఆమెకు **"మిత్రేశ్వరంబ"** అని నామకరణం చేశాడు. కామేశ్వరీ కామేశ్వరులు ఊర్ధ్వ దేవనాథ, మిత్రేశ్వర్యంబ అనే పేర్లతో ఓడ్యాణ పీఠంలో పీఠంలో ఉన్నారు. ఆ తరువాత ఆ పరమేశ్వరి అవ్యక్త మహత్తత్త్వ అహంకార స్వరూపులు, సత్వరజస్తమో గుణప్రధానులు, సృష్టి స్థితిలయాలకు కారకులు అయిన త్రిమూర్తి ద్వంద్వానికి శ్రీవిద్యను ఉపదేశించింది. మొదటగా ఉమామహేశ్వరులకు కామేశ్వర్యంబ, ఊర్ధ్వదేవనాథ అని నామకరణంచేసి వారికి శ్రీవిద్యను ఉపదేశించింది. వారు శ్రీచక్రంలోని యోనిచక్రంలో ఉత్తర కోణమైన జాలంధర పీఠంలో శక్తి బీజాధిపతులై ఉన్నారు. వారు శ్రీవిద్యను ఉపాసన చేసి లక్ష్మీనారాయణులకు శ్రీవిద్యను ఉపదేశం చేశారు. లక్ష్మీనారాయణులు వజ్రేశ్వర్యంబ షష్టీశదేవనాథ అనే పేర్లతో త్రికోణంలోని దక్షిణకోణమైన పూర్ణగిరిపీఠంలో కామరాజ బీజాధిపతులై ఉన్నారు. ఆ తరువాత వారు శ్రీవిద్యను ఉపాసన చేసి వాణీ హిరణ్యగర్భులకు శ్రీవిద్యను ఉపదేశించగా, వారు వాగ్భవ బీజాధిపతులై, త్రికోణంలోని ఊర్ధ్వకోణమైన కామగిరి పీఠంలో వాగ్భవ బీజాధిపతులై భగమాలిన్యంబ, మిత్రేశ దేవనాథ పేర్లతోఉన్నారు. వాణీ హిరణ్యగర్భులు శ్రీవిద్యను ఇంద్రాది దేవతలకు, వారు సనకసనందనాదులకు, వారు గౌడపాదుల వంటి మానవులకు శ్రీవిద్యను ఉపదేశించారు. ఈ వరుస త్రయాన్నే **ఓఘత్రయము** అంటారు. ఇందులో ఇంద్రాది దేవతలవరకు దివ్యౌఘులు.

సనకసనందనాదులు సిద్ధౌఘులు. గౌడపాదులవంటి వారు మానవౌఘులు. అయితే శ్రీవిద్యకు మూలపురుషుడు సాక్షాత్తు పరమేశ్వరుడే. అతడే ఆదినాథుడు. ఊర్ధ్వ దేవనాథుడు. అందుకే గురుపరంపర చెప్పేటప్పుడు

**ఆదినాథ సమారంభాం శంకరాచార్య మధ్యమాం**
**అస్మదాచార్య పర్యంతాం వందే గురుపరంపరాం ॥**

అంటూ శ్రీవిద్యకు మూలపురుషుడైన పరమేశ్వరుడి దగ్గర నుంచి, మనకు మంత్రం చెప్పిన గురువు వరకు అందరికీ నమస్కరించటం జరుగుతుంది.

ఇప్పుడు శ్రీచక్రంలోని ఎనిమిదవ ఆవరణ అయిన త్రికోణంలోని ఉత్తరకోణమైన జాలంధర పీఠంలో శక్తిబీజాధిపతులై ఉన్న ఉమామహేశ్వరులు శ్రీవిద్యను గురించి చెప్పుకుంటున్నారు. ఇక్కడ పార్వతీదేవి ఈశ్వరుణ్ణి అడుగుతున్నది. ఆయన చెబుతున్నాడు అంటే పార్వతీదేవికి తెలియదు. శివుడికి తెలుసు అని కాదు. వారిద్దరికీ విషయం తెలుసు. అయితే లోకాలకు శ్రీవిద్యను వ్యాపింపచెయ్యాలనే ఉద్దేశ్యంతో పార్వతి పరమశివుణ్ణి అడుగుతున్నది. ఇప్పుడు ఆయన చెబుతున్నాడు.

2. పరాశక్తి యొక్క కలావిద్య శ్రీచక్రాకార రూపమై ఉన్నది. దాని మధ్యన బిందువున్నది. ఆ బిందువులో పరమేశ్వరి ఉన్నది. శ్రీచక్రాన్ని గురించి మనం పదకొండవ శ్లోకంలో చెప్పుకోవటం జరిగింది.

3. ఆ బిందువునందు పరమేశ్వరి సదాశివునితో కలిసి సర్వతత్త్వాత్మక అవుతున్నది. అందుకే ఓ పార్వతీ ! శ్రీచక్రము బ్రహ్మాండ స్వరూపమైనది.

4. అందులో పంచభూతాలయొక్క తత్త్వాలు, తన్మాత్రలయొక్క తత్త్వాలు, జ్ఞానేంద్రియాల, కర్మేంద్రియాల, మనస్సు యొక్క తత్త్వాలు అన్నీ ఉన్నాయి. అందుకే శ్రీచక్రము బ్రహ్మాండానికి ప్రతీక. సృష్టిలోని జీవరాశికి ప్రతీక. మానవదేహానికి ప్రతీక.

5. అందులో మాయాదుల తత్త్వాలు కూడా ఉన్నాయి. మాయాదులు అంటే మాయ, శుద్ధవిద్య, మహేశ్వరుడు, సదాశివుడు. వీటన్నింటిని మించిన బిందు ఉన్నది. ఆ బిందువులో సృష్టి స్థితిలయాలకు కారణమైన పరమేశ్వరి ఉన్నది.

6. పార్వతీ ! సదాశివునితో కూడిన సర్వతత్త్వాతీతమైన ఆ పరమేశ్వరి జ్యోతిరూపమై, పరాశక్తి రూపమై ఉన్నది.

7. ఆమె దేహమునుంచి వేలు, లక్షలు, కోట్లు, కోటానుకోట్ల కిరణాలు ప్రసరిస్తున్నాయి. ఆ కాంతికిరణములు లెక్కకు మించినవి. లెక్కంచటానికి వీలు లేనటువంటివి. వీలు కానటువంటివి.

ఇదే పరమేశ్వర తత్త్వం. ఇక్కడ పరమేశ్వరుడంటే కాంతిపుంజము. అందుకే **దేవీ భాగవతంలో**

**కోటిసూర్యప్రతీకాశం చంద్రకోటి సుశీతలం**
**విద్యుత్కోటి సమానాభమరుణం తత్పరం మహః**

అని చెప్పటం జరిగింది. కొన్ని వేల కోట్ల సూర్యులయొక్క కాంతితో, చంద్రుల యొక్క చల్లదనంతో, కోట్లకొలది మెరుపుతీగలు ఒక్కసారిగా వస్తే ఎంత కాంతి ఉంటుందో, అంతటి కాంతిపుంజము ఆ పరమేశ్వరి.

**తామేవాను ప్రవిశ్యైవ భాతిలోకం చరాచరమ్ ।**
**యస్యాదేవ్యా మహేశాని భాసా సర్వం విభాసతే ॥ 8**
**తద్భాసా రహితం కించిత్ నచయచ్ఛ ప్రకాశతే ।**
**తస్యాశ్చ శివశక్తేశ్చ చిద్రూపాయాశ్చితంవినా ॥ 9**
**అంధమాపద్యతే నూనం జగదేతచ్చరా చరమ్**

8. ఆ కాంతి పుంజమువల్లనే, ఆ కిరణ సముదాయము వల్లనే చరాచర జగత్తంతా ప్రకాశిస్తున్నది. ఓ పార్వతీ ! ఆ పరమేశ్వరి యొక్క ప్రకాశము వల్లనే లోకాలన్నీ ప్రకాశిస్తున్నాయి.

9. ఆ కాంతులు లేకపోతే ఏ వస్తువూ ప్రకాశించదు. ఆ కాంతులు లేకపోతే జగత్తు అంతా అంధకారమయము అయిపోతుంది.

**తేషా మనంతకోటీనాం మయూఖానాం మహేశ్వరీ ॥ 10**
**మధ్యేషష్ట్యుత్తరం తే ఉ మీ త్రిశతం కిరణాశ్శివే**
**బ్రహ్మాండం వ్యశ్నువానాస్తే సోమసూర్యానలాత్మనా ॥ 11**

10. ఓ మహేశ్వరీ అనంతమైన ఆ కిరణ సముదాయంలో

11. కేవలము 360 కిరణములు మాత్రమే సోమసూర్యాగ్నుల ద్వారా ఈ బ్రహ్మాండాన్ని ప్రకాశింపచేస్తున్నాయి.

**అష్టోత్తరశతం వహ్నే షోడశోత్తరశతం రవేః**
**షట్త్రింశతదుత్తరశతం చంద్రస్య కిరణాశ్శివే ॥ 12**

**బ్రహ్మాండం భాసయంతస్తే పిండాండమపిశాంకరి**
**దివాసూర్యే స్తథారాత్రౌసోమో వహ్నిశ్చసంధ్యయోః ॥ 13**

**ప్రకాశయంతః కాలాంస్తే తస్మాత్కాలాత్మకస్త్రయః**
**షష్ట్యుత్తరంచ త్రిశతం దినాన్యేవచ హాయనమ్ ॥ 14**

**హాయనాత్మా మహాదేవః ప్రజాపతి రితిశ్రుతిః**
**ప్రజాపతి ర్లోకకర్తా మరీచి ప్రముఖాన్ మునీన్ ॥ 15**

**సృజంతేతే లోకపాలాన్ తే సర్వే లోకరక్షకాః ।**
**సంహారశ్చ హరాయత్తః ఉత్పత్తిర్భవ నిర్మితా ॥ 16**

**రక్షాతు మృడసంలగ్నా సృష్టిస్థితిలయే శివః ।**
**నియుక్తః పరమేశాన్యా జగదేవం ప్రవర్తతే ॥ 17**

12 అందులో అగ్ని 108, సూర్యుడు 116, చంద్రుడు 136 కిరణాలను కలిగి ఉన్నాడు.

ఇక్కడ ఒక్క విషయం గుర్తు పెట్టుకోవాలి. ఇక్కడ చెప్పేవి కిరణాలు. కళలు కాదు. మామూలుగా మంత్రశాస్త్రంలో అగ్నికళలు 10, సూర్యకళలు 12, చంద్రకళలు 16.

13. ఈ కిరణాలచేత అండ పిండ బ్రహ్మాండాలన్నీ ప్రకాశిస్తున్నాయి. పగటి పూట సూర్యకిరణములచేత, రాత్రి చంద్రకిరణముల చేత, సంధ్యవేళలయందు అగ్ని కిరణములచేత ఈ జగత్తు ప్రకాశిస్తున్నది. దీనిమీదనే **బృహదారణ్యకోపనిషత్తు**లో జనకుడికి, యాజ్ఞవల్క్యుడికి మధ్యన సంవాదం జరిగింది అని ఈ శ్లోకంలోనే మనం చెప్పుకున్నాం.

14. ఈ 360 కిరణములే 360 రోజులు. అదే ఒక సంవత్సరము.

15. ప్రజాపతి సంవత్సర స్వరూపుడు. అతడే మరీచి మొదలైన మునులను సృష్టించాడు.

16. లోకపాలకులను, లోకాలను రక్షించేవారిని సృష్టి చేశాడు. జగత్తు భవునిచే సృష్టించబడుతుంది. సంహారము హరునిచే చేయబడుతుంది.

17. జగద్రక్షణ మృడుని చేతిలో ఉన్నది. ఈ విధంగా సృష్టి స్థితి లయాలను పరమేశ్వరి నియంత్రిస్తున్నది.

ఇప్పుడు పరమేశ్వరి సహస్రదళపద్మంలో ఉన్నది. ఆమె శరీరం నుంచి ఈ కాంతి కిరణాలు వస్తున్నాయి. వాటివల్ల శరీరంలోని షట్చక్రాలు ప్రకాశిస్తున్నాయి. అంటున్నారు భగవత్పాదులవారు. అదెలాగో చూద్దాం. శరీరంలో షట్చక్రాలున్నాయి. వాటిని **మహీం మూలాధారే** అనే తొమ్మిదో శ్లోకంలోనే చెప్పుకున్నాం. అయినప్పటికీ మళ్ళీ ఒక్కసారి గుర్తు చేసుకుందాం.

1. మూలాధారము 2. స్వాధిష్ఠానము 3. మణిపూరము 4. అనాహతము, 5. విశుద్ధిచక్రము 6. ఆజ్ఞాచక్రము

వీటిలో ప్రతిచక్రము కొన్ని కిరణములచే ప్రకాశిస్తున్నది.

| | **చక్రము** | **తత్త్వము** | **కిరణములు** | **ఖండము** |
|---|---|---|---|---|
| 1. | మూలాధారము | పృథివీ | 56 | |
| 2. | మణిపూరము | జల | 52 | |
| | | | 108 | అగ్నిఖండము |
| 3. | స్వాధిష్ఠానము | అగ్ని | 62 | |
| 4. | అనాహతము | వాయు | 54 | |
| | | | 116 | సూర్యఖండము |
| 5. | విశుద్ధిచక్రము | ఆకాశ | 72 | |
| 6. | ఆజ్ఞాచక్రము | మనస్సు | 64 | |
| | | | 136 | చంద్రఖండము |

షట్చక్రాలలో రెండు చక్రాల తరువాత ఒక గ్రంధి ఉంటుంది. గ్రంధి అంటే ముడి. కణుపు. రెండు చక్రాలను కలిపి ఒక ఖండముగా చెప్పారు. వాటిలో

1. మూలాధారము మణిపూరము ఈ రెండూ కలిపి అగ్నిమండలము.

2. స్వాధిష్ఠానము, అనాహతము ఈ రెండూ కలిపి సూర్యమండలము.

3. విశుద్ధిచక్రము, ఆజ్ఞాచక్రము. ఈ రెండూ కలిపి చంద్రమండలము.

వీటిలో అగ్ని తనశిఖలచే ప్రథమ ఖండాన్ని, సూర్యుడు తన కిరణములచే ద్వితీయ ఖండాన్ని, చంద్రుడు తనకిరణములచే తృతీయ ఖండాన్ని ఆవరించి ఉన్నారు. ఈ రకంగా చూసినట్లైతే అగ్నికి 108, సూర్యుడికి 116, చంద్రుడికి 136. వెరసి 360 కిరణములచేత ఈ జగత్తు ప్రకాశిస్తున్నది అనే విషయం తెలస్తోంది. ఈ కిరణాలన్నీ సహస్రదళపద్మములో ఉన్న పరమేశ్వరిపాదారవిందముల నుండి ప్రసరించి లోకాలను ప్రకాశవంతం చేస్తున్నాయి.

గమనిక : పరమేశ్వరి పాదారవిందములనుంచి వచ్చే 360 కిరణముల పేర్లు **శ్రీవిద్యాసారథి** అనే పేరుతో నేను వ్రాసిన **లలితా సహస్రనామ భాష్యము**లో 36వ ప్రకరణములో 589వ పేజీలో ఇవ్వటం జరిగింది. ఆసక్తి కలవారు ఆ పుస్తకము చూడవచ్చును.

**శరజ్జ్యోత్స్నా శుద్ధాం శశియుత జటాజూట మకుటాం**
**వరత్రాసత్రాణ స్ఫటిక ఘటికా(ఘుటికా) పుస్తక కరామ్**
**సకృన్నత్వా సత్వా కథమివ సతాం సన్నిదధతే**
**మధుక్షీర ద్రాక్షా మధురిమ ధురీణాః ఫణితయః ॥ 15**

ఓ తల్లీ ! శరత్కాలమునందలి వెన్నెలలాగా స్వచ్ఛమైన శరీరముతోను, లేత జాబిల్లితో కూడిన జడముడి, కిరీటము, సకలాభీష్టములను తీర్చే వరముద్ర, భయాన్ని పోగొట్టే అభయముద్ర, స్ఫటికమణులతో కూడిన అక్షమాల, విద్యాసంకేతమైన పుస్తకము చేతులయందు ధరించిన నీకు నమస్కరించిన వారికి, నిన్ను ఆరాధించిన వారికి తేనియవలె తీయనైనవి, ద్రాక్షా పాకమువలె రుచియైనవి (ఇంపైనవి) అయిన మధురమైన వాగ్వైఖరులు ప్రాప్తిస్తాయి.

ఈ శ్లోకంలో సారస్వతప్రయోగము ఉపదేశిస్తున్నారు. 'ఐం' అనేది వాగ్బీజము. ఈ బీజాన్ని ఉపాసన చేసినవారికి మధురమైన కవిత్వం చెప్పే శక్తి వస్తుంది. **దేవీ భాగవతం**లో ఒక కథ ఉన్నది.

పూర్వకాలంలో కోసలదేశంలో దేవదత్తుడు అనే బ్రాహ్మణుడు ఉండేవాడు. అతడు గొప్ప పండితుడు. భగవచ్చింతన గలవాడు. అతడికి చాలాకాలం సంతానం లేదు. అందుచేత పండితులతో ఆలోచించి తమసా నదీతీరాన పుత్రసంతానం కోసం యాగం చెయ్యటం ఆరంభించాడు. ఆ యాగానికి వేదవేదాంగవేత్త అయిన "సుహోత్రుడు' బ్రహ్మ. 'యాజ్ఞవల్క్యుడు' అధ్వర్యుడు. దేవగురువైన బృహస్పతి 'హోత' 'గోబిలుడు' అనే పండితుడు ఉద్గాత. సమర్థులైన బ్రాహ్మణోత్తములు ఋత్విక్కులు. ఉద్గాత అంటే యాగం జరుగుతున్నప్పుడు సామగీతాలను గానం చేసేవాడు. గోబిలుడు సామవేదాన్ని మంచి స్వరంతో గానం చేస్తున్నాడు. ఆ గానానికి దేవతలు కూడా ముగ్ధులై గోబిలుణ్ణి అన్నివిధాలా ప్రశంసించారు. ఈ విధంగా యాగం జరుగుతుండగా ఒకనాడు గోబిలుడికి ఊపిరి పట్టింది. దాంతో స్వరం తప్పింది. అది గమనించిన దేవదత్తుడుకోపించి "ఓరీ ! మూర్ఖుడా ! పుత్రసంతానం కోసం నేను యాగం చేస్తుంటే, నువ్వు తప్పు స్వరం పలికి యాగపవిత్రతను పోగొట్టావు. నా కోరిక సఫలం కాకుండా చేశావు" అని తిట్టాడు. ఆ మాటలకు గోబిలుడు మండిపడి "ఇంతవరకు నేను ఒక్క తప్పుకూడా లేకుండా, దేవతలు కూడా మెచ్చుకునే లాగా సామవేదాన్ని గానం చేశాను. ఊపిరిపీల్చుటమనేది ప్రాణులకు ముఖ్యమైనది. శ్వాసలో తేడా వచ్చి తప్పు దొర్లింది. అంతమాత్రానికే నన్ను 'మూర్ఖుడు' అంటావా? నీకు మూర్ఖుడైన కొడుకే పుడతాడు" అని శపించాడు.

ఆ శాపాన్ని విన్న దేవదత్తుడు తన తొందరపాటుచర్యకు విచారించి గోబిలునితో "ఆర్యా ! చాలా పొరపాటు జరిగిపోయింది. మంచికుమారుడు కలగడేమోననే బాధతో మిమ్మల్ని నిందించాను. చదువురాని కొడుకు ఉండేకన్న, అసలు లేకుండటమే మేలు. చదువు లేనివాడికి మర్యాద మన్నన ఉండదు. అతడు ద్విపాదపశువు వాడికన్న నాలుగు కాళ్ళున్న పశువేమిన్న. కర్మదూరుడు, విద్యాశూన్యుడు అయిన బ్రాహ్మణుడు ఏ రాజ్యంలో ఉంటాడో, అలాటిచోట పండితులు ఉండరాదని శాస్త్రాలు చెబుతున్నాయి. మూర్ఖుడు, విద్యాహీనుడు అయిన బ్రాహ్మణుడికి ఏ వస్తువూ దానం

చెయ్యరాదు. ఒకవేళ ఇవ్వవలసి వస్తే పట్టెడన్నం వరకే పెట్టి పంపించాలి. పిత్రుకార్యాలలో కూడా విద్యాహీనుణ్ణి భోక్తగా పిలువరాదు. ఇన్ని రకాలుగా అయోగ్యుడైన పుత్రుడు నాకెందుకు ? అటువంటి కుమారుడికి తండ్రి అయ్యే కన్నా ప్రాణత్యాగం చేస్తాను" అన్నాడు.

ఆ మాటలు విన్న గోబిలుడిమనస్సు కరిగిపోయింది. దేవదత్తుడు తొందర పడటంలో అర్థంఉంది కాని తాను తొందరపడకుండా ఉండాల్సింది. పొరపాటు జరిగిపోయింది. అని చింతించి "దేవదత్తా ! నీ కుమారుడు చదువు లేని మూర్ఖుడు అయినా కొంత కాలానికి పరమేశ్వరి మహిమవల్ల మహా పండితుడు అవుతాడు" అన్నాడు.

యాగం పూర్తయింది. దేవదత్తుని భార్య రోహిణి గర్భవతి అయి పండంటి కుమారుని కన్నది. దేవదత్తుడు కుమారుడికి 'ఉతథ్యుడు' అని నామకరణం చేసి ఉపనయనం చేసి వేదం నేర్పాలని ప్రయత్నించాడు. కాని గోబిలుడి శాపంవల్ల జడుడై పోయాడు ఉతథ్యుడు. చదువులేని కుమారుణ్ణి చూసి బాధపడసాగాడు దేవదత్తుడు. ఈ పరిస్థితిలో ఇంటి దగ్గర ఉండటానికి మనస్కరించలేదు ఉతథ్యుడికి. ఎవరికీ చెప్పకుండా ఇంట్లోంచి వెళ్ళిపోయి గంగానదీ తీరంలో ఒక పర్ణశాల నిర్మించుకున్నాడు. తపస్సు చెయ్యాలని కోరిక. కాని ఏం చెయ్యాలో, ఎలా చెయ్యాలో తెలియదు. ఉదయాన్నే లేవటం గంగలో స్నానం చెయ్యటం. గంటల తరబడి కదలకుండా కూర్చోటం. ఆకలయినప్పుడు దొరికిన కాయో, పండో తినటం. ఇది అతడి దినచర్య. కొంత కాలానికి సత్యం తప్ప ఏమీ మాట్లాడనని తీర్మానించుకున్నాడు. అందుచేత అందరూ అతణ్ణి సత్యవ్రతుడు అని పిలువసాగారు.

అతడివల్ల మిగిలిన వారికి ఏ విధమైన అపకారములేదు, ఉపకారము లేదు. అతడు పర్ణశాలలో కూర్చుని అందము, చందము, ధనము ఎన్ని ఉన్నా చదువు లేకపోతే నిష్ప్రయోజనం కదా ! గత జన్మలో ఎవరికీ విద్యాదానం చేసి ఉండను. చదువు సంస్కారాలు పూర్వజన్మ వాసనను బట్టి వస్తాయి. నా వయసు వారందరూ శాస్త్రపండితులైనారు. నాకు మాత్రం చదువు రాలేదు. ఇది నా ప్రారబ్ధం. దీన్ని తప్పించటం ఆ పరమేశ్వరికి కూడా సాధ్యం కాదు కదా ?" అని చింతిస్తుండేవాడు. ఇలా కొంతకాలం గడిచింది.

ఒకనాడు ఒక వేటగాడు ఆహారం కోసం అడవిలో తిరుగుతూ ఒక పందిని బాణంతో కొట్టాడు. అది చావకుండా సత్యవ్రతుడున్న పర్ణశాల ముందు నుంచి అరుచుకుటూ పోయింది. ఆ పంది చేసిన ధ్వని 'ఐం' వాగ్బీజముగా వినిపించింది సత్యవ్రతుడికి. దాన్నే మంత్రంలాగా జపించటం మొదలుపెట్టాడు. ఇంతలో పందిని కొట్టిన వేటకాడు పరుగెత్తుకుంటూ వచ్చి, పంది కనపడక, అది ఎటు వెళ్ళిందో చెప్పమని సత్యవ్రతుణ్ణి అడిగాడు. ఆ సమయంలో వాగ్బీజాన్ని జపిస్తున్నాడు సత్యవ్రతుడు. త్రిలోకసంచారి అయిన పరమేశ్వరి ఆవైపుగా వెడుతూ జపం చేస్తున్న సత్యవ్రతుణ్ణి మహాకవి కమ్మని ఆశీర్వదించింది. అప్పుడు ఆ బాలుడు బోయవాణ్ణి చూసి

**యాపశ్యతి నసాబ్రూతే యాబ్రూతే సానపశ్యతి**

**అహోవ్యాధ ! స్వకార్యార్థిన్ । కింపృచ్ఛతి పునః పునః ॥**

ఓ కిరాతుడా ! నీ పని కావాలనే కోరికతో నన్ను పదేపదే అడుగుతున్నావు. కాని చూసే కళ్ళు చెప్పలేవు. చెప్పే నోరు చూడలేదు. కాబట్టి నన్ను ఏం చెప్పమంటావు అన్నాడు. ఆ మాటలు విన్న బోయవాడు అక్కడ నుంచి వెళ్ళిపోయాడు.

ఈ రకంగా వాగ్బీజాన్ని ఉపాసన చేసిన సత్యవ్రతుడు మంచి కవి అయినాడు.

బాలామంత్రంలోని మొదటి అక్షరం వాగ్బీజమైన 'ఐం'కారము రెండవది కామరాజ బీజము, మూడవది శక్తి బీజము.

**వాగ్భవం ప్రథమబీజం కామరాజమ్ ద్వితీయకమ్**

**తృతీయం శక్తికూటాఖ్యం నిగమత్రితయోద్ధృతమ్**

**ఇత్థంకుమారీ విద్యయా బీజత్రయ ముదీరితమ్**

ప్రణవము అంటే ఓంకారము. దీనికి వాగ్బీజమైన 'ఐం' కారమే వదనము అని చెప్పబడుతున్నది.

**ఐంకారం ప్రణవాశ్చరశ్చ వదనం ద్రాంద్రీం కుచా వేష్ఠితమ్**

**క్లీం నాభిస్థ గుహ్యామంతరంగతం బ్లూంకార మూరుద్వయం**

**సౌః కారేణతు పంచబాణసదృశం బందూక పుష్పద్యుతిమ్**

**ధ్యాయే ద్వర్గ విభూషితస్య పులకో గంగా ప్రవాహోద్రవమ్ ॥**

దుర్వాసులవారు తమ "దేవీ మహిమ్నస్తుతి"లోని మూడవ శ్లోకంలో

**వందే వాగ్భవ మైందవాత్మ సదృశం వేదాదివిద్యా గిరో**
**భాషా దేశసముద్భవాః పశుగతా శ్ఛందాంసి సప్తస్వరాన్**
**తాలాన్పంచ మహాధ్వనీ న్ప్రకటయత్యాత్మ ప్రసారేణయత్**
**తద్బీజం పద వాక్య మాన జనకం శ్రీమాతృకే తే పరమ్ ॥**

ఓ తల్లీ ! వాగ్బీజము చంద్రబింబమువలె శ్వేతవర్ణము గలది. అది తన ప్రసారము లేదా వ్యాప్తిచేత వేదాది విద్యలను, సకల వాక్కులను, సకల భాషలను, సకల ఛందస్సులను, సప్తస్వరాలను, తాళములను, పంచవిధ ధ్వనులను ప్రకాశిత మొనరుస్తున్నది. అక్షరాలను, పదాలను, వాక్యాలను, శాస్త్రాలను కూడా ప్రకాశింప చేస్తున్నది. అటువంటి నీరూపమే అయిన వాగ్బీజాన్ని ఉపాసిస్తున్నాను అంటున్నారు.

ఈ శ్లోకంలో దుర్వాసులవారు ఓ పరమేశ్వరీ ! ఐంకారమైన వాగ్బీజము నీవేను అంటున్నారు.

ఈ విషయము **'లలితా రహస్యోపనిషత్తు'**లో వివరించబడింది. "వికారాలు లేనిది, సత్యజ్ఞానానందమయమైనది, పరిపూర్ణమైనది, సనాతనముగా ఉన్నది, ఏకముగా ఉన్నది, రెండవది లేనిది, అదే పరబ్రహ్మ స్వరూపము. నిరాకారమైన ఆ పరబ్రహ్మ యందు ఎడారులలో ఎండమావిలాగా, స్థాణువునందు దొంగవాడిలాగా, స్ఫటికములోని రేఖలలాగా అనిపిస్తూ, తెలుపు, ఎరుపు, నలుపు, గల సమాన త్రిగుణాలు కలిగి, అనిర్వచనీయమైన మూలప్రకృతి ఉన్నది. ఆ మూలప్రకృతిలో ప్రతిబింబించిన పరబ్రహ్మమే సాక్షి చైతన్యము.

గతంలో ప్రళయం వచ్చినప్పుడు జగత్తంతా నాశనమై పోయింది. ఆ సమయంలో కర్మక్షయమైన జీవరాశికంతటికీ మోక్షం సిద్ధించింది. కర్మక్షయం కాకుండా ఉన్న జీవరాశి, తమ కర్మను తమతో మూట కట్టుకుని మాయలో కలిసిపోయింది. ఇప్పుడు భూమి జలంలోను, జలం అగ్నిలోను, అగ్ని వాయువులోను, వాయువు ఆకాశంలోను, ఆకాశం అహంకారమందు, అహంకారము మహత్తత్త్వ మందు, మహత్తత్త్వము అవ్యక్తమందు లీనమయినాయి. ఈ అవ్యక్తమే మాయ అనబడుతుంది. ఈ రకంగా పంచభూతాలను, జీవరాశిని తనలో లీనం చేసుకున్న

మాయ అనబడే అవ్యక్తం ఆ పరమేశ్వరిలో కలిసిపోయింది. అదే ఇప్పుడు మనం చెబుతున్న సృష్టికి ప్రారంభానికి ముందున్న నిరాకారమైన పరమేశ్వరి.

సృష్టి ఆవిర్భావానికి ముందు, జగత్తునంతటినీ తనలో నిక్షిప్తం చేసుకున్న ఆ పరమేశ్వరి రూపం ఒక్కటే ఉన్నది. ఆ పరమేశ్వరి ఇప్పుడు సృష్టి చెయ్యాలి అనుకున్నది. సృష్టి ఎందుకు చెయ్యాలి ? తన లీలావినోదం కోసం మాత్రం కాదు. ప్రళయం సంభవించినప్పుడు కర్మ క్షయంకాకుండా, ఆ కర్మతో పాటు తనలో లీనమై పోయిన జీవులన్నింటికీ కర్మక్షయం చేసి, వాటికి మోక్షం కల్పించాలనే ఉద్దేశ్యంతోనే సృష్టి చెయ్యాలనుకున్నది ఆ పరమేశ్వరి. సృష్టి ప్రారంభమైంది. నిరాకారంగా ఉన్న ఆ పరమేశ్వరినుంచి సత్వగుణ ప్రధానమైన అవ్యక్తము బయటకు వచ్చింది. అదే మాయ, ఈ మాయ పరమేశ్వరి అధీనంలోనే ఉంటుంది. దీనివల్లనే సృష్టి స్థితి లయాలు అన్నీ జరుగుతున్నాయి. ఇప్పుడు అవ్యక్తం నుంచి రజోగుణ ప్రధానమైన మహత్తత్త్వము వచ్చింది. ఇదే హిరణ్యగర్భుడు. మహత్తత్త్వమునుంచి తమోగుణ ప్రధానమైన అహంకారము వచ్చింది. అదే విరాడ్రూపము.

అహంకారము నుంచి నామరూపాత్మకమైన జగత్తు ఆవిర్భవించింది. ముందుగా రూపాత్మక జగత్తు. అహంకారము నుంచి పంచభూతాల సూక్ష్మరూపాలయిన తన్మాత్రలు ఆవిర్భవించాయి. అవే శబ్ద స్పర్శ రూప రస గంధాలు. వాటినుంచి పంచభూతాలు వచ్చినాయి. పంచభూతాలలో ముందుగా ఆకాశం పుట్టింది. ఆకాశము నుంచి వాయువు, వాయువు నుంచి అగ్ని, అగ్ని నుంచి జలము, జలము నుంచి భూమి, భూమి నుంచి ఓషధులు, ఓషధుల నుంచి అన్నము పుట్టినాయి. ఈ రకంగా రూపాత్మకమైన జగత్తు ఆవిర్భవించింది. ఇక నామాత్మకమైన జగత్తు. అవ్యక్తము నుంచి ముందుగా ఓంకారము పుట్టింది. ఓంకారము నుంచి అకార ఉకార మకారాలు పుట్టినాయి. వాటి నుంచి అక్షర సమామ్నాయము వచ్చింది. అక్షరాల నుంచి పదాలు. పదాల నుంచి వాక్యాలు, మంత్రాలు, వేదాలు, శాస్త్రాలు, పురాణాలు, ఇతిహాసాలు సంగీతము, సాహిత్యము వచ్చినాయి. ఈ రకంగా నామాత్మకమైన జగత్తు ఏర్పడింది.

నామాత్మకజగత్తు అంటే వాగ్భవ బీజమైన 'ఐంకారమే.' అందుకే దుర్వాసుల వారు వాగ్భవబీజము సాక్షాత్తు నీ రూపమే అంటున్నారు. దుర్వాసులవారు చెప్పిన

దాంట్లో రాగము, తాళము అందరికీ తెలుసు. కాని ఇక్కడ 'పంచవిధధ్వనులు' అని చెబుతున్నారు. ధ్వనులు ఐదు రకాలుగా ఉన్నాయి. అవి

1. తతము, 2. ఘనము, 3. అనాహతము, 4. ఆనద్ధము, 5. సుషిరము

**1. తతము :** విస్తారితము, నిరివి చేయబడినది సంగీతసాధనలో చేసే ఆలాపన.

**2. ఘనము :** దృఢమైనది, అధికమైనది. వీణ మొదలగు వాద్యముల నుంచి వచ్చే ధ్వని.

**3. అనాహతము :** తాల్వాది అవయవ స్పర్శ లేకుండా వచ్చే ధ్వని.

**4. ఆనద్ధము :** చర్మము ముఖమున కట్టబడిన వాద్యముల వల్ల వచ్చే ధ్వని. తప్పెట, మద్దెల మొ॥వి.

**5. సుషిరము :** బెజ్జములద్వారా వచ్చే ధ్వని. ఉదా॥ పిల్లనగ్రోవి, సన్నాయి.

ఈ విధంగా ఏ రకమైన ధ్వని అయినా సరే అది వాగ్బీజమే.

**త్రైలోక్య స్ఫుట మంత్ర తంత్ర మహిమాం నాప్నోతి శశ్వద్వినా**
**యద్బీజం వ్యవహారజాలమఖిలం నాస్త్యేవ మాతస్తవ**
**తజ్జాప్య స్మరణప్రసక్తి సుమతిః సర్వజ్ఞతాం ప్రాప్యకః**
**శబ్దబ్రహ్మ నివాసభూత వదనో నేంద్రాదిభిః స్పర్ధతే ॥**

ఓ తల్లీ ! నీ రూపమే అయిన వాగ్భవబీజము లేనట్లైతే ముల్లోకాలలోనూ ఏ మంత్రానికీ అర్థం ఎవరూ తెలుసుకోలేరు. ప్రవృత్తి, నివృత్తి మార్గాల గురించి తెలుసుకోలేరు. అటువంటి వాగ్బీజాన్ని జపించినవాడు పాండిత్యమునందు ఇంద్రాది దేవతలతో కూడా పోటీ పడగలడు.

పంచదశిమహామంత్రంలో మొదటి కూటమి వాగ్భవకూటమి. వాగ్భవ బీజము మూడు వేదములసారము. దీన్ని జపించినవాడు అన్ని విద్యలయందు అసమానమైన పాండిత్యం గడిస్తాడు. గొప్పకవి అవుతాడు. కాళిదాసు వాగ్బీజాన్ని ఉపాసించే గొప్ప కవి అయినాడు.

**కవీన్ద్రాణాం చేతః కమలవన బాలాతవ రుచిం**

**భజన్తే యేస సః కతిచి దరుణామేవ భవతీమ్ ।**

**విరిఞ్చి ప్రేయస్యా స్తరుణ తరశృఙ్గారలహరీ**

**గభీరాభిర్వాగ్భి ర్విదధతి సతాం రఞ్జనమమీ ॥** **16**

ఓ భగవతీ ! నీవు కవీంద్రులు అనే పద్మవనానికి లేత సూర్యకాంతివి. అరుణారుణఛాయలో ఉన్న నిన్ను సేవించినవారు పుంభావసరస్వతులై శ్లాఘనీయమైన తమ శృంగార వాగ్విలాసముతో సభను రంజింపజేయుచున్నారు.

హృదయకమలమందు భగవతియైన దేవిని ఉపాసించిన వారు, పూర్తిగా సరస్వతీస్వరూపమై, శృంగారరసప్రధానమైన వాక్కులచేత సభను రంజింప చేస్తున్నారు. పరమేశ్వరి మాత్రుకావర్ణరూపిణి. అరుణ వర్ణంలో ఉన్న ఆ దేవిని ఉపాసించటంచేత శృంగారరస ప్రధానమైన వాగ్విలాసము కలుగుతుంది. వామకేశ్వర తంత్రంలో

**అరుణాఖ్యాం భగవతీ మరుణాభాం విచింతయేత్**

**పాశాంకుశ ధరాం దేవీం ధనుర్బాణధరాం శివాం ॥**

**వరదాభయ హస్తాం చ పుస్తకాక్ష స్రగన్వితామ్**

**అష్టబాహుం త్రినయనాం ఖేలంతీ మమృతాంబుధౌ ॥**

**సకరోత్యేవ శృంగార రసాస్వాదన లంపటాన్**

**సభాసదః సదాసర్వాన్ సాధకేంద్రః సభాస్థలే ॥**

అరుణ అనే పేరు గల భగవతిని, అరుణవర్ణములో ఉన్న దేవిని, ఎనిమిది చేతులయందు పాశము, అంకుశము, ధనుర్బాణాలు, వరద, అభయ ముద్రలు, పుస్తకము, అక్షమాల ధరించి, మూడు కనులు గలిగి, పాలసముద్రమునందు విహరించే ఆ దేవిని ధ్యానించేవాడు సభామంటపంలో, సభాసదులను శృంగార రసములో ముంచివేయగలుగుతున్నాడు.

ఈ శ్లోకంలో సాధకుడు ఎటువంటివాడైనా సరే అరుణారుణచ్ఛాయలో ప్రకాశిస్తున్న పరమేశ్వరిని గనక ధ్యానించినట్లైతే సభికులను రంజింప చేయగలుగుతాడు అంటున్నారు శంకర భగవత్పాదులవారు. విద్యాహీనుడైన కాళిదాసు ఆదేవిని

ఉపాసించి గొప్ప కవి అయినాడు. 'లఘుస్తవం'లో కాళిదాసు దేవిని చేసిన ధ్యానం చూడండి.

**వామే పుస్తకధారిణీ మభయదాం సాక్షాస్రజం దక్షిణే**
**భక్తేభ్యో వరదాన పేశలకరాం కర్పూరకుందోజ్వలాం**
**ఉజ్జృమ్భాబుజపత్ర కాసనయన స్నిగ్ధప్రభాలోకినీం**
**యేత్వామంబ నశీలయంతి మనసా తేషాం కవిత్వం కుతః**

**సావిత్రీభిర్వాచాం శశిమణి శిలాభఙ్గరుచిభిః**
**వశిన్యాద్యాభిస్త్వాం సహజనని సఞ్చిన్తయతి యః**
**స కర్తా కావ్యానాం భవతి మహతాం భఙ్గిరుచిభిః**
**వచోభిర్వాగ్దేవీ వదన కమలామోద మధురైః ॥** **17**

ఓ తల్లీ ! చంద్రకాంతి శిలలవలె తెల్లని శరీరచ్ఛాయ కలవారైన, వశిని మొదలైన ఎనిమిదిమంది వాగ్దేవతలు, పన్నెండుమంది యోగినులు, గంధాకర్షిణి మొదలైన ఆకర్షణ దేవతలతో కూడిన నిన్ను ధ్యానించేవాడు సరస్వతీ స్వరూపుడై మృధుమధురమైన కవిత్వం చెప్పగల కాళిదాసువంటి మహాకవి అవుతాడు.

భాషకు అక్షరాలు యాభై. ఇది

| | | | |
|---|---|---|---|
| 1. అ నుంచి అః వరకు | – | అచ్చులు పదహారు. ఒకవర్గు | |
| 2. కచటతప | – | స్పర్శలు. ఇరవై ఐదు. ఐదు వర్గులు | |
| 3. యరలవ | – | అంతస్థములు నాలుగు | ఒకవర్గు |
| 4. శషసహళ | – | ఊష్మములు ఐదు. | ఒకవర్గు |

ఈ రకంగా అక్షరాలు మొత్తం ఎనిమిది వర్గులుగా చెప్పబడతాయి. అవి అకచటతపయశ. ఈ వర్గులే వశిన్యాది దేవతలుగా శ్రీచక్రముయొక్క ఏడవ ఆవరణ అయిన అష్టకోణమందు

1. వశిని, 2. కామేశ్వరి, 3. మోదినీ, 4. విమల, 5. అరుణ, 6. జయ 7. సర్వేశ్వరి, 8. కౌళిని అనే పేర్లతో వాగ్దేవతలుగా ఉంటాయి. ఇవిగాక యోగినీ దేవతలు పన్నెండు మంది వారు

| | | |
|---|---|---|
| 1. విద్యాయోగిని | 5. దీపికాయోగిని | 9. మేధాయోగిని |
| 2. రేచికాయోగిని | 6. జ్ఞానయోగిని | 10. వ్యోమరూపాయోగిని |
| 3. మోచికాయోగిని | 7. అప్యాయనీయోగిని | 11. సిద్ధరూపాయోగిని |
| 4. అమృతాయోగిని | 8. వ్యాపినీయోగిని | 12. లక్ష్మీయోగిని |

1. గంధాకర్షిణి, 2. రసాకర్షిణి, 3. రూపాకర్షిణి, 4. స్పర్శాకర్షిణి అనే ఆకర్షణ దేవతలు నలుగురు.

వశిన్యాది దేవతలు, ద్వాదశ యోగినులు వెరసి ఇరవై మంది. వీరందరూ దశారయుగ్మంలో ఉంటారు. శ్రీచక్రంలో పది కోణాలు గల చక్రాలు రెండున్నాయి. ఈ రెండింటికీ కలిపి ఇరవై కోణాలున్నాయి. ఆ ఇరవై కోణాలయందు వీరుంటారు. అలాగే గంధాకర్షిణి మొదలైన నలుగురు దేవతలు భూపురంలోని నాలుగు ద్వారాలలోను ఉంటారు. వీరందరితోనూ కూడిన ఆ పరమేశ్వరిని గనక అర్చించినట్లైతే మృదుమధురమైన కవిత్వం చెప్పగలశక్తి వస్తుంది.

**గంధద్వారాం ధురాదర్షాం నిత్యపుష్టాం కరీషిణీమ్**

**ఈశ్వరీమ్ సర్వభూతానాం తామిహోపహ్వయే శ్రియమ్ ॥**

గంధాకర్షిణి మొదలైన ఆకర్షణ దేవతలు నాలుగు ద్వారములందు గలది, అదృష్టహీనులకు కూడా నిత్యానందము కలుగచేయునది. సర్వభూతములకు అధిదేవత అయిన ఆ శ్రీదేవిని శ్రీచక్రమునందు ఆహ్వానిస్తున్నాను.

శంభువచనములో

**మాతృకావశినీయుక్తాం యోగినీభి సమన్వితాం**

**గంధాద్యాకర్షిణీ యుక్తాం సంస్మరేత్త్రిపురాంబికాం ॥**

వశిన్యాది శక్తులతోను, రేచిక మొదలైన యోగినులతోను గంధాకర్షిణి మొదలైన వారి తోడను కూడిన మాత్రుకారూపమైన త్రిపురాంబికను ధ్యానించాలి.

వశిన్యాది శక్తులు యాభై అక్షరాలస్వరూపం గలవారు. భాషకు గల అక్షరాలలో అ నుంచి అః వరకు అచ్చులనీ, క నుంచి క్ష వరకు హల్లులనీ అంటారు.

**నృత్తావసానే నటరాజరాజో సనాదఢక్కా నవపంచవారమ్ ।**

**ఉద్ధర్తుకామ స్సనకాదిసిద్ధా నేతద్విమర్శే శివసూత్రజాలమ్ ॥**

సనకాది సిద్ధులనుద్ధరింపగోరినవాడై శివుడు తనఢక్కను పద్నాలుగుసార్లు వాయించగా, పద్నాలుగా రకాలయిన శబ్దాలు వచ్చినాయి. వాటినుంచి పద్నాలుగు సూత్రాలు జనించాయి. అంటే పద్నాలుగు రకాలయిన శబ్దాలు పద్నాలుగు సూత్రాలుగా 'పాణిని'కి వినిపించాయి. వీటిని **'మాహేశ్వరసూత్రాలు'** అంటారు. వీటి ఆధారంగానే పాణిని సంస్కృత వ్యాకరణం వ్రాశాడు. ఆ సూత్రాలు :

1. అ ఇ ఉ ణ్, 2. ఋ ౠ ఌ క్, 3. ఏ ఓ ఙ్, 4. ఐ ఔ చ్, 5. హ య వ ర ట్, 6. లణ్, 7. ఞ మ ఙ ణ న మ్, 8. ఝ భ ఞ్, 9. ఘ ఢ ధ ష్, 10. జ బ గ డ ద శ్, 11. ఖ ఫ ఛ ఠ థ చ ట తౌ, 12. కపయ్, 13. శ ష స ర్, 14. హ ల్

వీటి ఆధారంగానే పాణిని మహర్షి అష్టాధ్యాయి అనే పేరుతో వ్యాకరణ గ్రంథాన్ని వ్రాశాడు. వీటిలో మొదటి నాలుగు సూత్రాలు అచ్చులు. మొదటి సూత్రము 'అ'తో మొదలయి, నాల్గవ సూత్రము 'చ్'లో పూర్తవుతుంది. అందుచేత ఈ మధ్యలో ఉన్న వాటిని అచ్చులు అంటారు. అలాగే ఐదవ సూత్రము 'హ'తో మొదలయి, పద్నాలుగవ సూత్రము 'ల్'తో ముగుస్తుంది. అందుకని వీటిని హల్లులు అంటారు.

వర్ణ సమామ్నాయంలో అ నుంచి క్ష వరకు ఉండే వర్ణ సముదాయాన్ని అక్షరాలు అంటారు. అక్షరము అంటే క్షరము లేనిది. నాశనము లేనిది అని అర్థం. అచ్చులు అంటే స్వరాలు ఇవి ప్రాణములు, శక్తి స్వరూపాలు. హల్లులు శివస్వరూపాలు ఈ విషయం **'మాత్రుకా హృదయము'** అనే గ్రంథంలో చెప్పబడింది.

**కకారాది క్షకారాంతా వర్ణాస్తే శివరూపిణః ।**

**సమస్త వ్యస్తరూపేణ షట్త్రింశత్ తత్త్వ విగ్రహా ॥**

**అకారాది విసర్గాంతాః స్వరాః షోడశయుక్తయః ।**

**నిత్యాషోడశకాత్మనః పరస్పరమమీయతాః ॥**

**శివశక్తి మయావర్ణా శబ్దార్ధ ప్రతిపాదికాః**

**శివః స్వర పరాధీనో నస్వతంత్రః పదావ్యసౌః ॥**

**స్వరాః స్వతంత్రా జాయంతే న శివస్తు కదాచన ॥**

క నుంచి క్ష వరకు ఉన్నవి హల్లులు. ఇవి శివరూపాలు. అ నుంచి అః వరకు ఉన్నవి అచ్చులు ఇవి శక్తిరూపాలు. హల్లులకు స్వతంత్రత లేదు. వాటిని విడిగా పలకలేము. అచ్చులకు స్వతంత్రత ఉన్నది. అచ్చులతో కలిస్తేనే హల్లులకు పూర్తి స్వరూపం వస్తుంది. పాణినికి ముందు శబరవర్మ అనే పండితుడు శాబరతంత్రం వ్రాశాడు. అతని ప్రకారము హల్లులు కాదిమాత్రుకలు అంటే కకారంతో మొదలవుతాయి. పాణిని ప్రకారము హల్లులు హాది మాత్రుకలు. హకారముతో మొదలవుతాయి. శబరవర్మ ప్రకారము హల్లులు 'క' కారముతో మొదలయి 'ళ' కారముతో పూర్తి అవుతాయి. అందుచేతనే కకారాది ళకారాంతము గల వర్ణాలను 'కళ' అంటారు. ఇది గౌణార్ధము. పంచదశీ మహామంత్రం కకారంతో మొదలయి 'ల' కారంతో పూర్తి అవుతుంది. ఈ రకంగా కకార లకారాల కలయికవల్ల అక్షరాలన్నీ మంత్రంలో గ్రహించబడినాయి అని అర్ధం. క, ల అనే అక్షరాలు ప్రతి ఖండంలోనూ ఉన్నాయి. కాబట్టి మంత్రంలోని ప్రతి ఖండములోనూ అక్షరాలన్నీ ఉన్నట్టే లెక్క. పంచదశి మహామంత్రం మూడు ఖండాలుగా ఉన్నది. అంటే అన్ని అక్షరాలను మూడుసార్లు తీసుకోవటం జరిగిందన్నమాట. ఇది **శ్రీవిద్యా రహస్యము.**

ఈ రకంగా చెప్పినప్పుడు అక్షరాలు యాభై అన్నారు కదా ! మరి 'క్ష'కారము కూడా కలిస్తే యాభై ఒకటి అవుతుంది కదా ! అనే అనుమానం వస్తుంది. నిజమే సంస్కృతభాషకు అక్షరాలు యాభై. కాని మంత్రశాస్త్రంలో యాభై ఒకటి. "అకారాది క్షకారాంతము వర్ణ సమామ్నాయాన్నే అక్షరములు అంటారు" అని 'శారదాతిలకము' అనే గ్రంథంలో చెప్పబడింది. అక్షమాల అంటే రుద్రాక్షమాల. ఇందులో యాభైపూసలు ఉంటాయి. ఇవే అక్షరాలు. అయితే ఆ మాలలో ఉండే మేరువు యాభై ఒకటవది అదే క్షకారము. 'క్షకారము' కషల మిశ్రమము అయినప్పటికీ మంత్రశాస్త్రంలో క్షకారాన్ని ఒక బీజముగా తీసుకోవటం జరిగింది. వర్ణసమామ్నాయంలో వ్యాకరణం ప్రకారము చివరి అక్షరము 'ళ' మంత్రశాస్త్ర ప్రకారము చివరి అక్షరము 'క్ష' అవుతాయి.

ప్రతి అక్షరానికి ఒకరూపమున్నది. ఈ విషయం సనత్కుమార సంహితలో వివరించటం జరిగింది. అకారము మొదలైన అచ్చులు తెల్లని రంగు, ఎనిమిది చేతులు కలిగి, ఆ చేతులయందు పాశము, అంకుశము, అభయ, వరముద్రలు, పుస్తకము, అక్షమాల, కమండలము, జ్ఞానముద్ర ధరించి ఉంటాయి. ఈ అక్షరముల శక్తి కొంతమేర ఆవరించి ఉంటుంది.

| అక్షరము | శక్తి మండలము విస్తీర్ణము |
|---|---|
| 1. అకారము | 80 లక్షల యోజనాలు |
| 2. ఆకారము | 160 లక్షల యోజనాలు |
| 3. ఇకారము | 90 లక్షల యోజనాలు |
| 4. ఈకారము | 180 లక్షల యోజనాలు |
| 5. ఉకారము | కోటి యోజనాలు |
| 6. ఊకారము | రెండు కోట్ల యోజనాలు |
| 7. ఋకారము | 10 లక్షల యోజనాలు |
| 8. ౠకారము | 20 లక్షల యోజనాలు |
| 9. ఌ కారము | 10 లక్షల యోజనాలు |
| 10. ౡ కారము | 20 లక్షల యోజనాలు |
| 11. ఏ ఐ ఒ ఔ కారములు | 150 లక్షల యోజనాలు |
| 12. బిందువు, విసర్గలు | 160 లక్షల యోజనాలు |
| 13. క నుంచి మ వరకు గల హల్లులు | 40 లక్షల యోజనాలు |

ఈ శక్తులు పాశము, అంకుశము, అక్షమాల, కమండలువు ధరించి ఉంటాయి.

| | |
|---|---|
| 14. అంతస్థములు (యరలవ) | పాంశాంకుశ, అభయ, వరహస్తులు |
| 15. ఊష్మములు (శషసహ) | పాశ, అంకుశ, అక్షమాల, వరహస్తులు |
| 16. ళ, క్ష | పాశము, అంకుశము, ఇక్షు దండము పుష్పబాణాలు ధరించినవి. |

**తనుచ్ఛాయాభిస్తే తరుణ తరణి శ్రీ సరణిభిః**
**దివం సర్వాముర్వీ మరుణిమ నిమగ్నాం స్మరతి యః**
**భవన్త్యస్య త్రస్యద్వనహరిణ శాలీన నయనాః**
**సహోర్వశ్యా వశ్యాః కతికతి న గీర్వాణ గణికాః ॥ 18**

ఓ తల్లీ ! ఉదయిస్తున్న బాలభానునిలాగా ప్రకాశిస్తున్న నీ శరీరకాంతివల్ల ఈ భూమి, ఆకాశము అంతా ఎరుపు రంగులో ఎవరు ధ్యానిస్తారో, అడవి లేళ్ళవలె బెదురుచూపులు గల రంభ, ఊర్వశి మొదలైన అప్సరాంగనలతో సహా వశము కాని వారుండరు.

ఈ శ్లోకంలో పరమేశ్వరియొక్క వర్ణాన్ని (రంగును) వివరిస్తున్నాడు. ఇక్కడ విశేషం ఏమిటి అంటే భూమి ఆకాశము ఈ రెండూ కూడా పరమేశ్వరియొక్క కెంపుజాయ అనే సముద్రంలో మునిగిపోయినాయట.

**యావకాబ్ధౌ నిమగ్నాం యో దివం భూమిం విచింతయేత్ ।**

**తస్య సర్వా వచం యాతాః త్రైలోక్య వనితా ధృతమ్ ॥**

భూమి, ఆకాశాలను ఎర్రని లత్తుక సముద్రమునందు మునిగిన వాటిలాగా భావించే వాడికి ముల్లోకాలలోని వనితలు అందరూ వశమవుతారు.

లత్తుకచెట్టు అంటే ఎర్రలొద్దుగచెట్టు. దీని నుంచి స్రవించే రసము ఎరుపు రంగులో రక్తంలాగా ఉంటుంది. పరమేశ్వరి పాలసముద్రంలో ఉన్నది కాబట్టి సముద్రం అంతా ఎర్రనికాంతి ప్రసరిస్తోంది. దానివల్ల భూమ్యాకాశాలు కూడా ఎర్రగా అనిపిస్తున్నాయి. ఈ జగత్తంతా పరమేశ్వరిమయం అనిపిస్తున్నదన్న మాట.

ఇక **'వనహరిణ'** అంటున్నారు భగవత్పాదులవారు. బెదురు కనులతో అని చెప్పటానికి **'వనహరిణశాలీన నయనాః'** అన్నారు. అంటే లేడి అడవిలో తిరిగే జంతువు. దీనికి ఎప్పుడూ ప్రాణభయమే. అందుచేత ప్రతి చిన్నశబ్దానికీ భయపడుతూ, బెదురుచూపులు చూస్తుంటుంది. అదే ఊళ్ళో తిరిగే లేడి అంటే మనం పెంచుకునే లేడికి అంత భయం ఉండదు. ఇది మనుషులకు అలవాటుపడుతుంది. ఆకారణం చేతనే బెదురు కనులు అనటానికి 'వనహరిణ' అన్నారు శంకరులవారు.

ఇక **'సహోర్వశ్యా'** అంటే ఊర్వశితో సహా అందరు అప్సరసలు అని అర్థం. అప్సరసలు దేవవేశ్యలు. వారికి నచ్చిన వారి దగ్గరకు, వారిని కోరినవారి దగ్గరకు, మునీంద్రుల తపస్సు భగ్నం చెయ్యటానికి వీరు వెడుతుంటారు. వీరు చాలా అందగత్తెలు.

నరనారాయణులు బదరికావనంలో తపస్సు చేస్తున్న సమయంలో, వారి తపస్సు భగ్నంచెయ్యటానికి ఇంద్రుడు అప్సరసలను పంపాడు. వారిని చూసిన నారాయణుడు

తనచేత్తో తొడను రాచుకున్నాడు. వెంటనే అతని ఊరువునుంచి అతిలోక సౌందర్యరాశి ఉద్భవించింది. ఆమె ఊర్వశి. అప్సరసలు అందరిలోకీ అందగత్తె. ఇక్కడ ఊర్వశితో సహా (సహోర్వశ్యా) అంటే అప్సరాంగనలు అందరూ అని అర్థం. వీరందరూ కూడా ఆ సాధకుణ్ణి మోహించి వసులౌతారు. అయితే అప్సరసలు వారకాంతలు కదా ! వారికి మోహము ఇష్టములాంటివి ఉంటాయా అని అనుమానం వస్తుంది. ఇక్కడ ఊర్వశి పురూరవులు, రంభనలకూబరుల గాథలు చెప్పుకోతగ్గవి.

ఈ శ్లోకంలో పంచదశీ మహామంత్రంలోకి రెండవ కూడమి అయిన కామరాజ కూటమని చెప్పబడుతోంది. దేవీభాగవతంలో 'క్లీం' కారము మీద ఒక కథ ఉన్నది.

అయోధ్యానగరాన్ని రాజధానిగా చేసుకుని పాలిస్తున్నాడు 'ధృవసంధి' ఇతనికి ఇద్దరు భార్యలు. పెద్దభార్య మనోరమ. చిన్నభార్య లీలావతి. పెద్దభార్య కుమారుడు 'సుదర్శనుడు' చిన్నభార్య కుమారుడు 'శతృజిత్తు'. సుదర్శనుడు మంచి అందగాడు. వినయసంపన్నుడు. శతృజిత్తు అందముతోపాటు నుంచి మాటకారి. దాంతో అందరూ శతృజిత్తునే ఎక్కువ అభిమానించేవారు.

ఒకనాడు ధృవసంధి వేటకు వెళ్ళి, సింహాన్ని వేటాడబోయి, దానిచేతిలో మరణించాడు. మంత్రి సామంతులంతా సుదర్శనుకి పట్టంకడదాము అనుకుంటుండగా లీలావతి తండ్రి యుధాజిత్తు వచ్చి మనోరమ తండ్రిని సంహరించి శతృజిత్తును రాజును చేశాడు. మనోరమ పిల్లవాణ్ణి తీసుకుని ఒక నమ్మకమైన మంత్రి సాయంతో అడవిలోకి పారిపోయి భరద్వాజుని ఆశ్రమంలో తలదాచుకుంది. సుదర్శనుడు మునిపిల్లలతో ఆడుకుంటుండగా, ఒక మునిబాలకుడు సుదర్శనుని మంత్రిని 'క్లీబా' అన్నాడు. నిజానికి 'షండుడు' అని ఆ పదానికి అర్థం. అయితే అది 'క్లీం'లాగా వినిపించింది సుదర్శనుడికి, ఇక అదే బీజాన్ని జపం చెయ్యటం మొదలుపెట్టాడు సుదర్శనుడు. పరమేశ్వరి అతడి భక్తికి మెచ్చి ప్రసన్నమైంది. ఆ తరువాత కాలంలో అతడు కాశీ రాజకుమార్తె శశికళను వివాహం చేసుకుని, తన రాజ్యాన్ని కూడా సంపాదించగలిగాడు. క్లీం అనేది కామరాజబీజం. దీనిని ఉపాసించిన వారికి ఆ పరమేశ్వరి యొక్క అపారమైన కృప కలుగుతుంది.

'దుర్వాస మహర్షి' తన 'దేవి మహిమ్నస్తుతి'లోని 6వ శ్లోకంలో

**తత్తే మధ్యమబీజ మంబ కలయా మ్యాదిత్యవర్ణం క్రియా**
**జ్ఞానేచ్ఛాది మనన్తశక్తి విభవ వ్యక్తిం వ్యనక్తి స్ఫుటం**
**ఉత్పత్తి స్థితి కల్ప కల్పితతను స్వాత్మ ప్రసారేణయత్**
**కామ్యం బ్రహ్మ హరీశ్వరాది విబుధైః కామం క్రియాయోజితైః**

ఓ తల్లీ ! నీ మంత్రములోని మధ్య బీజము (క్లీం కామరాజ బీజము) ఆదిత్య వర్ణ సమానమైనది. తన వ్యాప్తిచేతనే ఇచ్ఛా, జ్ఞాన క్రియ మొదలైన అనేక రకాలైన శక్తివిశేషాలను ఈ లోకానికి అందిస్తున్నది. సృష్టిస్థితిలయాలు గావిస్తున్నది. పంచకృత్యములయందు నియోగింపబడిన పంచబ్రహ్మలచేతకూడా ఆ శక్తులు సిద్ధించటం కోసం ప్రార్థింపబడుతున్నది. 8వ శ్లోకంలో

**యద్భక్తాఖిల కామపూరణ చణస్వాత్మ ప్రభావం మహా**
**జాడ్యధ్వాన్త నివారణైక తరణి జ్యోతిః ప్రబోధ ప్రదం**
**య ద్వేదేషు చ గీయతే శ్రుతిముఖం మాత్రాత్రయే ణోమితి**
**శ్రీవిద్యే ! తవ సర్వరాజ వశకృత్త త్కమరాజం భజే ॥**

ఓ శ్రీవిద్యాస్వరూపిణీ ! నీ కామకళా బీజము భక్తులయొక్క కోరికలను పూర్తిగా తీరుస్తుంది. మహామోహము అనే గాడాంధకారాన్ని పారద్రోలటానికి సూర్య ప్రకాశముగలదై ఉత్కృష్టమైన జ్ఞానాన్ని కలిగిస్తుంది. వేదాలలో చెప్పిన మూడు మాత్రలు గల ఓంకారము ఇదే. వేదము ప్రారంభించేటప్పుడు చెప్పే ఓంకారము ఇదే. అటువంటి నీ క్లీం బీజాన్ని ఉపాసిస్తాను.

**ముఖం బిన్దుం కృత్వా కుచయుగ మధస్తస్య తదధో**
**హరార్ధం ధ్యాయేద్యో హరమహిషి తే మన్మథ కలామ్**
**ససద్య స్సంక్షోభం నయతి వనితా ఇత్యతి లఘు**
**త్రిలోకీ మప్యాసు భ్రమయతి రవీన్దుస్తన యుగామ్ ॥** **19**

ఓ జననీ ! బిందుస్థానమందు ముఖాన్ని, దానికి కొంచెం క్రిందుగా స్తన యుగ్మము ఉంచి, దానికి కొంచెం దిగువన శివునిలో సగమయిన శక్తిని అంటే

త్రికోణాన్ని యోనిగా భావించి ఆ త్రికోణంలో కామరాజ బీజాన్ని గనక ధ్యానం చేసినట్లైతే, అతడు మదవతులైన స్త్రీలమనసులను కలత చెందించటమే కాదు, సూర్యచంద్రులు చనుగవగా ఉన్న స్వర్గ, మర్త్య, పాతాళలోకాలు మూడింటినీ మోహింపచేస్తాడు.

ఇది తాంత్రిక ప్రయోగము. ప్రియురాలి ముఖాన్ని బిందువుగా భావించి, కామరాజ బీజాన్ని గనక సేవించినట్లైతే ముల్లోకాలు వశమవుతాయి అంటున్నారు. ముల్లోకాలు సూర్యచంద్రులు చనుగవగా కలిగి ఉన్నాయి అని చెప్పటంతో, ముల్లోకాలకు స్త్రీత్వము ఆపాదింపబడింది. ఇది మాదన సంబంధమైన ప్రయోగము. చతుశ్శతిలో ఈ ప్రయోగాన్ని వివరించటం జరిగింది. దీన్ని ప్రయోగించేవాడు బిందుస్థానములో తాను వశంచేసుకోవాలి అనుకున్న స్త్రీముఖాన్ని భావించి, త్రికోణంలో క్లీం బీజాన్ని ధ్యానించాలి. చతుశ్శతిలో

**బిందుం సంకల్ప్య వక్త్రంతు తదధస్తా త్కుచ ద్వయం**
**తదధశ్చ హరార్ధంతు, చింతయేత్తదధో ముఖమ్ ॥**
**తత్రకామకలారూపా మరుణాం చింతయే దిహ**
**తతస్తేనైవ రూపేణ నిజరూపం విచింతయేత్ ॥**

బిందువును ముఖంగా సంకల్పించి, దాని క్రిందుగా స్తనద్వయము, దాని క్రింది యోనిని అధోముఖముగా భావించి దానిలో కామకళను ధ్యానించాలి.

ఇటువంటి ప్రయోగాలు సనత్కుమార సంహిత, సప్తశతిలయందు చెప్పబడ్డాయి.

**బిందౌ తద్వక్త్ర మారోప్య తదధతో బాహుయుగ్మకమ్**
**తదధః కుచయుగ్మంతు తదధో యోని మేవచ**
**ఏతేషు పంచస్థానేషు, పంచబాణాన్ విచింతయేత్ ॥**

బిందువునందు కావలసిన కాంతముఖము ఆరోపించి, దాని క్రింద ఆమె బాహుద్వయము, అంతకు క్రింద చనుగవ అంతకు క్రిందుగా యోనిని ఆరోపించి, ఈ ఐదు స్థానాలలోను మన్మథుని పంచబాణాలను ప్రయోగించాలి. పంచబాణాలు అంటే ద్రాం, ద్రీం, క్లీం, బ్లూం, సః ఇవి వరుసగా

ముఖము - ద్రాం

బాహుద్వయము - ద్రీం, క్లీం

స్తనములనడుమ - బ్లూం

యోని - సః

అసలు ఆ మంత్రమే అలాంటిది.

**ఓం నమోభగవతే కామదేవాయ, ద్రాం ద్రాం ద్రావణ బాణాయ, ద్రీం ద్రీం సందీపన బాణాయ, క్లీం క్లీం సమ్మోహన బాణాయ, బ్లూం బ్లూం సంతాపన బాణాయ, సః సః వశీకరణ బాణాయ, హ్రీం హ్రీం మదనావేశయావేశయ, సకల జనచిత్తం ద్రావయద్రావయ, కంపితకంపిత, హుంఫట్ స్వాహా ॥**

అలాగే ఇంకొక ప్రయోగం చూడండి.

**త్రికోణే బైందవస్థానే అథోవక్త్రం విచింతయేత్**
**బిందో రుపరిభాగేతు వక్త్రం సంచింత్యసాధకః ॥**
**తదుపర్యేన వక్షోజ ద్వితయం సంస్మరేద్బుధః**
**తదుపర్యేన యోనించ విన్యస్యాశు విమోహయేత్ ॥**

త్రికోణమందలి బైందవ స్థానానికి క్రిందగా ముఖాన్ని భావించి అలాగే బిందువుకు పైభాగాన ముఖాన్ని, దానిపైన యోనిని భావించి వాటిలో వరుసగా భువనేశ్వరి, శ్రీవిద్య, కామరాజులను ధ్యానించినవాడు ఈ జగత్తును మోహింపచేస్తాడు ఈ ప్రయోగము **'ముఖం బిందుం కృత్వా'** అనే ప్రయోగం కన్న త్వరగా ఫలితాన్నిస్తుంది. ఇలాంటి ప్రయోగాలు అనేకానేకాలు సనత్కుమార సంహితలో ఉన్నాయి. కాని చదువరులు వాటిని దుర్వినియోగం చేస్తారనే భయంతో వ్రాయటంలేదు.

ఆత్మ, మనస్సు, యోని ఈ మూడు అధీనంలో ఉంటే ధ్యానం చెయ్యటానికి సిద్ధి కలుగుతుంది. ఆత్మ అంటే సూర్యుడు. మనస్సు చంద్రుడు. యోని సంకల్ప కేంద్రము.

ప్రతి మనిషిలోను మూడు లోకాలుంటాయి. 1. పాతాళము–నాభికి దిగువ భాగము, 2. భూలోకము–నాభి, కంఠముల మధ్య భాగము, 3. దేవలోకము–

శిరోభాగము. ఈ శ్లోకంలో యోని పాతాళానికి, సంబంధించినవి. వీటినే భూలోక, భువర్లోక, సువర్లోకాలు అంటారు.

ఆత్మ, మనస్సు, యోనిలమీద పట్టు సాధించిన వాడికి ఈ మూడు లోకాల మీద కూడా పట్టు దొరుకుతుంది. అటువంటి వాడికి ఇతర ప్రలోభాలుండవు. అన్నీ అతనికి వశమవుతాయి. ఈ రకంగా ముల్లోకాలమీద ఆధిపత్యం సాధించినవాడికి ముక్తికాంత చేరువవుతుంది. కాబట్టి కామరాజ బీజమైన క్లీంకారాన్ని జపిస్తే, సాధకుడు ముక్తి పొందుతాడు.

ఈ శ్లోకంలో మామూలుగా చూసినట్లైతే వశీకరణ మంత్రం కనిపిస్తుంది. అది కౌళాచారులు, వామాచారులు కోరేది. సమయాచారులకు కావలసినది మోక్షము. వీరికి లౌకిక ప్రయోజనాలతో సంబంధం ఉండదు. ఇది అసలు ఈ శ్లోక రహస్యము. ఇదే **సమయమత రహస్యము.** అందుచేతనే

**ఐంకారః ప్రణవాశ్చరశ్చవదనం ద్రాంద్రీం కుచావేష్టితం**
**క్లీం నాభిస్థిత గుహ్యామంతరంగతం బ్లూంకారమూరుద్వయం**
**సౌః కారేణతు పంచబాణ సదృశం బందూక పుష్పద్యుతి**
**ధ్యాయోద్వర్గ విభూషితస్య పులకో గంగా ప్రవాహోద్రవం ॥**

అంటూ ద్రాంద్రీం క్లీం బ్లూం సః అనే మన్మథ బీజాలన్నీ ఓంకారంలోనే ఉన్నాయి. అదే ముక్తికి మార్గము అన్నారు. భగవత్పాదులవారు

**కిరన్తీ మఙ్గేభ్యః కిరణ నికురుమ్బామృతరసం**
**హృది త్వా మాధత్తే హిమకర శిలామూర్తి మివ యః**
**స సర్పాణాం దర్పం శమయతి శకున్తాధిప ఇవ**
**జ్వరప్లుష్టాన్ దృష్ట్యా సుఖయతి సుధాధార సిరయా ॥** **20**

తల్లీ ! కరచరణాది సర్వావయవముల నుండి, కిరణములనుంచి అమృతధారలు స్రవిస్తున్న నిన్ను, చంద్రకాంతి శిలాప్రతిమలాగా, హృదయమందు ప్రతిష్ఠించి ధ్యానించేవాడు, విషసర్పములకు దర్పాన్ని కలిగించే విషాన్ని గరుత్మంతునిలాగా

హరించివేస్తాడు. విషబాధలు పోగొట్ట కలుగుతాడు. జ్వరతీవ్రతతో బాధపడే వారి తాపాన్ని తగ్గించగలుగుతాడు.

ఈ శ్లోకంలో గారుడ ప్రయోగం చెప్పబడుతోంది. గరుడుడు విష్ణుమూర్తికి వాహనము. వైనతేయుడు. అనూరుని సోదరుడు. ఇతన్ని గురించి అధర్వణ వేదంలోని **గారుడోపనిషత్తు**లో చెప్పబడింది. "ఇతడు నల్లనికనులు, బంగారుకాంతి కలిగి పొడవైన బాహువులు, మోకాళ్ళ నుండి బంగారురంగు కలవాడు, మెడపైన తెల్లని రంగు గలవాడు, మోకాళ్ళ పై నుండి కంఠమువరకు కుంకుమ రంగుగలవాడు, తెల్లని ముక్కు గలవాడు, ముక్కు పైభాగము నీలిరంగులో, వంకర తిరిగి ఉండేవాడు. ఇతనికి నాగులు ఆభరణాలు. వాసుకి యజ్ఞసూత్రము, తక్షకుడు కటిసూత్రము, కర్కోటకుడు హారము, కుడిచెవి పద్మడు, ఎడమచెవి మహాపద్మడు, తలమీద శంఖుడు, భుజముల మధ్య గుళికుడు, పౌంఢ్రక మొదలైన నాగులు చామరాలు వీస్తుంటారు." ఈ గరుత్మంతుడు విషాన్ని హరిస్తాడు. గరుడుడు అంటే గ్రద్దకాదు. **కృష్ణపక్షి.** చతుశ్శతిలో

**షణ్మాస ధ్యానయోగేన జాయతే గరుడోపమః**
**దృష్ట్యా కర్షయతే లోకం దృష్ట్యైవ కురుతే వశమ్ ॥**
**దృష్ట్యా సంక్షోభయేన్నారీం దృష్ట్యైవహరతే విషమ్**
**దృష్ట్యా చాతుర్థికాదీంశ్చ జ్వరాన్ నాశయతే క్షణాన్ ॥**
**తాపజ్వరానశేషాంశ్చ శీఘ్రం తార్క్ష్య ఇవాపరః**
**గరుడ ధ్యానయోగేన స్మరణాన్నాశయతే విషమ్ ॥**

ఆరు నెలలు గనక ధ్యానం చేసినట్లైతే సాధకుడు గరుడునితో సమానమైన వాడవుతున్నాడు. తన దృష్టి చేతనే లోకాలను ఆకర్షించగలుగుతున్నాడు. చూపులతోనే లోకాలను వశం చేసుకోగలుగుతున్నాడు. స్త్రీల మనస్సులను కలత పెట్టుచున్నాడు. సర్పవిషాన్ని హరించగలుగుతున్నాడు. విషజ్వరాలను వెంటనే పోగొట్ట కలుగుతున్నాడు. తెల్లని కాంతులు వెదజిమ్ము ఆ పరమేశ్వరిని ధ్యానించి తాపజ్వరాలను నాశనం చెయ్యగలుగుతున్నాడు.

అమ్మవారిని సేవించినట్లైతే అనేక రకాల శక్తులు వస్తాయి. శాస్త్రపాండిత్యము, కవిత్వము, రాజవశ్యము, స్త్రీ వశ్యము, ఇన్ని చెప్పి ఇప్పుడు పరోపకారం చెయ్యటం కోసం విషాన్ని హరించే శక్తి చెబుతున్నాడు. పరమేశ్వరిని చంద్రకాంతి శిలామూర్తిలాగా ధ్యానించినవారు సర్పవిషాన్ని హరించగలరు. తన చల్లని చూపులతో విషజ్వరాలను తగ్గించగలుగుతాడు.

పాము, తేలు వంటివి కన్నంలోకి పోతాయి. అంటే అధోమార్గం గుండా పోతాయన్నమాట కామప్రలోభాలకు గురియైనవాడు అధోగతి పొందుతాడు. అటువంటి వారిని తిరిగి ఊర్ధ్వముఖంగా నడిపేవాడు గరుత్మంతుడు. అంటే పైన చెప్పిన విధంగా అమ్మవారిని సేవిస్తే అధోగతిలో ఉన్న మానవుడు కూడా రక్షింప బడతాడు అని అర్థం.

ఈ శ్లోకానికి యంత్రం రెండు చతురస్రాలతో కూడిన అష్టకోణము. అష్ట త్రిశూలసహితము.

ఈ యంత్రాన్ని భస్మము లేదా జలముతో వ్రాసి అర్చించి, శ్లోకాన్ని వేయిసార్లు చదివి, ఆభస్మము లేదా జలము వంటికిరాస్తే అతనిలోని విషం హరించి పోతుంది.

**తటిల్లేఖా తన్వీం తపనశశి వైశ్వానరమయీం**
**నిషణ్ణాం షణ్ణామప్యుపరి కమలానాం తవ కలామ్**
**మహాపద్మాటవ్యాం మృదితమలమాయేన మనసా**
**మహాన్తః పశ్యంతో దధతి పరమాహ్లాదలహరీమ్ ॥ 21**

తల్లీ ! మాయచేత ఏర్పడిన అవిద్య, అహంకారాలను పోగొట్టుకున్న యోగీశ్వరులు మూలాధారము మొదలైన షట్చక్రాలకు పైభాగాన సహస్రారము అనే సహస్రదళ కమలముల వనంలో, తామరదుద్దునందు మెరుపుతీగలాగా కాంతివంతమై, సూక్ష్మమై జ్యోతిరూపమైన నీ సాదాఖ్యకళను, సదా సేవిస్తూ నిరతిశయానందమును పొందుతున్నారు.

ఈ శ్లోకంలో ఉత్తమాధికారం గల సాధకుల ధ్యానం గురించి చెబుతున్నారు. శరీరంలో మేరుదండమున్నది. దీన్నే వెన్నుపూస అంటారు. దీని వెంబడి

సుషుమ్నానాడి ఉన్నది. సుషుమ్నా నాడికి రెండువైపులా సహస్రదళ పద్మాలుంటాయి. ఈ రెండింటినీ కలుపుతూ ఉన్న సుషుమ్నలో ఉన్నాయి. క్రింద ఉన్న సహస్రారానికి, మూలాధారానికి మధ్యన అష్టదళము, షడ్దళము ఉన్నాయి. ఈ రెండింటి మధ్య భాగాన్నే 'విషువు' అంటారు. ఆధార చక్రము నుంచి సహస్రదళ పద్మందాకా పందొనిమిది స్థానాలున్నాయి. ఇవి మూడు జట్లుగా ఉంటాయి. మొదటి జట్టులో తొమ్మిది, రెండవ జట్టులో తొమ్మిది, మూడవ జట్టులో ఒకటి. ఈ విషయాలన్నీ **'యోగినీహృదయం'**లో చెప్పబడ్డాయి.

> **అకులే విషు సంజ్ఞేచ శాక్తే వహ్నౌ తథాపునః**
> **నాభావనా హతేశుద్ధే లంబికాగ్రే భ్రువోంతరే ॥**
> **బిందౌ తదర్ధం రోదిన్యాం నాదోనాదాంత ఏవచ**
> **శక్తౌ పునర్వ్యాపికాయాం సుమనా ఉన్మనగోచరే ॥**
> **మహాబిందౌ పునశ్చైవం త్రిధాచక్రంతు భావయేత్ ।**

**మొదటి జట్టు :**

1. అకులము – ఆధారచక్రానికి క్రింద ఉన్న సహస్రదళము
2. విషు – అష్టదళము, షోడశదళముల మధ్య భాగము
3. శక్తి – మూలాధారము
4. వహ్ని – స్వాధిష్ఠానము
5. నాభి – మణిపూరకము
6. అనాహతము – అనాహతచక్రము హృదయస్థానము
7. శుద్ధే – విశుద్ధిచక్రము, కంఠస్థానము
8. లంబికాగ్రము – కొండనాలుక
9. భృవోన్తరము – భృకుటి, ఆజ్ఞాచక్రము

**రెండవ జట్టు :**

1. బిందువు – బిందువు
2. తదర్ధం – అర్ధచంద్రము

3. రోదిని, 4. నాదము, 5. నాదాంతము, 6. శక్తి, 7. వ్యాపిక, 8. సుమన, 9. ఉన్మన

**మూడవజట్టు :**

ఇందులో ఒకేస్థానముంటుంది. ఇది మహాబిందువు. ఇది శిరస్సుకు పైభాగాన ఉంటుంది.

సాధకులు పరమేశ్వరిని ఈ మూడు స్థానాలలోను ఉపాసన చేస్తారు.

**ఆజ్ఞాంతం సకలంప్రోక్తం తతస్సకల నిష్కలం**
**ఉన్మన్యంతం పరేస్థానే నిష్కళంచ త్రిధాస్థితం ॥**

క్రింద భాగాన ఉన్న సహస్రదళం దగ్గర నుంచి, ఆజ్ఞా చక్రము వరకు గల తొమ్మిది స్థానాల యందు పరమేశ్వరిని లేదా శ్రీచక్రాన్ని అర్చించటాన్ని సకల భావన అంటారు. వీరికి లౌకిక సుఖాలయందే మక్కువ ఎక్కువ. ఉపాసనా విధానంలో వీరిని అధములుగా పరిగణిస్తారు.

రెండవ జట్టులో బిందువు నుండి ఉన్మనవరకు గల తొమ్మిది స్థానాలయందు దేవిని ఉపాసించేవారు సకల నిష్కళులు. వీరు ద్వైదీభావంతో ఊగిసలాడుతుంటారు. ఒక ప్రక్క ఐహికము, ఇంకొక ప్రక్కపరము. రెండు భావనలు కలిగి ఉంటారు. వీరు మధ్యమాధికారులు.

మూడవజట్టులో పరదేవతకు, తమకు భేదం లేదని భావించేవారు. కేవలము జ్ఞానులు మాత్రమే ఉపాసన చేస్తారు. వీరు ఉత్తమాధికారులు.

ఇప్పుడు ఈ శ్లోకంలో ఉత్తమాధికారం గల సాధకుల గురించి చెప్పబడుతోంది. పంచదశి మహామంత్రానికి అక్షరాలు పదిహేను. ఈ అక్షరాలు ఇప్పుడు పైన చెప్పిన స్థానాలలో అంటే ఒక్కొక్క స్థానంలో ఒక్కొక్క అక్షరం చొప్పున లయమయి పోగా పదిహేనవ అక్షరము 'శక్తి'యందు లీనమవుతుంది. ఇదే త్రికోణము. బిందుత్రయము సోమసూర్య అనలాత్మకము. సూర్యుడు అగ్నియందు, అగ్నిచంద్రుని యందు, చంద్రుడు సపరార్ధకళ యందు అనగా సకారానికి పరమైన హకారమందు లీనమవుతాడు. ఇది ఉన్మని స్థానము. ఇప్పుడు సాధకుడు పరాస్థానములో ఐక్యత

భావించి జీవన్ముక్తుడవుతాడు. పరమేశ్వరి **"తపనశశి వైశ్వానరమయీ"** అని చెప్పబడింది. అంటే ఆమె సోమసూర్యానలాత్మకము. సూర్యచంద్రాగ్నులు ఆమెయే కాని వారికి ప్రత్యేక భావనలేదు.

**నిషణ్ణాం షణ్ణామప్యుపరి కమలానాం** అని చెప్పబడింది. అనగా షట్చక్రాలపైన ఆమె ఆసీనమై ఉన్నది అని అర్థం. అందుకే పరమేశ్వరిని ఆవాహన చేసేటప్పుడు

**మహాపద్మవనాంతస్థే కారణానంద విగ్రహే**
**సర్వభూతహితే మాతరే హ్యేహి పరమేశ్వరి**

అందుకే పరమేశ్వరిని ఉపాసన చేసేటప్పుడు షట్చక్రాలు భేదించి మహాబిందువు నందే ఆమెను ఉపాసించాలి. లలితాసహస్రంలో ఇలా చెప్పబడింది.

**మూలాధారైక నిలయా బ్రహ్మగ్రంధి విభేదినీ**
**మణిపూరాంతరుదితా విష్ణుగ్రంధి విభేదినీ ॥**

**ఆజ్ఞాచక్రంతరాళస్థా రుద్రగ్రంధి విభేదినీ**
**సహస్రారాంబుజారూఢా సుధాసారాభివర్షిణీ ॥**

**తటిల్లతామరు ష్షట్చక్రోపరి సంస్థితా**
**మహాశక్తిః కుండలినీ బిసతంతుతనీయసీ ॥**

ఇదే బ్రహ్మకళ, పరమాకళ, సాదాఖ్యకళ, చిత్కళ, ధృవకళ, అదే పరమేశ్వరి. ఆమెను అర్చించినవాడు జీవన్ముక్తుడవుతాడు. ఇది **సమయమతరహస్యము.**

**భవాని త్వం దాసే మయి వితర దృష్టిం సకరుణాం**
**ఇతి స్తోతుం వాంఛన్ కథయతి భవాని త్వమితియః**
**తదైవ త్వం తస్మై దిశసి నిజసాయుజ్య పదవీం**
**ముకుంద బ్రహ్మేంద్ర స్ఫుటమకుట నీరాజిత పదామ్ ॥** **22**

తల్లీ ! నీ కృపాకటాక్ష వీక్షణాలను తన మీద ప్రసరింపజేయవలసినది అనే కోరికతో నిన్ను స్తుతించే భక్తుడు "తల్లీ నీవు" అనే రెండు మాటలు పలికినంత మాత్రం చేతనే హరిహర బ్రహ్మాదులు కోరుకునే సాయుజ్యపదవిని అతనికి అనుగ్రహిస్తున్నావు.

తన కోరిక తీర్చుమని నిన్ను అడగటానికి ప్రయత్నించిన భక్తుడు, ఆ కోరిక ఏమిటో కూడా చెప్పకుండా కేవలము నీ పేరును ఉచ్చరించినంత మాత్రంచేతనే ఆ భక్తుని కోరికను తీర్చివేస్తావు అంటున్నారు శంకరభగవత్పాదులవారు. తెలిసి చేసినా, తెలియకచేసినా తప్పుతప్పే. ఒప్పుఒప్పే. నిప్పును ముట్టుకుంటే కాలుతుంది. అమృతం త్రాగితే మృత్యువు రాదు. ఈ పనులు తెలిసి చేసినా తెలియకచేసినా, వాటి ఫలితాన్ని అవి ఇస్తాయి. అలాగే పరమేశ్వరిని ధ్యానించినంత మాత్రం చేతనే భక్తుని కోరికలు తీరతాయి. ఆమె అపరిమితమైన కరుణామూర్తి.

ఇక్కడ **'భవానీ త్వం'** అన్నప్పుడు ఈ 'త్వం' అనే పదము "మహావాక్య" ప్రయోగమని గుర్తించాలి. "ఇష్టప్రాప్తిని అనిష్ట పరిహారాన్ని పొందటానికి అలౌకికమైన సాధనమే వేదము". వేదము నాలుగు భాగాలుగా ఉంటుంది. 1. సంహితలు 2. బ్రాహ్మణాలు 3. ఆరణ్యకాలు 4. ఉపనిషత్తులు. వేదంలోని అంత్యభాగాన్నే వేదాంతము అంటారు. అదే ఉపనిషత్తు. నాలుగు వేదాలకు కలిపి 1180 ఉపనిషత్తులు ఉన్నాయి. వాటిలో 108 మాత్రమే చదువదగ్గవి. అందులో పది ఉపనిషత్తులకు శంకర భగవత్పాదులవారు భాష్యం వ్రాశారు. ప్రతి ఉపనిషత్తు ఏదో ఒకవేదానికి సంబంధించినదే.

ఉపనిషత్తు అంటే బ్రహ్మవిద్య. బ్రహ్మవిద్యా పరిశీలకులైన విద్వాంసులకు కర్మ, జన్మ, మరణాలు లేకుండా చేసేది. ఆ జన్మాదికమైనదానిని నశింపచేసి బ్రహ్మపదార్థ లాభం కలిగించేది. ప్రతిఉపనిషత్తులోనూ పరబ్రహ్మతత్త్వాన్నే చెప్పటం జరిగింది.

ఈ విధంగా ఉపనిషత్తులు పరబ్రహ్మస్వరూపాన్ని ప్రతిపాదించటంలో చాలా వరకు సఫలీకృతమైనాయి. ఉపనిషత్తులసారమంతా మహావాక్యాలలో ఉంది. మహా వాక్యాలు నాలుగు. అవి

| | | |
|---|---|---|
| 1. ప్రజ్ఞానంబ్రహ్మ | ఐతరేయోపనిషత్తు | ఋగ్వేదము |
| 2. అహంబ్రహ్మాస్మి | బృహదారణ్యకోపనిషత్తు | శుక్లయజుర్వేదము |
| 3. తత్త్వమసి | ఛాందోగ్యోపనిషత్తు | సామవేదము |
| 4. అయమాత్మాబ్రహ్మ | మాండూక్యోపనిషత్తు | అథర్వణవేదము |

ఈ నాలుగు మహావాక్యాలలోను 'తత్త్వమసి' అనేది ముఖ్యమైనది. దీనిని గురించి తెలుసుకుంటే మిగిలిన మహావాక్యాల అర్థం పూర్తిగా తెలుస్తుంది. **శుకరహస్యోప నిషత్తు**లో ఈ విషయాలను వివరించటం జరిగింది.

**ఛాందోగ్యోపనిషత్తు**లో ఉద్ధాలకుడు తన కుమారుడైన శ్వేతకేతువుకు ఆత్మజ్ఞానాన్ని వివరిస్తూ "నాయనాశ్వేతకేతూ ! ఆకాశంలో సూర్యుడు ప్రకాశిస్తున్నాడు. అతని కాంతులవల్లనే ఈ లోకాలన్నీ మనగలుగుతున్నాయి. ఆ సూర్యునిలో ఏ తేజస్సయితే ఉన్నదో అదే నీవు. **'తత్ త్వం అసి'** తత్–అది, త్వం–నీవు, అసి–అయి ఉన్నావు. అదే నువ్వు అయి ఉన్నావు అంటాడు. అంటే జీవాత్మ పరమాత్మా రెండూ ఒక్కటే.

ఈ శ్లోకంలో **'భవాని త్వం'** ఆ పరమేశ్వరి, నువ్వు రెండూ ఒక్కటే కాని వేరుకాదు. అని చెబుతున్నారు. ఇది తాదాత్మ్యభావన. అంతర్యాగంలోకాని, బహిర్యాగంలో కాని కావలసినది ఇదే. ఫలితముకూడా ఇదే. పరమేశ్వరి అర్చనలో ఆంతర్యం ఏమిటి ? అంటే జన్మరాహిత్యం. అదే ముక్తి. మోక్షము, సాయుజ్యము.

ముక్తి నాలుగురకాలు. ఐదవది సాయుజ్యం. పరమేశ్వరిని షట్చక్రాలలో సేవించిన వారికి, వారు ఉపాసించే స్థానాన్ని బట్టి ముక్తి లభించటం జరుగుతుంది. షట్చక్రాలు ఆధారచక్రం నుండి ప్రారంభమవుతాయి. ఆధార స్వాధిష్ఠానాలు అందకార బంధురాలు. వాటిలో పరమేశ్వరి పూజ అవైదికము. ఇవి కౌళులకు మాత్రమే నిర్దేశించినవి. సమయులకు వీటిలో ప్రవేశము లేదు. సమయులు మణిపూరం నుంచే ఆ పరమేశ్వరిని అర్చించాలి.

1. మణిపూరంలో దేవిని అర్చించేవారు, దేవిపురానికి దగ్గరగా ఇంకొక పురము నిర్మించుకుని ఉండగలుగుతారు. దీన్ని **సార్షిరూపముక్తి** అంటారు.

2. అనాహతంలో దేవిని అర్చించేవారు, దేవి పట్టణంలోనే నివసించ గలుగుతారు. ఇది **సాలోక్య ముక్తి.**

3. విశుద్ధిచక్రంలో దేవిని పూజించేవారు, దేవికి అతిదగ్గరగా సేవకులుగా ఉంటారు. ఇది **సామీప్యముక్తి.**

4. ఆజ్ఞాచక్రంలో దేవిని అర్చించేవారు వేరే దేహం ధరించి, దేవితో సమానమైన రూపంలో ఉంటారు. ఇది **సారూప్యముక్తి.**

5. సహస్రారంలో దేవిని అర్చించేవారు జన్మరాహిత్యం పొందుతారు. ఇది శాశ్వతమైన ముక్తి. ఇదే సాయుజ్యము.

సాధకుడి అంతిమలక్ష్యం సాయుజ్యం. జన్మరాహితం. సహస్రారంలో పరమేశ్వరిని అర్చించిన వారికి మరుజన్మ ఉండదు. అయితే కొన్నిచోట్ల మొదటిదయిన సార్ష్రిరూపముక్తి చెప్పకుండా, మిగిలిన నాలుగు రకాల ముక్తులను చెబుతున్నారు. 'శివానందలహరి'లోని 28వ శ్లోకంలో

**సాలోక్యం తవ పూజనే శివమహాదేవేతి సంకీర్తనే**
**సామీప్యం శివభక్తి దుర్యజనతా సాంగత్య సంభాషణే**
**సారూప్యం చ చరాచరాత్మక తనుధ్యానే భవానీపతే**
**సాయుజ్యం మమచిత్రమత్ర భవతి స్వామిన్ కృతార్థోఽస్మ్యహమ్ ॥**

ఓ మహాదేవా ! నిన్ను పూజించటమే – సాలోక్యముక్తి, నిన్ను కీర్తించటమే – సామీప్యముక్తి, నీ భక్తుల సాంగత్యము, వారితో సంభాషణే – సారూప్యముక్తి, చరాచర జగత్తు నాలోనే ఉన్నది అనుకోవటమే – సాయుజ్యము.

అటువంటి జన్మరాహిత్యమైన సాయుజ్యాన్ని ఇచ్చేది పరమేశ్వరి.

**త్వయా హృత్వా వామం వపు రపరితృప్తేన మనసా**
**శరీరార్ధం శంభో రపరమపి శఙ్కే హృతమభూత్**
**యదేత త్త్వద్రూపం సకల మరుణాభంత్రి నయనం**
**కుచాభ్యా మానమ్రం కుటిల శశి చూడాల మకుటమ్ ॥ 23**

ఓ పరమేశ్వరీ ! నీవు మొదట శివుని శరీరములో సగభాగము హరించావు. కాని దానితో తృప్తి పొందక మిగిలిన సగభాగము కూడా అపహరించినట్లుగా నాకు అనిపిస్తోంది. ఎందుకంటే నా హృదయకమలమున ప్రకాశించు నీ రూపము వామదక్షిణ భాగములతో కూడినదంతా బాలబానునివలె అరుణారుణ ఛాయతో

ప్రకాశిస్తూ, మూడు కనులుగలదై, స్థనభారము చేత కొద్దిగా వంగినట్లు కనిపిస్తూ, శిరసున చంద్రకళతో ప్రకాశిస్తున్నది.

ఈ శ్లోకంలో **కౌళమతాన్ని** వివరిస్తున్నారు. పురుషార్థాలలో అర్థకామాలకే ప్రాధాన్యత ఇచ్చేవారు కౌళులు. వీరికి బాహ్యపూజయే కాని అంతఃపూజ ఉండదు. కౌళాగమాలు అని పిలువడే అరవై నాలుగు తంత్రాలు వీరికి ప్రామాణికాలు. వీరు షట్చక్రాలలోని ఆధారచక్రాన్ని పూజిస్తారు. కౌళాచారులను రెండురకాలుగా విభజిస్తారు. 1. పూర్వకౌళులు 2. ఉత్తరకౌళులు

పూర్వకౌళులు శ్రీచక్రాన్ని భూర్జరీపత్రము, పట్టువస్త్రము, బంగారు లేదా వెండి రేకులమీద వ్రాసి దానిలోని త్రికోణాన్ని పూజిస్తారు. వీరికి 'శివుడు' అనేవాడు ప్రత్యేకంగాలేడు. వీరి మతం ప్రకారము శక్తితత్త్వమొక్కటే ఉన్నది. శివతత్త్వము శక్తితత్త్వములో అంతర్భూతము. కౌళమతాన్ని **'తవాధారేమూలే'** అనే 41వ శ్లోకంలో వివరించటం జరిగింది.

ఇక్కడ పరమేశ్వరి అరుణారుణఛాయలో ప్రకాశిస్తున్నది అంటూ ఆమె స్త్రీ మూర్తి. శివుడు అక్కడ కనిపించటంలేదు అంటున్నారు. పరమేశ్వర స్వరూపం ఒకటే. అదే శివశక్తులుగా విభజించబడింది. శివశక్తులు వేరుకాదు. ఒకే నాణానికి బొమ్మ, బొరుసు వంటివారు.

ఆ దేవి శరీరంలో త్రినేత్రాలు, చంద్రకళ కనిపిస్తున్నాయి. ఇవి శివుని లక్షణాలు. అందుకే శివుని శరీరము ఆమె అపహరించింది అంటున్నారు భగవత్పాదులవారు.

ఇక్కడ అసలు రహస్యం ఏమంటే, శివుని వ్యక్త రూపమే శక్తి. శివుడు అవ్యక్తుడు. అతడికి రూపముండదు అంటూ ఈ జగత్తంతా శక్తిమయమే అంటున్నారు.

**జగత్సూతే ధాతా హరిరవతి రుద్రః క్షపయతే**
**తిరస్కుర్వ న్నేతత్స్వమసి వపురీశ స్తిరయతి**
**సదాపూర్వ స్సర్వం తదిద మనుగృహ్ణాతి చ శివః**
**తవాజ్ఞా మాలంబ్య క్షణచలితయో ర్భ్రూ లతికయోః ॥ 24**

ఓ తల్లీ ! సృష్టికర్తయైన బ్రహ్మ చరాచర జగత్తును సృష్టి చేస్తున్నాడు. విష్ణువు రక్షిస్తున్నాడు. రుద్రుడు సంహారము చేస్తున్నాడు. ప్రళయకాలమందు వీరు ముగ్గురూ మహేశ్వరునిలో కలిసిపోగా, అతడు సదాశివునిలో అంతర్భూతుడవుతున్నాడు. ఆ తరువాత సదాశివుడు కనులతో నీవుచేసిన సంజ్ఞ ప్రకారము బ్రహ్మ, విష్ణువు, రుద్రుడు, మహేశ్వరులను మళ్ళీ సృష్టిస్తున్నాడు.

ఈ సృష్టిలో పంచబ్రహ్మలు ఉన్నారు. వారు బ్రహ్మ, విష్ణువు, రుద్రుడు మహేశ్వరుడు, సదాశివుడు. **దక్షిణామూర్తిసంహిత**లో చెప్పినట్లుగా వీరందరూ పరమేశ్వరి పుత్రులు.

**బ్రహ్మ విష్ణు మహాదేవా అస్యాః పుత్రా వరాననే**
**చతుర్థోఽహం మహేశాని స్తుత స్తస్యా మహేశ్వరః**
**తస్యోపరి బ్రహ్మరూపే స్వయం సాక్షాస్సదాశివః ॥**

ఆ పరమేశ్వరికి బ్రహ్మ జ్యేష్ఠపుత్రుడు. అతడు సృష్టి కార్యక్రమం చేస్తుంటాడు. విష్ణువు రెండవ కుమారుడు. పాలనావిధానం చూస్తుంటాడు. రుద్రుడు మూడవ కుమారుడు. సంహారకృత్యము చూస్తుంటాడు. వీరు ముగ్గురూ కాలపురుషులు. మహేశ్వరుడు అనే పేరు గలవాడు నాల్గవ కుమారుడు వీరిపైన సాక్షాత్తు బ్రహ్మరూపుడు సదాశివుడు.

పరమేశ్వరి **'పంచకృత్య పరాయణ'** లలితా సహస్రంలో 274వ నామం అదే. పంచకృత్యములు అంటే సృష్టి, స్థితి, సంహారము, తిరోదానము, అనుగ్రహము. ఈ పనులు చేయటంకోసం తన అంశాలను నియమించింది. లలితా సహస్రంలో 264 నుంచి 273 దాకా ఈ విషయాన్ని వివరించటం జరిగింది. ఆ పరమేశ్వరి

సృష్టికర్త్రీ బ్రహ్మరూపా – బ్రహ్మరూపంలో సృష్టి చేస్తుంది

గోప్త్రీ గోవిందరూపిణి – విష్ణువు రూపంలో జగత్తును రక్షిస్తుంది

సంహారిణీ రుద్రరూపా – రుద్రుని రూపంలో సంహారం చేస్తుంది.

తిరోదానకరీశ్వరీ – మహేశ్వరుని రూపంలో తిరోదానము చేస్తుంది. తిరోదానము అంటే సంపూర్ణ నాశనము

సదాశివా అనుగ్రహదా - సదాశివుని రూపంలో పునః సృష్టి చేస్తుంది. పూర్తిగా ఏమే మిగలకుండా నాశనమైపోయిన జగత్తును మళ్ళీ సృష్టించటానికి సుముఖంగా ఉండటమే అనుగ్రహము. అంటే మళ్ళీ సృష్టిని ప్రారంభించటమే అనుగ్రహము.

మహాప్రళయం జరిగినప్పుడు జగత్తు పూర్తిగా నాశనమవుతుంది. ఆ సమయంలో రుద్రుడు విష్ణువులోను, విష్ణువు బ్రహ్మలోను, బ్రహ్మ ఈశ్వరునిలోను, ఈశ్వరుడు సదాశివునియందు లీనమవుతారు. ఆ సదాశివుడు పరమేశ్వరిలో లీనమైపోతాడు. మళ్ళీ సృష్టికి సంకల్పం జరిగినప్పుడు వీరందరూ బయటకు వచ్చి సృష్టిని ప్రారంభిస్తారు. **'శాంభవదీపిక'** అనే గ్రంథంలో

**సృష్టి స్థిత్యుపసంహార తిరోదానుగ్రహాత్మకమ్ ।**
**కృత్యం పంచవిధం యస్మాత్తం నమః శాశ్వతమ్ శివమ్ ॥**

సృష్టి స్థితి సంహార తిరోదాన అనుగ్రహాలు అనబడే పంచకృత్యాలను పంచబ్రహ్మలు పరమేశ్వరి యొక్క కంటినుంచి వచ్చిన ఆజ్ఞలద్వారా చేస్తారు.

**త్రయాణాం దేవానాం త్రిగుణ జనితానాం తవశివే**
**భవేత్పూజా పూజా తవ చరణయో ర్యా విరచితా**
**తథాహి త్వత్పాదోద్వహన మణి పీఠస్య నికటే**
**స్థితా హ్యేతే శశ్వ న్ముకుళిత కరోత్తంసమకుటాః ॥** **25**

ఓ తల్లీ ! సత్వరజస్తమోగుణాలకు ప్రతీకలైన బ్రహ్మ విష్ణు రుద్రులు, నీ పాదాలు పెట్టుకునే రత్నపీఠం దగ్గర కిరీటాలు తీసి, తలలు వంచి, వినమ్రులై కూర్చుని ఉన్నారు. కాబట్టి వారికి వేరే పూజలేదు. పాదాలకు జరిగే పూజయేవారికి పూజ.

ఆ దేవియొక్క పాదపీఠాలను సేవించే భాగ్యం నువు (సాధకుడు) పూజలందు కున్నంత మాత్రం చేత లభించదు. అంటే ఐహిక జగత్తులో అతడు గొప్పవాడైన మాత్రంచేత, పదిమంది నిన్ను గౌరవించినంత మాత్రంచేత, పూజించినంత మాత్రం చేత తను గొప్పవాడు కాలేడు. పరమేశ్వరి పదపీఠాలను అర్చించే అధికారం, భాగ్యం అతడికి కలగవు. హరిహర బ్రహ్మలు త్రిగుణాలకు ప్రతీక. ఈ జగత్తును సృష్టించేవారు.

చాలా గొప్పవారు. భక్తుల కోరికలు తీరుస్తారు. వారిచే పూజింపబడతారు. అయినప్పటికీ వారికి పరమేశ్వరి పదపీఠాన్ని అర్చించే భాగ్యం రాదు. అది కేవలము ఆ దేవి కృపాకటాక్ష వీక్షణాలవల్లనే జరుగుతుంది. దేవి పాదాలను అర్చించినట్లైతే, త్రిమూర్తులను కూడా అర్చించినట్లే. వారిని విడిగా అర్చించవలసిన అవసరంలేదు. పరమేశ్వరి పాదపూజ శివపూజకన్నా, విష్ణుపూజకన్నా శ్రేష్ఠమైనది. 'దేవీపురాణం'లో

**విష్ణుపూజా సహస్రాణి శివపూజా శతానిచ**
**అంబికా చరణార్చాయాః కాలం నార్హంతి షోడశమ్ ॥**

వేయిసార్లు చేసిన విష్ణుపూజ కన్నా - ఒక్క శివపూజ శ్రేష్టము
వంద శివపూజలకన్నా - ఒక్కసారి చేసిన పరమేశ్వరి అర్చన మేలు

**విరిఞ్చిః పఞ్చత్వం ప్రజతి హరి రాప్నోతి విరతిం**
**వినాశం కీనాశో భజతి ధనదో యాతి నిధనమ్**
**వితంద్రీ మాహేంద్రీ వితతిరపి సమ్మీలితదృశా**
**మహాసంహారేఽస్మిన్ విహరతి సతి త్వత్పతిరసౌ ॥** **26**

ఓ దేవీ ! మహాప్రళయం సంభవించినప్పుడు ఈ జగత్తు పూర్తిగా నాశనమై పోతుంది. ఏమీ మిగలదు. సంపూర్ణనాశనం జరుగుతుంది. అప్పుడు ఈ జగత్తును సృష్టించిన బ్రహ్మ మరణిస్తాడు. లోకపాలకుడైన విష్ణువు మరణిస్తాడు. సంహారకర్త అయిన రుద్రుడు నశిస్తాడు. అందరి ప్రాణాలు తీసే యముడు, ధనాధిపతి కుబేరుడు నాశనమవుతారు. పద్నాలుగు మంది మనువులు, ఆ మన్వంతరాలలో గల ఇంద్రులు, అందరూ నశించిపోతున్నారు. కాని నీ భర్త అయిన సదాశివుడు మాత్రము ఏ అడ్డూ లేక విహరిస్తున్నాడు.

ఈ జగత్తులో అధికారం గల త్రిమూర్తులు, లోకపాలకులు మొదలైన వారందరూ, దేవతాశ్రేష్ఠులతోసహా మహాప్రళయకాలమందు నశించిపోతారు. కాని నీ భర్త అయిన సదాశివుడికి మాత్రం నాశనం ఉండదు. నీ పాతివ్రత్య మహిమవల్లనే అతనికి ఏ కీడు లేదు.

పరమేశ్వరుడు నిరాకారుడు నిర్గుణస్వరూపుడు అయిన పరబ్రహ్మ. అతడు అక్షరపురుషుడు. నాశనం లేనివాడు శాశ్వతుడు. ప్రళయం జరిగినప్పుడు జగత్తంతా అంతరించిపోగా శక్తి శివుడిలో కలిసిపోతుంది. అప్పుడు శివశక్తులిద్దరూ కలిసి నిర్గుణబ్రహ్మగా మిగులుతారు. సూతసంహితలో ఈ విషయం చెబుతూ

**అసంఖ్యా విలయం యాంతి బ్రహ్మాణః పండితోత్తమాః**
**అసంఖ్యా విష్ణవో రుద్రా అసంఖ్యా వాసవాదయః**
**ఏకఏక శివస్సాక్షా త్సృష్టి స్థిత్యంత హేతవః**

అనేకమంది విష్ణుమూర్తులు, రుద్రులు, ఇంద్రులు ఉండచ్చు. కాని సృష్టి ఆఖరున అంటే ప్రళయం జరిగినప్పుడు మిగిలేది సాక్షాత్తు పరమేశ్వరుడొక్కడే.

ఈ జగత్తంతా పరమేశ్వమయము. ప్రళయం జరిగినప్పుడు ఈ జగత్తంతా నాశనమయిపోయి పరమేశ్వరునిలో లీనమవుతున్నది. అలాగే ఆ పరమేశ్వరుని నుంచే ఈ జగత్తంతా ఆవిర్భావం చెందుతున్నది. అంటే సృష్టికి ముందు ప్రళయం తరువాత ఉండేది పరమేశ్వరుడొక్కడే. ఈ మధ్య కాలంలో లోకపాలనా సౌలభ్యం కోసం అనేకమంది బ్రహ్మలు, విష్ణుమూర్తులు, రుద్రులు, ఇంద్రులు, ఎందరో ఉండవచ్చు. కాని వీరెవరూ శాశ్వతం కాదు. శాశ్వతమైనది ఆ పరమేశ్వరుడొక్కడే. అతడే భవానీపతి. పరమేశ్వరుడు.

**జపో జల్ప శ్శిల్పం సకలమపి ముద్రావిరచనా**
**గతిః ప్రాదక్షిణ్య క్రమణ మశనాద్యాహుతి విధిః**
**ప్రణామ స్సంవేశ స్సుఖమఖిల మాత్మార్పణ దృశా**
**సపర్యా పర్యాయ స్తవభవతు యన్మే విలసితమ్ ॥** **27**

తల్లీ ! ఆత్మార్పణ చెయ్యాలి అనే దృష్టితో నేను నోటితో పలికిన మాటలన్నీ నీ మంత్రజపమే అవుతుంది. ఈ దేహము నీవు ప్రసాదించినదే కాబట్టి, నేను చేతులతో చేసే పనులన్నీ నీ ముద్రలే అవుతాయి. నేను చేసే సంచారమంతా నీకు ప్రదక్షిణమే. అంగభంగిమలన్నీ నీకు నేనుచేసే నమస్కారము. శరీరంలో జఠరాగ్నివి నీవే కాబట్టి,

నేను తీసుకునే అన్నపానాదులు నీకు నివేదన, హోమము. నేను సుఖించటానికి చేసే పనులన్నీ నీ సపర్యగా భావిస్తున్నాను.

ఈ శ్లోకంలో సర్వము నీవే ! అనే తాదాత్మ్య స్థితిని చెబుతున్నారు. పరమేశ్వరి అర్చనా విధానం రెండు విధాలు అని గతంలో చెప్పుకున్నాం. 1. బాహ్యపూజ 2. అంతఃపూజ.

బాహ్యపూజను కౌళాచారులు చేస్తారు వీరికి ఐహిక సుఖాలయందు మక్కువ ఎక్కువ. వీరి దృష్టిలో భగవంతుడు వేరు భక్తుడు వేరు. అందులో దేవతా విగ్రహాన్ని గాని, యంత్రాన్నిగాని ఎదురుగా ఉంచి, దాన్ని పూజిస్తారు. అంతఃపూజలో సాధకుడు తనలోనే పరమేశ్వరుని ఊహించుకుని మానసికంగా అర్చిస్తాడు. ఇది 'అహం బ్రహ్మోస్మి' అనే భావనతో కూడి ఉంటుంది. వీరికి ఐహిక సుఖాలకన్నా పరమపదం మీదే మక్కువ ఉంటుంది. వీరి అంతిమ లక్ష్యం జన్మరాహిత్యం. అదే ముక్తి. వీరిది సమయమతము, అసలు 'సమయమతము' అంటే ఏమిటి ? లలితా సహస్రంలో కూడా **"అకులా, సమయాంతస్థా, సమయాచారతత్పరా"** అని చెప్పబడింది.

బాహ్యపూజ అల్పప్రయోజనాలకు ఉపయోగిస్తుంది. వృత్తి, వ్యాపారము, పదోన్నతి, ధనార్జన, గౌరవము, పలుకుబడి మొదలైనవి దీనివల్ల ఒనగూడతాయి. బ్రహ్మవాదులు, వైదికాచారపరులు అంతరారాధన చేస్తారు.

**బాహ్యపూజానకర్తవ్యా కర్తవ్యా బాహ్యజాతిభిః**

**సాక్షుద్ర ఫలదా నృణాం ఐహికార్థైక సాధనాత్ ॥**

**బాహ్యపూజరతాః కౌళాః క్షపణశ్చ కపాలికాః**

**దిగంబరేతి హాసాః వామకా స్త్రంత్ర వాదినః ॥**

**అంతరారాధన పరా వైదికా బ్రహ్మవాదినః**

**జీవన్ముక్తాశ్చరంత్యేతే త్రిషులోకేషు సర్వదా ॥**

వీరు జీవన్ముక్తులై ముల్లోకాలలోనూ ఎల్లప్పుడూ సంచరిస్తుంటారు.

సమయాచారులు శివశక్తులను సమయుడు, సమయమంటారు. 'సమయ' అంటే శివునితో ఐదు రకాలుగా సామ్యము (పోలిక) గలిగినటువంటిది శక్తి. అంటే

శివశక్తులు ఇద్దరూ ఐదురకాలుగా పోలిక గలిగి ఉంటారు. ఈ రకంగా శివశక్తులకు సామ్యమున్నదని వీరి నమ్మకము. అందుకే వీరి ఆచారాన్ని సమయాచారము అంటారు. అవి

1. అధిష్ఠాన సామ్యము – శివశక్తులు ఇద్దరూ ఒకే స్థానాన్ని అధిష్ఠించి ఉండటము
2. అనుష్ఠాన సామ్యము – ఇద్దరూ ఒకే పనిలో నిమగ్నమై ఉండటము.
3. అవస్థా సామ్యము – ఇద్దరూ ఒకే అవస్థలో ఉండటము
4. రూపసామ్యము – ఇద్దరూ ఒకేరూపంలో ఉండటము
5. నామసామ్యము – ఇద్దరిపేర్లూ ఒకేరకంగా ఉండటము

**జపాకుసుమ సంకాసౌ మధుఘూర్ణితలోచనౌ**
**జగతః పితరౌ వందే భైరవీ భైరవత్మాకౌ ॥**

షట్చక్రాల్లోని ప్రతిచక్రంలోనూ వీరికి ఈ రకంగా సామ్యం చెప్పబడింది.
**ఆధారచక్రంలో**

1. శివా శివులిద్దరికీ ఆధారచక్రమే అధిష్ఠానము. అందుచేత వీరిద్దరికీ అధిష్ఠాన సామ్యము చెప్పబడింది.

2. ఇద్దరూ అక్కడ నాట్యం చేస్తుంటారు. ఇది అవస్థాసామ్యము.

3. ఇద్దరూ జగత్తును సృష్టించే కార్యక్రమంలో నిమగ్నమై ఉంటారు. ఇది అనుష్ఠానసామ్యము.

4. ఇద్దరూ ఎర్రనిరంగులో ఉంటారు. ఇది రూపసామ్యము.

5. ఇద్దరికీ భైరవి, భైరవుడు లేదా నవాత్మ, నవాత్మకుడు అని పేరు. ఇది నామసామ్యము.

ఈ రకంగానే మిగిలిన ఐదు చక్రాల్లోకూడా చెప్పబడింది. ఇది సమయమతము. ఈ మతంలో సమయ అనబడే సాదాఖ్యకళకు చేసే సపర్య సహస్రదళ పద్మమునందే గాని విడిగా లేదు. బాహ్యపూజలో ఈ 'సపర్య' అనేది ఉండదు. యోగీశ్వరులు సంసారబంధనాలలో ఉన్నట్లు కనిపించినప్పటికీ, వారు నింతరము పరమేశ్వర ధ్యానంలోనే ఉంటారు. జనకమహారాజువంటి వారు ఈ కోవకు చెందినారు.

ఇటువంటి వారికి జపము (మంత్రానుష్ఠానము) జల్పము (మాట, భాషణ) శిల్పము (మూర్తి మందిరాలు అంటే దేవాలయాలు నిర్మాణం) వంటివి ఉండవు. ఒకవేళ అలాంటివి చేసినా అది లోకం కోసం మాత్రమే. పీఠాధిపతులు, మఠాధిపతులు వంటివారు ఏ రకమైన బాహ్యక్రియలు చేయవలసిన అవసరం లేదు. కాని వారు భక్తులకు ఆదర్శపురుషులు. వారు చెయ్యకపోతే భక్తులు కూడా భగవంతుణ్ణి పూజించరు. అందుకని వారు కూడా ఈ బాహ్యపూజలు చేస్తుంటారు.

ఆధార స్వాధిష్ఠానాలు అంధకారబంధురాలు. వీటిలో పరమేశ్వరిని అర్చించటానికి కౌళులకు మాత్రమే అర్హత ఉన్నది. సమయులకు అక్కడ పరమేశ్వరిని పూజించే హక్కు లేదు. వీరు

**సూర్యమండల మధ్యస్థాం దేవీం త్రిపురసుందరీం**
**పాశాంకుశ ధనుర్బాణ హస్తాన్ ధారయంతీం ప్రపూజయేత్**

సూర్యమండలము మధ్యన ఉన్న, పాశము, అంకుశము, ధనుస్సు, బాణాలు ధరించిన పరమేశ్వరిని అర్చించాలి. సమయాచారులలో కూడా ఒక తెగవారికి బాహ్యపూజ ఉన్నది. అంటే వారు శ్రీచక్రాన్ని విడిగా పూజిస్తారు. మూలమంత్రానికి అంతః పూజలో ఋషి ఛందస్సు ఉండవు. ఇవి బాహ్యపూజలోనే ఉంటాయి. అంతః పూజ భావనోపనిషత్తులో చెప్పిన విధంగా చెయ్యాలి. ఈవిషయమంతా పదవ శ్లోకంలో వివరించటం జరిగింది. అయినప్పటికీ పాఠకుల సౌలభ్యం కోసం మళ్ళీ ఇక్కడ చెబుతున్నాం.

బాహ్యమైన వస్తువులన్నీ విషయవాంఛలకు ప్రతీకలు. కాబట్టి వాటిని వదలివెయ్యాలి. శరీరంలో ఉండే వస్తువులచేతనే పూజ జరగాలి. పూజకు ముఖ్యమైనది జలము. శరీరంలో సత్త్వరజస్తమో గుణాలున్నాయి. వీటిలో సత్వగుణమే జలము. అంతః పూజలో ఉపచారము అంటే నిత్యము కాని వాటిని వదలివేయటము. అలాగే బ్రహ్మ ఒక్కటే సత్యము. మిగిలినదంతా మిధ్య. కంటికి కనిపించనంతమాత్రం చేత బ్రహ్మము లేదు అనుకోరాదు. ఇది అనుపచారము. చేయకూడని పని. ఇక ఆచారాలను చూద్దాం.

**1. ఆవాహన :** ఆత్మ అనేది దేహంలో ఉన్న వివిధ ఇంద్రియాల ద్వారానే ప్రకాశిస్తుంది. కాబట్టి వాటియొక్క దేవతారూపాన్ని ఆవాహన చెయ్యటమే, పరమేశ్వరికి ఆవాహన.

**2. ఆసనము :** శరీరంలో జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు, మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము అనే పద్నాలుగు ధర్మాలున్నాయి. వీటిని వదిలి సర్వమూ బ్రహ్మపదార్థమే అని భావించటమే ఆసన సమర్పణ.

**3. పాద్యము :** సాధకుడి శరీరంలో పరమేశ్వరి ద్వాదశాంతంలో ఉన్నది. బ్రహ్మము (ప్రకాశశక్తి) ఆత్మశక్తిలో ప్రవేశించి శుక్లబిందువయింది. విమర్శశక్తి శుక్లబిందువులో ప్రవేశించి రక్తబిందువయింది. ఈ రెండింటి కలయికవల్లా మిశ్రమ బిందువు ఏర్పడుతున్నది. ఇప్పుడు

పరమేశ్వరి కుడికాలు – శుక్లవర్ణమైన ప్రకాశాంశ

ఎడమకాలు – రక్తవర్ణమైన విమర్శాంశ

ఈ రెండు పాదాలనూ ధ్యానిస్తూ, వాటికి భేదం లేదు అనుకోవటమే పాద్య సమర్పణ.

**4. అర్ఘ్యము :** ఆత్మయే శ్రీదేవి అని గ్రహించి బ్రహ్మానందానుసంధానము చెయ్యటమే అర్ఘ్యప్రదానము.

**5. ఆచమనము :** ఆత్మస్వరూపమైన పరమేశ్వరి స్వచ్ఛమైనది. ఆ స్వచ్ఛత స్వయం సిద్ధమైనదని గ్రహించటమే ఆచమనము.

**6. స్నానము :** కుండలినీ శక్తిని సహస్రారం చేర్చి, అక్కడ నుండి ప్రసవించే అమృతధారలతో 72000 నాడీ మండలాన్ని తడపటమే స్నానము.

**7. వస్త్రము :** శరీరంలో కాంతి అంతా పరాశక్తి తేజస్సే అని గుర్తించి బ్రహ్మానందం పొందటమే వస్త్రసమర్పణ.

**8. బ్రహ్మసూత్రము :** సుషుమ్నా నాడియే బ్రహ్మసూత్రం.

**9. ఆభరణము :** సాధకుడు తాను కూడా పరబ్రహ్మ స్వరూపమే. మాయాది వస్తువులతో తనకు సంబంధంలేదు. అని గ్రహించి వాటిని పరిత్యజించటమే ఆభరణ సమర్పణ.

**10. చందనము :** పరాశక్తి ప్రభావంచేతనే నా శరీరం ప్రకాశిస్తున్నది కాబట్టి నేను కూడా పరమేశ్వరిలాగా పవిత్రుడనే అని భావించటమే చందన సమర్పణ.

**11. పూజ :** ఇంద్రియవాంఛలకు లోనుగాకుండా మనసును పరబ్రహ్మయందు లయంచేసి, సర్వమూ బ్రహ్మమయమని తెలుసుకోవటమే పూజ.

**12. ధూపం :** ఇంద్రియ చపలత్వానికి లోనుగాకుండా వాటిని తన అధీనంలో ఉంచుకోవటమే ధూపం.

**13. దీపం :** సాధకుడు ఆకాశమే తనశరీరము అని భావించి, తన శరీరంలో ఉన్న పరాశక్తిని (చిత్కళను) దీపంగా భావించటమే దీపసమర్పణ.

**14. నైవేద్యం :** ఇంద్రియ చాపల్యం లేకుండా బ్రహ్మాకార వృత్తిలో ఉండటమే నైవేద్యము.

**15. తాంబూలం :** జాగ్రస్వప్న సుషుప్తులను తురీయంలో విలీనం చెయ్యటమే తాంబూల సమర్పణ.

**16. ప్రదక్షిణ :** కుండలినీ శక్తిని మూలాధారం నుండి బ్రహ్మరంధ్రందాకా, బ్రహ్మరంధ్రం నుండి మూలాధారందాకా సుషుమ్న గుండా త్రిప్పటమే ప్రదక్షిణ.

ఈ రకంగా ఆధారచక్రంలో నిద్రావస్థలో ఉన్న కుండలిని జాగృతం చేసి, సహస్రారం చేర్చి, మరల దాన్ని ఆధారచక్రానికి రప్పించటమే యోగి చేయవలసిన పని. ఇది సమయమతరహస్యము.

సమయాచారులు ఈ జగత్తంతా పరబ్రహ్మ స్వరూపమే అంతకుమించి ఏమీ లేదు. అని భావిస్తారు.

**ఆత్మాత్వం గిరిజామతిః పరిజనాప్రాణా శరీరంగృహం**
**పూజాతే విషయోగభోగరచనా నిద్రాసమాధిస్థితిః**
**సంచాలపదయోః ప్రదక్షిణనిధిః స్తోత్రాణి సర్వాంగిరో**
**యద్యత్కర్మ కరోమి తత్త దఖిలం శంభో తవారాధనమ్ ॥**

**కరచరణకృతం వా కర్మవాక్కాయజం వా**
**విహితమవిహితం వా సర్వవిహిత క్షమస్వ**

**శివశివ కరుణార్ద్రే శ్రీమహాదేవ శంభో**
**హరహర శంభో గిరిజాబంధో శివ శంకరభూతపయే ॥**

అంటూ భక్తులు తాము చేసినవన్నీ పరమేశ్వరార్చనమే అంటున్నారు.

**సుధా మప్యాస్వాద్య ప్రతిభయ జరామృత్యు హరిణీం**
**విపద్యన్తే విశ్వే విధి శత మఖ ముఖాద్యా దివిషదః**
**కరాళం యత్క్ష్వేళం కబళితవతః కాలకలనా**
**న శమ్భో స్తన్మూలం తవ జనని తాటఙ్క మహిమా ॥** **28**

ఓ తల్లీ ! బ్రహ్మాది దేవతలందరూ అమృతాన్ని త్రాగి అతిభయంకరమైన జరా మరణాలను పోగొట్టుకొని కూడా ప్రళయకాలమందు విగత జీవులవుతున్నారు. అయితే నీభర్త అయిన పరమేశ్వరుడు అమృతం త్రాగలేదు సరికదా భయంకరమైన కాలకూటాన్ని త్రాగి ప్రళయమందు కూడా నాశనము పొందక శాశ్వతుడై ఉన్నాడు. ఇది నీ చెవులకు ఉన్న కమ్మల ప్రభావము.

పరమేశ్వరి సర్వాభరణ భూషిత. 44 రకాల ఆభరణాలను ధరించి ఉంటుంది అని **కాలికాపురాణం, పరశురాముని కల్పసూత్రాలు దత్తాత్రేయ సంహితలలో** చెప్పబడింది.

1. నవమణి మకుటము
2. పాపిట బొట్టు
3. కాలాంజనము
4. చంద్రశకలము
5. తిలకము
6. వాలీయుగళము
7. మణిమండల యుగళము
8. నాసాభరణము
9. అధరయావకము
10. మాంగల్యము
11. కనకచింతాకము
12. పదకము
13. మహాపదకము
14. ముక్తావళి
15. ఏకావళి
16. ఛన్నవీరము
17. కేయూర యుగళ చతుష్టయము
18. వలయావళి

19. ఊర్మికావళి
20. కాంచీదామము
21. కటిసూత్రము
22. సౌభాగ్యాభరణము (నల్లపూసలు)
23. పాదకటకము
24. రత్ననూపురము
25. పాదాంగుళీయకము
26. పాశము
27. అంకుశము
28. పుండ్రేక్షుచాపము
29. పుష్పబాణము
30. మాణిక్యపాదుకలు
31. కంఠాభరణము
32. పాపిటబిళ్ళ
33. కాళ్ళపట్టాలు
34. గొలుసులు
35. పాంజేబులు
36. కడియాలు
37. అందెలు
38. చూడామణి
39. పసుపు
40. రవిక
41. పూలు
42. చెవికమ్మలు
43. తాంబూలము
44. ఫలము

ఆభరణము అనే పదానికి అంతటా భరించేది అని అర్థం కూడా ఉంది. దీనిని బట్టి జగత్తునంతా ఆ పరమేశ్వరి భరిస్తోంది అని అర్థము.

మంత్రశాస్త్ర విశేషాలే దేవికి సర్వాభరణాలు. సప్తకోటి మంత్రాలు ఆమెకు ఆభరణాలుగా ఉన్నాయి.

ప్రపంచంలో అనేక జాతులవారున్నారు. వీరంతా అనేక ఆచారాలు పాటిస్తున్నారు. వివిధ రకాల ఆభరణాలు ధరిస్తున్నారు. బంగారము, వెండి, రాగి, దంతము మొదలైన వాటితో చేసిన ఆభరణాలు ధరిస్తున్నారు. విశాలమైన విశ్వంలోని సమిష్టి జీవరాశియే ఆ పరమేశ్వరి. కాబట్టి వీరందరూ ధరించే ఆభరణాలు ఆ దేవి ధరిస్తుంది. అందుచేతనే ఆమె **"సర్వాభరణభూషిత"** అనబడుతున్నది.

శ్రీచక్రంలో 44 కోణాలున్నాయి. అవి త్రికోణములో-3, అష్టకోణంలో-8, దశారయుగ్మములో-20, చతుర్దశారంలో-14, బిందువు-1 వెరసి 46. కానిశ్రీ

చక్రాన్ని గీసి లెక్కపెడితే త్రికోణంలోని 2 కోణాలు అష్టకోణంలో కలిసిపోతాయి. 46-2 = 44 కోణాలు మాత్రమే ఉంటాయి. ఈ కోణాలన్నీ పరమేశ్వరికి ఆభరణాలే.

దేవీ భాగవతంలోని 12వ స్కందంలో పరమేశ్వరి ఆభరణాలను వర్ణిస్తూ....

**నవరత్న గణాకీర్ణా కాంచీదామ విరాజితా**

**తప్తకాంచన సన్నద్ధ వైడూర్యాంగద భూషణా ॥**

**కనచ్ఛ్రీచక్రతాటంకవిటంక వదనాంబుజా**

**లలాట కాంతి విభవ విజితార్థ సుధాకరా ॥**

ఆ పరమేశ్వరి శ్రీచక్రారము గల తాటంకములతో ప్రకాశిస్తున్నది అంటారు.

**సప్తశతి**లోని ద్వితియోధ్యాయంలో మహిషాసుర సంహారం కోసం, దేవతలందరి తేజస్సుతోను ఆ పరమేశ్వరి ఆవిర్భవించింది. అనిచెబుతూ, దేవతలు తమవద్ద నున్న ప్రశస్థమైన ఆభరణాలను ఆమెకు అందించారు అని చెప్పారు.

**క్షీరోదశ్చామలం హారమజరేచ తథాంబరే**

**చూడామణింతథా దివ్యం కుండలే కటకానిచ ॥**

**అర్ధచంద్రం తథా శుభ్రం కేయూరాన్ సర్వబాహుషు**

**నూపురౌ విమలౌ తద్వద్గ్రైవేయక మనుత్తమమ్ ॥**

**అంగులీయక రత్నాని సమస్తా స్వంగులీషుచ**

ఈ రకంగా దేవి సర్వాభరణాలను ధరించి ఉన్నది. స్త్రీలకు పసుపు, కుంకుమ, గాజులు, చెవికమ్మలు, నల్లపూసలువంటివి సౌభాగ్య చిహ్నాలు. భర్త వి గతజీవుడై నప్పుడు స్త్రీలు వీటిని తీసివేస్తారు. తాటంకములు అంటే చెవికమ్మలు వీటిని తీసివేసే పరిస్థితి కాలం కల్పించలేదు. కాలము పరమేశ్వరి సౌభాగ్యానికి కీడు కలిగించలేదు. కాలమే ఆమె అధీనంలో ఉన్నది. అందుకే పరమేశ్వరిని అర్చించేవారికి కాలంవల్ల భయంలేదు. స్త్రీల పాతివ్రత్యము వారి పతులకు, సువాసినీత్వానికి రక్ష.

ఈ శ్లోకంలో అమృతం తాగిన దేవతలకు కూడా శాశ్వతత్త్వం లేదు. కాని విషాన్ని త్రాగినప్పటికి పరమేశ్వరుడు శాశ్వతుడు అంటున్నారు భగవత్పాదులవారు.

**కిరీటం వైరిఞ్చం పరిహర పురః కైటభ భిదః**
**కఠోరే కోటీరే స్ఖలసి జహి జమ్భారి మకుటమ్**
**ప్రణమ్రేష్వేతేషు ప్రసభముపయాతస్య భవనం**
**భవస్యాభ్యుత్థానే తవ పరిజనోక్తి ర్విజయతే ॥ 29**

ఓ దేవీ ! ఒకానొకనాడు నీ భవనానికి నీ పతి అయిన పరమశివుడు విజయం చేశాడు. ఆ సమయంలో బ్రహ్మ, విష్ణువు, ఇంద్రుడు మొదలగువారు నీకు సాష్టాంగ దండ ప్రమాణాలు ఆచరిస్తున్నారు. శివునికి స్వాగతం పలకటానికి నీవు గబగబా ఎదురేగుతున్నావు. అప్పుడు నీ చెలికత్తెలు, పరిజనులు, "అమ్మా ! నీ ముందు వైపున బ్రహ్మదేవుని కిరీటమున్నది, అటుప్రక్కన కైటభమర్దనుని కిరీటమున్నది, అటువైపున జంభారి కిరీటమున్నది. జాగ్రత్త తల్లీ ! అవి నీ కాళ్ళకి తగిలి నీకు బాధ కలిగిస్తాయి." అని హెచ్చరిస్తున్నారు.

కైటభమర్దనుడు – కైటభుడు అనే రాక్షసుని సంహరించినవాడు – విష్ణుమూర్తి. పూర్వకాలంలో ఒకసారి ప్రళయం జరిగింది. ఆ సమయంలో జగత్తు అంతా జలరాశిగా మారిపోయింది. ఆ జలరాశి మధ్యలో వటపత్రశాయి అయిన శ్రీమహావిష్ణువు యోగనిద్రలో ఉన్నాడు. అప్పుడు అతని నాభికమలం నుంచి బ్రహ్మ ఆవిర్భవించి, తన చతుర్ముఖాలతో వేదపారాయణ చేస్తున్నాడు. ఈ తరుణంలో విష్ణుమూర్తి చెవిలోని మలిన పదార్ధం నుంచి మధుకైటభులు అనే రాక్షసులు ఆవిర్భవించారు. వారు చుట్టూ చూశారు. అంతాజలరాశి. తాము ఎక్కడ నుంచి పుట్టారో వారికి తెలియలేదు. ఇంతలో 'తప తప' అని వినిపించింది. పరమేశ్వరి గురించి పదివేల సంవత్సరాలు తపస్సు చేశారు. ఆ తరువాత ఆ జలంలో అటు ఇటు తిరుగుతూ వేదపారాయణ చేస్తున్న బ్రహ్మను చూసి, అతని పరిహసిస్తూ యుద్ధానికి పిలిచారు. బ్రహ్మ చూస్తూ ఊరుకున్నాడు. అది అలుసుగా తీసుకుని మీది మీదికి ఎగబడ్డారు. బ్రహ్మ తామరతూడుగుండా క్రిందకి దిగి శ్రీమన్నారాయణుని శరణు వేడుకున్నాడు. మధుకైటభులు బ్రహ్మను వెతుకుతూ శ్రీమన్నారాయణుడి దగ్గరకు వచ్చారు. ఆ సమయంలో మధుకైభులకు, శ్రీమన్నారాయణునికి పెద్దపోరు జరిగింది. అందులో శ్రీమన్నారాయణుడు మధుకైటభులను సంహరించాడు. కైటభుడు అనే రాక్షసునిసంహరించాడు కాబట్టి కైటభమర్దనుడు అనబడ్డాడు శ్రీహరి.

జంభుడు, కుజంభుడు అని ఇద్దరు సోదరులు. వీళ్ళు ఇంద్రుని అనేకరకాలుగా బాధలు పెడుతుండేవారు. దాంతో కోపించిన ఇంద్రుడు ముందుగా కుజంభుణ్ణి సంహరించాడు. జంభుణ్ణి సంహరించే ఉపాయం తెలియక విష్ణుమూర్తిని వేడుకుని, ఆయన సలహా ప్రకారం వజ్రాయుధాన్ని వదలిపెట్టి, అగ్నిలో కాలిన వేడి అస్త్రాలు తీసుకుని, ఆ రాక్షసుని సంహరించటానికి విశ్వావసుడు అనే గంధర్వుని రథం ఎక్కి, శమీరుడి పుత్రుణ్ణి సారధిగా జేసుకుని, జంభాసురుని సంహరించాడు. ఈ రకంగా జంభాసురుని సంహరించాడు కాబట్టి 'జంభారి' అనబడ్డాడు ఇంద్రుడు.

ఇప్పుడు పరమేశ్వరి కొలువు దీరి ఉన్నది. బ్రహ్మాది దేవతలంతా ఆమెకు సాష్టాంగదండ ప్రణామాలు ఆచరిస్తున్నారు. ఆ సమయంలో వారి కిరీటాలు నేలను తాకి ఉంటాయి కాబట్టి, అమ్మా !కఠినమైన ఆ కిరీటాలు తాకి నీ పాదపద్మాలు కందిపోతాయి. జాగ్రత్త అని హెచ్చరిస్తున్నారు ఆమె చెలికత్తెలు. జగత్ సృష్టికర్త బ్రహ్మ. దేవరాజు ఇంద్రుడు. అలాంటివారుకూడా ఆమెకు సాగిలపడి నమస్కరిస్తున్నారు అంటే, ఆ పరమేశ్వరి వైభవము ఎంతటిదో వర్ణించలేము కదా! ఈ శ్లోకానికి **'కాటూరి వెంకటేశ్వరరావుగారు'** చక్కని అనువాదం చేశారు చూడండి.

**పదిలముదేవీ ! త్రోవనదె పద్మజుమస్త కిరీటము, అల్లన**
**ల్లదె మధువైరి రత్నమకుటాగ్రము, తొట్రి లేదేమో తల్లీ అ**
**య్యది త్రిదశేంద్రు మౌళి, యని యగ్రమునన్ శివురాకగాంచినీ**
**వెదురుగ నేగుచో చెలుల హెచ్చరికల్ విజయమ్ము నందుతన్**

**స్వదేహోద్భూతాభి ర్ఘృణిభి రణిమాద్యాభిరభితః**
**నిషేవ్యే నిత్యే త్వామహమితి సదా భావయతి యః**
**కిమాశ్చర్యం తస్య త్రినయన సమృద్ధిం తృణయతః**
**మహాసంవర్తాగ్ని ర్విరచయతి నీరాజనవిధిమ్. 30**

ఓ దేవీ ! ఆద్యంతములు లేనిదానా ! లోకమంతటిచేత సేవించబడే జగన్మాతా! నీ పాదపద్మములనుండి ప్రసరిస్తున్న మయూఖములతోను, అణిమాది అష్టసిద్ధులతోను నిత్యము సేవించబడే నిన్ను 'అహం' భావనతో నిరంతరము సేవించేవాడు ముక్కంటి

అయిన సదాశివుని ఐశ్వర్యమునుకూడా తృణీకరిస్తాడు. అతడికి మహాప్రళయ కాలాగ్ని నీరాజనము పడుతున్నది.

పరమేశ్వరి ఆద్యంతములు లేనిది. అనాది అయినది. అథర్వణ వేదంలో **దేవీ ఉపనిషత్తు** ఉన్నది. అందులో దేవతలందరూ పరమేశ్వరిని సమీపించి "ఓ దేవీ ! నీవెవరవు ?" అని అడిగారు. అప్పుడు ఆమె "నేను బ్రహ్మస్వరూపిణిని. నా వల్లనే ఈ జగత్తు పుట్టింది. నావల్లనే ఈ ప్రకృతి ఆవిర్భవించింది. శూన్యము, అశూన్యము నేనే. ఆనందము, దుఃఖము నేనే. విజ్ఞానము అవిజ్ఞానము నేనే. అందరూ తెలుసుకోదగిన బ్రహ్మను నేనే. బ్రహ్మపదార్థంకాని దానను కూడా నేనే. పంచభూతాలు, అఖిల జగత్తు నేనే. వేదము, అవేదము నేనే. విద్య అవిద్య నేనే. క్రింది భాగము పైభాగము మధ్య భాగము నేనే. అనాదియైన దానను" అంటుంది.

**బృహదారణ్యకోపనిషత్తు**లో చెప్పినట్లుగా "సృష్టి ప్రారంభానికి ముందు ఈ జగత్తంతా శూన్యంగా ఉండేది. ఆ శూన్యాన్ని పరమేశ్వరతత్త్వము ఆవరించి ఉన్నది. ఇక్కడ పరమేశ్వరుడు అన్నా, పరమేశ్వరి అన్నా తేడాలేదు. ఎందుకంటే పరమేశ్వర తత్త్వానికి రూపంలేదు. గుణంలేదు లింగభేదం అసలేలేదు. ఈ రకంగా ఆమె అనాదియైనది. ప్రళయం సంభవించినప్పుడు జగత్తంతా నశించిపోతుంది. పంచభూతాలు కూడా ఒకదానిలో ఒకటి కలిసి చివరకు పరబ్రహ్మలో లీనమవుతాయి. ఈ రకంగా ప్రళయం సంభవించిన తరువాత మిగిలేది పరబ్రహ్మ తత్త్వం ఒక్కటే. దానికి నాశనం లేదు. అందుచేతనే పరమేశ్వరిని "అమ్మా ! నీవు ఆద్యంతములు లేనిదానవు" అంటున్నారు శంకర భగవత్పాదులవారు.

ఆవిడే ఆదిప్రకృతి. రూపరహితమైనది, రూపసహితమైనది. **'వ్యక్తావ్యక్త స్వరూపిణీ'** లలితా సహస్రంలో 399వ నామం ఇదే. ఆవిడ లోకమంతటి చేత సేవించబడే జగన్మాత. ఆమెతో సమానమైనవారు కాని, ఆమెకన్న అధికులుగాని ఎవరూ లేరు. **"ఏకాకీ, భూమరూపా నిర్ద్వైతా, ద్వైతవర్జితా"** ఈ జగత్తంతా ఆమెవల్లనే, ఆమె నుండే ఆవిర్భవించింది. అందుకే ఆమె ఆద్యప్రకృతి. అటువంటి ఆ దేవిని బ్రహ్మేంద్రాదులు నిత్యము సేవిస్తుంటారు. అంటే లోకాలన్నీ ఆమెను సేవిస్తాయని వేరుగా చెప్పనక్కరలేదు. ఆ పాదపద్మముల నుండి వచ్చే కాంతి కిరణాలు అవే జ్ఞానజ్యోతులు, అష్టసిద్ధులు. ఇవన్నీ ఆమెను ఎల్లప్పుడూ సేవిస్తుంటాయి. అలాంటి

ఆ పరమేశ్వరిని 'అహం' భావనతో సేవించేవాడు అంటే నేనే పరమేశ్వర స్వరూపాన్ని **'అహం బ్రహ్మాస్మి'** అని భావన చేసేవాడికి మహాప్రళయం సంభవించినప్పుడు, కాలాగ్ని అతడికి నీరాజనం పడుతుంది.

ఇక్కడ అహంభావనతో సేవించటము అంటే, తానే పరబ్రహ్మ స్వరూపాన్ని అని భావన చేయటము. 'తత్త్వమసి' నేనే ఆ పరబ్రహ్మను. ఈ జగత్తంతా నానుండే ఆవిర్భవిస్తున్నది. మళ్ళీ నాలోనే లీనమవుతున్నది. అని భావించటము. అలా భావించే వాడికి మహాప్రళయ సమయంలో కాలాగ్ని నీరాజనం పడుతుంది. ఎందుచేతనంటే, ఈ సాధకుడు తాదాత్మ్యం చెందాడు. ఈ జగత్తులో పరమేశ్వరుడు తప్ప ఎవరూ లేరు అంతా పరమేశ్వరమయమని నమ్మేవాడు సాక్షాత్తు పరమేశ్వరుడే అవుతున్నాడు. ఇదే విషయాన్ని చెబుతున్నారు శంకరులవారు ఈ శ్లోకంలో

**చతుష్షష్ట్యా తన్త్రైః సకల మతిసన్ధాయ భువనం**
**స్థిత స్తత్త త్సిద్ధి ప్రసవపరతన్త్రైః పశుపతిః**
**పునస్త్వన్నిర్బన్ధా దఖిల పురుషార్థైకఘటనా**
**స్వతన్త్రం తే తన్త్రం క్షితితల మవాతీతరదిదమ్ ॥** **31**

తల్లీ ! పశుపతి అయిన నీ భర్త ఆ పరమేశ్వరుడు, ఐహిక సంబంధమైన అగ్ని స్తంభన, వాయుస్తంభన, ఆకాశ గమనము, పరకాయ ప్రవేశము వంటి విద్యలను లోకానికి అందజేశాడు. ఈ విద్యలను ఆధారం చేసుకుని లోకంలోని పండితులు కూడా మహామోహములో పడిపోయి మోక్షాన్ని మరచిపోతున్నారు. అది గమనించిన నీవు మోక్షసాధనమైన ఒక తంత్రాన్ని చెప్పమని అడగగా పరమేశ్వరుడు శ్రీవిద్యా తంత్రాన్ని ఉపదేశించాడు.

భారతదేశంలో అనాదిగా అనేకానేక దేవతలను పూజించటం, ఉపాసన చెయ్యటం జరుగుతున్నది. సాధకులు తమయొక్క కోరికల ననుసరించి గురువు ఆదేశానుసారము ఉపాసన చేస్తుంటారు. శ్రీవిద్యా సంప్రదాయంలో యతులకు, గృహస్థులకు కలిపి పది గురుపరంపరలున్నాయి. అవి 1. గిరి, 2. సాగర, 3. భారతి, 4. పురి, 5. అరణ్య, 6. తీర్థ, 7. ఆనంద, 8. నాథ, 9. తీర్థ, 10. ఆశ్రమ

వీరందరి ఆచార వ్యవహారాల్లో తేడాలున్నాయి. ఇవి కాక ఇంకా అనేక రకాల ఆచారాలు ఉన్నాయి.

1. కౌళాచారులు – వీరు ఆధారచక్రాన్ని పూజిస్తారు.
2. క్షపణికులు – స్త్రీ యోనిని పూజిస్తారు. పూర్వాదితంత్రాలు వీరికి ప్రమాణాలు.
3. కాపాలికులు – పంచామృతతంత్రం వీరికి ప్రామాణికము
4. దిగంబరులు – రూపభేదము, భూతోడ్డారము, కులాసారము, కులోడ్డీశము, కులచూడామణి, సర్వజ్ఞానోత్తరము, మహాకాళిమతము, అరుణేశము, మోదినీశము మొదలైన తంత్రాలు వీరికి ప్రామాణికాలు.
5. ఇతిహాసులు – భైరవయామళము వీరికి ప్రామాణికము.
6. వామాచారులు – వీరు తంత్రవాదులు వామకేశ్వరతంత్రం వీరికి ప్రామాణికము
7. సమయాచారులు – వీరు బ్రహ్మావాదులు వీరికి శుభాగమపంచకము ప్రమాణము.

వీరిలో కాపాలికులు, దిగంబరులు, ఇతిహాసులు మొదలైనవారు, పరమేశ్వరునికి జంతుబలులు, నరబలులు ఇస్తారు. ఈ రకంగా తమ కోరికలు తీరతాయని వీరి నమ్మకం. వీరు కాళి, స్మశానభైరవిలాంటి ఉగ్రదేవతలను అర్చిస్తారు. మన కథలలో ఉండే మాంత్రికులు ఈ కోవకు చెందినవారే. వీరంతా ఐహికవాంఛల సాధనకోసం పరమేశ్వరిని అర్చిస్తారు. ఈరకంగా సాధకులందరూ ఐహికంలో కూరుకుపోతున్నారు. అందుచేతనే పరమేశ్వరి పరమేశ్వరుణ్ణి అడుగుతోంది. **చతుషష్ట్యాతంత్రైః సకలమతి సంధాయ భువనమ్** ఓ పరమేశ్వరా ! నా భక్తులను ఉద్ధరించాలనే కోరికతో 64 తంత్రాలను వెల్లడి చేశావు. వాటివల్ల పండితులుకూడా అజ్ఞానాంధకారంలో పడిపోతున్నారు. వాళ్ళని ఉద్ధరించటానికి ఏదైనా మోక్షసాధనమైన ఒక తంత్రాన్ని చెప్పవలసినది. అని అడిగింది. గౌడపాదులవారి **సుభగోదయస్తుతి**లోని 18వ శ్లోకంలో

**చతుష్షష్టి స్తంత్రాణ్యపి కులమతం నిందితమభూ**

**ద్యదేతన్మిశ్రాఖ్యం మతమపి భవే న్నిందితమిహ**

**శుభాభ్యాః పంచైతాః శ్రుతిసరణిసిద్ధాః ప్రకృతయోః**

**మహావిద్యాస్తానాం భవతి పరమార్థో భగవతీ ॥**

శాక్తేయంలో కౌళాచారులకు అరవైనాలుగు, మిశ్రమాచారులకు ఎనిమిది తంత్రాలున్నాయి. సమయాచారులకు మాత్రం **"శుభాగమపంచకము"** ప్రామాణికము

ఈ శ్లోకాన్ని బట్టి లోకంలో కామ్యవాదులు, మోక్షవాదులు అని రెండు రకాల వారున్నారు. వీరి ఆచారాలను, సంప్రదాయాలను బట్టి వీరిని మూడురకాలుగా చెప్పవచ్చు.

1. కౌళాచారులు 2. మిశ్రమాచారులు 3. సమయాచారులు. సగుణ బ్రహ్మను గురించి చెప్పే తంత్రశాస్త్రాలను ఆగమాలు అంటారు. వీటిని సమిష్టిగా తంత్రశాస్త్రం అంటారు. ఆగమాలు మూడు రకాలు. అవి. 1. వైష్ణవాగమాలు, 2. శైవాగమాలు 3. శక్త్యాగమాలు. వీటిలో శక్తిని జగన్మాతగా చెప్పే ఆగమాలను శక్త్యాగమాలు అంటారు. వీటిలో

1. సాత్త్విక ఆగమాలను – తంత్రాలనీ
2. రాజస ఆగమాలను – యామళాలు అనీ
3. తామస ఆగమాలను – డామరాలు అని అంటారు.

**1. కౌళాచారులు :** చతుర్విధ పురుషార్థాలలో వీరు అర్ధకామాలకే ప్రాధాన్యత నిస్తారు. వీరికి బాహ్యపూజయేకాని అంతఃపూజ లేదు. వీరు ఆధారచక్రంలో దేవిని పూజిస్తారు. కౌళాగమాలుగా పిలువడే అరవైనాలుగుఆగమాలు వీరికి ప్రామాణికాలు. ఈ అరవైనాలుగుఆగమాలు దేవీపూజకు ఉత్తమమైనవి అని చతుశ్శతిలో చెప్పబడింది.

**చతుష్షష్టిశ్చతంత్రాణి మాత్రుణాముత్తమానిచ**

**మహామాయాశంబరంచ యోగినీజాలశంబరం ॥**

**తత్త్వశంబరకం చైవ భైరవాష్టకమేవచ**

**బహురూపాష్టకం చైవ యమళాష్టకమేవచ ॥**

చంద్రజ్ఞానం మాలినీంచ మహాసమ్మోహనం తథా
వామజుష్టం మహాదేవం వాతులమ్ వాతులోత్తమమ్ ॥
హృద్భేదం తంత్రభేదం చ గుహ్య తంత్రంచ కామికమ్ ।
కలానాదం కలాసారం తథాన్యత్ కుండికామత్ ॥
మతోత్తరం చ వీణాఖ్యం త్రోతలం త్రోతలోత్తరమ్
పంచామృతం రూపభేదం భూతోడ్డామరమేవచ ॥
కులసారం కులోడ్డీశం కులచూడామణిస్తథా
సర్వజ్ఞానోత్తరం చైవ మహాకాళీ మతం తథా ॥
అరుణేశం మోదినీశం నికుంతేశ్వర మేవ చ ।
పూర్వపశ్చిమ దక్షంచ ఉత్తరంచ నిరుత్తరమ్ ॥
విమలం విమలోద్ధంచ దేవీమత మతః పరమ్ ॥

ఈ రకంగా అరవైనాలుగు తంత్రాలు పరమేశ్వరిని గురించి చెప్పబడ్డాయి. ఇవన్నీ అవైదికములు, నీతిబాహ్యములు. ఇవి లోకంలో మహాజ్ఞానులైన విద్వాంసులను కూడా వంచించి భ్రష్టులను చేస్తాయి. అవి

**1. మహామాయాశాంబరము :** మాయాప్రపంచాన్ని నిర్మింపజేసే తంత్రము. దీనివల్ల ఉన్నది లేనట్లు, లేనిది ఉన్నట్లు కనిపిస్తుంది.

**2. యోగినీజాల శాంబరము :** ఇదికూడా మాయా ప్రధానమైన విద్యయే.

**3. తత్త్వశాంబరము :** ఇంద్రజాల మహేంద్రజాల విద్యలకు సంబంధించినది.

**4-11. భైరవాష్టకము :** ఇవి మొత్తం ఎనిమిది తంత్రాలు.

1) సిద్ధభైరవ, 2. వటుక భైరవ 3. కాలభైరవ, 4. కాలాగ్ని భైరవ, 5. కంకాళ భైరవ, 6. యోగినీ భైరవ, 7. మహాభైరవ, 8. శక్తిభైరవ ఇవన్నీ నిధి నిక్షేపాలను కనుక్కోవటానికి ఉపయోగిస్తారు.

**12-19. బహురూపాష్టకము :** ఇవి ఎనిమిది రూపాలు గల శక్తితంత్రాలు. అవైదికములు. అవి వరుసగా 1. బ్రాహ్మీ, 2. మాహేశ్వరి, 3. కౌమారి, 4. వైష్ణవి, 5. వారాహి, 6. మాహేంద్రి, 7. నారసింహి, 8. చాముండ

**20-27 యమళాష్టకము :**

కామ్యసిధ్యంబకు 'యామళ' అని పేరు. కామ్యసిద్ధాంబ ప్రతిపాదితమైన తంత్రాలకు యామళాష్టకము అని పేరు. ఇవి అవైదికములు. భైరవ యామళము, రుద్రయామళము ఇందులో చెప్పబడ్డాయి.

**28. చంద్రజ్ఞానము :** కాపాలిక మతసంబంధమైన చంద్రజ్ఞానవిద్య. సమయాచారంలోనిది కాదు.

**29. మాలినీ తంత్రము :** దీన్ని మాలినీవిద్యాతంత్రము అని కూడా అంటారు. సముద్రయానం గురించి చెబుతుంది.

**30. మహాసమ్మోహనము :** మేల్కొన్న వారిని నిద్రపోయినట్లుగా మైకంలో ముంచెత్తుతుంది. 14 సంవత్సరాల బాలుడి నాలుక ఇందులో ప్రధానపాత్ర వహిస్తుంది. అందుకే ఇది అవైదికము.

**31-32. వామజుష్ట, మహాదేవ తంత్రాలు** : ఇవి వామాచారినికి సంబంధించినవి.

**33-35 వాతులము, వాతులోత్తరము, కామికా తంత్రాలు :** వీటిలో ఆకర్షణ మొదలైన ప్రక్రియలున్నాయి. వీటిలో కొంత భాగము అవైదికము.

**36. హృద్భేధ తంత్రము :** దీనిలో షట్చక్రభేదన, సహస్రదళ పద్మము వివరించబడ్డాయి. అయితే వామాచార పద్ధతిలో ఉన్నాయి.

**37-38. తంత్రభేదము, సహ్యాతంత్రము :** ఈ తంత్రాలలో మారణ విద్యలు చెప్పబడ్డాయి.

**39. కలావాద తంత్రము :** ఇందులో చంద్రకళల ప్రతిపాదన చెప్పబడింది. పరదారాగమనము చెప్పటంవల్ల ఇది నిషేధము.

**40. కలాసార తంత్రము :** దీనిలో వర్ణముల ఆధిక్యత చెప్పబడింది. వామాచార సంప్రదాయము.

**41. కుండికామతము :** ఇది ఘటికాసిద్ధి హేతువు. ఘటిక అంటే పానపాత్ర.

**42. మతోత్తరము :** ఇందులో రససిద్ధి చెప్పబడింది.

**43. వీణాఖ్యా తంత్రము :** వీణ అనేది ఒక యక్షిణి పేరు. ఈ తంత్రాన్ని ఉపాసిస్తే వీణ అనే యక్షిణీ సిద్ధి కలుగుతుంది. ఇది సంభోగయక్షిణి.

**44. త్రోతల తంత్రము :** ఇందులో ఘటికాసిద్ధి, అంజనసిద్ధి, పాదుకాసిద్ధి చెప్పబడ్డాయి.

**45. త్రోతలోత్తరమ్ :** 576 కోట్ల మంది యోగినుల దర్శనము చేయించేది.

**46. పంచామృత తంత్రము :** అమృతము, మృత్యులేమి గురించి చెప్పబడింది.

47-51 రూపభేదము, భూతోడ్డారము, కులాసారము, కులోడ్డీశము, కులచూడామణి : ఈ తంత్రాలు మారణ హేతువులు.

52-56 సర్వజ్ఞానోత్తరము, మహాకాళిమతము, అరుణేశము, మోదినీశము, నికుంతేశ్వరము : ఇవి కాపాలిక, దిగంబర మతాలకు చెందినవి.

57-64. పూర్వ, పశ్చిమ, దక్షిణ, ఉత్తర, నిరుత్తర, విమలము, విమలోక్థము, దేవీమతము : ఈ ఎనిమిది తంత్రాలు దిగంబర క్షపణిక మతాలకు చెందినవి.

ఈ తంత్రాలన్నీ ఐహిక ఫలాన్ని ఇస్తాయి. అవైదికములు, నీతిబాహ్యాములు. కాబట్టి పనికిరావు.

**2. మిశ్రమాచారులు :** కౌళ, సమయాచారాలను కలిపి ఆచరించేవారిని మిశ్రమాచారులు అంటారు. వీరికి 1. చంద్రకళ, 2. జ్యోత్స్నావతి, 3. కళానిధి, 4. కులార్ణవ, 5. కులేశ్వరి, 6. భువనేశ్వరి, 7. బార్హస్పత్య, 8. దుర్వాస తంత్రాలు ప్రామాణికాలు. వీటిలో ధర్మకర్మ ఉపాసనల వివరణ, కుండలినీ శక్తి సాధన చెప్పబడింది. అన్ని వర్ణములవారికీ వీటిని సాధించే అధికారమున్నది. కాని మొదటి మూడు వర్ణములవారు సవ్యమార్గంలోనే సాధించాలి. ఈ తంత్రాలు మిశ్రమాచారానికి సంబంధించినవి కాబట్టి వదలివెయ్యాలి.

చంద్రకళాష్టకము కౌళ, సమయమతాలు రెండింటినీ అనుసరించటంవల్ల మిశ్రమతంత్రము అన్నారు.

**మిశ్రకం కౌళమార్గం చ పరిత్యాజ్యంచ శాంకరీ**

అనే ఈశ్వరవచనము ఆధారంగా, మిశ్రమాచారాన్ని కూడా కౌళాచారంగానే పరిగణించి వదలి వెయ్యాలి. ఈ రకంగా 72 తంత్రాలను వదలివెయ్యాలి.

**3. సమయాచారులు:** వీరికి ప్రధానమైనది కైవల్యప్రాప్తి. 'శుభాగమపంచకము' అనే ఐదుసంహితలలో, వైదికమార్గంలో ఉపాసనా విధానము చెప్పబడింది. ఈ మార్గాన్ని వశిష్ఠ, సనక, సనందన, సనత్కుమార, శుకమహర్షులు వివరించారు. ఇదే సమయాచారము. గౌడపాదులవారు, శంకర భగవత్పాదులవారు ఈ మార్గాన్నే నిర్దేశించారు.

శుభాగమ పంచకంలో షోడశనిత్యల ప్రతిపాదన చెప్పబడింది. ఈ షోడశ నిత్యలు చంద్రవిద్యలో అంగభూతాలు. అయితే చతుష్షష్టి తంత్రాలలోను చంద్రజ్ఞాన విద్య కూడా చెప్పబడింది. కాని ఈవిద్య ఇక్కడ కౌళాచారములో చెప్పబడింది. అదే చంద్ర జ్ఞానవిద్యను శుభాగమ పంచకంలో సమయాచారంలో చెప్పటం జరిగింది. వశిష్ఠ సంహితలోని చంద్రజ్ఞాన విద్యలో షోడశనిత్యలను వివరించటం జరిగింది. పరమేశ్వరి షోడశనిత్యలను వివరించమని పరమేశ్వరుణ్ణి అడుగుతుంది. అప్పుడు ఈశ్వరుడు చెబుతున్నాడు.

**శృణుదేవీ ప్రవక్ష్యామి నిత్యాషోడశకం తవ**
**నకస్య చిన్మయాఖ్యాతం సర్వతంత్రేషు గోపితం**

ఓ పరమేశ్వరీ ! అన్ని తంత్రాలయందు గోప్యముగా ఉన్నది. ఇంతవరకు ఎవరికీ చెప్పనిది అయిన షోడశనిత్యలను గూర్చి చెబుతున్నాను వినవలసినది.

**తత్రాదౌ ప్రథమా నిత్యా మహాత్రిపురసుందరీ**
**తతః కామేశ్వరీ నిత్యా, నిత్యాచ భగమాలినీ ॥**

**నిత్యక్లిన్నా తథాచైవ భేరుండా వహ్నివాసినీ**
**మహావజ్రేశ్వరీ రౌద్రీ, త్వరితా కులసుందరీ ॥**

**నిత్యా నీలపతాకాచ విజయా సర్వమంగళా**
**జ్వాలామాలిని చిద్రూపాః ఏతానిత్యాస్తు షోడశః ॥**

**ప్రతిపత్ ప్రభృతౌ దేవ్యాః పౌర్ణమాస్యంత మర్చయేత్**
**ఏకాది వృద్ధ్యా హాన్యాంచ దర్శాంతం దేవివిగ్రహమ్ ॥**

| | |
|---|---|
| 1. మహాత్రిపురసుందరి | 9. త్వరితా |
| 2. కామేశ్వరి | 10. కులసుందరీ |
| 3. భగమాలినీ | 11. నిత్యా |
| 4. నిత్యక్లిన్నా | 12. నీలపతాక |
| 5. భేరుండా | 13. విజయ |
| 6. వహ్నివాసిని | 14. సర్వమంగళా |
| 7. మహావజ్రేశ్వరి | 15. జ్వాలామాలిని |
| 8. రౌద్రి (శివదూతి) | 16. చిత్ర (చిద్రూప) |

పాద్యమి నుంచి పౌర్ణమి వరకు వీరిని అర్చించాలి. శుక్లపక్షంలో పెంచుకుంటూ, కృష్ణపక్షంలో తగ్గించుకుంటూ రావాలి. చంద్రకళలు పదహారు. అవి

| | | | |
|---|---|---|---|
| 1. అమృతా | 5. పుష్టి | 9. చంద్రికా | 13. ప్రీతి |
| 2. మానదా | 6. రతి | 10. కాంతి | 14. అంగదా |
| 3. పూషా | 7. ధృతి | 11. జ్యోత్స్న | 15. పూర్ణా |
| 4. తుష్టి | 8. శశిని | 12. శ్రీ | 16. పూర్ణామృతా |

షోడశకళాప్రపూర్ణుడు చంద్రుడు. పదహారు కళలతోను కూడినవాడు. అయితే ఈ పదహారు కళలు ముందుగా జ్యోతిరూపుడైన సూర్యునిలో ఉంటాయి. ఆ రోజున చంద్రునితో ఒక్క కళకూడా ఉండదు. ఆ రోజు అమావాస్య. ఆ తరువాత శుక్లపక్ష పాద్యమి నుండి ప్రతిరోజూ ఒక్కొక్కకళ సూర్యునినుండివచ్చి చంద్రునిలో చేరుతుంది. ఈ రకంగా శుక్లపక్ష పాద్యమి నుంచి పౌర్ణమివరకు పదిహేను కళలు వచ్చి చంద్రునిలో చేరతాయి. మరి పదహారవకళ ఏది అంటే **షోడశీతు కలాజ్ఞేయా సచ్చిదానంద రూపిణీ** పదహారవకళ సాక్షాత్తూపరమేశ్వరి అయి ఉన్నది. ఇక కృష్ణపక్షం అంటే పౌర్ణమి మరునాడు బహుళ పాద్యమి. ఆ రోజు నుంచి ఒక్కొక్కకళ చంద్రుని విడిచి సూర్యునిలో చేరుతుంది. ఈ రకంగా అమావాస్య వచ్చేసరికి పదిహేనుకళలు చంద్రుని విడిచి వెళ్ళిపోతాయి. పరమేశ్వరి అర్చనా విధానంలో నిత్యార్చన అని ప్రత్యేకంగా ఉన్నది. సాధకుడు ప్రతిరోజూ ఆ తిథి నిత్యను అర్చిస్తూ, మహానిత్యను విధిగా

అర్చించాలి. అయితే పాడ్యమి మొదలైన తిథులు నిత్యాస్వరూపాలు. అలాగే నిత్యలు కళాస్వరూపాలు. ఈ విషయం 32వ శ్లోకంలో చెప్పుకుంటాం.

షోడశనిత్యలు అంగభూతములై శ్రీచక్రంలో అంతర్భావం పొందుతున్నాయి. ఈ షోడశనిత్యలు అష్టవర్గస్వరూపాలై అంటే **అకచటతపయశ** అనే వర్గుల రూపం పొంది శ్రీచక్రంలోని మూడవ ఆవరణ అయిన సర్వసంక్షోభణ చక్రము (ఇది ఎనిమిది దళాలు గల పద్మము)లో ఉంటాయి. అలాగే అష్టకోణచక్రము (ఇది ఏడవ ఆవరణ. సర్వసిద్ధిప్రద చక్రము)లో తూర్పువైపున ఉన్న కోణమునుంచి ఒక్కొక్క కోణానికి ఇద్దరు చొప్పున 8×2=16 మంది నిత్యాదేవతలు ఉంటారు. ఈ నిత్యాదేవతలే 'సర్వాశా పరిపూరక చక్రము' అనబడే షోడశదళము (ద్వితీయావరణ)లో ఉన్నారు. ఈ నిత్యతే దశారయుగ్మములో ఉన్నారు. వీరిలో మొదటి రెండు నిత్యలు బిందు త్రికోణమునందు, మిగిలిన పద్నాలుగు చతుర్దశారమందు ఉన్నారు. ఇక మేఘలాత్రయము, భూపురత్రయము. ఈ రెండూ బిందువు, త్రికోణములందు అంతర్భూతములు. ఈ రకంగా నిత్యాదేవతల అంతర్భావాన్నే మేరుప్రస్తారము అంటారు. ఇదే నిత్యాతాదాత్మ్యము.

సనందనసంహితలో "ఈ షోడశనిత్యలు చంద్రకళ అయిన చంద్రవిద్యకు అంగభూతములు. షోడశనిత్యలు స్వరాల (అచ్చుల) రూపముగలవారై, పంచదశీ మహామంత్రంలో అకార విసర్గాంతము, సకారము– ఈ రెండింటిచేత తీసుకోబడ్డవై, జీవకళారూపాలై, బైందవ స్థానమున స్థాపించబడినవై, అక్కడే అంతర్భూతములై ఉన్నాయి. వర్గులు ఐదు అనగా **కచటతప** మొత్తం 25 అక్షరాలు పాశాంకుశ బీజయుక్తములై అష్టారమునందు, దశకోణ ద్వయమునందు అంతర్భూతములై ఉన్నాయి. మిగిలిన తొమ్మిది అక్షరాలు (యరలవశషసహళ) మన్వస్రంలో రెండు ఆ వృత్తులచేత పద్నాలుగు కోణములందు అంతర్భూతములు అవుతున్నాయి. ఇలా పోగా నాలుగు అక్షరాలు మిగులుతాయి 9×2=18–14=4 ఈ నాలుగు అక్షరాలు శివచక్రాలు నాలుగింటియందు అంతర్భూతములు. ఇది కైలాస ప్రస్థార విశేషము" అని చెప్పబడింది. ఇదే మాతృకా తాదాత్మ్యము.

సనత్కుమార సంహితలో "షోడశ నిత్యలు ఇద్దరిద్దరుగా వశిన్యాది దేవతలతో కలిసి అష్టకోణములోని ఎనిమిది కోణాలయందు అంతర్భూతం చెందుతున్నారు.

అలాగే వసిన్యాది దేవతలు ఎనిమిది మంది, యోగినులు పన్నెండు. వెరసి ఇరవై. దశారయుగ్మంలో ఉంటారు. ఈ రకంగా వర్గులు ఎనిమిది (అకచటతపయశ), వశిన్యాది దేవతలు ఎనిమిది, నిత్యలు పదహారు, యోగినులు పన్నెండు. వెరసి నలభై నాలుగు మంది. వీటిలో మహాత్రిపురసుందరి బిందువు నందుండగా, మిగిలిన 43 మంది 43 కోణాలలో అంతర్భూతం చెందుతారు. శ్రీచక్రంలో మొత్తం కోణాలు 45 కాని నేలమీద గీసి చూసినట్లైతే అష్టకోణంలోని రెండు కోణాలు త్రికోణంలో అంతర్భావం చెందుతాయి. అందుచేత 43 కోణాలే లెక్కలోకి వస్తాయి. ఇక గంధాకర్షిణి, స్పర్శ్యాకర్షిణి, రూపాకర్షిణి, రసాకర్షిణి అనబడే నలుగురు ఆకర్షణ దేవతలు భూపురంలోని నాలుగు ద్వారాలయందు ఉంటారు. ఇది భూప్రస్తారము. ఇదే వశిన్యాది తాదాత్మ్యము.

వేదంలో రెండు రకాల విద్యలు చెప్పబడ్డాయి. 1. పరావిద్య, 2. అపరావిద్య. పరావిద్య అనేది మోక్షమార్గము. అపరావిద్య అనేది లౌకికమార్గము. ఇది ఉన్నత పదవులు, సంసారసుఖాలు, ధనార్జన, వ్యాపారోన్నతి, భోగభాగ్యాలు పొందటానికి ఉపయోగిస్తుంది. అయితే ఇప్పటిదాకా చెప్పిన ఈ అరవైనాలుగుతంత్రాలు, అపరావిద్య సాధించటానికి ఉపయోగించేవే. ఇది క్షణికానందానిస్తుంది. మోక్షమార్గాన్ని చూపదు. లౌకిక విషయాలలో ముంచి తేలుస్తుంది. దీనిని అనుసరించినవాడు ఎంతటిపండితుడైనప్పటికి సంసార సాగరంలో పడి గానుగకు కట్టిన ఎద్దులాగా తిరుగుతూ ఉంటాడు. అందుకే పార్వతీదేవి తన భక్తులను రక్షించాలనే ఉద్దేశ్యంతో వారికి మోక్షం ప్రసాదించాలనే కోరికతో, పరమేశ్వరుని ప్రార్థించి **'శ్రీవిద్యాతంత్రము'** అనే స్వతంత్ర తంత్రాన్ని ఈశ్వరునిచే ఇప్పించింది. సర్వశాస్త్రాలు, వేదాలు, ఇతిహాసాలు, మంత్రాలు అన్నీ ఈశ్వరుని నుంచే వచ్చినాయి అని మనం గుర్తుంచుకోవాలి. శ్రీవిద్యాతంత్రము అంటే పంచదశీ మహామంత్రమే అన్నారు లొల్లా లక్ష్మీధరులు. పంచదశీ మహామంత్రాన్ని తరువాతి శ్లోకంలో చూద్దాం.

**శివశ్శక్తిః కామః క్షితి రథ రవి శ్శీతకిరణః**
**స్మరో హంసశ్శక్ర స్తదనుచ పరా మార హరయః**
**అమీ హృల్లేఖాభి స్తిసృభి రవసానేషు ఘటితాః**
**భజన్తే వర్ణాస్తే తవ జనని నామావయవతామ్ ॥ 32**

ఓ తల్లీ ! కకారము శివుడు, ఏకారము శక్తి, ఈకారము కాముడు, లకారము భూమి. ఇవి మొదటి ఖండము. హకారము రవి, సకారము చంద్రుడు, కకారము స్మరుడు (మన్మథుడు) హకారము హంస, లకారము ఇంద్రుడు. ఇవి రెండవ ఖండము. సకారము పరాశక్తి, కకారము మన్మథుడు, లకారము హరి. ఇవి మూడవ ఖండము. ఈ మూడు ఖండముల చివర మూడు హ్రీంకారములు. వెరసి పదిహేను అక్షరములతో పంచదశీ మహామంత్రము ఒప్పారుతున్నది.

ఈ శ్లోకంలో పంచదశీ మహామంత్రాన్ని వివరిస్తున్నారు శంకర భగవత్పాదుల వారు. అసలు మంత్రము అంటే ఏమిటో చూద్దాం.

**దైవాధీనం జగత్సర్వం, మంత్రాధీనంతు దైవతమ్ ।**

**తన్మంత్రం బ్రాహ్మణాధీనం, బ్రాహ్మణో మమదేవతా ॥**

చరాచర జగత్తు అంతా ఆ పరమేశ్వరుని అధీనంలో ఉన్నది. ఆ పరమేశ్వరుడు మంత్రానికి అధీనమై ఉన్నాడు. ఆ మంత్రము బ్రాహ్మణుని అధీనంలో ఉన్నది కాబట్టి అందుకే బ్రాహ్మణుడు దైవస్వరూపుడు, భూసురుడు అనబడుతున్నాడు. అందరూ అనుకుంటూఉంటారు బ్రాహ్మణుని ఆధిక్యత ఏమిటి ? అని నిజమే ఏమీలేదు.కాని అతడు ఉన్నంతవరకే ధర్మము, న్యాయము, సంప్రదాయము అనేవి ఉంటాయి. అతడు పతనం అయినరోజున ఇవిఏవీ ఉండవు. అందుకే బ్రాహ్మణుడైనవాడు బుద్ధికలిగి తనవిధులు తాను సక్రమంగా నిర్వర్తించాలి. అప్పుడే 'బ్రాహ్మణో మమదేవతా' అనే పదానికి అర్థం సార్ధకమవుతుంది.

**మననాత్త్రాయత ఇతిమంత్రః** మననము వలన, మననము చేయు వానిని రక్షించునది మంత్రము. దేవతల దయకు పాత్రులు కావాలంటే మంత్రజపం చెయ్యాలి. దీన్నే 'ఉపాసన' అంటారు. ప్రాచీనకాలం నుంచీ మనదేశంలో అనేకమైన ఉపాసనా మార్గాలున్నాయి. వీటిలో గాణాపత్యం, శైవం, వైష్ణవం, శాక్తేయం వంటివి ఎక్కువ ప్రాచుర్యం పొందినాయి. శక్తిని ఆరాధించే వారిని 'శాక్తేయులు' అంటారు. శాక్తేయంలో అనేక మార్గాలున్నాయి. వీటిలో శ్రీవిద్య బహుళప్రాచుర్యం పొందింది. శ్రీవిద్యనే "చంద్రకళావిద్య" అని కూడా అంటారు. శ్రీవిద్యలో పంచదశీ మహామంత్రం ముఖ్యమైనది.

అరణిమథిస్తే అగ్ని ఎలా పుడుతుందో, అలాగే మంత్రాన్ని జపించినట్లైతే శక్తి పుడుతుంది. ఆ శక్తి సాధకుడికి సర్వార్థాలూ చేకూరుస్తుంది. బీజాక్షరాలచేత సంపుటం చేయబడిన మంత్రజపం వల్ల దేవతానుగ్రహం త్వరగా కలుగుతుంది. ఆయా దేవతలయొక్క తత్త్వాలకు అనుగుణమైన బీజాక్షరాలు మంత్రాలకు సంపుటీకరణ చేయబడ్డాయి. బీజాక్షరాలు అంటే ఎక్కడి నుంచో ప్రత్యేకంగా రాలేదు. భాషకు ఉన్న యాభై ఒక్క అక్షరాలు ద్విత్తాలుగా, సంయుక్తాక్షరాలుగా, రకరకాలుగా ఉంటాయి. ఇందులో మూలము సంస్కృత భాషలోని అక్షరాలే అని గ్రహించాలి.

పరమేశ్వర బీజం 'ఓం'కారము. అలాగే ఈం లక్ష్మీబీజము, ఐం వాగ్బీజము, క్లీం మన్మథబీజము, హ్రీం శక్తిబీజము, గం గణపతిబీజము, ఈ రకంగా దేవతలకే కాక పంచభూతాలకు కూడా బీజక్షరాలున్నాయి. లం పృథివీబీజము. హం ఆకాశబీజము. యం వాయుబీజము. రం అగ్నిబీజము, వం అమృతబీజము.

ప్రతిమంత్రంలోనూ దేవతపేరు, ఆ దేవతకు సంబంధించిన బీజాక్షరాలు ఉంటాయి. మనం అనేక రకాలయిన యంత్రాలను చూస్తుంటాము. ప్రతి యంత్రంలోను ఆయా దేవతలకు సంబంధించిన మంత్రాలు, బీజాక్షరాలు ఉండటాన్ని గమనించవచ్చు. మంత్రాలలో పంచదశీ మహామంత్రానికి ఒక ప్రత్యేకత ఉన్నది. దీనిలో బీజాక్షరాలు మాత్రమే ఉంటాయి. ఏ దేవత పేరూ ఉండదు. అలాగే పంచదశీ మహామంత్రానికి యంత్రరూపమైన శ్రీచక్రానికి కూడా ఒక ప్రత్యేకత ఉన్నది. దీనిలో మిగిలిన యంత్రాలలోలాగా దేవత పేరుగాని, బీజాక్షరాలుగానీ ఉండవు. ఇది కేవలము రేఖానిర్మితము. మంత్రాలు మూడు రకాలు.

1. వైదికములు 2. తాంత్రికములు 3. అపభ్రంశములు. వేదాలలో చెప్పబడ్డ మంత్రాలను 'వైదిక మంత్రాలు' అంటారు. ఇవి జ్ఞానప్రదాలు. కామ్యప్రదమైనవి 'తాంత్రికాలు'. సంస్కృతంలో కాకుండా, ఇతర భాషలలో గల మంత్రాలు 'అపభ్రంశములు' మళయాళ మంత్రాలు, తెలుగు, హిందీ, పార్శీ మొదలైన భాషలలోని మంత్రాలు, ఇవి అపభ్రంశములు.

**వైదికా: ప్రణవైర్యుతాః ప్రణవేన విహీనంతు తాంత్రికా ఏవః ప్రకీర్తితా**

ఓంకారము గలవి వైదికమంత్రాలనీ, ఓంకారము లేనివి తాంత్రికాలు అని చెప్పబడుతున్నాయి.

మంత్రాలను స్త్రీ, పురుష, నపుంసక మంత్రాలు అని మూడు రకాలుగా విభజించవచ్చు. మంత్రంలో 'స్వాహా' అనే పదము చివరి గలవి స్త్రీ మంత్రాలు. 'హుంఫట్' అనే పదము చివర గలవి పురుష మంత్రాలు. 'నమః' అనే పదము చివర గలవి నపుంసక మంత్రాలు. అయితే పురుషదేవతలను ఉపాసించే వాటిని మంత్రాలనీ, స్త్రీదేవతలను ఉపాసించే వాటిని **'విద్య'** అని అంటారు. వీటిలో ఒక అక్షరము కలవాటిని **'పిండము'** అని, మూడు అక్షరాలు గలవాటిని **'కర్తరులు'** అని, మూడు నుంచి తొమ్మిది వరకు అక్షరాలుగల వాటిని **'బీజములు'** అని, పది నుంచి ఇరవైవరకు గలవాటిని **'మంత్రాలు'** అని, ఇరవైకన్న ఎక్కువ అక్షరాలున్న మంత్రాలను **మాలామంత్రాలు** అని అంటారు. వైదిక మంత్రాలు సమయాచారినికి, తాంత్రిక మంత్రాలు కౌళాచారానికి సంబంధించినవి. సాధకులు ఎల్లప్పుడూ వైదిక మంత్రాలనే జపించాలి. సప్తకోటిమంత్రాలలో ప్రధానమైనవి వైదికమంత్రాలే.

శ్రీవిద్యలో పంచదశీ మహామంత్రము ప్రసిద్ధమైనది. శాక్తేయానికి ఇది గాయత్రి వంటిది. గాయత్రీమంత్రము బ్రాహ్మణుల కోసం ఏర్పడగా పంచదశీ మహామంత్రం 'నాలుగు వర్ణాలవారికీ ఉపాశ్య' అని అగస్త్యమహర్షి వ్రాసిన **'శ్రీవిద్యాదీపిక'** అనే గ్రంథంలో చెప్పబడింది. కాబట్టి పంచదశీమహామంత్రాన్ని బ్రాహ్మణులు ఒక్కరే చెయ్యాలా? మిగిలిన వారెవరూ చేయరాదా ? అనే అనుమానాలు అక్కరలేదు. ఈ మంత్రం ఏ జాతివారైనా, ఏ కులంవారైనా, ఏమతంవారైనా చెయ్యవచ్చు. అయితే ఒక మంచి గురువు దగ్గర ఉపదేశం పొంది మంత్రాన్ని చేస్తే ఫలితము ఉంటుంది. మంత్రజపం చేసేటప్పుడు పూర్తి ఫలితం రావాలి అంటే మనం చేసే మంత్రముయొక్క పూర్వాపరాలు, దానిఅర్థము, మంత్రాధిష్ఠానదేవత. ఇవన్నీ క్షుణ్ణంగా తెలిసి ఉండాలి. ఏ మంత్రమైనా సరే, అర్థం పూర్తిగా తెలుసుకుని మాత్రమే జపం చెయ్యాలి. లేకపోతే ఆ ఉపాసనకు ఫలితముండదు. మంత్రార్థం తెలియని జపం వ్యర్థం.

**నార్థజ్ఞాన విహీనంచ శబ్ద స్యోచ్చారణం ఫలతి ।**
**భస్మని వహ్ని విహీనేన న ప్రక్షిప్తం హవిర్జ్వలతి ॥**

అగ్నిహోత్రము లేనటువంటి బూడిదలో గనక నెయ్యి మొదలైన హోమద్రవ్యాలు వేసినట్లైతే ఏ రకంగా వ్యర్థమైపోతాయో, అలాగే అర్థం తెలియకుండా చేసిన మంత్రజపం కూడా వ్యర్థమై పోతుంది.

**అర్థమజానానాం నానావిధ శబ్దమాత్ర పాఠవతామ్ ।**

**ఉపమేయశ్చక్రీవాన్ మలయజ భారస్య ఓఢైవ ॥**

అర్థం తెలియకుండా కేవలము శబ్దము మాత్రమే పలికేవాడు మంచి గంధపు చెక్కలు మోస్తూ వాటి వాసనను గ్రహించలేని గాడిదవంటివాడు. ఎన్ని గంధపు చెక్కలు మోసినప్పటికీ వాసన తెలియకపోతే గాడిదకు ఏరకంగా ఉపయోగం లేదో, అలాగే సాధకుడికి అర్థం తెలియకుండా చేసిన జపంవల్ల ఫలితము ఏమీ ఉండదు. చతుర్విధపురుషార్థాలు సాధించటానికి మంత్రార్థము ముఖ్యమైనది. వేదాలు, శాస్త్రాలు, తంత్రాలు, కర్మకాండ, ఉపాసనకాండ, జ్ఞానకాండలను ఉపదేశించే వారు మంత్రార్థము తెలుసుకుని ఉపదేశము, అనుష్టానము చేసినట్లైతే మంచి ఫలితము ఉంటుంది. అర్థం తెలియకుండా విపరీతసాధన చేసినట్లైతే ఫలితం లేకపోగా, అనర్థం కూడా జరుగుతుంది. ఉదాహరణకు 'రక్షమాం' అనేచోట రకు బదులుగా పొరపాటున 'భ' అని చెప్పామనుకోండి అప్పుడు 'భక్షమాం' అవుతుంది. అంటే మంత్రాధిదేవత సాధకుడి కోరిక ప్రకారం అతన్నే భక్షిస్తుంది. అందుచేత, మంత్రార్థాన్ని పూర్తిగా తెలుసుకుని తప్పులు లేకుండా మంత్రాన్ని సరిగా జపించాలి. ఇక ఈ మంత్రాన్ని చూద్దాం.

పంచదశీమహామంత్రము పదిహేనుఅక్షరాలు గల మంత్రము. ఇహాన్ని కలుగచేసేవి, అంటే లౌకికమైన కోరికలు తీర్చేవి మంత్రాలు. పరాన్ని కలుగచేసేవి మహామంత్రాలు. పంచదశీమహామంత్రం ఇహాన్ని, పరాన్ని కూడా కలుగజేస్తుంది. ఈ మంత్రంలో పదిహేను అక్షరాలు ఉంటాయి. ఈ మొత్తం అక్షరాలు మూడు భాగాలుగా ఉంటాయి. వీటినే మూడుకూటములు, మూడుఖండములు అని కూడా అంటారు. పరమేశ్వరి యొక్క సూక్ష్మశరీరమే పంచదశీ మహామంత్రము.

**స్థూలశరీరము :** పాంచభౌతికమైనది ఈ దేహము. ఇది మూడు రకాలుగా ఉంటుంది. 1. స్థూలశరీరము 2. సూక్ష్మశరీరము 3. కారణశరీరము. వీటిలో చర్మము, మాంసము, రక్తము, నరాలు, మేద, మజ్జ, ఎముకలు మొదలైన వాటితోను, మలమూత్రాలతోను కూడిన ఈదేహాన్ని 'స్థూలశరీరము' అంటారు. ఇది అసహ్యకరమైనది. పూర్వకర్మల ననుసరించి, పంచభూతాల కలయికచేత ఈ దేహం

ఏర్పడింది. భోగాలు అనుభవించటానికి ఆధారము ఈదేహమే. జీవుడు ఈశరీరంతోనే సుఖదుఃఖాలు భోగభాగ్యాలు అనుభవిస్తాడు. స్థూలశరీరం జాగ్రదావస్థలో అనుభవం పొందుతుంది. మిగిలిన అవస్థలు దానికి తెలియవు. గృహస్థుకు గృహంలాగా జీవాత్మకు ఈ శరీరం ఆవాసమై ఉన్నది. జీవిచేసిన పాపపుణ్యాలన్నీ ఈశరీరం ద్వారానే అనుభవిస్తాడు. జననము, మరణము, ముసలితనము, రోగము, అన్నీ ఈశరీరానివే. బాల్యము, యవ్వనము, కౌమారము, వృద్ధాప్యము మొదలైనదశలు కూడా ఈశరీరానివే. బ్రహ్మచర్యము, గృహస్థాశ్రమము, వానప్రస్థము, సన్యాసము వంటి ఆశ్రమధర్మాలు ఈశరీరానివే అలాగే యమనియమాలు, మానావమానాలు మొదలైన విశేషాలు కూడా ఈ శరీరానికి సంబంధించినవే.

**సూక్ష్మశరీరము :** జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు, పంచప్రాణాలు, పంచభూతాలు, అంతఃకరణ చతుష్టయము, విద్య, కామము, కర్మ ఇవన్నీ కలిసి సూక్ష్మశరీరం అనబడుతున్నది. దీన్నే లింగశరీరము అనికూడా అంటారు. ఇది అపంచీకృత భూతాలవలన ఏర్పడి, వాసనలతో కూడినదై, కర్మఫలాలు అనుభవిస్తూ ఉంటుంది. స్వప్నాన్ని ఈసూక్ష్మశరీరమే అనుభవిస్తుంది.

**కారణ శరీరము :** గుణత్రయమే ఆత్మయొక్క కారణశరీరము. ఇది సుషుప్తావస్థలో ఉంటుంది. సుషుప్తిలో అన్నిరకాలయిన జ్ఞానము నశిస్తుంది. బుద్ధి కేవలము బీజరూపంలో ఉంటుంది. ఆస్థితిలో శరీరంలోని అన్నిఅవయవాలు పూర్తిగా విశ్రమిస్తాయి.

ఇప్పుడు దేవియొక్క సూక్ష్మరూపాన్ని వర్ణిస్తున్నారు. సూక్ష్మరూపము మూడు విధాలుగా ఉంటుంది.

1. సూక్ష్మము – పంచదశీ మహామంత్రము
2. సూక్ష్మతరము – కామకలాక్షరము
3. సూక్ష్మతమము – కుండలిని

లలితా సహస్రంలోని 85, 86, 87 నామాలలో పంచదశీమహామంత్రాన్ని వివరించారు. **శ్రీమద్వాగ్భవకూటైకస్వరూప ముఖపంకజా, కంఠాదికటిపర్యంతం మధ్యకూటస్వరూపిణీ, శక్తికూటైకతాపన్న కట్యధోభాగధారిణః**

ఈ మంత్రం మొత్తం మూడు కూటములు లేదా ఖండములుగా ఉంటుంది. వాటిని 1. వాగ్భవకూటమి, 2. కామరాజకూటమి, 3. శక్తికూటమి అంటారు. పరమేశ్వరి యొక్క కంఠము నుంచి పైభాగము అంటే శిరస్సును వాగ్భవకూటమి అంటారు. శిరస్సునుంచే పరావాక్కు ఉత్పన్నమవుతుంది. నోటిద్వారా బయటకు వస్తుంది. అందుకే దీనిని వాక్కుయొక్కభాగము, వాగ్భవకూటమి అన్నారు. రెండవది కామరాజకూటమి. ఇది కంఠము దగ్గరనుంచి కటిప్రదేశము వరకు విస్తరించి ఉంటుంది. ఈ శరీరభాగంతోనే జీవి తనకోరికలు అనుభవిస్తుంది. అందుకే దీనిని మన్మథభాగము, కామరాజకూటమి అన్నారు. మూడవది శక్తికూటమి. కటిప్రదేశంలోనుంచి క్రిందిభాగము అంతా శక్తికూటమి. జీవి సంచరించటానికి అవసరమైన శక్తినిచ్చే కాళ్ళు ఇక్కడ ఉంటాయి. అందుకే ఇది శక్తికూటమి అనబడుతున్నది. ఈ రకంగా పరమేశ్వరి శరీరాన్ని మూడు భాగాలుగా జేసి వాటిని వాగ్భవకూటమి, కామరాజకూటమి, శక్తికూటమి అన్నారు. పరమేశ్వరికి శరీరము ఏమిటి ? అనే అనుమానం రావచ్చు. నిరాకారుడైన పరబ్రహ్మ, సాధకులను ఉద్ధరింప గోరినవాడై ఒక రూపం దాల్చాడు. అదే పరమేశ్వరి. పరలోకానికి ఈశ్వరి. అధిపతి ఆ పరమేశ్వరి సూక్ష్మరూపమే పంచదశీమహామంత్రము.

పంచదశీమహామంత్రము దేవికి ఆత్మస్వరూపము. శ్రీవిద్యా సంప్రదాయానికి ఇది గాయత్రివంటిది. ఈ మంత్రాన్ని ఉపాసించినవారికి ఆత్మసాక్షాత్కారం కలుగుతుంది. చతుర్విధపురుషార్థాలకూ మూలమవటంచేత పంచదశీ మహామంత్రము **"మూలమంత్రము"** అనబడుతున్నది. ఈ మూలమంత్రము మూడు కూటములుగా ఉన్నది. ఆ కూటత్రయమే పరమేశ్వరిస్వరూపము. ఇక్కడ 'మూల' అనే శబ్దము కామకలాక్షరాన్ని (శ్రీ) చెబుతున్నది. కూటత్రయము అనటంచేత మూడు విధాలయిన అవయవాలు చెప్పబడుతున్నాయి. వివరంగా చెప్పాలంటే కామకళలో ఊర్ధ్వబిందువు, మధ్య బిందువు, నాదబిందువు. వీటినీ 'కూటత్రయము' అంటారు. కాబట్టే లలితా సహస్రంలో 88, 89 నామాలు **మూలమంత్రాత్మికా, మూలకూటత్రయ కళేబరా.**

శ్రీవిద్యలో మొదటిది 'బాలామంత్రము' ఎవరీ బాలాత్రిపురసుందరి ? ఈమెను గురించి లలితాసహస్రంలోని 'భండాసురవధ' ఘట్టంలో **"భండపుత్రవధోద్యుక్త**

**బాలావిక్రమనందితా"** అనే 74వ నామంలో చెప్పబడింది. భండాసురడితో యుద్ధం చేస్తున్నప్పుడు భండాసురుని కుమారులు ముప్పైమంది ఒక్కసారిగా దేవిని చుట్టుముట్టారు. అప్పుడు కేవలము సంకల్ప మాత్రం చేత ఉద్భవించి భండపుత్రులను సంహరించిన పరమేశ్వరిస్వరూపులు **బాలాత్రిపురసుందరి.**

**అరుణ కిరణజాలై రంచితా శావకాశా**
**విధృత జపటీకా పుస్తకాభీతి హస్తా ।**
**ఇతర వరకరాఢ్యా పుల్లకల్హార సంస్థా**
**నివసతుహృది బాలా నిత్యకల్యాణశీలా ॥**

అరుణారుణచ్ఛాయలతో ప్రకాశిస్తూ, పై రెండు చేతులలోను పుస్తకము, అక్షమాల, క్రింది రెండు చేతులతోను అభయవరద ముద్రలు ధరించి, పద్మాసనాసీన యైన ఆ దివ్యమంగళమూర్తి నా హృదయపీఠమందు నివశించుగాక. బాలామంత్రం అంటే బాలాత్రిపురసుందరీ ఉపాసనా మంత్రం. ఇందులో మూడుబీజాలు అనులోమ విలోమంగా ఉంటాయి. అప్పుడు మొత్తం ఆరుఅక్షరాలవుతాయన్న మాట. ఈ మూడు బీజాక్షరాలు 1) వాగ్భవ బీజము ఐం 2) కామరాజబీజము క్లీం, 3) శక్తి బీజము సౌః మానవుడికి ఐహికంలో కావలసిన అర్ధకామాలను సాధించిపెట్టేవి ఈ మూడు బీజాక్షరాలే. వీటినే అనులోమ విలోమంగా చెప్పటంవల్ల వాటి శక్తి కొన్నిరెట్లు పెరుగుతోంది. శ్రీవిద్యలో ఇది మొదటి మంత్రం. కాగా రెండవ దశలో చెప్పే మంత్రము పంచదశి. ఈ మంత్రము మూడు కూటములుగా ఉంటుంది. 1. వాగ్భవకూటమి 2. కామరాజ కూటమి 3. శక్తికూటమి.

పూర్వకాలంలో ఎంతోమంది మహానుభావులు ఈ పంచదశీ మహామంత్రాన్ని జపించి తరించారు.

**మను శ్చంద్ర కుబేరశ్చ లోపాముద్రా చ మన్మథః**
**అగస్తి రగ్ని సూర్యశ్చ ఇంద్ర స్కంద శ్శివ స్తథా**
**క్రోధభట్టారకోదేవ్యా ద్వాదశాదో ఉపాసకాః ॥**

మనువు, చంద్రుడు, కుబేరుడు, లోపాముద్ర, మన్మథుడు, అగస్త్యుడు, అగ్నిదేవుడు, సూర్యుడు, ఇంద్రుడు, స్కందుడు (కుమారస్వామి), శివుడు, దుర్వాసుడు

అనే పన్నెండుమంది ఈ మంత్రాన్ని జపించి తరించారు. **"మానసోల్లాసము"** అనే గ్రంథంలో

**విష్ణుః శివః సురజ్యేష్ఠో మను శ్చంద్రో ధనాధిపః**

**లోపాముద్రా తథాగస్త్యః స్కందః కుసుమసాయకః**

**సురాధీశో రోహిణీయో దత్తాత్రేయో మహామునిః**

**దుర్వాసా ఇతి విఖ్యాతా ఏతే ముఖ్య ఉపాసకాః ॥**

విష్ణువు, శివుడు, బ్రహ్మ, మనువు, చంద్రుడు, కుబేరుడు, లోపాముద్ర, అగస్త్యుడు, కుమారస్వామి, మన్మథుడు, ఇంద్రుడు, బలరాముడు, దత్తాత్రేయుడు, దుర్వాసుడు వీరందరు ప్రఖ్యాతి గడించిన దేవీఉపాసకులు అని చెప్పారు. **"జ్ఞానార్ణవము"** అనే తంత్రంలో

**మనుశ్చంద్ర కుబేరశ్చ మన్మథ స్తదనంతరమ్**

**లోపాముద్రా తథాగస్త్యః స్కందో విష్ణు స్తదా శివః**

**దత్తాత్రేయో మునిః శక్రో దుర్వాసాశ్చ త్రయోదశ**

**ఉపాసతే మహావిద్యా ద్వాదశోక్తా స్తవానఘే ॥**

మనువు, చంద్రుడు, కుబేరుడు, మన్మథుడు, లోపాముద్ర, అగస్త్యుడు, కుమారస్వామి, విష్ణువు, శివుడు, దత్తాత్రేయుడు, ఇంద్రుడు, దుర్వాసుడు మొదలైన మహానుభావులు పంచదశీమహామంత్రాన్ని ఉపాసించి తరించారు.

మంత్రాన్ని దర్శించినవాడు ద్రష్ట. సృష్టించినవాడు స్రష్ట. పంచదశీ మహామంత్రాన్ని దర్శించి ఈలోకానికి తెచ్చినవాడు మన్మథుడు. అతడే ఈ మంత్రానికి ఋషి అని కొందరి వాదము. కాగా దక్షిణామూర్తి ఋషి అని కొందరంటారు. కాని వాడుకలోకి వచ్చేసరికి అనేక సంప్రదాయాలున్నాయి. వీరిలో కొంతమంది, మన్మథుడు, దక్షిణామూర్తి కాకుండా ఇతరులను ఋషులుగా చెబుతున్నారు. అది వారి సంప్రదాయం. ఏ సంప్రదాయాన్ని అంగీకరించాలి ? అన్నప్పుడు అన్ని సంప్రదాయాలను గౌరవించటం మన విధి అని మరచిపోకూడదు. ఇక పంచదశీ మహామంత్రం ఏ రకంగా వచ్చిందో చూద్దాం.

ప్రళయం సంభవించినప్పుడు సృష్టిఅంతా పరమేశ్వరునిలో లీనమై పోయింది. ఇది ఎలా జరిగింది ? అంటే ప్రళయం సంభవించినప్పుడు కర్మక్షయం అయిన జీవరాశి అంతా ముక్తినిపొందగా, కర్మక్షయంకాని జీవరాశి ఆ కర్మను తమతో మూటకట్టుకున్నదై, తనకర్మతో సహ మాయలో లీనమైపోయింది. ఆ తరువాత భూమి జలమునందు, జలముఅగ్నియందు, అగ్ని వాయువునందు, వాయువు ఆకాశమునందు, ఆకాశము మాయయందు లీనమవగా, వీటన్నింటినీ తనలో లీనం చేసుకున్న మాయ, పరమేశ్వరునిలో లీనమైపోయింది. ఈ విధంగా సృష్టి అంతా పరమేశ్వరునిలో లీనమవగా, ఇప్పుడు వికారాలు లేనిది, సత్యజ్ఞానానంద మయమైనది, పరిపూర్ణమైనది, సనాతనముగాఉన్నది, ఏకముగాఉన్నది, రెండవది లేనిది పరబ్రహ్మస్వరూపము ఒక్కటేఉన్నది. నిరాకారమైన ఆ పరబ్రహ్మ స్వరూపంలో ఎడారులందు ఎండమావిలాగా, స్థాణువునందు దొంగవాడిలాగా, స్ఫటికంలోని రేఖలులాగా అనిపిస్తూ, తెలుపు, ఎరుపు, నలుపు గల సమాన త్రిగుణాలు కలిగి, అనిర్వచనీయమైన మూలప్రకృతి ఉన్నది. ఆ మూలప్రకృతిలో ప్రతిబింబించిన పరబ్రహ్మయే సాక్షిచైతన్యము.

ఈ పరమేశ్వరతత్త్వానికి రూపంలేదు. గుణంలేదు, లింగభేదం అసలే లేదు. ఇది తేజోమయమైన కాంతిపుంజము. బ్రహ్మవాదులు దీన్నే 'పరమేశ్వరుడు' అంటారు. అది శివశక్తుల ఏకీకృతరూపము.

ఈ రకంగా సృష్టినంతటినీ తనలోనిక్షిప్తం చేసుకున్న ఆ పరమేశ్వరి ఇప్పుడు సృష్టిచెయ్యాలి అని సంకల్పించింది. సృష్టి ఎందుకుచెయ్యాలి ? ప్రళయం జరిగినప్పుడు కర్మక్షయం కాకుండా తనలోలీనమైపోయిన జీవకోటికి కర్మక్షయంచేసి, దానికి ముక్తికలిగించాలనే ఉద్దేశ్యంతో సృష్టిచెయ్యాలని సంకల్పించింది పరమేశ్వరి. ఇప్పుడు సృష్టి ప్రారంభమైంది. ముందుగా ఆ పరమేశ్వరి నుంచి సత్వగుణ ప్రధానమైన అవ్యక్తం వచ్చింది. అదేమాయ. ఈ మాయ పరమేశ్వరి అధీనంలోనే ఉంటుంది. మాయవల్లనే సృష్టిస్థితిలయాలు అన్నీ జరుగుతున్నాయి. ఇప్పుడు అవ్యక్తము నుంచి రజోగుణప్రధానమైన మహత్తత్త్వము పుట్టింది. అదే హిరణ్యగర్భుడు. మహత్తత్త్వము నుంచి తమోగుణప్రధానమైన అహంకారము పుట్టింది. అదే దేవి విరాడ్రూపము. ఈ రకంగా పరమేశ్వరి నుంచి అవ్యక్తము (మాయ) మహత్తత్త్వము (హిరణ్యగర్భుడు) అహంకారము (విరాడ్రూపము) ఆవిర్భవించినాయి.

ఈ అహంకారము నుంచే నామరూపాత్మకమైనజగత్తు ఆవిర్భవించింది. ముందుగా రూపాత్మకజగత్తు. అహంకారం నుంచి పంచభూతాలసూక్ష్మ రూపాలయిన తన్మాత్రలు ఆవిర్భవించాయి. అవే శబ్ద స్పర్శ రూప రసగంధాలు. ఆ తరువాత తన్మాత్రల స్థూలరూపాలయిన పంచభూతాలు ఆవిర్భవించినాయి. పంచభూతాలలో ముందుగాపుట్టింది ఆకాశము. ఆకాశము నుంచి వాయువు, వాయువు నుంచి అగ్ని, అగ్ని నుంచి జలము, జలము నుంచి భూమి, భూమి నుంచి ఓషధులు, ఓషధుల నుంచి వనస్పతులు, వనస్పతుల నుంచి అన్నము వచ్చింది. ఈ రకంగా రూపాత్మకమైన జగత్తు ఏర్పడింది. ఇక నామాత్మకమైన జగత్తు. అవ్యక్తము నుంచి ముందుగా ఓంకారము పుట్టింది. ఓంకారము నుంచి అకార ఉకార మకారాలు వచ్చినాయి. వాటినుంచి అక్షరసమామ్నాయము వచ్చింది. అక్షరాల నుంచి పదాలు, వాక్యాలు, మంత్రాలు, వేదాలు, శాస్త్రాలు, పురాణాలు, సంగీతము, సాహిత్యము వచ్చాయి. ఈ రకంగా పరమేశ్వరి నుంచి నామరూపాత్మకమైనజగత్తు ఏర్పడింది.

ఇప్పుడు పంచభూతాల పంచీకరణ జరిగింది. పంచభూతాలలో ముందుగా ఆకాశం పుట్టింది. ఆకాశంలో దానియొక్కలక్షణం శబ్దముమాత్రమే ఉన్నది. ఆకాశం నుంచి వాయువు వచ్చింది. వాయువు లక్షణం స్పర్శ. అందుచేత వాయువులో ఆకాశలక్షణమైన శబ్దము, వాయులక్షణమైన స్పర్శ ఉన్నాయి. వాయువు నుంచి అగ్ని వచ్చింది. అగ్నిలో ఆకాశలక్షణమైనశబ్దము, వాయులక్షణమైనస్పర్శ, అగ్ని లక్షణమైనరూపము ఉన్నాయి. అగ్ని నుంచి జలము వచ్చింది. జలమునందు ఆకాశలక్షణమైనశబ్దము, వాయులక్షణమైనస్పర్శ, అగ్నిలక్షణమైనరూపము, జలలక్షణమైనరసము ఉన్నాయి. జలము నుంచి భూమి వచ్చింది. భూమియందు పంచభూతాల యొక్క లక్షణాలన్నీ అంటే ఆకాశ లక్షణమైనశబ్దము, వాయులక్షణమైన స్పర్శ, అగ్నిలక్షణమైనరూపము, జలలక్షణమైనరసము, భూలక్షణమైనగంధము ఉన్నాయి. ఈ రకంగా

| | | |
|---|---|---|
| ఆకాశమునందు | – | శబ్దము |
| వాయువునందు | – | శబ్దము, స్పర్శ |
| అగ్నియందు | – | శబ్దము, స్పర్శ, రూపము |
| జలమునందు | – | శబ్దము, స్పర్శ, రూపము, రసము |

భూమియందు – శబ్దము, స్పర్శ, రూపము, రసము, గంధము ఉన్నాయి. ఇదే పంచీకరణ. ఈ పంచీకరణలో మొత్తం పదిహేను భాగాలున్నాయి. **ఈ రకంగా పంచభూతాల పంచీకరణతో వచ్చిన పదిహేను భాగాలే, పంచదశి మహామంత్రంలోని పదిహేను బీజాక్షరాలు.** పంచదశి మహామంత్రము అంటే పంచభూతాలు అని అర్థం. ఈ సృష్టి అని అర్థం ఈ జగత్తు అని అర్థం. సాక్షాత్తూ చరాచరజగత్తే పంచదశీమహామంత్రంగా ఆవిర్భవించింది. సంస్కృతభాషకు గల అక్షరాలు యాభై అని, మంత్రశాస్త్రానికి అక్షరాలు యాభైఒకటి అని గతంలో చెప్పుకున్నాం. **మాతృకా హృదయము** అనే గ్రంథంలో

**కకారాది క్షకారాంతా వర్ణాస్తే శివరూపిణః**
**సమస్త వ్యస్తరూపేణ షట్త్రింశత్ తత్త్వ విగ్రహా ॥**

**అకారాది విసర్గాంతాః స్వరాషోడశ శక్తయః**
**నిత్యాషోడశకాత్మనః పరస్పర మమీయతా ॥**

**శివశక్తి మయావర్ణా శబ్దార్థ ప్రతిపాదకా**
**శివస్వరః పరాధీనో నస్వతంత్రః పదాప్ససౌః ॥**

**స్వరాః స్వతంత్రా జాయంతే నశివస్తు కథాచన**

అని చెప్పారు. వీటిలో అ నుంచి విసర్గ అంటే అః వరకు అచ్చులనీ, క నుంచి క్ష వరకు హల్లులని అంటారు. అచ్చులు శక్తి స్వరూపాలు హల్లులు శివస్వరూపాలు. అచ్చు స్వతంత్రత గలవి. హల్లులు స్వతంత్రత లేనివి. అంటే హల్లులు అచ్చులతో కలిస్తే ఒకరూపాన్ని సంతరించుకుంటాయి. హల్లులను విడిగా పలకలేము. అవి అచ్చులతో కలిస్తేనే పలకబడతాయి.

ఈ రకంగా ఉన్న అక్షరాలను మూడు భాగాలుగా విభజించటం జరిగింది.

1. అ నుంచి అః వరకు 16 అక్షరాలు మొదటి భాగము.

2. క నుంచి త వరకు 16 అక్షరాలు రెండవ భాగము.

3. థ నుంచి స వరకు 16 అక్షరాలు మూడవ భాగము.

వీటిలో హ ళ క్షలను వదలివేశారు. ఎందుకంటే హకారము ఆకాశ తత్త్వాత్మకము. సర్వత్రావ్యాపించి ఉంటుంది. ళ కారము. లళ యోరబేధః లళలకు బేధం లేదు. ఈ రెండూ ఒక్కటే. గతంలో లకారాన్ని మూడవ భాగంలో చెప్పుకున్నాం. అందుచేత ళకారాన్ని వదలివెయ్యటం జరిగింది. ఇక క్షకారము సంస్కృతభాషలో లేదు. కాని శబరవర్మ వ్రాసిన **'శాబర తంత్రం'**లో క్షకారమున్నది. అంటే మంత్ర శాస్త్రంలో ఉన్నదన్న మాట. ఇది క షల మిశ్రమము. అందుచేత క్షకారాన్ని కూడా వదలివేయుట జరిగింది. ఇప్పుడు హ ళ క్షలను వదలివేయగా అ నుంచి స వరకు 48 అక్షరాలే ఉంటాయి. వాటిని పైనచెప్పినట్లుగా ఒక్కొక్క భాగానికీ పదహారు అక్షరాల చొప్పున మూడుభాగాలుగా చేసి, వాటిలో సత్వరజస్తమోగుణాలు, త్రిమూర్తుల తత్త్వాలు అనగా సృష్టిస్థితిలయాలు, చంద్ర సూర్యాగ్నుల తత్త్వాలు, అవస్థాత్రయము జాగ్రస్వప్నసుషుప్తుల తత్త్వాలు చేర్చబడ్డాయి. వీటిలో షోడశ నిత్యలను కూడా చేర్చటం జరిగింది. ఎవరీ షోడశ నిత్యలు ? వీరిని గురించి **వశిష్ఠ సంహితలో** చెప్పటం జరిగింది.

**శృణుదేవి ప్రవక్ష్యామి నిత్యాషోడశకం తవ**
**నకస్య చిన్మయాఽఽఖ్యాతం సర్వతంత్రేషు గోపితం ॥**

**తత్రాదౌ ప్రథమానిత్యా మహాత్రిపురసుందరీ**
**తతః కామేశ్వరీనిత్యా నిత్యా చ భగమాలినీ ॥**

**నిత్యక్లిన్నా తథాచైవ భేరుండా వహ్నివాసినీ**
**మహావజ్రేశ్వరీ రౌద్రీ త్వరితా కులసుందరీ ॥**

**నిత్యా నీలపతాకా చ విజయా సర్వమంగళా**
**జ్వాలామాలిని చిద్రూపాః ఏతానిత్యాస్తు షోడశః ॥**

ఈ షోడశ నిత్యలను గురించి **వామకేశ్వరతంత్రం**లోని ఖడ్గమాలలో కూడా చెప్పటం జరిగింది.

**కామేశ్వరీ, భగమాలినీ, నిత్యక్లిన్నే, భేరుండే, వహ్నివాసిని, మహావజ్రేశ్వరి, శివదూతి, త్వరితే, కులసుందరి, నిత్యే, నీలపతాకే, విజయే సర్వమంగళే, జ్వాలామాలిని, చిత్రే, మహానిత్యే** ఈ నిత్యలు వరుసగా

1. మహాత్రిపురసుందరి
2. కామేశ్వరి
3. భగమాలిని
4. నిత్యక్లిన్న
5. భేరుండ
6. వహ్నివాసిని
7. మహావజ్రేశ్వరి
8. శివదూతి (రౌద్రి)
9. త్వరిత
10. కులసుందరి
11. నిత్యా
12. నీలపతాక
13. విజయే
14. సర్వమంగళే
15. జ్వాలామాలినీ
16. చిద్రూప (చిత్ర)

వీటిలో పదహారవనిత్య మహాత్రిపురసుందరి. ఈ నిత్యను వశిష్ఠసంహితలో మొదట చెప్పగా, ఖడ్గమాలలో ఆఖరున చెప్పటం జరిగింది. శివదూతి అన్నా రౌద్రి అన్నా ఒక్కటే. అలాగే చిద్రూపా నిత్యనే ఖడ్గమాలలో చిత్ర అని చెప్పటం జరిగింది. ఈ షోడశనిత్యలు శుక్లపక్షపాద్యమి మొదలు పౌర్ణమి వరకు, కృష్ణపక్షపాద్యమి మొదలు అమావాస్య వరకు తిథులరూపంలో ఉన్నారు. వీరికే చంద్రకళలు అని పేరు. చంద్రకళలే పాద్యమి మొదలైన తిథులు అని **జ్యోతిశ్శాస్త్రం**లో చెప్పబడింది.

**ప్రతిపన్నామ విజ్ఞేయా చంద్రస్య ప్రథమాకలా**

**ద్వితీయాద్యా ద్వితీయాద్యాః పక్షయో శుక్లకృష్ణయో**

పాద్యమి నుంచి అమావాస్య లేక పౌర్ణమి వరకు తిథులు పదిహేను. ఇవి రెండు భాగాలుగా శుక్లపక్షము, కృష్ణపక్షములందు ఉన్నాయి. అంటే ప్రతిమాసంలోనూ శుక్లపక్షంలో ఒకసారి, కృష్ణపక్షంలో ఒకసారి రెండు ఆ వృత్తులుగా ఉన్నాయి.

**దర్శాద్యాః పూర్ణిమాంతస్తుకలా పంచదశైవతు**

**షోడశీతు కలాజ్ఞేయా సచ్చిదానంద రూపిణీ ॥**

పాద్యమి నుంచి పౌర్ణమి వరకు కళలు పదిహేను. కాగా పదహారవ కళ సచ్చిదానందరూపిణి అయిన ఆ పరమేశ్వరి అయి ఉన్నది. అందుకే ఖడ్గమాలలో నిత్యాదేవతలను చెబుతూ చివరగా "మహానిత్యే పరమేశ్వర పరమేశ్వరీ" అన్నారు.

మహానిత్య అంటే సాక్షాత్తు ఆ పరమేశ్వరియే అని దీని అర్థం. అయితే చంద్రకళలే నిత్యాదేవతలు. అంటే కళలు నిత్యాస్వరూపాలు. నిత్యలు తిథిస్వరూపాలు. చంద్రకళలు పదహారు అవి

| | | | |
|---|---|---|---|
| 1. అమృత | 5. పుష్టి | 9. చంద్రికా | 13. ప్రీతి |
| 2. మానదా | 6. రతి | 10. కాంతి | 14. అంగదా |
| 3. పూషా | 7. ధృతి | 11. జ్యోత్స్నా | 15. పూర్ణా |
| 4. తుష్టి | 8. శశినీ | 12. శ్రీ | 16. పూర్ణామృతా |

పాడ్యమి దగ్గర నుండి పూర్ణిమ లేక అమావాస్యదాకా తిథులు పదిహేను. కృష్ణపక్షంలోను, శుక్లపక్షంలోను వీటి పేర్లు విడివిడిగా ఉంటాయి. అలాగే రాత్రిపూట, పగలుపూట తిథులపేర్లు విడివిడిగా ఉంటాయి. **తైత్తిరీయ బ్రాహ్మణం**లో ఈ తిథుల వివరాలను ఇవ్వటం జరిగింది. శుక్లపక్ష పగటి తిథులు వరుసగా

**సంజ్ఞానం విజ్ఞానం ప్రజ్ఞానం జానదభిజానత్**

**సంకల్పమానం ప్రకల్పమనం ఉపకల్పమానముపక్లప్తం**

**క్లప్తం శ్రేయోవశీయ ఆయస్సంభూతం భూతం**

| | |
|---|---|
| 1. సంజ్ఞానము | 9. ఉపక్లప్తం |
| 2. విజ్ఞానము | 10. క్లప్తం |
| 3. ప్రజ్ఞానము | 11. శ్రేయం |
| 4. జానతు | 12. వశీయం |
| 5. అభిజానత్తు | 13. ఆయత్ |
| 6. సంకల్పమానం | 14. సంభూతం |
| 7. ప్రకల్పమానం | 15. భూతం |
| 8. ఉపకల్పమానం | |

**దర్శా దృష్టా దర్శితా విశ్వరూపా సుదర్శనా**

**ఆప్యాయమానా ప్యాయమానా ప్యాయా సునృతా ఇరా**

**అపూర్యమాణా పూర్యమాణాపూరయంతీ పూర్ణా పూర్ణమాసి**

1. దర్శ
2. దృష్టా
3. దర్శితా
4. విశ్వరూపా
5. సుదర్శనా
6. ఆప్యాయమానా
7. ఆప్యాయమానా
8. ఆప్యాయా
9. సూనృతా
10. ఇరా
11. అపూర్వమాణా
12. పూర్వమాణా
13. పూరయంతీ
14. పూర్ణా
15. పూర్ణమాసీ

**అదే విధంగా కృష్ణపక్షంలో పగటి తిథులు**

**ప్రష్టుతం విష్టుతగ్ం సంస్తుతం కల్యాణం విశ్వరూపం**

**శుక్రం అమృతం తేజస్వి తేజః సమిద్ధం**

**అరుణం భానుమతు మరీచీ అభితసత్తు తపస్విత్తు**

1. ప్రష్టుతం
2. విష్టుతగ్ం
3. సంస్తుతం
4. కల్యాణం
5. విశ్వరూపం
6. శుక్రం
7. అమృతం
8. తేజస్వి
9. తేజః
10. సమిద్ధం
11. అరుణం
12. భానుమతు
13. మరీచి
14. అభిసత్తు
15. తపస్విత్తు

కృష్ణపక్ష రాత్రి తిథులు

**సుతా సున్వతీ ప్రసుతా సూయమానా అభిసూయమానా**

**ప్రీతీప్రసా సంసా తృప్తి తర్పయంతీ**

**కాంతా కామ్యా కామజాతా ఆయుష్మతి కామధుఘా**

1. సుతా
2. సున్వతీ
3. ప్రసుతా
4. సూయమానా
5. అభిసూయమానా
6. ప్రీతీ
7. ప్రసా
8. సంసా
9. తృప్తి
10. తర్పయంతీ
11. కాంతా
12. కామ్యా
13. కామజాతా
14. ఆయుష్మతీ
15. కామధుఘా

ఈ విధంగా ఉన్న తిథులే నిత్యాస్వరూపాలు. నిత్యలు కళాస్వరూపాలు. ఇవన్నీ పంచదశీమహామంత్రంలో మూడు ఖండాలుగా ఉన్నాయి.

ఇక యోగినులు తొమ్మిది మంది

1. ప్రకటయోగిని
2. గుప్తయోగిని
3. గుప్తతరయోగిని
4. సంప్రదాయయోగిని
5. కుళోత్తీర్ణయోగిని
6. నిగర్భయోగిని
7. రహస్యయోగిని
8. అతిరహస్యయోగిని
9. పరాపరరహస్యయోగిని

ఈ యోగినులను కూడా ఇందాక చెప్పిన మూడుఖండాలలో చేర్చటం జరిగింది. ఇప్పుడు

1. శివ, శక్తి, మాయ, శుద్ధవిద్య, జలము. అనే ఐదుతత్త్వాలకు సంబంధించినది మొదటిఖండము. ఇది అగ్నిఖండము.

2. తేజస్సు, వాయువు, మనస్సు, పృథివి,ఆకాశము అనే ఐదుతత్త్వాలకు సంబంధించినది రెండవ ఖండము. ఇది సూర్యఖండము.

3. విద్య, మహేశ్వరి, పర, ఆత్మ, సదాశివ అనే ఐదుతత్త్వాలకు సంబంధించినది మూడవ ఖండము. ఇది సోమఖండము.

ఈ రకంగా పంచదశీమహామంత్రము సోమసూర్యానలాత్మకము అంటే అగ్నిఖండము, సూర్యఖండము, చంద్రఖండము అని మూడు భాగాలుగా ఉన్నది. ఈ మూడుఖండాలను మూడుహ్రీంకారాలు కలుపుతున్నాయి.

అన్ని కళలకు, ఖండాలకు అధిదేవత కామేశ్వరుడు. కాగా అధిష్ఠాత్రికామేశ్వరి. ఈ రకంగా పంచదశీమహామంత్రంలోని బీజక్షరాలను చెబుతున్నారు శంకర భగవత్పాదులవారు.

మొదటిది అగ్నిఖండం. ఇందులో **శివశక్తి కామక్షితిః** శివుడు, శక్తి, కాముడు, క్షితి అనే దేవతలకు సంబంధించిన **క ఏ ఈ ల** అనే నాలుగు బీజాక్షరాలు ఉన్నాయి.

రెండవది సూర్యఖండం. ఇందులో **రవి, శ్శీతకిరణస్మరోహంసశ్శక్ర** అనే దేవతలకు సంబంధించిన హసకహల అనే ఐదు బీజాక్షరాలు ఉన్నాయి.

మూడవది చంద్రఖండం. ఇందులో **పరామారహరయః** అనే దేవతలకు సంబంధించిన **సకల** అనే మూడు బీజాక్షరాలు ఉన్నాయి. ప్రతిఖండము తరువాత ప్రాణశక్తి అయిన హ్రీంకారము ఉన్నది. అంటే మొదటి ఖండంలో నాలుగు, రెండవ ఖండంలో ఐదు, మూడవ ఖండంలో మూడు వెరసి పన్నెండు బీజాలు కాగా ప్రతిఖండము చివర ఒక హ్రీంకారము. ఈ రకంగా మూడు ఖండాలకు మూడు హ్రీంకారాలు. వెరసి పంచదశీమహామంత్రానికి పదిహేను బీజాక్షరాలున్నాయి. ఇదే విషయాన్ని గౌడపాదులవారు తమ **సుభగోదయస్తుతి**లోని 19వ శ్లోకంలో

**స్మరో మారో మారః స్మర ఇతి పరో మార మదనః**

**స్మరానంగశ్చేతి స్మరమదన మారాః స్మరయితి**

**త్రిఖండః ఖండాంతే కలిత భువనేశ్యక్షరయుత**

**శ్చతుః పంచార్ణాస్తే త్రయ ఇతి చ పంచాక్షరమనుః ॥**

స్మర – కకార బీజం, మారో – ఏకార బీజం, మారః – ఈకార బీజం, స్మర – లకార బీజం. ఇది ప్రథమ ఖండం. అగ్నిఖండం.

పర–హకార బీజం, మార–సకార బీజం, మదన – కకార బీజం, స్మరానంగములు – హకారలకారములు. ఇది రెండవ ఖండం. సూర్యఖండం.

స్మరమదన – సకార బీజము, మార – కకార బీజం, స్మర – లకార బీజం, ఇది మూడవ ఖండము. చంద్రఖండము. ఈ మూడుఖండముల చివర భువనేశ్వరీ బీజమయిన హ్రీంకారమున్నది. ఇప్పుడు

**క ఏ ఈ ల హ్రీం । హ స క హ ల హ్రీం । స క ల హ్రీం**

అనేది పదిహేను అక్షరాలు గల మంత్రము. ఇదే పంచదశీమహామంత్రము. శ్రీవిద్యకు గాయత్రి వంటిది.

**మంత్రానికి దేవత ఎవరు ?**

ప్రతి మంత్రానికి ఒక అధిదేవత ఉంటుంది. మరి పంచదశీమంత్రానికి అధిదేవత ఎవరు ? అంటే మొట్టమొదటగా చెప్పుకున్నాం. సృష్టిఆవిర్భావ సమయంలో ముందుగా పంచభూతాలు వచ్చినాయి. ఆ పంచభూతాలు పంచీకృతం చెంది

పదిహేనుభాగాలయినాయి. ఆ పదిహేనుభాగాలే పంచదశీమహామంత్రంలోని పదిహేనుబీజాక్షరాలు. కాబట్టి పంచదశీమహామంత్రానికి అధిదేవత ఎవరు అంటే పంచభూతాలే అనగా చరాచర జగత్తు. ఆ పరమేశ్వరియే ఈ మంత్రానికి అధిదేవత.

ఈ మంత్రంలోని బీజాక్షరాలను చూసినట్లైతే, ఒక్కొక్క బీజాక్షరానికి ఒక్కొక్క దేవత చెప్పబడింది. అందుచేత మంత్రానికి అధిదేవత సర్వదేవతా స్వరూపమైన పరమేశ్వరియే. **'వరివశ్యా రహస్యము'** అనే గ్రంథంలో భాస్కరరాయలవారు

**వామేచ్ఛా బ్రహ్మభారత్యౌ జ్యేష్ఠాజ్ఞానే హరిక్షితి ।**
**రౌద్రీక్రియా శివాపర్ణే ఇత్యే తన్మిథున త్రయమ్ ॥**

ప్రకాశవిమర్శ రూపాలు రెండూ కలిసి, దంపతులై ఈ జగత్తును సృష్టించాయి. ఇక్కడ ప్రకాశరూపము పరమేశ్వరుడు కాగా విమర్శ రూపము పరమేశ్వరి. వామజ్యేష్ఠ రౌద్రీ. ఈ మూడు శక్తులు విడివిడిగా త్రిమూర్తులు. సమిష్టిగా ఈశ్వరస్వరూపం. శాంత. అలాగే ఇచ్ఛజ్ఞానక్రియాశక్తులు మహాకాళి, మహాలక్ష్మి, మహా సరస్వతులు. సమిష్టిగా అంబిక. ఈ శక్తులు కలిస్తే

వామ, ఇచ్ఛ శక్తులు - బ్రహ్మ, భారతి

జ్యేష్ఠ, జ్ఞానశక్తులు - లక్ష్మి, నారాయణులు

రౌద్రి, క్రియాశక్తులు - మహాకాళి, రుద్రుడు కాగా నాల్గవ జంట శాంత అంబికల స్వరూపము. పంచదశీమహామంత్రంలో వాగ్భవ కూటమి. వాణీ హిరణ్య గర్భులు, కామరాజ కూటమి-విష్ణువు, పృథివి, శక్తికూటమి - రుద్రుడు, గౌరి. వీరందరూ కలిసి సమిష్టిగా నాల్గవకూటమి అవుతున్నారు. అదే శాంత అంబికల స్వరూపము. మరి ఈ మంత్రానికి అధిదేవత ఎవరు అంటే శాంత అంబిక. వారే శివశక్తులు, పార్వతీ పరమేశ్వరులు.

**హాదివిద్య, కాదివిద్య :**

అక్షరసమామ్నాయము రెండు రకాలుగా ఉన్నది. శివుడు తాండవం చేస్తున్నప్పుడు సనకాదిసిద్ధుల నుద్ధరింపగోరినవాడై తన ఢక్కను పద్నాలుగుసార్లు మ్రోగించాడు. అవి పాణిని మహర్షికి అక్షర సమామ్నాయముగా, పద్నాలుగు సూత్రాలుగా వినిపించాయి. వాటి ఆధారంగా పాణిని 'అష్టాధ్యాయి' అనే వ్యాకరణ

గ్రంథం వ్రాశాడు. దీని ప్రకారము అ నుంచి అః వరకు అచ్చులు. కాగా హ నుంచి ల వరకు హల్లులు. అంటే హల్లులు హకారముతో మొదలవుతాయి. అయితే శబరవర్మ 'శాబర తంత్రాన్ని' వ్రాస్తూ క నుంచి క్ష వరకు ఉన్నవి హల్లులు అన్నాడు. ఇక్కడ హల్లులు కకారముతో మొదలవుతాయి. అక్షరాలు హాదివిద్యలో యాభై కాది విద్యలో యాభై ఒకటి. క్ష కారము వచ్చి చేరుతుంది. అక్షరాలు హకారముతో మొదలయితే హాది మాత్రుకలు, కకారముతో మొదలయితే కాది మాత్రుకలు అనబడతాయి. పంచదశీమహామంత్రం కకారముతో మొదలయితే కాదివిద్య. హకారముతో మొదలైతే హాదివిద్య. హాదివిద్యలో యమనియమాలు ఉంటాయి. కాదివిద్యలో అవి ఉండవు. ధర్మాచరణ విషయంలో స్వేచ్ఛఇవ్వబడింది అని **"శక్తిసంగమ తంత్రం"**లో చెప్పబడింది.

**కామో (క) యోనిః (ఏ) కమలా (ఈ) వజ్రపాణిః (ల)**
**గుహా (హ్రీం) హసా (హస) మాతరిశ్వా (క) భ్ర (హ)**
**మింద్రః (ల) పునర్గుహా (హ్రీం) సకలా (సకల) మాయ**
**యా (హ్రీం) చ పురూచ్యేషా విశ్వమాతాది విద్యా ॥**

**మంత్రము :** క ఏ ఈ ల హ్రీం । హ స క హల హ్రీం । స క ల హ్రీం ॥

ఈ మంత్రానికి దక్షిణామూర్తి ఋషి.

**ఋషిర్దక్షిణామూర్తిః దక్షిణాచార ప్రవర్తకః**
**హయగ్రీవస్తథా చైవం వామేచానంద భైరవ ॥**

దీనినిబట్టి హయగ్రీవుడు, దక్షిణామూర్తి ఇద్దరూ దక్షిణాచార సంపన్నులే. కాని ఆనందభైరవుడు వామాచారసంప్రదాయంవాడు అని చెప్పబడింది. హాది విద్యలో మంత్రంలో ఉన్న బీజాలు కొన్ని మారతాయి.

శివ – హకారము, శక్తి – సకారము, కామః – కకారము, క్షితి – లకారము. ఈ రకంగా చూసినట్లైతే లోపాముద్ర ఉపాసించినమంత్రం హాదివిద్యకు సంబంధించినది.

**మంత్రము : హసకల హ్రీం । హసకహల హ్రీం । సకల హ్రీం ॥**

గతంలో "మనుశ్చంద్ర కుబేరశ్చ" అంటూ పన్నెండు మంది ఈ మంత్రాన్ని ఉపాసించి తరించారని చెప్పటం జరిగింది. వారిలో మన్మథుడు మొదలైన వారు కాదివిద్యను ఉపాసించగా, లోపాముద్ర, సూర్యుడు, శివుడు, విష్ణువు మొదలైన వారు హాదివిద్యను ఉపాసించారు. పై శ్లోకంలో చెప్పిన పన్నెండుమంది ఈ మంత్రాన్ని భిన్నరీతులలో ఉపాసించారు. అయితే

**తేషుద్వా మనురాజౌతు వరిష్ఠౌ వింధ్యమర్దనః ।**
**లోపాముద్రా కామరాజా ఇతి ఖ్యాతి ముపాగతౌ ॥**

**హాదిస్తు లోపాముద్రాస్యా కామరాజాస్తు కాదికః ।**
**తయోస్తు కామరాజోఽయం సిద్ధిదో భక్తిశాలినః॥**

ఈ భిన్నమైన పన్నెండు మంత్రాలలోను హాదిమతంలో లోపాముద్ర మంత్రము, కాదివిద్యలో కామరాజ మంత్రము శ్రేష్ఠములు. మళ్ళీ ఈ రెండింటిలోనూ కాదివిద్య అయిన కామరాజమంత్రము ప్రశస్త్యమైనది. ఈ పన్నెండు రకాల మంత్రాల వివరాలు కావలసిన వాళ్ళు, నాచే వ్రాయబడిన "శ్రీవిద్యా పంచాదశి" చూడగలరు.

పంచదశీమహామంత్రం మూడు ఖండాలుగా ఉన్నదని గతంలో చెప్పుకున్నాం. వీటిలో మొదటిది వాగ్భవకూటమి. దీనివల్ల పురుషార్ధ సాధనచే కలిగే బ్రహ్మవర్చస్సు, మంచిబుద్ధి కలుగుతాయి. దీనిలో బ్రాహ్మణులచే ఉపాసింపబడే గాయత్రీ మంత్రసారము చెప్పబడింది. ఇది ఋగ్వేదాత్మకము. రెండవది కామరాజకూటమి. దీనిలో అర్ధకామపురుషార్ధనిర్మాణము, క్షత్రియులచే ఉపాసింపబడు త్రిష్ఠప్ఛందస్సు చెప్పబడ్డాయి. ఇది అభీష్ఠప్రదము. యజుర్వేదాత్మకము. మూడవది శక్తికూటమి. దీనిలో మోక్షసాధనామార్గము, వైశ్యజాతిచే ఉపాసింపబడు జగతీచ్ఛందస్సు చెప్పబడ్డాయి. ఈ ఖండము సామవేదాత్మకము. ఈ విద్య సర్వవేదాల యందు, సర్వలోకాలయందు, సమిష్ఠిరూపంలో, సర్వాత్మకమైన చైతన్యరూపంలో చెప్పబడింది. అందుచేతనే ఈ మంత్రాన్ని ఇతర మంత్రాలతో సంపుటీకరణ చెయ్యటం జరుగుతుంది.

**సంపుటీకరణ :**

ప్రత్యేకమైన ప్రయోజనాన్ని ఆశించి ఒక మంత్రాన్ని ఇంకొక మంత్రంతో పూర్తిగా కాని, కొంతభాగాన్ని కాని కలిపినట్లైతే దాన్ని సంపుటీకరణ అంటారు.

పంచదశీమహామంత్రం సర్వోత్తమయమైన మంత్రము. దీన్ని మించినది ఇంకొకటి లేదు. అందుచేత ఇతర మంత్రాలతో పంచదశీమంత్రాన్ని సంపుటం చేసినట్లైతే, ఆ మంత్రాలు త్వరగా సిద్ధిస్తాయి. వాటి ఫలము కొన్ని రెట్లు పెరుగుతుంది. పంచదశి మహామంత్రాన్ని గాయత్రీమంత్రంతో సంపుటీకరణ చేస్తే గాయత్రీమంత్రఫలము పదిరెట్లు పెరుగుతుంది. ఈ రకంగా శైవ, వైష్ణవ, మంత్రాలను పంచదశీ మహా మంత్రంతో సంపుటం చెయ్యటం జరుగుతుంది. పంచదశీమంత్రాన్ని

1. బాలామంత్రంతో సంపుటం చేస్తే సౌభాగ్యవిద్య అంటారు.
2. గణపతి మంత్రంతో సంపుటం చేస్తే విద్యాగణపతి అంటారు.
3. గోపాల మంత్రంతో సంపుటం చేస్తే గోపాలసుందరి అంటారు.

**మంత్రార్థము :**

ఏ మంత్రానికయినా అర్థం పూర్తిగా తెలుసుకుని, ఆ తరువాత మాత్రమే మంత్రోపాసన చెయ్యాలి. లేకపోతే చేసిన ఉపాసనకు ఫలితం ఉండదు. మంత్రార్థం తెలియక చేసిన జపము అంతా వ్యర్థము.

**న అర్థ జ్ఞానవిహీనం చ శబ్దస్యోచ్చారణం ఫలతి ।**
**భస్మన్ వహ్ని విహీనేన ప్రక్షిప్తం హవిర్జ్వలతి ॥**

అగ్నిహోత్రం లేని బూడిదలో వేసిన హోమద్రవ్యాలు ఏ రకంగా వ్యర్థమై పోతాయో, అలాగే అర్థం తెలియని మంత్రజపం కూడా వ్యర్థమైపోతుంది. అంతే కాదు. అర్థం తేలియకుండా కేవలము శబ్దాన్ని మాత్రమే పలికేవాడు మంచి గంధపు చెక్కలు మోసే గాడిదలాంటివాడు. గంధపుచెక్కలు ఎంత మంచి వాసనలు వెదజల్లినా, అది గాడిదకు ఏరకంగానూ ఉపయోగించదు. అందుకే మంత్రార్థం తెలుసుకుని మాత్రమే జపం చెయ్యాలి.

పంచదశీమహామంత్రానికి అనేక రకాల అర్థాలున్నాయి. వీటిలో భావార్థము, సంప్రదాయార్థము ముఖ్యమైనవి. సంప్రదాయప్రకరణంలో పంచదశీమహామంత్రం పంచభూతాలనుంచే ఆవిర్భవించింది అని చెప్పటం జరిగింది.

**వ్యోమాది జనక హకరసలార్ణై ర్ఘటేన పంచభూతమయీ**

ఆకాశాది పంచభూతాలకు హకరసల అనేవి బీజాక్షరాలు. పంచభూతాలు భూమి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము. వీటిలో ఒక్కొక్క దానికి ఒక్కొక్క బీజాక్షరమున్నది. అవి

**హకారద్వ్యోమ సంభూతం కకారస్తు ప్రభంజనః**

**రేఫాదగ్ని స్సకారశ్చ జలతత్త్వసముద్భవః ॥**

**లకార పృథివీజాతా తస్మాద్విశ్వమయీ చసా**

| | | |
|---|---|---|
| హకారము | – | ఆకాశతత్త్వము |
| కకారము | – | వాయుతత్త్వము |
| రకారము | – | అగ్నితత్త్వము |
| సకారము | – | జలతత్త్వము |
| లకారము | – | పృథివీతత్త్వము |

సృష్టి ప్రారంభసమయంలో పంచభూతాలు ఆవిర్భవించినాయి. అవి పంచీకరణ చెంది మొత్తం పదిహేను భాగాలయినాయి. వీటిలో

ఆకాశము ఐదు భాగాలు

వాయువు నాలుగు భాగాలు

అగ్ని మూడు భాగాలు

జలము రెండు భాగాలు

భూమి ఒక భాగము. వెరసి పదిహేను భాగాలు. ఈ పదిహేను భాగాలే పంచదశీమహామంత్రంలోని పదిహేను అక్షరాలు. ఈ రకంగా లెక్కపెడితే పంచదశీ మహామంత్రంలో హకారాలు ఐదు. (రెండవ కూటమిలో రెండు, మూడు హ్రీంకారాలలోనూ మూడు)

కకారాలు – నాలుగు. అయితే మంత్రంలో కకారాలు మూడు మాత్రమే ఉంటాయి. ఈ మూడు కకారాలు సాధకులకు ప్రతీకగా చెప్పారు.

**కకార త్రయవాచ్యస్తు సకలాః ప్రళయాకళాః**

**విజ్ఞాన కేవలశ్చేతి త్రిఃప్రకారా ఉపాసకాః ॥**

సాధకులు 1 సకలులు 2 ప్రళయాకలులు 3 విజ్ఞానకేవలులు అని మూడు రకాలుగా విభజింపబడతారు.

**ఆజ్ఞాంతం సకలంప్రోక్తం । తతస్సకల నిష్కలం**
**ఉన్మన్యంతం పరేస్థానం । నిష్కళంచ త్రిధాస్థితం**

మానవశరీరంలో మొత్తం 19 చక్రాలున్నాయని గతంలో చెప్పుకున్నాం. ఇవి మూడు జట్లుగా ఉన్నాయి. వీటిలోమొదటి జట్టు.

**అకుతే విషు సంజ్ఞే చ శాక్తౌ వహ్నౌ తథాపునః**
**నాభావనా హుతేశుద్ధే లంబికాగ్రే భ్రువోంతరే ॥**

**1. అకులము :** ఆధారచక్రం క్రిందఉన్న సహస్రదళ పద్మము.

**2. విషువు :** అష్టదళము, షడ్దళముల మధ్య భాగము.

3. మూలాధారము, 4. స్వాధిష్ఠానము, 5. మణిపూరము, 6. అనాహతము, 7. విశుద్ధి చక్రము, 8. లంబికాగ్రము (కొండనాలుక) 9. ఆజ్ఞాచక్రము. ఇక రెండవ జట్టు.

**బిందౌ తదర్థం రోదిన్యాం నాదో నాదాంత ఏవచ**
**శక్తిః పునర్వాపికాయాం సుమన ఉన్మన గోచరే ॥**

1. బిందువు, 2. అర్ధచంద్రము, 3. రోదిని, 4. నాదము, 5. నాదాంతము, 6. శక్తి, 7. వ్యాపిక, 8. సుమన, 9. ఉన్మన. మూడవజట్టులో ఒకేస్థానముంటుంది. అదే మహాబిందువు. ఇది శిరస్సుకు మూడు అంగుళాలపైన ఉంటుంది.

వీటిలో మొదటి జట్టులో సాధన చేసేవారు సకలులు అనబడతారు. వీరు ఐహికమైన వాంఛలతో జీవాత్మ వేరు, పరమాత్మ వేరు అని భావిస్తారు. ధ్యానశ్లోకంలో చెప్పిన ప్రకారము భగవంతుని రూపం కల్పించుమని ఆరాధిస్తారు.

రెండవజట్టులో సాధనచేసేవారు సకలనిష్కలులు. వీరినే ప్రళయాకలులు అని కూడా అంటారు. వీరు మిశ్రమదృష్టి కలిగిఉంటారు. సాకారము, నిరాకారము రెండింటి గురించీ మాట్లాడతారు.

మూడవజట్టులో సాధన చేసేవారు నిష్కలులు. వీరినే విజ్ఞానకేవలులు అని కూడా అంటారు. వీరు కేవలము మోక్షవాదులు. నిర్గుణ బ్రహ్మోపాసన చేస్తారు. ఈ విధంగా కకారము సాధకుల గురించి చెబుతున్నది. మరి వాయుబీజం ఏది ? అది నాలుగు భాగాలుగా ఉండాలికదా అంటే భాస్కరరాయలవారు ఈకారాన్ని వాయు బీజంగా తీసుకోవాలి అన్నారు. ఇప్పుడు ఈ కారము మొదటి కూటమిలో ఒకటి, మూడు హ్రీంకారాలలోను మూడు. వెరసి నాలుగు అవుతాయి.

ఇక అగ్నిబీజమయిన రకారాలు మూడు హ్రీంకారాలలోను ఉన్నాయి. జలబీజములయిన సకారాలు రెండవకూటమిలో ఒకటి, మూడవ కూటమిలో ఒకటి. మొత్తం రెండు ఉన్నాయి. ఇక ఆఖరుది పృథివీ బీజమైన లకారము మూడు ఖండములయందు మూడు ఉన్నాయి. అయితే లకారము ఒకటే ఉండాలి కదా అంటే మూడు లకారాలు భూలోక భువర్లోక సువర్లోకాలకు ప్రతీక. కాబట్టి ఆ మూడింటినీ కలిపి ఒకటిగానే లెక్కపెట్టాలి. ఇప్పుడు మంత్రంలో

**1. హకారాలు :** ద్వితీయ ఖండంలో రెండు, మూడు హ్రీంకారాలయందు మూడు. వెరసి ఐదు.

**2. ఈకారాలు :** ప్రథమ ఖండంలో ఒకటి. మూడు హ్రీంకారాలలోను మూడు. వెరసి నాలుగు.

**3. రకారాలు :** మూడు హ్రీంకారాల యందు మూడు.

**4. సకారాలు :** ద్వితీయ ఖండంలో ఒకటి, తృతీయ ఖండంలో ఒకటి వెరసి రెండు

**5. లకారాలు :** మూడు ఖండాలలోను మూడు. ఈ మూడూ ముల్లోకాలకు ప్రతీక. అందుచేత వీటిని ఒకటిగానే లెక్కించాలి.

ఈ రకంగా పంచదశీమహామంత్రం పంచభూతాలకు ప్రతీక. చరాచర జగత్తుకు ప్రతీక. ఇది పంచదశీమహామంత్రానికి సంప్రదాయార్థం.

**భావార్థం :** ప్రకాశ విమర్శాంశలు రెండూ కలిసి మిధునమై ఈ జగత్తును సృష్టించాయి. ఇందులో ప్రకాశాంశ పురుషుడు విమర్శాంశ స్త్రీ. అయితే ప్రకాశ రూపము వ్యష్టిగా వామజ్యేష్ఠ రౌద్రి అనబడుతుంది. ఇందులో వామాది శక్తులే

సృష్టి స్థితి లయాలకు కారకులైన బ్రహ్మ విష్ణు రుద్రులు. వారే త్రిమూర్తులు సమిష్టిగా శాంతా అనబడతారు. అలాగే విమర్శశక్తి కూడా వ్యష్ఠిగా ఇచ్ఛాజ్ఞానక్రియా శక్తులు అవుతుంది. ఇవే త్రిశక్తులు. సరస్వతి, పృథివి, గౌరి. సమిష్ఠిగా అంబికా అనబడతారు. ఈ రకంగా వీరంతా కలిసి నాలుగు మిధునాలవుతున్నారు. ఇందులో

**వామేచ్ఛా బ్రహ్మభారత్యౌ జ్యేష్ఠా జ్ఞానహరిక్షితి**

**రౌద్రిక్రియా శివాపర్ణే ఇత్యే తన్మిథునత్రయమ్ ॥**

| | | |
|---|---|---|
| వామ, ఇచ్ఛాశక్తులు | – | బ్రహ్మభారతి |
| జ్యేష్ఠజ్ఞానశక్తులు | – | విష్ణువు, పృథివి, వీరే లక్ష్మీనారాయణులు |
| రౌద్రి క్రియాశక్తులు | – | శివుడు, అపర్ణ, ఉమామహేశ్వరులు |

వీరందరూ కలిసి సమిష్ఠికూటమిగా నాల్గవకూటమి అవుతున్నారు. ఆ నాల్గవకూటమే శాంత, అంబికలు.

పైన చెప్పిన మూడు కూటములే పంచదశీమహామంత్రంలోని మూడు కూటములు.

| | | |
|---|---|---|
| ప్రథమ కూటమి | – | సృష్టిరూపము |
| ద్వితీయ కూటమి | – | స్థితిరూపము |
| తృతీయ కూటమి | – | సంహారరూపము |

వీటిలో సృష్టి కార్యక్రమానికి బ్రహ్మ, భారతి, స్థితికి – విష్ణువు, పృథివి. లయానికి – శివుడు, గౌరి అధిపతులు. దీని ప్రకారము ప్రథమకూటమిలోని బీజాలకు అర్థం.

**కకారో బ్రహ్మరూపశ్చ ఏకారో భారతీమతమ్**

**ఈకారో విష్ణురూపశ్చ లకారో పృథివీమతమ్**

**హకారో రుద్రరూపశ్చ రకారో రుద్రాణి ముచ్యతే ॥**

ఇందులో కకారము – బ్రహ్మస్వరూపము, ఏకారము – భారతి (సరస్వతి)

ఈకారము – విష్ణుస్వరూపము, లకారము – పృథివి

హకారము – రుద్రస్వరూపము, రేఫ – రుద్రాణి (గౌరి)

ఈ రకంగా ప్రథమ ఖండంలోని బీజాక్షరాలకు అర్థం – త్రిమూర్తి ద్వంద్వము. ఇక ద్వితీయకూటమిలో హసకహల అనే ఐదు అక్షరాలున్నాయి. వీటిలో రెండవ హకారాన్ని మూడవ కూటమికి ముందు చేర్చాలి. అప్పుడు రెండు, మూడు కూటముల యందు 'హసకల' అని ఒకే అక్షరాలుంటాయి. ఇప్పుడు రెండు మూడు కూటముల కర్థం.

**హకారో బ్రహ్మరూపశ్చ సకారో భారతీమతమ్**

**కకారో విష్ణురూపశ్చ లకారో పృథివీ మతమ్**

**హకారో రుద్రరూపశ్చ రకారో రుద్రాణీ ముచ్యతే ॥**

హకారము – బ్రహ్మ, సకారము – భారతి, కకారము – విష్ణువు, లకారము – పృథివి, హకారము – రుద్రుడు, రకారము – రుద్రాణి.

ఈ రకంగా పంచదశీమంత్రంలోని ప్రతికూటమికి అర్థం త్రిమూర్తి ద్వంద్వమే. వారే శివశక్తులు. ప్రకృతి పురుషులు.

**పంచదశీ మహామంత్రము - శ్రీచక్రము :**

పంచదశీ మహామంత్రం నుంచే దానికి ప్రతిరూపమైన శ్రీచక్రం ఉద్భవించింది. జ్ఞానార్ణవ తంత్రంలో

**శ్రీచక్రంతు వరారోహే శ్రీవిద్యార్ణవ సంభవమ్**

శ్రీచక్రము పంచదశీమహామంత్రంలోని బీజాక్షరాలవల్లనే పుట్టింది అని చెప్పారు.

**భూమిశ్చంద్ర శివో మాయాశక్తిః కృష్ణమాదనౌ**

**అర్థచంద్రశ్చ బిందుశ్చ నవార్ణోమేరురుచ్యతే ॥**

పంచదశీమహామంత్రంలో మొత్తం పదిహేను అక్షరాలున్నాయి. కాని ఒకసారి లెక్కపెట్టిన అక్షరాన్ని మళ్ళీ లెక్కపెట్టకుండా ఉన్నట్లైతే, ఆ సంఖ్య తొమ్మిది అవుతుంది. అవి

1. భూమి – లకారము, 2. చంద్ర – సకారము, 3. శివ – హకారము, 4. మాయ – ఈకారము, 5. శక్తి – ఏకారము, 6. కృష్ణమాద్య – రేఫ, 7. మాదన – కకారము, 8. అర్థచంద్ర – నాదము, 9. బిందువు – బిందువు

ఈ తొమ్మిది అక్షరాల సముదాయమే పంచదశీమహామంత్రము. వీటివల్లనే శ్రీచక్రము ఆవిర్భవించింది.

1. లకారము పృథివీబీజము. దీనివల్ల భూపురం ఉద్భవించింది.

2. సకారము చంద్రబీజము. దీనివల్ల షోడశదళం ఆవిర్భవించింది.

3. హకారము శివబీజము. దీనివల్ల అష్టమూర్త్యాత్మకమైన అష్టదళం పుట్టింది.

4. ఈకారము మాయాబీజము. దీనివల్ల చతుర్దశభువనాలకు ప్రతీకగా చతుర్దశారము వచ్చింది.

5. ఏకారము శక్తిబీజము. దీనివల్ల దశావతారాలకు ప్రతీకగా బహిర్దశారము పుట్టింది.

6. రకారము అగ్నిబీజము. దీనివల్ల అగ్నికళలతో కూడిన అంతర్దశారం ఏర్పడింది.

7. కకారము మన్మథబీజము. దీనివల్ల అష్టవసువులకు ప్రతీకగా అష్టకోణం ఏర్పడింది.

8. అర్ధచంద్రము త్రిగుణాత్మకము. దీనివల్ల త్రికోణం ఏర్పడింది.

9. బిందువు పరబ్రహ్మాత్మకము. దీనివల్ల బిందువు ఏర్పడింది.

ఈ రకంగా పంచదశీమహామంత్రంలోని బీజాక్షరాలవల్లనే, ఆ మంత్రానికి ప్రతీక అయిన శ్రీచక్రము ఏర్పడింది.

భాస్కరరాయలవారు **'వరివశ్యారహస్యము'** అనే గ్రంథంలో పంచదశీ మహామంత్రానికి 1. గణేశత్వము 2. యోగినీరూపము 3. నవగ్రహరూపము 4. రాశిస్వరూపము 5. నక్షత్రరూపము ఉన్నాయి అని చెప్పారు.

**1. గణేశత్వము :** గణాలకు అధిపతిత్వము గణేశత్వము. ఇందులో

1. అకారాది వర్ణాలు పదహారు వాగ్భవకూటమి

2. క నుంచి త వరకు గల పదహారుఅక్షరాలు కామరాజకూటమి

3. థ నుంచి స వరకు గల పదహారుఅక్షరాలు శక్తికూటమి

4. పర, పశ్యంతి, మధ్యమ వైఖరి అనే నాలుగు వాగ్గణాలు

5. వ్యష్టి సమిష్టి విబేధముచేత విద్యా స్వరూపము.

ఈ రకంగా వర్ణస్వరూపం గలది కాబట్టి పంచదశీమహామంత్రానికి గణేశత్వము వచ్చింది.

**2. యోగినీరూపము :** మంత్రంలో హ్రీంకారాలు మూడు. అవి లేని కూటములు మూడు వెరసి ఆరు. డాకిని,రాకిని, లాకిని, కాకిని, సాకిని, హాకిని అనే యోగినులు ఆరు. కాబట్టి పంచదశీ మంత్రానికి యోగినీరూపం వచ్చింది.

**3. నవగ్రహరూపము :** పంచదశీమహామంత్రంలో బిందువులు మూడు, నాదములు మూడు, బిందువు నాదము లేని కూటములు మూడు వెరసి తొమ్మిది. గ్రహాలు తొమ్మిది. అందుచేత పంచదశీమహామంత్రానికి నవగ్రహత్వం వచ్చింది.

**4. రాశి స్వరూపము :** మేషాది రాసులు పన్నెండు. పంచదశీమహామంత్రంలో హ్రీంకారాలు వదిలేస్తే మిగిలిన అక్షరాలు పన్నెండు. కాబట్టి పంచదశీమహా మంత్రానికి రాశి రూపము వచ్చింది.

**5. నక్షత్రరూపం :** సంప్రదాయ ప్రకరణంలో మూలవిద్యలో 37 వర్ణాలున్నాయి. ఇది ఎలాగంటే – ముందుగా మంత్రము.

**క ఏ ఈ ల హ్రీం । హ స క హ ల హ్రీం । స క ల హ్రీం ॥**

ఇందులో ముందుగా హ్రీంకారాన్ని చూద్దాం. హ్రీంకారములో హకారము, ఈకారము, రకారము, బిందువు, నాదము. మొత్తం ఐదు వర్ణాలున్నాయి. ఈ రకంగా మూడు హ్రీంకారాలలోను 3×5 = పదిహేను వర్ణాలు. ఇక ప్రతి హల్లునందు రెండు అక్షరాలు క్+అ =క. ల్+అ = ల, ఈ రకంగా మొదటి ఖండంలో క ల రెండు, రెండవ ఖండంలో హ స క హ ల ఐదు. మూడవ ఖండంలో స క ల – మూడు. వెరసి పది. ఈ పది అక్షరాలలోనూ అచ్చులు పది, హల్లులు పది. వెరసి ఇరవై. ఏ ఈ అచ్చులు రెండు వెరసి 15+20+2 37 పంచదశీ మహామంత్రానికి వర్ణాలు 37. ఇందులో క, ల మొదలైన అక్షరాలలో అచ్చులను విడదీయకుండా లెక్కపెడితే హ్రీంకారాలలో 15, హల్లులు 10, అచ్చులు 2 వెరసి ఇరవై ఏడు. అంటే హ్రీంకారాలలో 15, మిగిలిన అక్షరాలు 12 వెరసి 27. అశ్వని మొదలైన నక్షత్రాలు ఇరవై ఏడు. కాబట్టి పంచదశి మహామంత్రానికి నక్షత్రరూపం వచ్చింది.

ఈ రకంగా పంచదశీమహామంత్రము గణేశత్వము, యోగినీస్వరూపము, నవగ్రహత్వము, రాశిస్వరూపము, నక్షత్రరూపము సంతరించుకుని మంత్రరాజముగా వెలుగొందుతున్నది.

**చంద్రకళావిద్య :** శ్రీవిద్య అనేది చంద్రకళావిద్య. చంద్రుని యొక్క కళలు పదహారు. నిత్యలుపదహారు. వీటిలో పదహారవనిత్య మహాత్రిపురసుందరి. అని గతంలో చెప్పుకున్నాం. చంద్రుని యొక్క వృద్ధిక్షయాల ననుసరించి శ్రీవిద్యోపాసన జరుగుతుంది. చంద్రునియొక్క కళలు సూర్యునిలో ఉంటాయి. అమావాస్య తరువాత వచ్చే పాడ్యమినాడు మొదటి కళ సూర్యుని నుంచి వచ్చి చంద్రునిలో చేరుతుంది. విదియనాడు రెండవకళ తదియనాడు మూడవకళ. ఈ రకంగా పౌర్ణమి నాటికి పదిహేను కళలు చంద్రునిలో చేరతాయి. పదహారవకళ శ్రీకళ, ధృవకళ, సాదాఖ్యకళ చిత్కళ అనబడుతుంది. అలాగే బహుళ పాడ్యమి నుంచి ఒక్కొక్క కళ చంద్రుని నుంచి విడిపోయి సూర్యునిలో కలిసిపోతుంది. ఈ రకంగా అమావాస్య రోజున చంద్రుడు కళాహీనుడవుతాడు. ఉపాసకులు ప్రతిరోజు షోడశీకళను, ఆ రోజున ఉన్న తిథియొక్కకళను అర్చన చేస్తారు. ఇక ఉపాసనా విధానంలో సాధన అనేది శుక్లపక్ష రాత్రులందు మాత్రమే చేయాలి. ఈ విషయాన్ని 87వ శ్లోకంలో వివరించటం జరిగింది.

ఫలితం : పంచదశీమహామంత్రాన్ని మంత్రరాజము అని, దీనికి అధిదేవత పరబ్రహ్మ స్వరూపమైన పరమేశ్వరి అని గతంలో చెప్పుకున్నాం కదా ! మరి అటువంటి మంత్రజపం చెయ్యటం సామాన్యమైన విషయం కాదు. సాక్షాత్తు శివశక్తులను ఆరాధించాలి అంటే పూర్వజన్మ సుకృతం ఉండాలి. అంతేగాని సామాన్య మానవుడు ఈ మంత్రజపం చెయ్యలేడు. అందుచేతనే **లలితాత్రిశతి** ఫలశ్రుతిలో

**నతేషాం శిద్ధిదా విద్యా కల్పకోటి శతైరపి**
**కత్రయం హద్వయం చైవ శైవభాగ ప్రకీర్తితః**
**శక్త్యక్షరాణి శేషాణి, హ్రీంకారముభయాత్మకః**

పంచదశీమహామంత్రంలోని అక్షరాలలో కకారాలు మూడు, హకారాలు రెండు సాక్షాత్తు శివునిచేత చెప్పబడగా, ఏ ఈ ల స ల స ల అనే ఏడు అక్షరాలు పార్వతీదేవి

చెప్పింది. ఇక మూడు హ్రీంకారాలు శివశక్తులచేత చెప్పబడ్డాయి. అటువంటి మహామంత్రాన్ని జపించాలంటే

**యశ్యైనో పశ్చిమంజన్మ యదివా శ్శంకర స్స్వయం**
**తేనైవ లభ్యతే విద్యా శ్రీమత్పంచ దశాక్షరీ ॥**

ఎవరికైతే మరుజన్మ ఉండదో, ఎవడైతే సాక్షాత్తూ దైవాంశ సంభూతుడో, అతడుమాత్రమే పంచదశీమహామంత్రాన్ని జపించగలుగుతాడు.

**ఆయుష్కరం పుష్టికరం పుత్రదం వశ్యకారకమ్ ।**
**విద్యాప్రదం కీర్తికరం సుకవిత్వ ప్రదాయకమ్ ॥**

**సర్వసంపత్ప్రదం సర్వభోగదం సర్వసౌఖ్యదమ్ ।**
**సర్వాభీష్టప్రదంచైవ దేవీనామ శతత్రయమ్ ॥**

లలితాత్రిశతి అంటే పంచదశీమహామంత్రమే. ఈ మంత్రాన్ని గనక జపించినట్లైతే సాధకుడికి. ఆయురారోగ్య ఐశ్వర్యాలు, ధనధాన్యాలు, భోగభాగ్యాలు, విద్య, కవిత్వము, కీర్తి, మంచి కుమారులు, ఒకటేమిటి? అతడి కోరికలన్నీ తీరతాయి అని చెబుతున్నారు

అయితే శ్రీవిద్య కేవలము కామ్యవిద్య మాత్రమే కాదు. మోక్షవిద్యకూడా.

**యత్రాపి భోగోన చ తత్ర మోక్షః యత్రాపి మోక్షో నచతత్ర భోగః**

ఎక్కడ భోగము ఉంటుందో అక్కడ మోక్షము ఉండదు. ఎక్కడ మోక్షం ఉంటుందో అక్కడ భోగం ఉండదు. కాని

**శ్రీ సుందరీసేవన తత్పరాణాం భోగశ్చ మోక్షశ్చ కరస్థ ఏవ ॥**

ఆ పరమేశ్వరిని అర్చించిన వారికి భోగము, మోక్షము ఏది కావాలంటే అది లభిస్తుంది.

అందుకే మీరందరూ ఆర్తత్రాణ పరాయణి, భక్తులపాలిట కల్పవృక్షము, కోరిన వారి కొంగు బంగారము అయిన ఆ పరమేశ్వరిని సేవించి ఆమెకృపకు పాత్రులు కావాలని శంకర భగవత్పాదుల వారి కోరిక, గణపతి సచ్చిదానందస్వామి వారి కోరిక, మా కోరిక కూడా

పరదేవతానుగ్రహ ప్రసాద సిద్ధిరస్తు.

**స్మరం యోనిం లక్ష్మీం త్రితయ మిద మాదౌ తవ మనోః**
**నిధా యైకే నిత్య నిరవధి మహాభోగరసికాః**
**భజన్తి త్వాం చిన్తామణి గుణ నిబద్ధాక్షవలయాః**
**శివాగ్నౌ జుహ్వన్త స్సురిభి ఘృతధారాహుతి శతైః ॥ 33**

నిత్యాస్వరూపమై, ఆద్యంతరహితమైన ఓ దేవీ ! నీమంత్రానికి ముందు కామరాజ, భువనేశ్వరీ, లక్ష్మీబీజములను చేర్చి (క్లీం హ్రీం శ్రీం) అపరిచ్ఛిన్నము, అఖండము, మహాభోగరూపము అయిన నిత్యసుఖమును పొందిన సమయాచారులైన యోగీశ్వరులు చింతామణులతో చేయబడిన అక్షమాలలను చేతులయందు ధరించి, త్రికోణరూపమైన బైందవస్థానమందు సంస్కరింపబడిన 'శివాగ్ని' అనబడే స్వాధిష్ఠానాగ్నియందు కామధేనువు యొక్క నేతిధారలను వేల సంఖ్యలో హోమము చేయుచు నిన్ను సేవిస్తున్నారు.

ఇక్కడ 'శివాగ్ని' అంటున్నారు. శివ అంటే శక్తి అదే త్రికోణము. త్రికోణమైన బైందవస్థానమందు స్వాధిష్ఠానాగ్నిని నిలిపి, అగ్నికి షోడశసంస్కారాలు చేసినట్లైతే, దానిని శివాగ్ని అంటారు. జాతకకర్మ, నామకరణము, చౌలము, అన్నప్రాసన, ఉపనయనము మొదలైన వాటిని షోడశకర్మలు అంటారు.

బిందువు త్రికోణంలో ఉంటుంది. అదే బైందవస్థానము. ఆజ్ఞాచక్రంలో త్రికోణాన్నిఆరోపించి, సహస్రారపద్మములో ఉన్న కామేశ్వరిని క్రిందకు తీసుకువచ్చి పునశ్చరణ చెయ్యాలి. స్వాధిష్ఠానంలో ఉన్న అగ్నిని బైందవస్థానానికి చేర్చి అక్కడ కామధేనువు యొక్క నేతిధారలతో హోమము చేయటమంటే, సర్వవాసనలను పరిత్యజించి, 'శివోహం' అనే మహావాక్యార్థానుభవంతో పరమానందం పొందటం. ఇది అంతర్యాగము. సాధకుని యొక్క అధికారాన్ని బట్టి ఇది మహాభోగము, సర్వసౌఖ్యానుభవము అవుతుంది. యోగియొక్క గమ్యం క్షణికానందం కాదు. శాశ్వతమైన ఆనందం పొందటమే. ఇదే బ్రహ్మానందము అని ఉపనిషత్తులు చెబుతున్నాయి.

**తైత్తిరీయోపనిషత్తు**లోని రెండవ భాగమైన ఆనందవల్లిలో బ్రహ్మానందం అంటే ఏమిటో చెప్పారు.

ఈ లోకంలోని సంపదఅంతా యువకుడు, సదాచారసంపన్నుడు, వేదాధ్యాయి, బలమైనవాడు, ఆరోగ్యవంతుడు అనుభవించటానికే ఉన్నది. దీన్ని అనుభవించటంవల్ల కలిగే ఆనందాన్ని 'మానుషానందము' అంటారు. మానుషానందానికి నూరురెట్లు మనుష్యగంధర్వానందం. మనుష్యగంధర్వులు అంటే మానవులై ఉండి పుణ్యకర్మలచేత గంధర్వత్వం పొందినవారు. మానవ గంధర్వానందానికి నూరురెట్లు దేవగంధర్వా నందం. సృష్టికాలంలో దేవలోకంలో గంధర్వులుగా పుట్టినవారు దేవగంధర్వులు. దేవగంధర్వాందానికి నూరురెట్లు చిరలోకపితరానందం. చిరకాలం ఉండే లోకంలో ఉన్న పిత్రుదేవతలను చిరలోకపితరులు అంటారు. చిరలోకపితరానందానికి నూరురెట్లు అజానజ దేవానందము. ఈ లోకము దేవలోకానికి పైన ఉన్నది. దానికి నూరురెట్లు కర్మ దేవానందము. వైదికకర్మలు చేసినవారు కర్మదేవతలు. దానికి నూరురెట్లు – దేవానందము. యజ్ఞంలో హవిర్భాగము తీసుకునే 33 మంది దేవతలు. దానికి నూరురెట్లు ఇంద్రానందం. దానికి నూరురెట్లు–బృహస్పతి ఆనందం. దానికి నూరురెట్లు – ప్రజాపతి ఆనందం. దానికి నూరురెట్లు–బ్రహ్మానందం. ఈ ఆనందము సత్యము, నిత్యము, శాశ్వతము అయినది.

మహావాక్యార్థానుభవంతో సాధనచేసినట్లైతే సాధకుడు పరమానందం పొందుతాడు. మహావాక్యాలు నాలుగు 1. ప్రజ్ఞానం బ్రహ్మ 2. అయమాత్మాబ్రహ్మ 3. తత్త్వమసి 4. అహంబ్రహ్మాస్మి. వీటన్నింటి అర్థం ఒక్కటే. అదే జీవాత్మా పరమాత్మా రెండూ ఒక్కటే. 'శివోహం' సాక్షాత్తూ నేనే శివుడను. నేనే పరమేశ్వరుడను నాకన్న భిన్నమైనది ఏదీ లేదు. ఈ జగత్తంతా నా నుంచే ఆవిర్భవిస్తున్నది. తిరిగి నాలోనే లీనమవుతున్నది. అని భావన చెయ్యటమే మహావాక్యార్థాన్ని అనుభవించటం. ఈ రకంగా 'శివోహం' అని పరమేశ్వరిని అర్చించేవారికి శాశ్వతమైన ఆనందం కలుగుతుంది. ఇక్కడ పరమేశ్వరిని అర్చించటం అంటే నేనేపరమేశ్వరిస్వరూపాన్ని అని భావించి తనను తాను అర్చించుకోవటమే.

పంచదశీమహామంత్రం మూడుకూటములుగా ఉన్నది. మొదటిది వాగ్భవకూటమి. ఇది సకలవిద్యాప్రదము. రెండవది కామరాజకూటమి. ఇది మహాభోగసాధనము. మూడవది పరాకూటమి. ఇది మోక్షప్రదము. అయితే బాహ్యపూజ కాకుండా అంతరారాధన చేసేవారికే మోక్ష ప్రాప్తి కలుగుతుంది.

**శరీరం త్వం శమ్భో శ్శశిమిహిర వక్షోరుహయుగం**
**తవాత్మానం మన్యే భగవతి నవాత్మాన మనఘమ్**
**అతశ్శేష శ్శేషీ త్వయ ముభయసాధారణతయా**
**స్థితస్సమ్బన్ధోవాం సమరస పరానన్ద పరయోః ॥ 34**

ఉత్పత్తి మొదలైన ఆరు విషయాలను తెలిసినదానవైన ఓ దేవీ ! ఆనంద భైరవుడికి నీవు సూర్యచంద్రులు స్థనాలుగా గల శరీరము అవుతున్నావు. అందుకే నవవ్యూహాత్మకుడైన ఆనందభైరవుని నీ శరీరముగా భావిస్తున్నాను. అతడే నీ శరీరము అని భావిస్తున్నాను. దీనివల్ల మీ ఇద్దరికీ ఐక్యము సంభవించి నీవు శేషము అతడు శేషి, అతడు శేషము, నీవు శేషి – అనే ఈ శేషి, శేష సంబంధమైన సామరస్యముతో కూడి ఆనంద భైరవ, ఆనందభైరవి రూపులైన మీ ఉభయులకు సమానత్వమున్నదని భావిస్తున్నాను.

ఉత్పత్తి మొదలైన విషయాలు అంటే 1. జన్మ 2. స్థితి 3. వృద్ధి 4. విపరిణామము 5. క్షయము 6. నాశనము ఇవి తెలిసినవి పరమేశ్వరి.

పరమేశ్వరి పూజలో 1. కౌళాచారము 2. సమయాచారము అని రెండు ఆచారాలున్నాయి. చతుర్విధపురుషార్థాలలో అర్థకామాలకే ప్రాధాన్యతనిచ్చే వారు కౌళులు. వీరికి బాహ్యపూజయే కాని అంతఃపూజ లేదు. వీరు ప్రత్యక్షంగా శ్రీచక్రాన్ని గాని, పరమేశ్వరి పటాన్నిగాని, విగ్రహాన్ని గాని ఎదురుగా పెట్టుకుని ఆరాధిస్తారు. వీరిది సగుణబ్రహ్మారాధన. ఇక్కడ పరమేశ్వరియే పరబ్రహ్మస్వరూపిణి, మోక్షప్రదాత. చరాచర జగత్తు అంతా ఆమెయొక్క రూపమే. సూర్యచంద్రులే ఆమెయొక్క స్థనాలు అని చెప్పటం జరిగింది. ఇక్కడ శంకర భగవత్పాదులవారు చెబుతున్నారు. “తల్లీ ! శివుడు అనేవాడు ప్రత్యేకంగా లేడు. నీవేశివుడు. శివుడేశక్తి ఉన్నది ఒక్కటే అదే పరమేశ్వరి అంతకన్నా ఏదీలేదు” అంటున్నారు. దేవీభాగవతంలో మణిద్వీపాన్ని వర్ణిస్తూ

**చింతామణి గృహేరాజన్ । శక్తి తత్త్వాత్మకైః పరైః**
**సోపానై దశభిర్యుక్తో! మంచకోప్యద్వి రాజితే ॥**

**బ్రహ్మ విష్ణుశ్చ రుద్రశ్చ । ఈశ్వరశ్చ సదాశివః**

**ఏతే పంచఖురా ప్రోక్తాః ఫలకస్తు సదాశివః ॥**

వైశంపాయనుడు చెబుతున్నాడు. రాజా ! చింతామణి గృహంలో శక్తి తత్త్వాత్మకమైన పదిమెట్ల వరుసతో దివ్యకాంతులతో ప్రకాశించే ఆసనమున్నది. బ్రహ్మ, విష్ణువు, రుద్రుడు, ఈశ్వరుడు దానికి కాళ్ళు (కోళ్ళు) కాగా సదాశివుడు దానిపై పలకగా ఉంటాడు.

**తస్యోపరి మహాదేవో భువనేశో విరాజితే ।**

**యా దేవీ నిజలీలార్థం ద్విదాభూతాబభూవహ ॥**

దానిమీద త్రిభువనేశ్వరుడు, మహాదేవుడు అయిన కామేశ్వరుడుంటాడు. ఆ భువనేశ్వరియే ఈ లోకాలను సృష్టించాలనే కోరికతో రెండు రూపాలు ధరించింది. అని చెప్పబడింది.

కాబట్టి ఉన్నది ఒక్కటే అదేపరమేశ్వరి రూపము కాని అది సృష్టి చేయటం కోసం శివశక్తులుగా మారుతుంది. అందుచేతనే శివశక్తులు ఒకటే, వారికి సమానత్వమున్నది అంటున్నారు భగవత్పాదులవారు.

కౌళాగవమాలుగా పిలువబడే 64 తంత్రాలు వీరికి ప్రమాణాలు. ఈతంత్రాలన్నింటినీ 31వ శ్లోకంలో వివరించటం జరిగింది. కౌళాచారులు షట్చక్రాలలోని ఆధారచక్రాన్ని పూజిస్తారు. కుః అంటే పృథివీతత్త్వము. అది షట్చక్రాలలోని ఏ చక్రమందుంటుందో దాన్ని కులము అంటారు. పృథివీతత్త్వము ఆధారచక్రంలో ఉంటుంది. శ్రీచక్రానికి బాహ్యపూజ చేసేవారు కేవలం కామ్యసిద్ధి కోసమే చేస్తారు. అందుకే వీరు పృథివీ తత్త్వాత్మికమైన ఆధారచక్రాన్ని పూజిస్తారు. కాబట్టి వీరి పూజను కౌళము అని, వీరి ఆచారాన్ని కౌళాచారము అని అంటారు. వీరు శ్రీచక్రాన్ని భూర్జరీపత్రము, పట్టువస్త్రము, వెండి, బంగారము లేక రాగిరేకులమీద వ్రాసి ఆరాధిస్తారు.

ఆధారచక్రమే త్రికోణము. దానిలో బిందువున్నది అని ప్రసిద్ధి. కౌళమతం ప్రకారము త్రికోణమే బిందుస్థానం ఆ బిందువే త్రికోణమునందు ఆరాధింపతగినది. అందుకే కౌళులు త్రికోణాన్ని పూజిస్తారు. కౌళుల్ని రెండు రకాలుగా చెబుతారు. 1.

పూర్వకౌళులు 2. ఉత్తరకౌళులు. ఈ శ్లోకంలో పూర్వకౌళులను వివరిస్తున్నారు భగవత్పాదులవారు. ఇందాక చెప్పినట్లుగా శ్రీచక్రాన్ని లేదా దేవీ విగ్రహాన్ని ఎదురుగా ఉంచి ఆరాధించేవారు పూర్వకౌళులు. వీరికి శివుడు అనేవాడు ప్రత్యేకంగా లేడు. వీరు చేసేది బాహ్యపూజ. వీరికి ఆధారచక్రమే పూజనీయము. అందులో ఉండే కుండలినీశక్తియే కౌళిని. త్రికోణపూజలో కౌళినియే ఉపాస్య. ఆధారచక్రంలో కుండలినీశక్తి సర్పాకారం ధరించి తోకను నోటితో కరిచి పట్టుకున్నట్లుగా ఉంటుంది. ఈ కుండలినీశక్తి సదా నిద్రావస్థలో ఉంటుంది. నిద్రావస్థలో ఉన్నప్పటికీ కుండలినీ శక్తి పూజింపదగినదే. అందుకే ఈ పూజను 'తామిశ్రమము' అంటారు. ఆధార స్వాధిష్ఠానాలు అంధకార బంధురాలు. అంటే లౌకిక సంబంధమైనవి. వాటిమీద కౌళులకు మాత్రమే అధికారమున్నది. కుండలిని ప్రబోధం ఎప్పుడు జరుగుతుందో, ఆ క్షణంలోనే కౌళులకు ముక్తి కలుగుతుంది. అందుకే వీరిని క్షణముక్తులు అంటారు. కౌళులకు త్రికోణంలో భైరవీభైరవులు పూజనీయులు.

**జపాకుసుమసంకాసౌ మధుఘూర్ణితలోచనౌ**

**జగతః పితరౌవందే భైరవీ భైరవాత్మకౌ ॥**

కౌళులు పరమేశ్వరుణ్ణి నవాత్మకుడు లేదా నవవ్యూహాత్మకుడు అంటారు. పరమేశ్వరుడు నవవ్యూహాత్మకుడు. అందుచేతనే ఆనందభైరవుడైన మహాభైరవుడికి నవాత్మకుడు, నవవ్యూహాత్మకుడు అని పేరు. నవవ్యూహాలు ఏవంటే

**కాల వ్యూహః కులవ్యూహో నామవ్యూహ తథైవచ**

**జ్ఞానవ్యూహస్తథా చిత్తవ్యూహస్స్యా స్తదనంతరమ్ ॥**

**నాదవ్యూహ స్తథా బిందువ్యూహస్స్యా స్తదనంతరమ్**

**కలావ్యూహ స్తథా జీవవ్యూహస్స్యా దితి తేనవ ॥**

1. కాలవ్యూహము
2. కులవ్యూహము
3. నామవ్యూహము
4. జ్ఞానవ్యూహము
5. చిత్తవ్యూహము
6. నాదవ్యూహము
7. బిందువ్యూహము
8. కళావ్యూహము
9. జీవవ్యూహము

**1. కాలవ్యూహము :** నిమిషము మొదలు కల్పాంతము వరకు ఉన్న కాలసముదాయము. సూర్యచంద్రులు పగలు రాత్రి అనే తేడా కల్పిస్తున్నారు కాబట్టి వారు కూడా కాలవ్యూహమునందు అంతర్భావము పొందినవారే.

**2. కులవ్యూహము :** ఎరుపు, తెలుపు, నలుపు, పసుపు మొదలైన రంగులను తెలిపేది

**3. నామవ్యూహము :** స్థావర జంగమమైన ఈ జగత్తులో ప్రాణికోటి పేర్లను తెలిపేది.

**4. జ్ఞానవ్యూహము :** ఇది విజ్ఞానవిషయము. ఇంద్రియాలు. అంతఃకరణల ద్వారా బయట ఉన్న విషయాలను తెలుసుకునే జ్ఞానము. దీన్ని భాగవ్యూహము, భోగవ్యూహము అని కూడా అంటారు. ఇది మళ్ళీ రెండు రకాలుగా ఉంటుంది. 1) సభాగము 2. విభాగము.

సభాగము అంటే వికల్పము. విభాగము అంటే నిర్వికల్పము.

**5. చిత్తవ్యూహము :** ఇది అహంకారపంచకముతో కూడినది. అహంకార పంచకము అంటే మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము, మహతత్త్వము.

**6. నాదవ్యూహము :** రాగము, ఇచ్ఛ, కృతి, ప్రయత్నము, మాయ శుద్ధవిద్య, మహేశ్వరుడు, సదాశివుడు, పరా, పశ్యంతి, మధ్యమ, వైఖరిల గురించి చెప్పేది.

పరా, పశ్యంతీ, మధ్యమా, వైఖరీ అనేవి వాక్స్వరూపాలు. వాక్కు అనేది పరమేశ్వరి రూపం. ఈ వాక్కు నాలుగు విధాలుగా ఉన్నది. అవే పరాపశ్యంతీ మధ్యమావైఖరి.

పరాస్థానం వాక్కుకు ప్రథమస్థానం. అక్కడ ఆలోచన పుడుతుంది. తరువాత పశ్యంతీ స్థానం రెండవది. ఏదైనా విషయం చెప్పాలి అంటే ముందుగా ఆలోచన రావాలి. అదే పరావాక్కు. ఆ తరువాత వాక్కు ఆధారచక్రం నుండి బయలుదేరి నెమ్మదిగా స్వాధిష్ఠాన మణిపూరాలు దాటి, అనాహతం చేరి, అక్కడ నుండి కంఠస్థానమైన విశుద్ధిచక్రంచేరి, ముఖంద్వారా స్పష్టమైన వైఖరీ వాక్కుగా, నామాత్మకమైనదిగా బయటకు వచ్చి శబ్దతరంగాలుగా చెవి రంధ్రాన్ని చేరుతుంది. వీటిలో

పరావాక్కు – ప్రత్యక్చితీ రూపం గలది. అంటే అవ్యక్తమైనది.

పశ్యంతీవాక్కు – పరదేవతా అనబడుతుంది. ఇది పూర్తి అస్పష్టమైనది. అప్పుడే పుట్టిన పిల్లవాడి ఏడుపులా ఉంటుంది.

మధ్యమావాక్కు – పూర్తిగా అస్పష్టం కాదు. అలాఅని స్పష్టమూ కాదు. మాటలు వచ్చీరాని పిల్లలు మాట్లాడినట్లుంటుంది. ఇది పూర్తిగా హల్లులతో కూడినది.

వైఖరీ వాక్కు – ఇది స్పష్టమైనది.

ఈ వాక్స్వరూపాలను లలితాసహస్రంలోని 366 నుంచి 374 వరకు గల నామాలలో వివరించటం జరిగింది. "కామకలావిద్య"లో పరావాక్కు మహేశ్వరి అయి ఉన్నది. పశ్యంతి అనగా పరయే స్పష్టమై తోచేది. ఈ వాక్కు త్రిమాతృకయై చక్రరూపము పొంది ఉన్నది. త్రిమాతృక అనగా త్రిఖండమైన మాతృక. అదే పంచదశి మహామంత్రము. త్రిఖండాత్మకమైన చక్రంతో, త్రిమాతృకఅయిన మంత్రానికి ఐక్యత చెప్పబడింది. ఇది **శ్రీవిద్యా రహస్యము.**

శ్రీచక్రము సోమసూర్య అనలాత్మకము. పంచదశీమహామంత్రము అగ్నిఖండము, సూర్యఖండము, చంద్రఖండము అనిమూడు ఖండాలుగా ఉన్నది. అసలు శ్రీచక్రము పంచదశీమహామంత్రంనుంచే పుట్టింది. కాబట్టి చక్రము, మంత్రము ఈ రెండూ ఒక్కటే. ఈ విషయాన్ని గతంలో చెప్పుకున్నాం.

పరావాక్కు పూర్తిగా అవ్యక్తము. పశ్యంతీ వాక్కు వ్యక్తమైనప్పటికీ ఏమీ తెలియదు. మధ్యమ వాక్కు అనాహతంలో ఉంటుంది. ఇది పూర్తిగా హల్లులతో కూడి ఉంటుంది. ఇది రెండు రకాలు 1. స్థూలమధ్యమ 2. సూక్ష్మమధ్యమ. ఆధారచక్రం నుండి అనాహతం వరకు ఉండే వాక్కును స్థూలమధ్యమ అని, అనాహతం నుండి విశుద్ధి వరకు ఉండే దానిని సూక్ష్మమధ్యమ అని అంటారు. స్థూలమధ్యమలో వాక్కు కొద్దిగా తెలుస్తుంది. అంటే 20% తెలుస్తుంది అనుకుందాం. సూక్ష్మ మధ్యమలో 60% వాక్కు తెలుస్తుంది. ఇక్కడ వాక్కు రెండు విధాలు వామాది వ్యష్టిరూపము, వామాది సమిష్టిరూపము. వామాదులు అంటే వామ, జ్యేష్ఠ, రౌద్రి, అంబిక ఇవి నాలుగు శక్తులు. వీరు శ్రీచక్రంలో అధోముఖంగా ఉన్న చతుర్యోనిస్వరూపులై ఉన్నారు.

ఇచ్ఛాజ్ఞానక్రియాశాంతా పరాశక్తులు శ్రీచక్రంలో ఊర్ధ్వముఖయోని స్వరూపులై ఉన్నారు. ఈ తొమ్మిదిశక్తులు నవవ్యూహాత్మికలు. వీరివల్లనే భగవతికి నవాత్మకత్వము వచ్చింది. ఈ విషయం అంతా **కామకలావిద్య**లో చెప్పబడింది.

పరాశక్తి సత్త్వరజస్తమో గుణసామ్యరూపము గలది. పశ్యంతిలో ఒకగుణము తక్కువ ఉంటుంది. మధ్యమ వామాదిశక్తుల వ్యష్టిరూపము. వామాదిశక్తులు బైందవ స్థానానికి రెండు ప్రక్కల ఉన్నారు. అందుచేతనే వీరు వ్యూహాశబ్దముతోను, నవాత్మశబ్దముతోను చెప్పబడుతున్నారు. వీరు సమిష్టిగా పరాశక్తిలో అంతర్భూతమవుతున్నారు. స్థూల మధ్యమ నవనాదమయి. నవనాదాలు అంటే అకచటతపయశక్ష అనబడే తొమ్మిది నాదములు. ఈ తొమ్మిది వర్గులు భిన్నస్వరూపము గలవై, భిన్నమైన ధ్వనితో ఉంటాయి. ఈ తొమ్మిది వర్గులు కలిపి 'భూతలిపి' అనబడుతుంది. భూతలిపి అంటే మిధ్య, సత్యము కానిది అని అర్థం. ఈ మిధ్యారూపలిపికి అఖ్యాపకత్వము అనగా ప్రత్యేకమైన ధ్వని, ఉచ్ఛారణ ఉన్నది అనటం హాస్యాస్పదము. అద్దంలో ప్రతిబింబించిన బింబము లాంటిది.

7. బిందువ్యూహము : ఆధారాదిషట్చక్రాల సమూహము.

8. కాలవ్యూహము : యాభైకళలై, వర్గస్వరూపాలయిన అక్షరాలను గురించి తెలిపేది.

9. జీవవ్యూహము : భోక్తలకు జీవుల సమూహము.

**నవవ్యూహాత్మకో దేవః పరానంద పరాత్మకః**
**నవాత్మా భైరవోదేవో భుక్తి ముక్తి ప్రదాయకః ॥**
**పరానంద పరాశక్తిః చిద్రూపా ఉ ఉ నందభైరవీ**
**తయోర్యదా సామరస్యం జగదుత్పద్యతే తదా ॥**

పరానందుడు, పరాత్మకుడు అనే భైరవుడు నవవ్యూహాత్మకుడు అతడే భుక్తి ముక్తి ప్రదాత పరానందమైన పరాశక్తి చిద్రూప అయిన ఆనందభైరవి అవుతుంది. ఈ భైరవీభైరవులకు ఎప్పుడు సామరస్యము కలుగుతుందో, అప్పుడు జగదుత్పత్తి కలుగుతుంది.

**మనస్త్వం వ్యోమ త్వం మరుదసి మరుత్సారథి రసి**
**త్వ మాప స్త్వం భూమి స్త్వయి పరిణతాయాం నహి పరం।**
**త్వమేవ స్వాత్మానం పరిణమయితుం విశ్వవపుషా**
**చిదానన్దాకారం శివయువతి భావేన బిభృషే ॥ (హరమహిషి) 35**

శివునిపట్టపురాణి అయిన ఓ పరమేశ్వరీ ! ఆజ్ఞాచక్రమందున్న మనస్తత్త్వము నీవే. విశుద్ధిచక్రంలో ఉన్న ఆకాశతత్త్వము నీవే. అనాహతంలోని వాయుతత్వం నీవే. స్వాధిష్ఠానములోని అగ్నితత్త్వము, మణిపూరంలోని జలతత్త్వము ఆధారచక్రంలోని పృథివీతత్త్వము కూడా నీవే. నీకన్న వేరైనది ఏదీలేదు. నీ స్వరూపాన్ని ఈ జగత్తుగా పరణమింప చెయ్యటానికి నీవే శివతత్త్వమైన బ్రహ్మస్వరూపమగు ఆనందభైరవునిగా రూపుధరించావు.

ఈ శ్లోకంలో ఉత్తరకౌళుల గురించి వివరిస్తున్నారు. కౌళాచారంలో పరమేశ్వరుడు అనే వాడు లేడు. ఉన్నది ఒక్కటే అదే పరమేశ్వరీ. అధర్వణవేదంలో **'దేవీ ఉపనిషత్తు'** చెప్పబడింది. అందులో దేవతలందరూ పరమేశ్వరిని సమీపించి ఓ తల్లీ ! నీవెవరవు ? అని అడుగుతారు. దానికి ఆ దేవి సమాధానం చెబుతున్నది." నేను బ్రహ్మస్వరూపిణిని. నావల్ల ప్రకృతి పురుషాత్మకమైన జగత్తు ఆవిర్భవించింది. ఈ జగత్తులోని శూన్యము నేనే. అశూన్యము నేనే. ఆనందము అనానందము నేనే. విజ్ఞానము అవిజ్ఞానము నేనే. తెలుసుకోదగిన బ్రహ్మము, అబ్రహ్మము నేనే.

పంచభూతాలు, అపంచభూతాలు నేనే. అఖిలజగత్తు నేనే అని చెబుతుంది. అలాగే ఋగ్వేదంలో **"బహ్వృచోపనిషత్తు"** ఉన్నది. అందులో "ఈ సృష్టికి ముందు దేవి ఒక్కతే ఉండేది. ఆమెయే ఈ బ్రహ్మాండాన్ని సృష్టించింది. ఆమెయే కామకళ, శృంగారకళ. ఆమెనుంచే బ్రహ్మ పుట్టాడు. ఆమె నుంచే విష్ణువు, రుద్రుడు, సకల మరుద్గణాలు, గంధర్వులు, అప్సరసలు, కిన్నెరలు, కింపురుషులు, సిద్ధులు, సాధ్యులు పుట్టారు. అండజాలు, స్వేదజాలు, ఉద్భిజాలు, స్థావరాలు, జంగమాలు అన్నీ ఆమె నుంచే పుట్టినాయి. ఆవిడే పరాశక్తి. మహాత్రిపురసుందరి" అని చెప్పబడింది. ఈ రకంగా చరాచర జగత్తంతా ఆ పరమేశ్వరి నుంచే ఆవిర్భవించింది. అందుకే భగవత్పాదులవారు అంటున్నారు ఓ తల్లీ ! పంచభూతాల తత్త్వము నీవే. ఇక సృష్టి

చెయ్యాలి అనుకున్నప్పుడు అంతవరకు ఒకటిగా ఉన్న ఆ శక్తి శివశక్తులుగా, ప్రకృతి పురుషులుగా మారిపోయింది. అదే మాట ఇక్కడ చెబుతున్నారు సృష్టి చెయ్యటానికి బ్రహ్మరూపమైన ఆనందభైరవుని స్వరూపాన్ని ధరిస్తున్నావు. అంటే ఆనందభైరవుడు అనేవాడు వేరే లేడు. ఈ భైరవియే భైరవరూపం ధరిస్తున్నది. **చతుశ్శతిలో**

**శృణుదేవి మహాజ్ఞానం సర్వజ్ఞానోత్తమం ప్రియే**
**యేన విజ్ఞానమాత్రేణ భవాబ్ధౌ న నిమజ్జతి ॥**
**త్రిపురా మరమా శక్తి రాద్యా జాతా మహేశ్వరి**
**స్థూల సూక్ష్మవిభాగేన త్రైలోక్యోత్పత్తి మాతృకా ॥**
**కబలీకృత నిశ్శేష తత్త్వ గ్రామ స్వరూపిణీ**
**యస్యాం పరిణతాయాం తు నకించిత్పరమిష్యతే ॥**

దేవీ ! అన్నింటిలోకి ఉత్తమమైన మహాజ్ఞానాన్ని నీకు చెబుతున్నాను వినవలసినది. దీన్ని తెలుసుకున్నంత మాత్రంచేతనే మానవులు సంసారసాగరంలో మునిగిపోకుండా ఉంటారు. మహేశ్వరి, త్రిపుర, పరమాశక్తి ఆమెయే. ఆదిశక్తి స్థూలసూక్ష్మ విభాగాలచేత అంటే ప్రకృతిపురుషులుగా, శివశక్తులుగా రూపాలు ధరించటంచేత ముల్లోకాల సృష్టికి కారణమవుతున్నది. ఆవిడే జగన్మాత. సర్వజగత్తును నిశ్శేషముగా, ఏమీ మిగల్చకుండా తనలో లీనంచేసుకుంటుంది. అనగా చరాచర జగత్తును ఆవిడే సృష్టి చేస్తున్నది. లయముకూడా ఆవిడే చేస్తున్నది. ఈ సృష్టి అంతా ఆమె నుండి వచ్చి, మళ్ళీ ఆమెలోనే లీనమై పోతుంది.

ఉత్తర కౌళులకు ప్రధానమైనది భగవతి. ఆమె తప్ప వేరొకటి లేదు. శివుడనేవాడు కూడా ఆమెకన్న వేరుగా లేడు. ఆమెకు ఆధారకుండలి అని కూడా పేరు. ఆధారచక్రాన్ని 41వ శ్లోకంలో చూద్దాం. పైన శ్లోకంలో చూడండి **"పరిణమయితుం విశ్వవపుషా"** విశ్వవపుషా – జగద్రూపంతో, పరిణమయితుం – పరిణమించటానికి నీవు ఆనంద భైరవుని రూపం ధరిస్తున్నావు అంటున్నారు భగవత్పాదులవారు. ఉన్నది పరమేశ్వరి ఒకతే. అయితే ఈ జగత్తును నిర్మించాలి కాబట్టి

**యా దేవీ నిజలీలార్థం ద్విధాభూతా బభూవహ**

ప్రళయం జరిగినప్పుడు కర్మక్షయం కాని జీవులు, తమ కర్మను తమతో మూట కట్టుకుని ఆ దేవిలో కలిసిపోయినాయి. వాటియొక్క కర్మను క్షయం చెయ్యాలనే కోరికతో పరమేశ్వరి సృష్టి చెయ్యాలని సంకల్పించింది. అదే ఆమె లీలావినోదం.

పిండాండం బ్రహ్మాండాల రూపం ఒకటే. అదే ఆ పరమేశ్వరి. జగత్తంతా ఆవిడ స్వరూపమే. కాబట్టి ప్రత్యేకంగా సృష్టి అనేది లేదు. అంతా మిధ్య అంటున్నారు శంకరులవారు

**తవాజ్ఞాచక్రస్థం తపన శశికోటిద్యుతిధరం**
**పరం శమ్భుం వన్దే పరిమిళితపార్శ్వం పరచితా ।**
**యమారాధ్య న్భక్త్యా రవిశశిశుచీనా మవిషయే**
**నిరాలోకేఽ లోకే నివసతిహి భాలోకభువనే ॥** **36**

ఓ భగవతీ ! నీయొక్క భ్రూమధ్యమున ప్రకాశిస్తున్న ఆజ్ఞాచక్రమందు కోట్లకొలది సూర్యచంద్రుల కాంతిని ధరించినవాడు, 'సరయ' అనే పేరుగల చిచ్ఛక్తిని తన ఉభయపార్శ్వములందు గలవాడు అయినపరమశివునికి నమస్కరిస్తున్నాను. సాధకుడు నీ ఆజ్ఞాచక్రంలో గల శివుని ప్రసన్నునిగా చేసుకుని బాహ్యదృష్టికి గోచరముగాని చంద్రలోకమందు నివశిస్తున్నాడు.

భ్రూమధ్యభాగంలో రెండు దళాలు కలిగి ఉన్న స్థానాన్ని ఆజ్ఞాచక్రము అంటారు. ఈ చక్రానికి అధిదేవత సదాశివుడు. ఇది గంగ యమున సరస్వతిల సంగమస్థానము. ఇడ పింగళ సుషుమ్నల సంగమస్థానము. కూటత్రయము, మండలత్రయము, ఖండత్రయముల సమాప్తిస్థానము.

కూటత్రయము – వాగ్భవకూటమి, కామరాజకూటమి, శక్తికూటమి

ఖండత్రయము – చంద్రఖండము, సూర్యఖండము, అగ్నిఖండము

మండలత్రయము – చంద్రమండలము, సూర్యమండలము, అగ్నిమండలము

ఇది త్రిపురానివాసస్థానము. అన్ని ఇంద్రియాలకు ఇక్కడి నుంచే ఆజ్ఞలు జారీచేయబడతాయి. కాబట్టి దీన్ని ఆజ్ఞాచక్రము అంటారు. ఇది ఆత్మస్థానము.

ఈ చక్రంలో రెండు దళాలుంటాయి. ఒక్కొక్క దళంలోనూ నాలుగు నాలుగు చొప్పున ఎనిమిది ఆ వృత్తులుగా కిరణాలుంటాయి. అంటే ఒక్కొక్క దళానికి ముప్పైరెండు కిరణాలు. రెండు దళాలకు కలిపి అరవై నాలుగు కిరణాలుంటాయి. ఈ కిరణములకుపైన దేవిపదయుగళమున్నది. అదే ఈ కిరణములకు ఆధారము. ఈచక్రంలో సిద్ధమాతా అనే దేవత ఉంటుంది. ఆమె తెల్లని రంగులో ఆరుముఖాలు కలిగి ఉంటుంది. ఎముకలయందుండే మజ్జయందు ఉంటుంది. అక్కడ ఉన్న రెండు దళాలలోను హంసవతి క్షమావతి అనే రెండు శక్తులు ఆమెను పరివేష్టించి ఉంటాయి. ఈ సిద్ధమాతకు హరిద్రాన్నమునందు ప్రీతి ఎక్కువ. ఈమె మంత్రానికి శక్తి బీజము కీలకము అన్నీ హకార సంకేతంగా ఉంటాయి. కాబట్టి ఈమెను హాకిని అంటారు. ఈ విషయాలన్నీ లలితా సహస్రంలోని 522 నుంచి 528వ నామం వరకు అంటే **ఆజ్ఞాచక్రాబ్జనిలయా – హాకినీ రూపధారిణీ** వరకు ఏడు నామాలలో వివరించారు.

యోగినీన్యాసంలో

**భ్రూమధ్యే బిందుపద్మే దళయుగకలితే శుక్లవర్ణాం కరాబ్జైః**
**బిభ్రాణాం జ్ఞానముద్రాం డమరుక మక్షమాలాం కపాలం**
**షడ్వక్త్రాధారమధ్యాం త్రినయనలసితాం హంసవత్యాదియుక్తాం**
**హరిద్రాన్నైకరసికాం సకలశుభకరీం హాకినీం భావయామః ॥**

కనుబొమలమధ్య రెండుదళములు గల పద్మమున్నది. ఆ పద్మమునందు హాకినీదేవత ఉంటుంది. ఆమె చేతులలో జ్ఞానముద్ర, డమరుకము, అక్షమాల, కపాలము ధరించి ఉంటుంది. హాకినీదేవతకు మూడుకనులు, ఆరుతలలు ఉంటాయి. ఆమెకు హరిద్రాన్నమునందు ప్రీతి ఎక్కువ.

**ఆజ్ఞాచక్రాధిష్ఠానదేవతా హాకినీయుక్త సదాశివ**
**స్వరూపిణ్యంబా శ్రీపాదుకాం పూజయామి తర్పయామి నమః**

లక్ష్మీధరుడు తన **కర్ణావతంసస్తుతిలో**

**ఆజ్ఞాత్మక ద్విదళ పద్మగతే తదానీం**
**విద్యున్నిభే రవిశశి ప్రయుతోత్కటాభే**

**గండస్థలప్రతిఫల త్కరదీప జ్వాల**

**కర్ణావతంసకలికే కమలాయతాక్షి ! ॥**

ఆజ్ఞా చక్రమనబడే రెండుదళములు గల పద్మమందున్న ఓ దేవీ ! మెరుపుతీగవలె కోట్లకొలది సూర్యచంద్రులకాంతులతో ప్రకాశిస్తున్నావు. **షట్చక్రనిరూపణంలో** "ఆజ్ఞాచక్రము అనేది గురువుయొక్క ఆజ్ఞలు లభించే స్థానము. ఇక్కడ నుంచే శరీరం లోని వివిధభాగాలకు ఆజ్ఞలుజారీచేయబడతాయి. ఇక్కడ ఓంకారాన్ని ధ్యానించేవాడు జ్ఞానిఅవుతాడు. సర్వజ్ఞుడై సర్వదర్శి అయిన మునీంద్రుడవుతాడు. ఈచక్రముకర్ణికలో త్రికోణమున్నది. ఈ త్రికోణంలో ప్రణవానికి ఆధారమైన అకారఉకారాలుంటాయి. దానిమీద బిందురూపంలో మకారముంటుంది. **సంతానోపనిషత్తులో**

**షష్ఠేమాసి నాసాక్షిశ్రోత్రాణి భవంతి**

ఆరవనెలలో గర్భస్థశిశువుకు ముక్కు, చెవులు, కనులు మొదలైన అవయవసౌష్టవం ఏర్పడుతుంది. ఈ నెలలోనే మనస్సుకూడా ఏర్పడుతుంది. అదే ఆరవ అవయవము. అందుచేతనే సిద్ధమాతకు ఆరుతలలుంటాయి. ఈ సమయంలో గర్భిణీస్త్రీకి హరిద్రాన్నము మంచిఆహారము. అయితే శంకరులవారు ఇక్కడ ఆజ్ఞాచక్రం గురించి చెప్పటంలేదు. "తవాజ్ఞాచక్రస్థమ్" నీ ఆజ్ఞాచక్రస్తుని అని చెబుతూ సాధకుని భ్రూమధ్యభాగంలోఉన్న శ్రీచక్రంలోని శివచక్ర చతుష్టయాన్ని చెబుతున్నారు. అంతేకాని ఆజ్ఞాచక్రంలోని రెండు దళాల గురించి కాదు. శ్రీచక్రంలో తొమ్మిది చక్రాలున్నాయి. అందులో నాలుగుశివచక్రాలు, ఐదుశక్తిచక్రాలు.

**చతుర్భి శ్రీకంఠై శివయువతిభి పంచభిరపి**

ఇక్కడ శివచక్రాలు అంటే శ్రీచక్రంలోని శివచక్రాలలోఉన్నశివుడు. సాధకుడు సదాశివుని ప్రసన్నం చేసుకుని బాహ్యదృష్టికి గోచరముకాని చంద్రలోకంలో నివశిస్తున్నాడు. ఆజ్ఞాచక్రంలో ఉండేది చంద్రమండలం. సహస్రారం చంద్రలోకం అక్కడ ఉండే చంద్రుడు వృద్ధిక్షయాలు లేనివాడు. షోడశకళాప్రపూర్ణుడు. అటువంటి చంద్రలోకంలో నివశిస్తున్నాడు అని అర్థం. ఆజ్ఞాచక్రంలో ఉన్న శివుని ప్రసన్నం చేసుకుని అంటే ఆధారచక్రంలో నిద్రావస్థలో ఉన్నకుండలినిని నిద్రలేపి ఆజ్ఞాచక్రం దాటి సహస్రారం చేరినవాడు నీ సాయుజ్యంపొందుతాడు.

ఆజ్ఞా చక్రంలో శివాశివులకు పంచవిధసామ్యము

1. అధిష్ఠానము ఆజ్ఞాచక్రము - అధిష్ఠానసామ్యము

2. ముక్తిప్రదిత్వము - అనుష్ఠానసామ్యము

3. పర అనే చిచ్ఛక్తితో కూడిన సదాశివుడు అనటంచేత - అవస్థాసామ్యము

4. కోట్లకొలది సూర్యచంద్రుల కాంతులతో ప్రకాశిస్తున్నారు అనేది - రూపసామ్యము.

5. పరుడు అనే పేరు గల శివుడు, పర అనే పేరు గల దేవి (పరంశంభుం) అనటం - నామసామ్యము.

**విశుద్ధౌ తే శుద్ధస్ఫటికవిశదం వ్యోమజనకం**
**శివం సేవే దేవీమపి శివసమానవ్యవసితామ్**
**యయోః కాన్త్యా యాన్త్యా శ్శశికిరణసారూప్యసరణే**
**ర్విధూతా న్తర్ధ్వాన్తా విలసతి చకోరీవ జగతీ ॥ 37**

ఓ తల్లీ ! విశుద్ధిచక్రంలో దోషరహితుడు స్ఫటికమువలె నిర్మలుడు అయిన శివుని, అతనితో సమానమైన నిన్ను ధ్యానిస్తున్నాను. శివాశివులైన మీ నుండి వచ్చే కాంతులవల్ల సాధకుని యొక్క అజ్ఞానము నశించిపోతుంది. చంద్రకిరణములవల్ల చకోరపక్షులు సంతుష్టిచెందినట్లుగా, తన అజ్ఞానము తొలగిపోగా సాధకుడు సంతృప్తి చెందుతాడు.

కంఠస్థానానికి కొంచెం దిగువగా పదహారుదళాలు గల పద్మమున్నది. దాన్ని విశుద్ధిచక్రము అంటారు. ఇది తెల్లనిరంగులో ఉంటుంది. దీని పదహారుదళాలలోను అ నుంచి అః వరకు అచ్చులు ఉంటాయి. పరాస్థానంలో అవ్యక్తంగా ఉండే వాక్కు ఇక్కడకు వచ్చి, అచ్చులతో కలిసి వైఖరీవాక్కువగా మార్పుచెందుతుంది. ఈ పదహారుదళాలయందు పదహారుశక్తులు పరివేష్టించి ఉండగా, చక్రాధిష్ఠానదేవత అయిన వజ్రేశ్వరి ఈ పద్మంయొక్కకర్ణికలో ఉంటుంది. దీని కర్ణికయందు మహేశ్వరుడు ఉంటాడు.

విశుద్ధి చక్రాన్ని గురించి గౌడపాదులవారు తమ 'సుభగోదయస్తుతి'లో

**తదేతత్తే సంవిత్కమలమితి సంజ్ఞాంతరముమే**
**భవే సంవిత్పూజా భవతి కమలే ఉస్మిన్ సమయినామ్ ।**
**విశుద్ధాఖ్యే చక్రే వియదుదితమాహుః సమయినః**
**సదాపూర్వోదేవః శివ ఇతి హిమానీ సమతనుః ॥**

విశుద్ధిచక్రంలో శివుడు ఆకాశమువలె తెల్లనిశరీరము కలవాడు. ఆకాశ తత్త్వాత్మకుడు. స్పటికములాగా స్వచ్ఛమైనవాడు. అతనితో సమానమైన భగవతి ఇక్కడ ఉంటారు. అనగా ఇక్కడ శివాశివులు శుద్ధస్పటికాలలాగా తెల్లగా, స్వచ్ఛంగా ప్రకాశిస్తూ, ప్రాణాయామంచెయ్యటంవల్ల కాంతులు కోల్పోయిన చంద్రకళలకు మళ్ళీ కాంతులు ప్రసరింప చేస్తుంటారు.

ఇక్కడ ఉండే చక్రాధిష్ఠాన దేవత ఆరక్తవర్ణములో (ఎరుపుతెలుపు కలిసిన పాటలవర్ణములో) మూడు కనులు, నాలుగు చేతులు, ఒకే ముఖముతో ఉంటుంది. ఈమె పాయసాన్న ప్రియ. అమృతా మొదలైన శక్తులతో పరివేష్టింపబడి ఉంటుంది. ఈమె పేరు డాకిని. ఈ విషయమంతా లలితా సహస్రంలోని 476–485 **విశుద్ధి చక్రనిలయా – డాకినీశ్వరి** వరకు పది నామాలలో వివరించబడింది.

యోగినీన్యాసంలో విశుద్ధి చక్రాన్ని గురించి వివరిస్తూ

**గ్రీవాకూపే విశుద్ధౌ నృపదళకమలే శ్వేతరక్తాం త్రినేత్రాం**
**హస్తైః ఖట్వాంగ ఖడ్గాం త్రిశిఖమపి మహాచర్మ సంధారయంతీం**
**వక్త్రేణైకేన యుక్తాం పశుజన భయదాం పాయసాన్నైకసక్తాం**
**త్వక్స్థాం వందే ఉమృతాద్యైః పరివృతవపుషం డాకినీం వీరవంద్యాం ॥**

కంఠస్థానంలో విశుద్ధిచక్రము 16 దళాలు కలిగి ఉన్నది. దీనియందు ఎరుపురంగుతో మూడుకనులుగలిగి ఖట్వాంగము ఖడ్గము త్రిశూలము చర్మము తన నాలుగు చేతులయందు ధరించి ఒకే ముఖముతో పశుప్రాయులకు భయము కలిగించు డాకినీదేవి అమృత మొదలైన 16 శక్తులచే పరివృతఅయి ఉంటుంది. ఈమెకు పాయసాన్నమునందు మక్కువ ఎక్కువ.

**విశుద్ధి చక్రాధిష్ఠానదేవతా డాకినీయుక్త మహేశ్వర ।**

**స్వరూపిణ్యంబా శ్రీపాదుకాం పూజయామి తర్పయామి నమః ॥**

**షట్చక్రనిరూపణంలో** "విశుద్ధిచక్రము యొక్క కర్ణికయందు వృత్తరూపంలో ఉన్న వియన్మండలము చంద్రబింబమువలె ప్రకాశిస్తూ ఉంటుంది. దీని బీజము హం. ఇది ఆకాశబీజము ఈ బీజానికి నాలుగుచేతులున్నాయి. ఆ చేతులయందు పాశము అంకుశము అభయ వరద ముద్రలు ఉంటాయి. ఆ బీజములో ఐదుముఖాలు మూడుకనులు, పదిచేతులు గలిగి వ్యాఘ్రచర్మధారియైన మహేశ్వరుడుంటాడు. ఈ చక్రానికి అధిదేవత డాకిని. యోగాభిలాషులకు ఇది మోక్షద్వారము" అని చెప్పబడింది.

**సంతానోపనిషత్తు**లో మాతృగర్భంలో పిండం ఏవిధంగా ఏర్పడుతుంది ? ఏ రకంగా అభివృద్ధి చెందుతుంది ? అనే విషయాలు చెప్పబడ్డాయి.

మాతృగర్భంలో శుక్లరక్తబిందువులు మిశ్రమం కావటంచేత రజోబిందువు ఏర్పడుతుంది. ఈ రెండు బిందువులు కలిసిన తరువాత వారాంతానికి బుద్బుదాకారం (బుడగ) ధరిస్తుంది. పక్షాంతాన పిండముగా ఏర్పడి మాసాంతాన అది గట్టిపడుతుంది.

**ఏకరాత్రే కలలం భవతి సప్తరాత్రోషితం బుద్బుదం భవతి**

**అర్ధమాసాభ్యంతరేణ పిండో భవతి మాసాంతరేణ కఠినోభవతి**

శుక్లరక్తబిందువుల మిశ్రమం కావటంచేత అది పాటలవర్ణంలో ఉంటుంది. దీనికి ఒకే ముఖము ఉంటుంది. ఈ ముఖరంధ్రం ద్వారానే తల్లి భుజించిన ఆహారం పిండానికి అందుతుంది. ఈ గర్భస్థశిశువునే వజ్రేశ్వరి అంటారు.

విశుద్ధిచక్రంలో చెప్పిన దేవత ఈ పిండమే. అందుకే అది పాటలవర్ణంలో ఉంటుంది. ఒకే ముఖం ఉంటుంది. పాయసాన్నప్రియ. గర్భిణిఅయినతల్లికి ఈ నెలలో పాయసాన్నము మంచి ఆహారము.

విశుద్ధిచక్రంలోని పదహారుదళాలలోను చంద్రుని యొక్క పదహారుకళలు ఉన్నాయి. శరీరంలో మేరుదండాన్నాశ్రయించి సుషుమ్నానాడి ఉన్నది. దానికి రెండు వైపులా ఆధారచక్రం నుంచి ముక్కు పైదాకా ఇడ పింగళనాడులు ఉన్నాయి. ఇడా నాడి చంద్రనాడి. పింగళనాడి. సూర్యనాడి. ఈ రెండు నాడులగుండా ఉచ్ఛ్వాస

నిశ్వాసలు జరుగుతుంటాయి. వీటిలో ముందుగా చంద్రకిరణాలు ప్రసరిస్తుంటాయి. అవి అమృతపు జల్లులను కురిపిస్తుంటాయి. అమృతపు జల్లులను ఆహారంగా తీసుకుని కుండలినీశక్తి నిద్రావస్థలో ఉంటుంది. ఆ వెనక వచ్చే సూర్యకిరణాల వేడివల్ల అమృతం ఆవిరి అవుతుంటుంది. సాధకుడు ప్రాణాయామం చేసినప్పుడు ఉచ్ఛ్వాస నిశ్వాసలు బంధింపబడతాయి. అప్పుడు చంద్రకిరణముల ప్రసరణ ఆగిపోతుంది. అమృతపు జల్లులు కురియవు. దీనివల్ల నిద్రావస్థలో ఉన్న కుండలిని నిరాహార అయి మేల్కొని సుషుమ్నగుండా పైకి ప్రయాణిస్తుంది. ఈ రకంగా ఉచ్ఛ్వాస నిశ్వాసలు బంధింపబడటంవల్ల విశుద్ధిచక్రంలోని పదహారుదళాలయందు ఉన్న చంద్రకళలు కాంతిహీనమవుతాయి. అయితే విశుద్ధిచక్రంలో ఉన్న వ్యోమేశ్వరి వ్యోమేశ్వరుల (శివశక్తులు) శరీరముల నుంచి వచ్చే కాంతికిరణాలతో మళ్ళీ ఆ చంద్రకళలు ప్రకాశవంతమవుతాయి. అంటున్నారు భగవత్పాదులవారు.

ఈ చక్రంలో శివాశివులకు పంచవిధ సామ్యము

1. అధిష్ఠానసామ్యము విశుద్ధి చక్రము.

2. ఇద్దరూ ఆకాశతత్త్వములో ఉన్నారు (వ్యోమ జనకం) అనటం – అనుష్ఠాన సామ్యము.

3. చంద్రకిరణములతో సమానమైన కాంతి కలవారు అనటంతో – అవస్థా సామ్యము.

4. శుద్ధస్ఫటికాలవలె ఉన్నారనటం – రూపసామ్యము.

5. శివాశివులు అనటం – నామసామ్యము.

**సమున్మీల త్సంవి త్కమలమకరన్దైకరసికం**
**భజే హంసద్వన్ద్వం కిమపి మహతాం మానసచరమ్ ।**
**యదాలాపా దష్టాదశగుణిత విద్యాపరిణతిః**
**యదాదత్తే దోషా ద్గుణ మఖిల మద్భ్యః పయఇవ ॥ 38**

ఓ తల్లీ ! వికసిస్తున్న జ్ఞానము అనే అనాహతపద్మమందలి మధువును ఆస్వాదించుటయందు ఆసక్తి గలది, యోగీశ్వరుల మనస్సు అనబడే మానస

సరోవరమందు సంచరించేది, ఇటువంటిది అని చెప్పటానికి వీలుకానిది, ఇరవై ఆరవ తత్త్వమైనది అయిన రాజహంసమిథునమును ధ్యానిస్తున్నాను. ఏ హంసలయొక్కపలుకులవలన వేదాలు నాలుగు, వేదాంగాలు ఆరు, మొదలైన పద్దెనిమిది విద్యలు జన్మిస్తున్నాయో, ఏ హంసద్వంద్వము నీటినుండి పాలను వేరు చేసినట్లుగా, దోషము నుండి సద్గుణ సముదాయము గ్రహిస్తున్నదో, ఆ హంస మిథునాన్ని ధ్యానిస్తున్నాను. అంటున్నారు.

సంవిత్కమలము అంటే అనాహతచక్రము. ఉపాసకులు శివశక్తులను హంస మిథునముగా భావించి అనాహతచక్రంలో ధ్యానంచేస్తారు. ఇది సమయమత రహస్యం. అయితే సమయాచరులలో కూడా కొంతమందిమాత్రమే దీన్ని సమర్థిస్తారు. మామూలుగా మాటాడేటప్పుడు మనం చెబుతుంటాం. "హిమాలయ పర్వతాలలో పై భాగాన మానస సరోవరమున్నది. అందులో హంసలు తిరుగాడుతుంటాయి. తామరతూళ్ళు ఆహారంగా తీసుకుంటాయి. వీటికి పాలను, నీళ్ళను వేరు చేయగలశక్తి ఉన్నది." అవి రాజహంసలు. అయితే మానససరోవరము అనేది ఎక్కడో లేదు. యోగీశ్వరులయొక్క మనస్సే మానస సరోవరము. అదే అనాహతపద్మం. హృదయస్థానంలో పన్నెండుదళాలు కలిగి ఉంటుంది. వాయుతత్త్వాత్మకమైనది. దీనిలో మణిపూరానికి ప్రతీకగా పది, విశుద్ధి, ఆజ్ఞా చక్రాలకు ఒక్కొక్కటి చొప్పున మొత్తం పన్నెండుదళాలుంటాయి. ఈ చక్రం బంగారు రంగులో ప్రకాశిస్తూ ఉంటుంది. ఈ పన్నెండుదళాలతోను క నుంచి ఠ వరకు అక్షరాలు శక్తి రూపాలలో ఉంటాయి. పరాస్థానంలో పుట్టిన వాక్కు. ఇక్కడకు వచ్చి మధ్యమగా మారుతుంది. ఈ చక్రానికి అధిదేవత వామదేవి. ఆమె నల్లని వర్ణముతో, రెండు ముఖాలు, తెల్లగా ప్రకాశించేకోరలు కలిగి, చేతులయందు అక్షమాల శూలము కపాలము డమరుకము ధరించి ఉంటుంది. ఈమె రక్తమునందు ప్రీతిగలది. అంటే సప్తధాతువులలోను రుధిరము అనే ధాతువుకు అధిదేవత. స్నిగ్ధాన్నమునందు ప్రీతి గలది, మహావీరేంద్రులచేత సేవించబడేది, రాకిని అనే పేరు గలది. ఈ విషయం అంతా లలితా సహస్రంలోని 486–495 **అనాహతాబ్జ నిలయా – రాకిన్యంబా స్వరూపిణీ** వరకు చెప్పబడ్డాయి. యోగినీన్యాసంలో

**హృత్పద్మే భానుపత్రే ద్వివదనలసితాం దంష్ట్రిణీం శ్యామవర్ణాం**

**అక్షం శూలం కపాలం డమరుక మపి భుజై ర్ధారయంతీం త్రినేత్రాం**

**రక్తస్థాం కాళరాత్రిప్రభృతి పరివృతాం స్నిగ్ధభుక్తైకసక్తాం**

**శ్రీమద్వీరేంద్రవంద్యా మభిమతఫలదాం రాకినీం భావయామః ॥**

హృదయస్థానంలో ఉండే అనాహతపద్మము పన్నెండుదళాలు కలిగి హేమవర్ణంతో ప్రకాశిస్తుంది. ఇది వాయుతత్త్వాత్మకమైనది. దీని కర్ణికలో రాకినీ దేవత రెండు ముఖములు, మూడు నేత్రములు, కోరలు కలిగి నాలుగుచేతులయందు అక్షమాల, శూలము, కపాలము, డమరుకము ధరించి నల్లనిరంగులో ఉంటుంది. ఈమెకు స్నిగ్ధాన్నము నందు మక్కువ ఎక్కువ. క కారము నుంచి ఠ కారము వరకు గల పేర్లతో పన్నెండుశక్తులు ఆ దేవిని పర్యవేష్టించి ఉంటారు. ఈ దేవత మహా పండితులతోను, జ్ఞానులతోను, శ్రీవిద్యాధురంధరులతోనూ ఉపాసించబడుతుంది.

**అనాహతాధిష్ఠానదేవతా రాకినీయుక్త రుద్రస్వరూపిణ్యంబా**

**శ్రీపాదుకాం పూజయామితర్పయామి నమః**

అనాహతచక్రంలో శివశక్తులు ఇద్దరూ రాజహంసల రూపంలో ఉంటారు. హంసరూపము అంటే 26వ తత్త్వము. ఈ హంసద్వంద్వమువల్లనే అష్టాదశవిద్యలూ ఉద్భవించినాయి. ఈ తత్త్వాన్ని సేవించేవారు అష్టాదశవిద్యలయందు ప్రావీణ్యు లౌతారు. **షట్చక్రనిరూపణం**లో "అనాహతపద్మము యొక్క కర్ణికలో షట్కోణాకృతిగా ధూమ్రవర్ణంలో వాయుమండలమున్నది. దీని బీజము 'యం' దీని వాహనము లేడి అని చెప్పబడింది.

**సంతానోపనిషత్తు**లో "అనాహతపద్మములో వామదేవికి రెండు వదనాలున్నాయి. గర్భస్థపిండానికి మొదటినెలలో నోరు ఏర్పడగా, రెండవనెలలో ముక్కు ఏర్పడుతుంది. ఈరెండూ వదనాలు. అందుచేతనే వామదేవికి రెండు ముఖాలున్నాయని చెప్పబడింది. ఈ మాసములో నేతితోతడిపినఅన్నము తల్లీబిడ్డలకు మంచి ఆహారము.

**'పుణ్యానందుడు'** అనే ముని ఒకరోజున తన ఆశ్రమ ప్రాంగణంలో చెట్టు క్రింద కూర్చుని ఉన్నాడు. పైన ఆకాశమార్గంలో రెండుహంసలు ఎగురుతూ పోతున్నాయి. అందులో ఆడుహంస మగహంసను అడుగుతోంది. "నాథా ! ఏ

విషయాన్ని తెలుసుకున్నంత మాత్రంచేత జగత్తులోని అన్నివిషయాలు తెలుస్తాయో, దాన్ని నాకుతెలియజేయవలసినది" ఆ మాటలువిన్న మగహంస చెబుతోంది. "దేవీ! కుమ్మరివాడు మట్టితో అనేకమైన పాత్రలు కుండలు, బానలు, చట్లు ఇలా చాలా తయారుచేస్తాడు. పాత్రలపేరు ఏదైనప్పటికీ, వాటి ఆకారం ఏదైనప్పటికీ వాటిలో ఉన్నది మట్టే. అలాగే బంగారంతో అనేక రకాల ఆభరణాలు తయారుచేస్తారు. కాని వాటిలో ఉన్నది బంగారమే" ఈ మాటలు వినగానే ఆడుహంస "స్వామీ ! తెలిసింది, చరాచర జగత్తంతా పరమేశ్వరుని చేతనే సృష్టించబడింది. జగత్తులోని ప్రతివస్తువూ పరమేశ్వర స్వరూపమే" అంది.

ఈ మాటలు విన్న పుణ్యానందముని తలపైకి ఎత్తిచూశాడు. హంసలు ఆశ్రమం దాటి వెళ్ళిపోయినాయి. ఇప్పుడు ఆ హంసలు తన హృదయకమలంలో ఉన్న శివశక్తులు అని భావించి వారు చెప్పిన విషయాన్ని యాభై రెండు శ్లోకాల రూపంలో ఒక గ్రంథం వ్రాశాడు. అదే **"కామకలావిలాసము"** దీనికి నేను వ్రాసిన వివరణయే "శ్రీవిద్యా సర్వస్వము" దీన్ని సాక్షాత్తు పరమేశ్వరి స్వరూపులు శ్రీశ్రీశ్రీ గణపతి సచ్చిదానంద స్వామివారు ఆవిష్కరించారు.

గౌడపాదులవారు తమ 'సుభగోదయస్తుతి'లో

**వదంత్యేకే వృద్ధా మణిరితి జలం తేన నిబిడం**
**పరేతు త్వద్రూపం మణిధనురితీదం సమయినః ।**
**అనాహత్యానాదః ప్రభవతి సుషుమ్నా ధ్వజనిత**
**స్తదా వాయో స్తత్ర ప్రభవ ఇద మాహుః సమయినః॥**

షట్చక్రాలలో క్రింది నుంచి మూడవది మణిపూరము సూర్యకిరణాలు నీటిమీద పడి ఇంద్రధనుస్సు ఏర్పడుతుంది. ఇంద్రధనుస్సుకు అల్లెత్రాడు ఉండదు. సమయాచారులకు మణిపూరంలోని భగవతిరూపమే ఇంద్రధనుస్సు. ఇదే మణిధనుస్సు. షట్చక్రాలలోను నాల్గవదయిన అనాహతం నుండి నాదం బయలు దేరుతుంది. అనాహతం వాయుతత్త్వాత్మకమైనది. సుషుమ్నలో జన్మించిన నాదము అనాహతంలో బయటకు వస్తుంది. అంటే అనాహతంలోకి వాయువు రాగానే నాదము వినిపిస్తుంది.

అనాహతంలో శివశక్తులు రాజహంసల రూపంలో ఉంటారు. ఉపాసకులు ఆ హంసమిధునాన్నే ఆరాధిస్తారు. యోగప్రక్రియలో ప్రాణులందరికీ హృదయ కమలంలో విహరించే రాజహంసలజంట శివశక్తుల రూపము అని **"యోగానుశాసనము"** అనే గ్రంథంలో చెప్పబడింది.

**అనుపమ మనుభృతి స్వాత్మ సంవేద్య మాద్యం**

**వితత సకల విద్యాలాప మన్యోన్యముఖ్యమ్ ।**

**సకల నిగమసారం సోఽహ మోంకారగమ్యమ్**

**హృదయ కమల మధ్యే హంసయుగ్మం నమామి ॥**

ఇది సమయమతంతో ఒక శాఖవారి అభిప్రాయము. అయితే మరికొందరు అనాహతంలోని పరమేశ్వరుడు అగ్నిజ్వాలారూపుడై, జ్వాలారూపిణి అయిన శక్తితో దీపాంకురములాగా ప్రకాశిస్తుంటాడు. అంటారు. ఈ అభిప్రాయాన్ని శంకర భగవత్పాదులవారు "సుభగోదయ వ్యాఖ్య"లో

**శిఖిజ్వాలారూపః సమయ ఇహ సైవాత్ర సమయా**

**తయోసంభేదో మే దిశతు హృదయాబ్జైక నిలయః**

అనాహతచక్రంలో అగ్నిజ్వాలారూపుడైన పరమేశ్వరుడు సమయుడు. జ్వాలారూపిణి అయిన భగవతి సమయ. ఈ సమ్మేళనము నా హృదయ పద్మమందు నిలచి సదా నన్ను అనుగ్రహించుగాక.

ఈ 38వ శ్లోకంలో శంకరులవారు అనాహతంలోని హంసమిధునం నుంచే 18 విద్యలు వచ్చినాయి అంటున్నారు. అవి

వేదాలు నాలుగు 1. ఋగ్వేదము, 2. యజుర్వేదము, 3.సామవేదము, 4. అధర్వణవేదము.

శాస్త్రాలు ఆరు 1. తర్కము, 2. వ్యాకరణము, 3. ధర్మము, 4. శిక్ష, 5. వైద్యము 6. జ్యోతిషము.

మీమాంస, న్యాయము, పురాణము, ఆయుర్వేదము, ధునుర్వేదము, గాంధర్వ వేదము, అర్ధశాస్త్రము, నీతిశాస్త్రము. వెరసి పద్దెనిమిది శాస్త్రాలు పరమేశ్వరి నుంచే

వచ్చినాయి. ఈ రకంగా హంసమిధునంగా అనాహతపద్మములో ఉన్న శివశక్తులను ఉపాసిస్తున్నాను. అంటున్నారు.

ఈ చక్రంలో శివాశివులకు పంచవిధసామ్యము

1. అధిష్ఠానము అనాహత మందిరము

2. వాయుతత్త్వాన్ని ఉత్పాదించటము అనుష్ఠానసామ్యము

3. గాలి లేని దీపముగా అనటం అవస్థాసామ్యము

4. అగ్నికణిక అనటం రూప, నామ సామ్యాలు చెప్పబడ్డాయి.

**తవ స్వాధిష్ఠానే హుతవహమదిష్ఠాయ నిరతం**
**తమీడే సంవర్తం జనని మహతీం తాంచ సమయామ్**
**యదాలోకే లోకాన్ దహతి మహతి క్రోధకలితే**
**దయార్ద్రా యా దృష్టి శ్శిశిరముపచారం రచయతి ॥ 39**

తల్లీ ! స్వాధిష్ఠానచక్రమందున్న అగ్నితత్త్వాన్ని అధిష్ఠించి నిరంతరము ప్రకాశిస్తూ ఉండే సంవర్తాగ్నిరూపంలో ఉన్న ఆ పరమేశ్వరుని స్తుతి చేస్తున్నాను. అలాగే సంవర్తాగ్ని రూపిణిఅయినశక్తిని ఆరాధిస్తున్నాను. అగ్నిరూపుడైన శివుని తీక్షణ దృక్కులచేత లోకాలు దగ్ధమవుతుండగా, పరమేశ్వరి యొక్క దయార్ద్ర ద్రుక్కులచే ఆ లోకాలకు శీతలోపచారములు కలుగుతున్నాయి.

మూలాధారానికి కొద్దిగా పైభాగాన ఆరుదళాలతో ఉండే పద్మాన్ని స్వాధిష్ఠానము అంటారు. ఇది అగ్నితత్త్వాత్మకమైనచక్రము. ఇక్కడ ఉండే అగ్నిని సంవర్తాగ్ని అంటారు. దీని అధిదేవత బ్రహ్మ. దీనిలోని ఆరుదళాలలోను బ నుంచి ల వరకు అక్షరాలు శక్తుల రూపంలో ఉంటాయి. ఈ చక్రాధిష్ఠాన దేవత సిద్ధేశ్వరి ఈ దేవతకు నాలుగు ముఖాలుంటాయి. నాలుగుచేతులుంటాయి. ఆ చేతులయందు శూలము, పాశము, కపాలము, అభయ ముద్రలు ధరించి ఉంటుంది. పసుపు పచ్చని శరీరవర్ణము కలిగి, మహాతిశయసౌందర్యము కలిగి ఉంటుంది. ఈవిడ శిరస్సు లోపల ఉండే మేదస్సునందుంటుంది. ఈమెకు మధువంటే (తేనె) ప్రీతి ఎక్కువ. బంధిని మొదలైన ఆరుగురు శక్తులతో పరివేష్టించబడి, దధ్యన్నమునందు ఆసక్తి గలిగి ఉంటుంది.

ఈమెను కాకిని అని కూడా అంటారు. ఈ విషయాలన్నీ లలితా సహస్రంలోని 505 స్వాధిష్ఠానాంబుజగతా నుంచి 514 కాకినీరూపధారిణీ వరకు చెప్పబడ్డాయి.

యోగినీన్యాసంలో స్వాధిష్ఠానాన్ని వివరిస్తూ

**స్వాధిష్ఠానాఖ్యపద్మే రసదళలసితే వేదవక్త్రాం త్రినేత్రాం**
**హస్తాభ్యాం ధారయంతీం త్రిశిఖగుణకపాలాభయాం ఉన్మత్త గర్వాం**
**మేదోధాతు ప్రతిష్ఠాం అళిమదముదితాం బందినీముఖ్యయుక్తాం**
**పీతాం దధ్యోదనేష్టాం అభిమతఫలదాం కాకినీం భావయామః ॥**

ఆరుదళాలు గల స్వాధిష్ఠానచక్రంలో నాలుగు శిరస్సులు, మూడుకనులు గలిగి, చేతులయందు త్రిశూలము, పాశము, కపాలము, అభయముద్ర కలిగి, అతిశయించిన గర్వముకలదై మద్యముత్రాగి సంతసించుచున్నది, మేదస్సు అను ధాతువునం దుండునది, బందిన్యాదిశక్తులతో పరివేష్ఠితమైన కాకినీ దేవిని ధ్యానించుచున్నాను.

**స్వాధిష్ఠాన దేవతా కాకినీయుక్త బ్రహ్మస్వరూపిణ్యంబా**
**శ్రీ పాదుకాంపూజయామి తర్పయామి నమః**

**షట్చక్రనిరూపణం**లో "స్వాధిష్ఠానము లింగస్థానంలో సింధూరపు రంగులో ఉంటుంది. దీని ఆరుదళాలలోను బంధిని మొదలైన శక్తులు విద్యుల్లతలలాగా ప్రకాశిస్తుంటాయి. దీనికి అధిదేవతబ్రహ్మ. బీజం - వం. ఈ మండలము అర్ధచంద్రాకారంలో ఉంటుంది.

**సంతానోపనిషత్తు**లో "ఈ చక్రంలో సిద్ధేశ్వరీ దేవికి నాలుగుముఖాలుంటాయి. వీటినే నాలుగుశిరస్సులు అంటారు. గర్భస్థశిశువుకు ఈ నెలలో చెవులు ఏర్పడతాయి. ఇప్పుడు నోరు, ముక్కు, కన్ను, చెవి. ఈ నాలుగే ఆ దేవతముఖాలు.

**అథ చతుర్థమాసే జఠర కటిప్రదేశో భవతి**

ఈ సమయంలో పిండానికి ఉదరము, కటిప్రదేశము ఏర్పడతాయి. ఈ మాసంలో గర్భిణీస్త్రీకి మధువు మంచి ఆహారము. అది తల్లికి బిడ్డకి కూడా క్షేమము.

స్వాధిష్ఠానము అనేది అగ్నితత్త్వాత్మకము. అగ్నినిఉత్పత్తి చేసే స్థానం. ఇక్కడ ఉండే అగ్నిని సంవర్తాగ్ని అంటారు. సంవర్తము నాశనము, ప్రళయము అని అర్థం.

అంటే ప్రళయకాలంలో ఉండే అగ్ని ఇక్కడ ఉంటుందన్నమాట. దానితో పరమేశ్వరుడు లోకాలను భస్మంచేస్తుంటే పరమేశ్వరి తన దయాదృక్కులచే మణిపూరంలో శశిరోపచారాలు చేస్తున్నది అంటున్నారు. ఇక్కడ పరమేశ్వరుడు అగ్నిరూపంలో ఉంటే పరమేశ్వరి జ్వాలారూపంలో ఉంటుంది.

1. శివాశివులిద్దరూ స్వాధిష్ఠానంలో ఉంటారు కాబట్టి అధిష్ఠాన సామ్యము.
2. లోకాలను దహిస్తున్నారు. అనటం అనుష్ఠాన సామ్యము.
3. మహాసంవర్తాగ్ని జ్వాలాశక్తి రూపంలో ఉన్నారనేది అవస్తాసామ్యము.
4. మహాసంవర్తాగ్నులు అనటంచేత రూప, నామసామ్యాలు చెప్పబడ్డాయి.

**తటిత్త్వన్తం శక్త్యా తిమిరపరిపన్థి స్ఫురణయా**
**స్ఫురన్నానారత్నాభరణ పరిణద్ధేన్ద్రధనుషమ్ ।**
**తవ శ్యామం మేఘం కమపి మణిపూరైక శరణం**
**నిషేవే వర్షన్తం హరమిహిరతప్తం త్రిభువనమ్ ॥ 40**

భగవతి ! మణిపూరచక్రములో అలముకున్న అంధకారంలో మెరుపులాగా ప్రకాశించే ఓ దేవీ ! స్వాధిష్ఠానచక్రంలో శివుడు సంవర్తాగ్నిచేత దగ్ధంచేసిన లోకాలను ఆదేవి తనవర్షధారలచే తడుపుతున్నది. నవరత్నాభరణములు ధరించి ఇంద్రధనుస్సు లాగా ప్రకాశిస్తున్నది. నల్లనివర్ణము గలది అయిన మేఘమును మేఘరూపంలో ఉన్న పశుపతిని ధ్యానిస్తున్నాను.

నాభిస్థానంలో పదిదళాలతో ప్రకాశించే మణిపూరచక్రమున్నది. ఇది జలతత్త్వము గలది. ఇందులో ఆధార స్వాధిష్ఠానాలకు ప్రతీకగా పదిదళాలుంటాయి. ఆధారచక్రానికి ప్రతీకగా నాలుగు, స్వాధిష్ఠానానికి ప్రతీకగాఆరు వెరసి పది దళాలన్న మాట. ఈ చక్రంలో మూడు ముఖములు, కోరలుగలది. చేతులయందు వజ్రము, శక్తి, దండము, అభయముద్ర ధరించినది. మాంసము మీద మక్కువ గలది, గుడాన్నమునందు ప్రీతిగలది, డామరి మొదలైన పదిశక్తులచే పరివేష్టించబడినది. అందరికీ సుఖమును కలిగించేది అయిన లాకిని అనే పేరు గల యోగిని ఉంటుంది. ఈ విషయమంతా లలితా సహస్రంలో 496వ నామం మణిపూరాబ్జనిలయానుంచి 504వ నామం లాకిన్యంబాస్వరూపిణీ వరకు చెప్పబడింది.

యోగినీన్యాసంలో మణిపూరాన్ని వివరిస్తూ

**దిక్పత్రే నాభిపద్మే త్రివదన విలసద్దంష్ట్రిణీం రక్తవర్ణాం**
**శక్తిం దంభోళిదండాం అభయమపి భుజై ర్థారయంతీం మహోగ్రాం**
**డామర్యాద్యై పరీతాం పశుజనభయదాం మాంసధాత్వైకనిష్ఠాం**
**గౌడాన్నాసక్తచిత్తాం సకలసుఖకరీం లాకినీం భావయామః ॥**

నాభిస్థానంలో పదిదళాలుగల పద్మమున్నది. దానిలో మూడుముఖములు, కోరలు గలిగి, రక్తవర్ణములో ఉన్నది, చేతులయందు వజ్రము, శక్తి, దండము, అభయముద్రలు గలిగినది. మాంసధాతువునందుండునది, గుడాన్నమునందు ప్రీతిగలది, సమస్తసుఖాలను ఇచ్చేది అయిన లాకినీదేవికి నమస్కరిస్తున్నాను.

**మణిపూరాధిష్ఠాన దేవతా లాకినీయుక్త విష్ణుస్వరూపిణ్యంబా**
**శ్రీపాదుకాంపూజయామి తర్పయామి నమః**

**షట్చక్రనిరూపణం**లో "మణిపూరచక్రం యొక్క కర్ణికలో అగ్నిమండలమైన త్రికోణము ఎర్రని రంగులో ఉన్నది. అక్కడ అగ్నిబీజము రం. మేషవాహనముపై నున్నది. ఈ బీజము అంక భాగాన సింధూరవర్ణము గల రుద్రమూర్తి ఉంటాడు. అతడు భస్మలేపనం చేసుకుని తెల్లగామెరుస్తూ ఉంటాడు. అతడికి మూడుకనులు ఉంటాయి. అభయవరదముద్రలు ధరించి ఉంటాడు. అతడు సృష్టి సంహారకారి" అని చెప్పబడింది.

**సంతానోపనిషత్తు**లో "మణిపూరంలో ఉండే దేవి వయోవస్థావివర్జితా ఆమెకు మూడుశిరస్సులుంటాయి.

గర్భస్థశిశువుకు మూడవనెలలో చక్షువులు ఏర్పడతాయి. ఇప్పుడు ఆ శిశువుకు నోరు, ముక్కు, కనులు ఏర్పడ్డాయి. ఈ మూడుఇంద్రియాలే మూడుశిరస్సులు. ఈ నెలలో గర్భిణిస్త్రీకి గుడాన్నము మంచి పౌష్టికాహారము. **మాసత్రయేణ పాదప్రదేశో భవతి.** గర్భస్థశిశువుకు ఈ నెలలో కాళ్ళు చేతులు వస్తాయి.

స్వాధిష్ఠానంలో మహాసంవర్తాగ్ని వల్ల దగ్ధమైన లోకాలను శివాశివులు తమ అమృతధారలతో తడుపుతుంటారు. ఇక్కడ శివుడు మేఘరూపంలోను, దేవి సౌదామిని (మెరుపు) రూపంలోను ఉంటారు. ఈ చక్రంలో

1. శివాశివులిద్దరూ మణిపూరంలో ఉండటంచేత అధిష్ఠానసామ్యము.

2. 'స్ఫురన్నానారత్నాభరణ ఫణిరద్దేంద్రు ధనుషమ్' అనటంవల్ల అనుష్ఠాన సామ్యము.

3. కారుమేఘాలవలె ఉన్నారు అనటం అవస్థాసామ్యము.

4. మేఘము విద్యుల్లత అనేది రూపసామ్యము.

5. తటిత్వంతుడు, తటిత్వతి వీరు పేర్లు. ఇది నామసామ్యము.

గౌడపాదులవారు తమ సుభగోదయ స్తుతిలో

**క్షకారః పంచాశత్కల ఇతి హలో బైందవ గృహమ్**
**క్షకారా దూర్ధ్వం స్యాజ్జనని తవ నామాక్షరమితి**
**భవేత్పూజాకాలే మణిఖచిత భూషాభిరభితః**
**ప్రభాభి ర్వ్యాలీఢం భవతి మణిపూరమ్ సరసిజమ్ ॥**

వర్ణసమామ్నాయంలో క్షకారము ఆఖరుది. అందులోని వర్ణాలను అక్షరములు అన్నారు. అక్షరము ఉంటే అ నుంచి క్ష వరకు గల వర్ణసమామ్నాయము అని అర్థం. అయితే సంస్కృతభాషలో ఆఖరుఅక్షరము ళకారము. పంచదశీమంత్రంలో మొదటి అక్షరము క చివరి అక్షరము ల. ఈ రెండుఅక్షరాలు ఒకచోట చేరటంవల్ల కల అవుతున్నది. అదే కళ. షోడశీకళ. సాదాఖ్యకళ. ఇదే బ్రహ్మవిద్య. శ్రీవిద్య, చిత్కళ, చంద్రకళ, సమయ, చిద్రూప, పరా అనే పేర్లతో పిలుస్తారు.

మణిపూరం జలతత్త్వాత్మకమైనది. మణులతో కూడి ఉన్నది కాబట్టి దీన్ని మణిపూరకము అంటారు. ఇది సూర్యఖండము. సూర్యకిరణాలు ఇక్కడ జలంమీద పడి ఇంద్రధనుస్సు ఏర్పడుతుంది. ఇంద్రధనుస్సుకు అల్లెత్రాడు ఉండదు. ఇది ఆగమరహస్యము. **'అరుణోపనిషత్తు'**లో చెప్పినట్లుగా మేఘస్వరూపుడైన రుద్రుని యొక్క ధనుస్సు అల్లెత్రాడులేనిది. సిద్ధఘటికలో చెప్పినట్లుగా

**మణిపూరైక వసతిః ప్రావృషేణ్య స్సదాశివః**
**అంబుదాత్మతయా భాతి స్థిరసౌదామినీ సివా ॥**

సూర్యకిరణాలు మేఘత్వం పొంది జలరూపంలో ఆధారస్వాధిష్ఠానాల మధ్య ఉన్నాయి. అనగా మణిపూరంలో జలరూపంలో ఉన్నాయి. మణిపూరంలో భగవతికి స్థిరసౌదామినీత్వము సూచించబడింది. ఇక్కడ ఉండే జలము స్వాధిష్ఠానంలో అగ్నిని, అనాహతంలో సూర్యుణ్ణి, ఆజ్ఞాచక్రంలో చంద్రుణ్ణి ఉత్పన్నము చేస్తుంది.

యోగప్రక్రియలో ఆధారచక్రంలో నిద్రావస్థలోఉన్న కుండలిని ఆధార స్వాధిష్ఠానాలను భేదించుకుని మణిపూరంలో ప్రవేశిస్తుంది. సాధకుడు భగవతిని షట్చక్రాలలో ఇక్కడ నుంచే ఆరాధించాలి. ఇక్కడ దేవికి అర్ఘ్యపాద్యాదులిచ్చి షోడశోపచారవిధిని పూజించాలి. చంద్రజ్ఞానవిద్యలో

**సూర్యమండల మధ్యస్థాం దేవీం త్రిపుర సుందరీం**

**పాశాంకుశ ధనుర్బాణాన్ ధారయంతీం ప్రపూజయేత్ ॥**

సూర్యమండలము మధ్యన ధనుర్బాణములు, పాశము, అంకుశము ధరించి వెలుగొందుతున్న ఆ భగవతిని పూజించాలి అని చెప్పబడింది. షట్చక్రాలలోను మణిపూర అనాహతాలు సూర్యమండలము అని గతంలో చెప్పుకున్నాం. అయితే గౌడపాదాచార్యులవారు

**సూర్యమండల మధ్యస్థా దేవీం త్రిపుర సుందరీం**

**పాశాంకుశ ధనుర్బాణ హస్తాన్ ధ్యాయేత్సు సాధకః**

**త్రైలోక్యం మోహయేదాసు నరనారీ గణైర్యుతమ్ ॥**

సూర్యమండలమధ్యవర్తియై, పాశము, అంకుశము, ధనుర్బాణాలు ధరించి ఉన్న భగవతిని ఆరాధించినట్లైతే సకలజనవశ్యం కలుగుతుంది. అలాగే కాళిదాసు **'చర్చాస్తవం'**లో

**యే చింతయంత్యరుణ మండల మధ్యవర్తి**

**రూపంతవాంబ నవయావక పంకరమ్యమ్**

**తేషాం సదైవ కుసుమాయుధ బాణభిన్న**

**వక్షస్థలా మృగదృశో వశగాభవంతి ॥**

సూర్యమండల మధ్యవర్తి అయిన దేవిని ధ్యానించినట్లైతే లేడికనులు గల జవరాండ్రు అతనికి వశమవుతారు.

**తవాధారే మూలే సహ సమయయా లాస్యపరయా**
**నవాత్మానం మన్యే నవరస మహాతాణ్డవనటమ్ ।**
**ఉభాభ్యామేతాభ్యా ముదయవిధి ముద్దిశ్య దయయా**
**సనాథాభ్యాం జజ్ఞే జనకజననీమ జ్జగ దిదమ్ ॥** **41**

ఓ తల్లీ ! ఆధారచక్రంలో శృంగారపరమైన నృత్యమునందు ఆసక్తురాలవై సమయ అనే పేరుగల శక్తివైన నీతో కలిసి నవరసమహాతాండవం చేస్తున్న పరమశివుడు ఆనంద భైరవుడు. నీవు ఆనందభైరవివి. భైరవి భైరవులు అనే పేర్లుగల శివశక్తులు జగత్తును ఉత్పత్తిచేసే కార్యక్రమంలో ఆధారచక్రంలో నిమగ్నమై ఉంటారు.

మూల అంటే గుదస్థానం. శరీరమంతటికీ ఆధారమైన చక్రం గుదస్థానంలో ఉంటుంది. కాబట్టి దీన్ని మూలాధారచక్రము అంటారు. ఇది గనక లేకపోతే శరీరం పైకిఎగిరిపోవటంగాని, క్రిందికిపడిపోవటంగాని జరుగుతుంది. ఇది పృథివీ తత్త్వాత్మకమైన స్థానము. ఇక్కడ నాలుగుదళాలతో కూడిన పద్మము ఉంటుంది. ఈ దళాలలో వ నుంచి స వరకు అక్షరాలుంటాయి. దీనికి అధిదేవత గణపతి. ఈ చక్రంలో ఉండే దేవత సిద్ధవిద్యాదేవి. దీనిలో పసుపురంగులో వర్తులాకారంలో భూమండలమున్నది. దానిమీద తెల్లనిగుర్రము. ఆ గుర్రము మీద లం అనే బీజము ఉంటాయి. ఇదే కుండలినీస్థానము. దీని మధ్యన విద్యుత్కాంతులతో త్రికోణముంటుంది. అందులో క్లీం బీజమున్నది. ఆ బీజం మీద స్వయంభూలింగానికి మూడున్నరచుట్లు చుట్టుకుని సర్పాకారంలో కుండలినీశక్తి ఉంటుంది.

ఈ చక్రాధిష్ఠాన దేవత అయిన సిద్ధవిద్యాదేవికి ఐదుముఖాలుంటాయి. అవే ఐదుశిరస్సులుగా చెప్పబడతాయి. ఈ ఐదుతలలే సద్యోజాత, వామదేవ, అఘోర తత్పురుష, ఈశానులు. సిద్ధవిద్యాదేవత అస్థిధాతువు నందుంటుంది. ఎముకలు విరిగినవారు త్వరగా కోలుకోవాలంటే **"ఓం అస్థి సంస్థితాయై నమః"** అని జపం చెయ్యాలి. సిద్ధవిద్యాదేవత తన నాలుగు చేతులయందు అంకుశము, కమలము, పుస్తకము, జ్ఞానముద్రలు ధరించి ఉంటుంది. ఆధారచక్రం మధ్యలో సిద్ధవిద్యాదేవి ఉండగా నాలుగు దళాలయందు వ నుంచి స వరకు శక్తులు పరివేష్టించి ఉంటాయి. ఈమెకు ముద్గాన్నమునందు ప్రీతిఎక్కువ. ఈమెను సాకిని అంటారు. ఈ

విషయమంతా లలితా సహస్రంలోని 515 **మూలాధారాంబుజారూఢా**నుంచి 52. **సాకిన్యంబాస్వరూపిణి** వరకు చెప్పబడ్డాయి.

మూలాధార చక్రాధిదేవత అయిన సిద్ధవిద్యాదేవి యొక్క బీజము, శక్తి, కీలకము అన్నీ స కార సంకేతంగా ఉంటాయి. కాబట్టి ఈమెను సాకిని అంటారు. యోగినీ న్యాసంలో ఆధారచక్రాన్ని వివరిస్తూ

**మూలాధారపద్మే శ్రుతిదళలసితే పంచవక్త్రాం త్రినేత్రాం**
**ధూమ్రాభాం అస్థిసంస్థాం సృణి మపి కమలం పుస్తకం జ్ఞానముద్రాం**
**భిభ్రాణాం బాహుదండై స్సులలిత వరదాపూర్వశక్త్యావృతాం తాం**
**ముద్గాన్నాసక్త చిత్తాం మధుమద ముదితాం సాకినీం భావయామః ॥**

ఆధారచక్రంలో ఐదుముఖాలు, మూడుకనులు కలిగి ధూమ్రవర్ణముతో ఉన్నది, ఎముకలు యందుండునది. అంకుశము, కమలము, పుస్తకము, జ్ఞానముద్ర చేతులయందు ధరించినది, ముద్గాన్నమునందు ఆసక్తి కలది అయిన సాకినీదేవికి నమస్కరిస్తున్నాను.

**మూలాధారాధిష్ఠానదేవతా సాకినీయుక్త శ్రీగణపతి**
**స్వరూపిణ్యంబా శ్రీపాదుకాంపూజయామి తర్పయామి నమః**
**జపాకుసుమ సంకాశౌ మధుఘూర్ణితలోచనౌ**
**జగతః పితరౌ వందే భైరవీభైరవాత్మకౌ ॥**

మంకెన్నపూలవంటి శరీరచ్ఛాయగలిగి మధుపానముచే మత్తెక్కిన కనులు గలిగి, ఈ జగత్తుకు మాతాపితురులైన భైరవీభైరవులకు నమస్కారము.

షట్చక్రనిరూపణంలో "ఆధారచక్రం గుదస్థానానికి దగ్గరగా ఉంటుంది. దీనిలోని నాలుగదళాలు ఎరుపురంగులో ఉంటాయి. ఈ పద్మము మధ్యభాగంలో చతురస్రాకారమైన పృథివీమండలమున్నది. అది పీతవర్ణంలో ఉంటుంది.

**మూలాధారే ధరాచక్రం చతుష్కోణం ప్రియంవదే**
**పీతవర్ణం పరివృతం చా ష్టశూలైః కులాచలైః ॥**

కులపర్వతాలే దీని ఎనిమిది దిక్కులయందు శూలములుగా ఉన్నాయి. దీనియందు లం పృథివీబీజమున్నది. ఇదే ఇంద్రబీజం. ఇది పచ్చనిరంగుతో

పెద్దపెద్దచేతులతో వజ్రాయుధం ధరించి ఐరావతము ఎక్కి ఉంటుంది. దాని అంకభాగాన ఒక శిశువు ఉన్నాడు. అతడే ఇంద్రుడు అని యామళగ్రంధాలు చెబుతున్నాయి. ఇక్కడికి కొద్దిగా పైభాగాన స్వయంభూలింగానికి మూడున్నరచుట్లు చుట్టుకుని కుండలినీశక్తి నిద్రిస్తూ, తన ముఖంచేత బ్రహ్మరంధ్రాన్ని కప్పిఉంచుతుంది.

**సంతానోపనిషత్తు**లో "ఇక్కడ సిద్ధవిద్యాదేవి ఐదుముఖాలతో ఉంటుంది. గర్భస్థశిశువుకు ఈ నెలలో చర్మము ఏర్పడుతుంది. **పంచమేమాసే పృష్ఠవంశోభవతి** ఐదవనెలలో బిడ్డకు వెన్నెముకఏర్పడుతుంది. గతంలో

| | | |
|---|---|---|
| మొదటినెలలో | – | నోరు |
| రెండవనెలలో | – | ముక్కు |
| మూడవనెలలో | – | కనులు |
| నాల్గవనెలలో | – | చెవులు |
| ఐదవనెలలో | – | చర్మము |

ఏర్పడి పంచేద్రియస్ఫూర్తి కలుగుతుంది. గర్భిణీస్త్రీకి ఈ సమయంలో ముద్గాన్నము మంచి ఆహారము.

ఆధారస్వాధిష్ఠానాలు అంధకారబంధురాలు. ఇక్కడ కౌళులకు మాత్రమే అర్చనాధికారమున్నది. కుండలినీశక్తి నిద్రావస్థలో ఉంటుంది. అయినప్పటికీ కౌళులు కుండలినీ పూజ చేస్తారు. సమయమతానుసారము పరమేశ్వరిని మణిపూరం నుంచే అర్చించాలి. ఆధారచక్రముత్రికోణాత్మకము. అందులో బిందువున్నది. కౌళమతంలో త్రికోణమేబిందుస్థానము. కౌళులకు ఆ బిందువే ఆరాధింపతగినది. అందుకనే కౌళులునిత్యము త్రికోణంలోనిబిందువును అర్చిస్తారు. ఆ త్రికోణం రెండు విధాలుగా ఉన్నది. శ్రీచక్రంలో ఉన్న త్రికోణం ఒకటి కాగా స్త్రీయొక్క ప్రత్యక్ష యోని రెండవది.

పూర్వకౌళులు శ్రీచక్రాన్ని భూర్జరీపత్రం మీదగాని, రాగి, వెండి, బంగారు రేకులమీద గాని, పట్టు వస్త్రముమీద గాని వ్రాసి దాన్నిపూజిస్తారు. ఉత్తరకౌళులు ప్రత్యక్షయోనిని పూజిస్తారు. ఈ రెండు రకాల పూజలు బాహ్యాపూజలే. అందుచేతనే కౌళులకు ఆధారచక్రమే పూజనీయమవుతున్నది. ఆధారచక్రంలో ఉన్న కుండలినిని 'కౌళిని' అంటారు. త్రికోణపూజలో ఆ కౌళినియే ఉపాస్య. ఇదికౌళమత రహస్యము.

కౌళిని నిద్రావస్థలోఉన్నప్పటికీ ఆమె పూజనీయమే అవుతున్నది. నిద్రావస్థలో ఉన్న కుండలిని పూజిస్తారు కాబట్టి ఆపూజ అంధతామిశ్రపూజ అనబడుతుంది. నిద్రలో ఉన్న కుండలిని ఎప్పుడైతే జాగృతమవుతుందో, అప్పుడే కౌళులకు ముక్తిలభిస్తుంది. అందుకే వారిని క్షణముక్తులు అంటారు.

**ధ్యాయేత్ కుండలినీం దేవీం ఇష్టదేవ స్వరూపిణీం**
**సదా షోడశవర్షీయాం పీనోన్నతపయోధరాం**
**నవయవ్వన సంపన్నాం సర్వాభరణభూషితాం**
**పూర్ణచంద్రప్రభాం రక్తాం సదాచంచలలోచనాం ॥**

ఈమె ఎప్పుడూ నవయవ్వనంతో పదహారుసంవత్సరాలబాలికలాగా, సర్వాభరణభూషితయై ఉంటుంది. **కంకాళమాలినీ తంత్రం**లో కుండలినీశక్తిని గురించి ఈ విధంగా చెప్పబడింది.

**కోటిచంద్ర పతీకాశాం పరబ్రహ్మ స్వరూపిణీం**
**చతుర్భుజాం త్రినేత్రాం చ వరదాభయకరాం తథా ।**
**తథా పుస్తక వీణాంచ ధారిణీం సింహవాహినీం**
**గచ్ఛంతీం స్వాపనాం భీమాం నానారూప ధరాత్మికామ్ ॥**

**రుద్రయామళం**లో కుండలినీ స్తవం ఉన్నది. అందులో

**జన్మోద్ధార విరిక్షిణీహ తరుణీ వేదాదిబీజాదిమా**
**నిత్యం చేతసి భావ్యతే భువికదా సద్వాక్యసంచారిణీ ।**
**మాంపాతు ప్రియదాన భావకపదం సంఘాతయే శ్రీధరే**
**ధాత్రి । త్వం స్వయమాది దేవవనితా దీనాతిదీనం పశుం ॥**

ఓ పరాత్పరీ ! శివుని అర్ధాంగిఅయిన ఓ పార్వతీ ! నీవు సర్వకాల సర్వావస్థల యందు ఉపనిషద్వాక్యముల యందే సంచరిస్తుంటావు. ఓంకార స్వరూపిణివి. నిత్యయవ్వనవు. మానవుల జన్మల నుద్ధరించటానికి సదామెలకువతో ఉంటావు. అటువంటి నిన్ను నేను ఎల్లప్పుడు ధ్యానిస్తూ ఉంటాను.

లలితాసహస్రంలో కుండలినీశక్తిని గురించి 90వ నామము **'కులామృతైక రసికా"** నుంచి 95వ నామము **'కులయోగినీ'** వరకు చెప్పబడింది.

కౌళులకు త్రికోణమందు భైరవీభైరవులు పూజనీయులు. సాధన చేసేటప్పుడు ఎవరైనాసరే వారు ఉపాసించే దేవతతో తాదాత్మ్యం చెందాలి. అప్పుడే ఆ సాధనకు ఫలితముంటుంది. ఈ కారణంచేతనే న్యాసంచెప్పుకుని దేవతను మన శరీరం మీదికి ఆవాహన చేసుకోవటం జరుగుతుంది. ఈ కారణం చేతనే కౌళులు బిందుపూజ చేసేటప్పుడు భైరవాకారమైన దిగంబరత్వం పొంది అర్చన చేస్తారు. ఈ విధానంలో స్త్రీపురుషులకు బేధం లేదు. ఈ పూజలో మకారపంచకం ఉపయోగిస్తారు. మకారపంచకము అంటే

**మద్యం మాంసం తథా మత్స్యం ముద్రా మైథునమేవచ**
**శక్తిపూజా విధానాద్యై పంచతత్త్వ ప్రకీర్తితః**

వామాచారసంప్రదాయంలో వీటిని యదాతథంగా ఉపయోగిస్తారు. వామాచారులకు వామకేశ్వరతంత్రం ప్రామాణికం. క్షీరసాగర మథనంలో పుట్టిన మద్యంత్రాగినఅసురులది వామమార్గము. అమృతంత్రాగినదేవతలది సమయమార్గము. వామాచారులు ఇంద్రియాల తృప్తితో ఆనందం పొందటానికి ఇష్టపడతారు. మనస్సు, శరీరము వేటితో తృప్తి పొందుతాయో, వాటివల్లనే దేవి కటాక్షిస్తుంది అని వీరి నమ్మకం. వీరు పంచమకారపూజలుచేస్తారు. నరబలులు, పశుబలులు ఇస్తారు. వివస్త్రఅయినకన్యను, కులకాంతను, వేశ్యను దేవి స్థానంలో కూర్చోపెట్టి, మద్యంసేవించి, ఆ స్త్రీతో సంభోగిస్తారు. ఇదే దేవిని తృప్తిపరచే సులభమైన మార్గము అని వీరి నమ్మకం. బెంగాలు, బీహారు, మధ్యప్రదేశ్ ప్రాంతాలలో వీరు పుష్కలంగాఉన్నారు. వీరి పరిభాషలో త్రికోణము అనగా స్త్రీ యోని. బిందువు అనగా యోనియందలి మన్మథచక్రము. ఇది అథోముఖంగా ఉండే త్రికోణ పూజ. దిగంబరులు, క్షపణకులు మొదలైన వారు స్త్రీని తలక్రిందులుగా నిలబెట్టి ఊర్ధ్వత్రికోణ పూజ చేస్తారు. ఇదంతా కౌళమతరహస్యము.

మేరుతంత్రం వామాచారాన్ని పూర్తిగా ఖండిస్తున్నది. వామమార్గం వలన సర్వనాశనం కలుగుతుంది. అజ్ఞానులు ఆటవికులు ఈ మార్గాన్ని అనుసరిస్తారు

ఇంద్రియతృప్తిచేత ఆనందాన్ని అనుభవించే వామాచారులు భ్రష్టులవుతారు. దేవీపూజలో వైదికపూజ శ్రేష్ఠము, స్మార్తపూజఉత్తమము, పౌరాణికపూజ మధ్యమము, తాంత్రికపూజ అధమము అని చెప్పబడింది. సాధకులు పూజలో మకారపంచకాన్ని ఉపయోగించరాదు.

శ్రీచక్రంలోని వివిధచక్రాలే ఆధారాదిషట్చక్రాలు. శ్రీచక్రంలోని త్రికోణమే బైందవస్థానము. అదే సహస్రారాంతర్గతమైన చంద్రమండలము. అదే బిందుస్థానము. సుధాసింధువు. సరఘ అని చెప్పబడుతున్నది. శివునితో శక్తి పంచవిధ సామ్యము పొంది ఉంటుంది. అందుకే శివశక్తులను సమయుడు, సమయ అన్నారు. వీరి ఆచారమే సమయాచారము. ఆధారచక్రంలో

1. శివాశివులిద్దరూ ఆధారచక్రంలోనే ఉంటారు కాబట్టి అధిష్ఠానసామ్యము.

2. ఇరువురూ జగత్తునుసృష్టించే కార్యక్రమంలో ఉంటారు కాబట్టి అనుష్ఠాన సామ్యము.

3. ఇరువురూ నాట్యం చేస్తుంటారు కాబట్టి అవస్థాసామ్యము.

4. ఇరువురూ అరుణారుణచ్ఛాయలో ఉంటారు కాబట్టి రూపసామ్యము.

5. వీరిద్దరికీ భైరవీ భైరవుడు, నవాత్మ, నవాత్మకుడు అని పేర్లు కాబట్టి నామసామ్యము చెప్పబడ్డాయి.

**జపాకుసుమ సంకాసౌ మధుఘూర్ణిత లోచనౌ**

**జగతః పితరౌ వందే భైరవాత్మకౌ ॥**

దాసాని పువ్వులాగా ఎర్రని శరీరచ్ఛాయ గలవారు, మధుపానముచే మత్తెక్కిన కనులు గలవారు, ఈజగత్తుకు జననీజనకులు అయిన భైరవీభైరవులకు నమస్కారము.

షట్చక్రాలకు పైభాగాన బ్రహ్మరంధ్రం దగ్గర ఉంటుంది. అదే సహస్రదళ పద్మము. ఇది వేయిదళాలతో ప్రకాశిస్తుంటుంది. ఇందులో దిక్కుకు ఒకటిచొప్పున ఎనిమిది దిక్కులయందు ఎనిమిదిదళాలుంటాయి. ఒక్కొక్కదళంలోను నూటఇరవైఐదు చిన్న దళాలుంటాయి. వెరసి వేయిదళాలు గల పద్మం. అధోముఖంగా ఉంటుంది. లలితాసహస్రంలో 529వ నామము **సహస్రదళ పద్మస్థా** నుంచి 535 **యాకిన్యంబా స్వరూపిణీ** వరకు సహస్రదళ పద్మాన్ని వివరించటం జరిగింది. ఇక్కడ ఉండేవాడు

పరమేశ్వరుడు. ఈ చక్రాధిష్ఠానదేవత యశశ్విని. ఇక్కడ ఉండే దళాలలో అన్ని వర్ణాలు అంటే అన్నిరంగులు, అన్నిఅక్షరాలు ఉంటాయి. ఇదిపరమాత్మ స్థానము. ఇక్కడ వేలకొలది సూర్యకాంతులు ప్రసరిస్తూ ఉంటాయి. యోగీశ్వరులకు ఇక్కడే ఆత్మదర్శనమవుతుంది. ఇది జీవాత్మపరమాత్మల సంగమస్థానము. ఇక్కడ ఉండే యశశ్వినీ అనేదేవత యాకిని అనిపిలువబడుతుంది. ఈమెకు అన్ని రకాలయిన ఆహారములందు ప్రీతి. సమయమతస్థులు శివశక్తులను సహస్రారమందే అర్చించాలి. అదే ముక్తికి మార్గము.

**షట్చక్రాల ఐక్యము :**

శరీరంలో ఉండే షట్చక్రాలు భాషకు ఉన్న యాభై అక్షరాలతోను, షోడశ కళలతోను, శ్రీచక్రంతోను, మూలమంత్రంతోను ఐక్యత చెందుతున్నాయి.

**1. అక్షరాలతో ఐక్యము :**

సంస్కృతభాషకు అక్షరాలు యాభై. అవి

| | | | | |
|---|---|---|---|---|
| 1. | విశుద్ధిచక్రంలో | - | అ నుంచి అః వరకు | 16 |
| 2. | అనాహతచక్రంలో | - | క నుంచి ఠ వరకు | 12 |
| 3. | మణిపూరచక్రంలో | - | డ నుంచి ఫ వరకు | 10 |
| 4. | స్వాధిష్ఠానచక్రంలో | - | బ నుంచి ల వరకు | 6 |
| 5. | ఆధారచక్రంలో | - | వ నుంచి స వరకు | 4 |
| 6. | ఆజ్ఞాచక్రంలో | - | హ, క్ష | 2 |
| | | | వెరసి అక్షరాలు | 50 |

**2. కళలు, మూలమంత్రముతో ఐక్యత :**

కళలు తిథులస్వరూపాలు. నిత్యలు కళాస్వరూపాలు. కళలయొక్క ప్రతిరూపమే పంచదశీమహామంత్రం ఈ మంత్రంలోని పదిహేనుఅక్షరాలు సోమ సూర్య అగ్నిఖండాలు. ఈ మూడు ఖండాలు షట్చక్రాలలోకూడా ఉన్నాయి. షట్చక్రాలలోని మూడుగ్రంథులూ మంత్రంలోని మూడుహ్రీంకారాలు. ఈ రకంగా కళలతోను, మూలమంత్రంతోను షట్చక్రాలకు ఐక్యత ఏర్పడింది.

**3. శ్రీచక్రంతో ఐక్యత :**

షట్చక్రాలకు శ్రీచక్రంతోఐక్యతనే నాదబిందుఐక్యత అంటారు. నాదము అంటే శ్రీచక్రము. బిందువు అంటే షట్చక్రాల సమూహము. ఈ ఐక్యత ఈ విధంగా ఉంటుంది. గౌడపాదులవారు తమ సుభగోదయ స్తుతిలో

**త్రికోణం చాధారం త్రిపుర వినుతేష్టార మనఘే**
**భవే త్స్వాధిష్ఠానం పునరపి దశారం మణిపురం**
**దశారంతే సంవిత్కమల మథ మన్వస్రక్రముమే**
**విశుద్ధం స్వాధాజ్ఞా శివ ఇతి తతో బైందవ గృహమ్ ॥**

1. ఆధార చక్రానికి – త్రికోణంతో ఐక్యత
2. స్వాధిష్ఠానానికి – అష్టకోణంతో ఐక్యత
3. మణిపూరానికి – అంతర్దశారంతో ఐక్యత
4. అనాహతానికి – బహిర్దశారంతో ఐక్యత
5. విశుద్ధి చక్రానికి – చతుర్దశారంతో ఐక్యత
6. ఆజ్ఞాచక్రానికి – అష్టదళము, షోడశదళాలతో ఐక్యత
7. సహస్రారానికి – చతుర్ద్వారసహిత భూపురంతో ఐక్యత
8. మూడు వృత్తాలు – బ్రహ్మగ్రంధి, విష్ణుగ్రంధి, రుద్రగ్రంధి

**షట్చక్ర సేవాఫలం :**

ఆధార స్వాధిష్ఠానాలు అంధకార బంధురాలు. వాటిలో దేవిపూజ అవైదికము. మణిపూరము నుండి సహస్రారము వరకే దేవిని పూజించాలి. ఇక్కడ దేవిని ఉపాసించిన సాధకుడికి ఒక్కొక్క స్థానంలో ఒక్కొక్క ఫలితం వస్తుంది.

1. మణిపూరంలో దేవిని పూజించేవారు దేవిపురానికి దగ్గరగా ఇంకొక పురము నిర్మించుకుని ఉండగలుగుతారు. ఇది **"సార్ష్టిరూపముక్తి".**

2. అనాహతంలో దేవిని పూజించేవారు దేవిపట్టణంలోనే నివసించ గలుగుతారు. ఇది **"సాలోక్యముక్తి"**

3. విశుద్ధి చక్రంలో దేవిని పూజించేవారు దేవికి అతిదగ్గరగా, సేవకులుగా ఉంటారు. ఇది **"సామీప్యముక్తి"**

4. ఆజ్ఞాచక్రంలో దేవిని పూజించేవారు వేరే దేహం ధరించి దేవితో సమానమైన రూపం కలిగి ఉంటారు. ఇది **"సారూప్యముక్తి"**

5. సహస్రారంలో దేవిని అర్చించేవారు జన్మరాహిత్యం పొందుతారు. ఇది **"సాయుజ్యము".**

సాధకుడు గురుముఖతః మంత్రాన్ని స్వీకరించి, గురువునందే లక్ష్యం ఉంచి కొంతకాలం జపం చెయ్యాలి. ఆ తరువాత ఆశ్వయుజ శుద్ధ నవమి రాత్రి గురువుకు పాదాభివందన చేయగా, ఆయన తనచేతిని శిష్యునితలపైఉంచి హస్తమస్తకసంయోగం చేసి షట్చక్రపూజావిధానము, చతుర్విధైక్యసంధానము ఉపదేశిస్తాడు. అప్పుడు భగవతి మణిపూరంలోకి ప్రవేశించి, చతుర్విధైక్యసంధానము చేసినవారికి చతుర్భుజగాను, షడ్విధైక్యసంధానము చేసినవారికి దశభుజగాను దేవి దర్శనమిస్తుంది.

మణిపూరంలో ఉన్న దేవిని మానసికంగా అర్ఘ్యపాద్యాదులు ఇచ్చి షోడశోపచార విధిని పూజించాలి. తరువాత ఆమె అనాహతానికి చేరుతుంది. అక్కడ ఆమెకు ధూప దీప నైవేద్యాలు, హస్త ప్రక్షాళన వరకు పూర్తి చెయ్యాలి. అప్పుడు దేవి విశుద్ధి చక్రం చేరి సింహాసనం మీద కూర్చుని చెలులతో ముచ్చటిస్తుంది. ఇక్కడ దేవిని శుద్ధస్ఫటికాలతో పూజించాలి. శుద్ధస్ఫటికాలు అంటే విశుద్ధిచక్రంలోని పదహారు కళలు. తరువాత దేవిని ఆజ్ఞాచక్రానికిచేర్చి నీరాజనాదులచే సంతోషపెట్టాలి. ఆజ్ఞాచక్రంలో ఉన్న దేవిని లక్ష్మీధరుడు తన "కర్ణావతం స్తుతి"లో

**ఆజ్ఞాత్మక ద్విదళ పద్మగతే తదానీం విద్యున్నిభే రవి శశి ప్రయుతోత్కటాభే**
**గండస్థల ప్రతిఫల త్కరదీపజాల కర్ణావతంస కలికే కమలాయతాక్షి ॥**

ఆజ్ఞాచక్రము అనబడే ద్విదళపద్మంలో దేవి మెరుపుతీగలాగా కోట్లకొలది సూర్యచంద్రుల కాంతితో, తామరపూలవలె విశాలమైన కనులు కలిగి ప్రకాశిస్తూ ఉంటుంది. అలాఉన్నదేవి మెరుపుతీగెలాగా సహస్రకమలంలో ప్రవేశించి పరమశివునితోకూడి సుఖిస్తుంది. అంతవరకు వేచిఉండి సాధకుడు ఆ దేవిని ఆధారచక్రంలోకి తీసుకురావాలి. ఇది **సమయమత రహస్యము.**

ఈ రకంగా కౌళసమయాచారాలు రెండింటినీ ఈ ఆరు శ్లోకాలలోను వివరించారు శంకర భగవత్పాదులవారు.

షట్చక్రాలకు పైన బ్రహ్మరంధ్రం దగ్గర సహస్రదళపద్మమున్నది. ఇందులో ఎనిమిది దిక్కులకు ఎనిమిది దళాలుంటాయి. ఒక్కొక్క దళంలోనూ 125 చిన్నచిన్న దళాలుంటాయి. ఈరకంగా మొత్తం వేయిదళాలుంటాయి. అందుకే దీన్ని సహస్రదళపద్మము అంటారు. ఇక్కడ ఉండేవాడు పరమేశ్వరుడు. ఈ చక్రానికి అధిదేవత యశస్విని. ఇక్కడ సహస్రదళాలలోను అన్ని రంగులు, అన్ని అక్షరాలు ఉంటాయి. ఇది పరమాత్మస్థానము. సహస్రదళంలో వేలకొలది సూర్యకాంతులు ప్రసరిస్తూ ఉంటాయి. యోగీశ్వరులకు ఇక్కడే ఆత్మదర్శనమవుతుంది. అంటే స్వస్వరూపజ్ఞానం కలుగుతుంది. ఇది జీవాత్మపరమాత్మల సంగమస్థానం.

సహస్రారంలో యశస్విని అనే ఈ దేవత అన్ని వర్ణములు అంటే అన్ని రంగులతోనూ ప్రకాశిస్తుంటుంది. అన్ని అక్షరములతోనూ ప్రకాశిస్తుంటుంది. పైన చెప్పిన షట్చక్రాలలోను అక్షరాలు విడివిడిగా ఉంటాయి అని చెప్పాం. కాని ఇక్కడ అ నుంచి క్ష వరకు అన్ని అక్షరాలు ఉంటాయి.

**సర్వవర్ణే మహాదేవీ సంధ్యావిద్యేసరస్వతీ**

ఇంతవరకు చెప్పిన చక్రాలలో దేవతలు తమ నాలుగుచేతులయందు ఆయుధాలుధరించి ఉంటారు. కాని ఇక్కడ ఉండేది పరమేశ్వరి. ఆవిడకు అనేక చేతులు ఉంటాయి. **సహస్రాణి సహస్రథా బాహువోస్తవహేతయః** కాబట్టి అన్ని చేతులయందు అన్నిరకాల ఆయుధాలు ధరించి ఉంటుంది. ఆమె చేతిలో లేని ఆయుధం ఈ లోకంలో లేనేలేదు.

ఈ దేవత సర్వధాతుసారమైన శుక్లమందుంటుంది. ఇది శరీరమంతా వ్యాపించి ఉండే ధాతువు. కాబట్టి ఈ దేవత జీవకోటి శరీరమంతా వ్యాపించి ఉంటుంది.

ధాతుపుష్టి లేని వాళ్ళు **ఓం శుక్ల సంస్థితాయై నమః** అని జపం చేస్తే ధాతువృద్ధి కలుగుతుంది. ఇప్పటి దాకా

**1. ఓం త్వక్కుస్థాయై నమః**
**2. ఓం రుధిరసంస్థితాయై నమః**
**3. ఓం మాంసనిష్ఠాయై నమః**
**4. ఓం మేధోనిష్ఠాయై నమః**
**5. ఓం అస్థిసంస్థితాయై నమః**
**6. ఓం మజ్జాసంస్థాయై నమః**
**7. ఓం శుక్లసంస్థితాయై నమః**

అని మంత్రాలు చెప్పటం జరిగింది. వీటికి

**వశిన్యాది వాగ్దేవతాఋషిః । అనుష్టుప్ఛ్ఛందః । శ్రీ లలితాత్రిపురసుందరీ దేవతా । ఐం బీజం । సౌం శక్తిః । క్లీం కీలకం । జపే వినియోగః**

**న్యాసము : ఐం । క్లీం । సౌః । సౌః । క్లీం ః । ఐం**

**ధ్యానము : సకుంకుమవిలేపనా.........**

ఈ దేవతకు అన్నివైపులా ముఖాలుంటాయి. **సహస్రశీర్షాపురుషః సహస్రాక్షస్స హస్రపాత్** పరమేశ్వరుడికి కొన్నివేల తలలు ఉంటాయి. అంటే ప్రపంచంలోని జీవరాశి అంతా పరమేశ్వరిస్వరూపమే. అందుకే అన్నిజీవులయొక్క శిరస్సులూ ఆ దేవతకుంటాయి. ఇదేవిశ్వరూపము. విశ్వుడు ప్రపంచంలోని జీవరాశికంతటికీ ప్రతీక. అకారాది క్షకారాంతము సర్వదేవతలు ఇక్కడ పరమేశ్వరిరూపంలో ఉంటారు. అందుకే ఈ దేవి అన్నివైపులకూ ముఖాలుంటాయి. కాబట్టే ఈమె సర్వతోముఖీ అనబడింది.

అన్నిరకాలయిన ఆహారములందు ఈమెకు ప్రీతిఉంటుంది. ప్రపంచంలోని సకలజీవరాశి రూపము ఈపరమేశ్వరియే. అందుకే అన్ని జీవుల తలలు ఈమెకు ఉన్నాయి. అలాగే అన్నిరకాల ఆహారపదార్థాలను కూడా ఈ దేవి ప్రేమగానే స్వీకరిస్తుంది.

మనం కూడా అన్నాన్ని ఎప్పుడూ ఉపేక్షించరాదు. **అన్నంననింద్యాత్** అన్నాన్ని నిందించరాదు. అన్నము పరబ్రహ్మస్వరూపము అని అందుకే చెబుతారు.

యశస్వినీ అనబడే ఈదేవతయొక్క బీజము, శక్తి, కీలకము అన్నీ యకార సంకేతముగానే ఉంటాయి. అందుకే ఆమెను యాకినీ అంటారు. యోగినీన్యాసంలో

**ముండవ్యోమస్థపద్మే దశశతదళకే కర్ణికా చంద్ర సంస్థాం**
**రేతోనిష్ఠాం సమస్తాయుధకలితకరాం సర్వతోవక్త్ర పద్మాం**
**ఆదిక్షాంతార్ణశక్తి ప్రకటపరివృతాం సర్వవర్ణాం భవానీం**
**సర్వాన్నాసక్తచిత్తాం పరశివ రసికాం యాకినీం భావయామః ॥**

బ్రహ్మరంధ్రం దగ్గర సహస్రదళపద్మమున్నది. దాని కర్ణికలో అన్నిరకాల ఆయుధాలు ధరించి అన్నివైపులకు ముఖములు కలిగి, సర్వవర్ణములతోను ప్రకాశించునది, అన్నిరకాలైన ఆహారములందు ప్రీతికలది, శుక్లమునందు ఉండునది అయిన యాకినీ అనే దేవత ఉన్నది.

**యోఽహమస్మి బ్రహ్మోహమస్మి । అహమస్మి బ్రహ్మోహమస్మి ।**
**తత్త్వమసి । బ్రహ్మోహమస్మి । సోహం బ్రహ్మోహమస్మి । ఓం**
**బ్రహ్మోహమస్మి । ఆత్మైవేదగ్ం సర్వం । బ్రహ్మై వేదగ్ం**
**సర్వం । సర్వమేతద్బ్రహ్మ । సర్వం ఖిల్విదం బ్రహ్మ ।**
**బ్రహ్మవిద్ బ్రహ్మైవభవతి ॥**

**షట్చక్రనిరూపణంలో** "ఆజ్ఞాచక్రం దాటిన తరువాత యోగి మహానాదాన్ని దర్శిస్తాడు. అతడికి వాక్సిద్ధి కలుగుతుంది. సహస్రదళము పూర్ణచంద్రునిలాగా ప్రకాశిస్తుంటుంది. దానికిరణాలు సూర్యకిరణాలవలె కాంతివంతంగా, చంద్రకిరణాల వలె చల్లగాఉంటాయి. ఇక్కడ అకారాది సర్వవర్ణములు ఉంటాయి. ఇది కేవలము ఆనందరూపమైనది. ఇది చంద్రమండలము. ఇక్కడ వృద్ధిక్షయాలు లేనివాడు, కళంక రహితుడయిన చంద్రుడుంటాడు. ఈచంద్రమండలము మధ్యన మహాశూన్యమున్నది.

**తదంతః శూన్యం తత్సకల సురగణైః సేవితం చాతిగుప్తం**

ఆ మహాశూన్యాన్ని దేవతలు రహస్యంగా సేవిస్తుంటారు. ఆ శూన్యము చాలా రహస్యమైనది. అతిప్రయత్నము మీదగాని దాన్ని పొందలేరు. అక్కడే పరమేశ్వరుడు ఉంటాడు. ఆయన సర్వాత్మరూపి. అజ్ఞానము మోహము పోగొట్టి సాధకుడికి సుధాధారలచే ఆత్మజ్ఞానం కలిగిస్తాడు. అప్పుడు సాధకుడు జీవాత్మ పరమాత్మల సమైక్యము సాధించి పరమహంస అవుతాడు.

**శివస్థానంశైవాః పరమపురుషం వైష్ణవగణాః**
**లపంతీతీప్రాయో హరిహరపదం కేచిదపరే ।**
**పదం దేవ్యా దేవీచరణయుగళాం భోజరసికా**
**మునీనా మప్యంతే ప్రకృతిపురుషస్థాన మమలం ॥**

ఈ ప్రదేశాన్ని శివస్థానమని శైవులు, పరమపురుషస్థానమని వైష్ణవులు, దేవీస్థానమని శాక్తేయులు, హరిహరస్థానమని కొందరు, ప్రకృతి పురుష స్థానమని మరికొందరు అంటారు.

**ఇదం స్థానంజ్ఞాత్వా నియత నిజచిత్తో నరవరో**
**న భూయత్ సంసారే పునరపి న బుద్ధస్త్రిభువనే**
**సమగ్రాశాక్తః స్వాన్నియమ మనసస్తస్వకృతినః**
**సదాకర్తుం ఖగతిరపి వాణీసువిమలా ॥**

ఈ స్థానాన్ని తెలుసుకున్న సాధకుడికి పునర్జన్మలేదు. ఈ లోకంతో బంధం ఉండదు. పాపపుణ్యాలుండవు. సంసారబంధనాలుండవు. ఇష్టార్ధసిద్ధి కలుగుతుంది. ఇక్కడకు చేరిన యోగికి సాయుజ్యం లభిస్తుంది. **సంతానోపనిషత్తులో**

**సప్తమేమాసే జీవసంయుక్తో భవతి ।**
**అష్టమేమాసే సర్వసంపూర్ణో భవతి । నవమే జీవతి ॥**

ఏడవమాసంలో జీవం ఏర్పడుతుంది. పూర్వజన్మలో చేసినకర్మతో జీవుడు ఇందులో ప్రవేశిస్తాడు. ఎనిమిదవ మాసంలో శిశువుకు అన్ని అవయవాలు పూర్తిగా ఏర్పడతాయి. తొమ్మిదవ మాసంలో చలనం ఏర్పడుతుంది. ఈనెలలో గర్భిణీస్త్రీ అన్నిరకాల ఆహారాలు భుజించవచ్చును.

**గతైర్మాణిక్యత్వం గగనమణిభి స్సాంద్రఘటితం**
**కిరీటం తే హైమం హిమగిరి సుతే కీర్తయతి యః ।**
**స నీడేయచ్ఛాయాచ్ఛురణ శబలం చన్ద్రశకలం**
**ధను శ్శౌనాసీరం కిమితి న నిబధ్నాతి ధిషణామ్ ॥** **42**

ఓ దేవీ ! హిమవంతుని కుమార్తె అయిన హైమావతీ ! ద్వాదశాదిత్యులనే మణులచే చక్కగా పొదగబడిన నీ బంగారుకిరీటమును కీర్తించినవాడు, ఆ కిరీటంలో ద్వాదశాదిత్యులు అనే మణులయొక్క కాంతులతో కలిసి చిత్రవిచిత్రమైన కాంతులను ప్రసరింపచేస్తున్న చంద్రరేఖను గాంచి అదిఇంద్రధనుస్సు అని భ్రమిస్తాడు.

పరమేశ్వరి కిరీటంలో దగద్ధమాయమైన కాంతులు ప్రసరిస్తున్న మణులున్నాయి. అవి మామూలుమణులుకావు. ద్వాదశాదిత్యులే ఆ మణుల రూపంలో ఉన్నారు. సూర్యులు పన్నెండుమంది. వారు

1. ఇంద్రుడు, 2. ధాత, 3. పర్జన్యుడు, 4. త్వష్ట, 5. పూష, 6. ఆర్యముడు, 7. భృగుడు, 8. వివస్వంతుడు, 9. విష్ణువు, 10. అంశుమంతుడు, 11. వరుణుడు, 12. మిత్రుడు

వీరందరూ మణుల రూపంధరించి పరమేశ్వరి కిరీటంలో పొదగబడ్డారు. చంద్రరేఖ కూడా ఆకిరీటంలో ఉన్నది. ద్వాదశాదిత్యుల కాంతికి చంద్రరేఖ చిత్రవిచిత్రంగా మెరుస్తోంది. చంద్రరేఖ అర్ధవలయంగా ఉంటుంది. ఇంద్రధనుస్సు అర్ధవలయంగానే ఉంటుంది. అందుచేత ఈ చంద్రరేఖయే ఇంద్రధనుస్సు అని భ్రమపడుతున్నారు.

లలితాసహస్రంలోని 14వ నామం **"కురువిందమణి శ్రేణి కనత్కోటీరమండితా"** అని దేవి కిరీటాన్ని వర్ణించారు. కామము, అనురాగము మొదలైన గుణాలు గల మణులను 'కురువిదములు' అంటారు. ఈ మణులన్నీ రావణగంగ నదీతీరంలో దొరుకుతాయి. ఆ నదిలోదొరికే సౌగంధికము, కురువిందము, స్పటికముల నుండి పుట్టినవాటిని మణులు అంటారు.

వీటిలో కురువిందముల నుంచి పుట్టినవి పద్మరాగమణులు. ఇవి మంకెన్న పువ్వు, దాసాని పువ్వు, దానిమ్మగింజ, రక్తవర్ణములో ఉంటాయి. ఇవిశ్రేష్ఠమైనవి. స్వచ్ఛమైన కాంతిగలవి. స్ఫటికాల నుంచి పుట్టిన వాటికి ఈ లక్షణాలుండవు.

పరమేశ్వరి కిరీటము పద్మరాగమణులతో ప్రకాశిస్తున్నది. ఆ మణులయొక్క ఎరుపుదనము భక్తులయొక్క భక్తిని పెంచుతుంది. ఆ దేవి అరుణారుణచ్ఛాయలో ఉంటుంది. ఎర్రనివస్త్రాలు, ఎర్రనిపూలు ధరిస్తుంది. కిరీటంలోని మణులకూడా

ఎరుపురంగువే. కురువిందములు, మణులు రెండుపదాలుకావు. మాణిక్యాలు దొరికే ప్రదేశాన్ని బట్టి రకరకాలుగా విభజించబడ్డాయి.

1. సింహళంలో దొరికేవి శ్రేష్టమైనవి.

2. కొల్హాపురంలో దొరికేవి కొద్దిగా పసుపు రంగులో ఉంటాయి.

3. ఆంధ్రప్రదేశ్‌లో దొరికేవి సౌగంధికాలు ఇవి మధ్య రకానివి.

4. తుంబురంలో దొరికేవి నీలంరంగులో ఉంటాయి. ఇవి తక్కువ జాతివి.

కామము, అనురాగము అనే గుణాలుగల కురువిందములు అనేమణులచే అలంకరింపబడిన కిరీటముగల దేవిని ధ్యానించుట మంగళప్రదము.

**ధునోతు ధ్వాన్తం న స్తులిత దళితేన్దీవర వనం**
**ఘనస్నిగ్ధశ్లక్ష్ణం చికుర నికురుంబం తవ శివే**
**యదీయం సౌరభ్యం సహజముపలబ్ధుం సమనసో**
**వసన్త్యస్మి న్మన్యే వలమథనవాటీవిటపినామ్ ॥ 43**

ఓ తల్లీ ! అప్పుడే వికసించిఉన్న నల్లకలువల సమూహములాగా, కారుమబ్బుల లాగా దట్టమై, చిక్కనై సుగంధతైలములతో కూడుకొన్న దానిలాగా, మెత్తగా ఉన్న నీ కురులు మాయొక్క అజ్ఞానమును తొలగించుగాక. నీకురులయొక్క సువాసనలు తమకు కూడా తెచ్చుకోవటానికా అన్నట్లు ఇంద్రుని నందనోద్యానవనంలోని కల్పవృక్ష పూలు నీకురులయందు చేరినాయి.

బలమధనుడు – బలుడనే రాక్షసుని మధించినవాడు – ఇంద్రుడు. ఈ శ్లోకంలో పరమేశ్వరి కురులు సుగంధపరిమళాలు వెదజల్లుతున్నాయి. ఆ పరిమళాలను గ్రహించటానికి నందనోద్యానవనంలోని పూలుదేవి కురులను ఆశ్రయించినాయి అంటున్నారు. అంటే పూవులకు సువాసన ఆ దేవి కురులనుంచేవచ్చింది. లలితా సహస్రంలోని 13వ నామం **"చంపకాశోకపున్నాగ సౌగంధికలశత్కచా"** ఇక్కడ ముందుగా దేవి కురులను వర్ణించటం జరుగుతోంది. సప్తశతిలో మహిషాసుర సంహారం చెబుతూ

**యామ్యేన చా భవన్‌కేశా, బాహువో విష్ణుతేజసా**

అన్నారు. యమునియొక్క తేజస్సుతో పరమేశ్వరికేశపాశాలు వచ్చినాయి. ఆ కేశపాశాలు సంపంగి, అశోకము, పున్నాగము మొదలైన పూలసువాసనలతో గుబాళిస్తున్నాయి. ఆ పూలు ధరించటంవల్ల దేవికేశాలకు సువాసన రాలేదు. దేవి ధరించటంవల్లనే వాటికి ఆవాసన వచ్చింది. అంటే కేశపాశములు సహజ సుగంధములు. దుర్వాసుడు తన **'దేవీ మహిమ్నాస్తుతి'**లోని 37వ శ్లోకంలో దేవికురులను శ్లాఘిస్తూ

**జాతీ చంపక కుంద కేసర రజోగంధోత్కిర త్కేతకీ**
**నీపాశోక శిరీష ముఖ్యకుసుమైః ప్రోస్తం సితాధూపితా**
**ఆనీలాంగనతుల్య మత్తమధుప శ్రేణీవ వేణీతవ**
**శ్రీమాతః । శ్రయతాం మదీయ హృదయామ్భోజం సరోజాలయే**

ఓ తల్లీ ! సంపెంగ, మొగలి, మొల్ల, కడిమి, అశోక, దిరిశెన మొదలైన పూలు అలంకారములుగా కలిగి, అగరుమొదలైన ధూపములు వేయబడి, దట్టమైన నీలిరంగుగల, కాటుకతో సమానమైన, తుమ్మెదల వరుసలాగా ప్రకాశించే నీకురులు నా హృదయపద్మమును ఆశ్రయించుకుని ఉండాలి." అన్నారు.

**తనోతు క్షేమం న స్తవ వదనసౌందర్యలహరీ**
**పరీవాహస్రోతస్సరణిరివ సీమన్తసరణిః**
**వహన్తీ సిన్దూరం ప్రబల కబరీభార తిమిర**
**ద్విషాం బృన్దై ర్బన్దీకృతమివ నవీనార్క కిరణమ్॥ 44**

ఓ తల్లీ ! నీయొక్క వదన సౌందర్యము పొంగిప్రవహించే ప్రవాహములాగా ఉన్నది. ఆ ప్రవాహము నుండి చీలి ప్రవహించే నీటిపాయలాగా నీపాపిట ఉన్నది. దానికి రెండువైపులా ఉన్న దట్టమైన నీకురులు, కారుచీకటిలాగా నల్లగాఉండి, ఆ పాపిటకు రెండువైపులా ఉన్న శత్రుసమూహమువలె ఉండగా ఆ మధ్యఉన్న ఆసింధూరము సమూహానికి బందీగాచిక్కిన బాలసూర్యునిలా కనిపిస్తూ, మాకు జ్ఞానజ్యోతులు ప్రసాదిస్తున్నది.

ఈ శ్లోకంలో శంకరభగవత్పాదులవారు పరమేశ్వరియొక్క పాపిటను వర్ణిస్తున్నారు. పాపిటయందు సింధూరము ధరించుటమనేది పుణ్యస్త్రీల ఆచారము. అయితే ఈ ఆచారం ఉత్తరభారతదేశంలో ఎక్కువగా ఉంది. అక్కడ వివాహమైన ప్రతి స్త్రీ పాపిటయందు సింధూరాన్ని ధరిస్తుంది. ఇది సుమంగళీచిహ్నం. పరమేశ్వరి సౌందర్యము పైకిప్రాకుతూ పాపిటవరకు వ్యాపించి ఉన్నది. బాలభానుని కిరణాలు, అప్పటివరకు ఆవరించి ఉన్న చీకటి తెరలను ఏ రకంగా పోగడతాయో, అలాగే ఆ పాపిటయందలి సిందూరము మన అజ్ఞానాన్ని పోగొడుతుంది.

లలితా సహస్రంలోని 289వ నామం చూడండి. **శ్రుతి సీమంత సింధూరీకృత పాదాబ్జధూళికా** శ్రుతులుఅంటే వేదాలు. సీమంతసింధూరము అంటే శరీరంలో ఉన్నతస్థానమైన శిరస్సు, పాదాబ్జధూళి అంటే మహావాక్యాలు, వేదాలు, ఉపనిసత్తులు పరమేశ్వరిస్వరూపాన్ని వర్ణించటానికి చాలావరకు ప్రయత్నం చేశాయి. కాని పూర్తిగా సఫలం కాలేకపోయాయి. అంటే వేదాలు, ఉపనిషత్తుల వలన కూడా వర్ణింపనలవి కానిది. అవి ఆమెకు పాపటబొట్టులాంటివి. "శివస్తుతి"లో 'శివా ! నీకు ప్రియమైన శ్రుతులు కూడా నిన్ను పూర్తిగా వర్ణించలేకుండా ఉన్నాయి. మిగిలినవి 'నేతి, నేతి' (ఇది కాదు, ఇది కాదు) అంటూ నిషేధవాక్యాలచే చెప్పటానికి ప్రయత్నించాయి. అటువంటి నిన్నుగురించి చెప్పటానికి నేనెంతవాడను?" అంటాడు. అనగా వేదాలకు ఉపనిషత్తులకు కూడా అందనిది పరబ్రహ్మస్వరూపం.

నాలుగువేదాలకు కలిపి 1180 ఉపనిషత్తులు ఉన్నాయి. వాటిలో 108మాత్రమే చదవతగ్గవి అని తేల్చారు. అందులో పదిఉపనిషత్తులు ముఖ్యమైనవి అన్నారు. శంకరభగవత్పాదులవారు. ప్రతిఉపనిషత్తు ఏదో ఒకవేదానికి సంబంధించినదే. వీటిలో

| | | |
|---|---|---|
| ఐతరేయోపనిషత్తు | – | ఋగ్వేదంలోది |
| కఠ, తైత్తిరీయోపనిషత్తులు | – | కృష్ణయజుర్వేదంలోవి |
| ఈశావాశ్యము, బృహదారణ్యకము | – | శుక్లయజుర్వేదంలోని |
| కేన, ఛాందోగ్యోపనిషత్తులు | – | సామవేదంలోవి |
| ప్రశ్న, ముండక, మాండూక్యోపనిషత్తులు | – | అధర్వణవేదంలోవి |

ఉపనిషత్తుఅంటే బ్రహ్మవిద్య. బ్రహ్మవిద్యాపరిశీలకులైన విద్వాంసులకు కర్మ, జన్మ, మరణాలు లేకుండా చేసేది. ఆ జన్మాదిమరణాదికమైన దానిని నశింపజేసి, బ్రహ్మపదార్థలాభం కలిగించేది.

ఈ విధంగా ఉపనిషత్తులు పరబ్రహ్మస్వరూపాన్ని ప్రతిపాదించటంలో చాలావరకు సఫలీకృతమైనాయి. ఈ ఉపనిషత్తులసారమంతా మహావాక్యాలలో ఉంది. ఈ మహావాక్యాలు నాలుగు అవి.

| | | | |
|---|---|---|---|
| 1. | ప్రజ్ఞానంబ్రహ్మ | ఐతరేయోపనిషత్తు | ఋగ్వేదము |
| 2. | అహం బ్రహ్మాస్మి | బృహదారణ్యకోపనిషత్తు | శుక్లయజుర్వేదము |
| 3. | తత్త్వమసి | ఛాందోగ్యోపనిషత్తు | సామవేదము |
| 4. | అయమాత్మాబ్రహ్మ | మాండూక్యోపనిషత్తు | అధర్వణవేదము |

ఈ మహావాక్యాలసారమే పరబ్రహ్మస్వరూపం. ఇక్కడ 'పాదాబ్జధూళి' అంటే ఉపనిషత్తుల సారమైన మహావాక్యాలు.

అమ్మవారి పాపిటసింధూరము అనేది మహావాక్యాలసారము. అందుకే అది మనఅజ్ఞానాన్ని పారద్రోలి జ్ఞానజ్యోతులను ప్రకాశింపచేస్తుంది అంటున్నారు భగవత్పాదులవారు.

**అరాళైస్స్వాభావ్యా దళికలభసశ్రీభిరలకైః**
**పరీతం తే వక్త్రం పరిహసతి పఙ్కేరుహరుచిమ్ ।**
**దరస్మేరే యస్మిన్ దశనరుచికిఞ్జల్కరుచిరే**
**సుగన్ధౌ మాద్యన్తి స్మరదహన చక్షుఃర్మధులిహః ॥ 45**

ఓ తల్లీ ! నీ ముఖాన వ్రేలాడే ముంగురులు వంకరలు తిరిగి నీ ముఖపద్మము కన్న అందంగా ఉన్నది. నువ్వు చిరునవ్వు నవ్వినప్పుడు నీ పలువరుస కింజల్కముల (కేసరములు)వలె ప్రకాశిస్తూ, మన్మథుని భస్మంచేసిన శివునిచూపులు అనే తుమ్మెదలను నీముఖపద్మము ఆకర్షిస్తున్నది.

ఈ శ్లోకంలో దేవియొక్క ముఖపద్మాన్ని వర్ణిస్తున్నారు. గిరిజాకల్యాణ సందర్భంలో మన్మథుణ్ణి దహించినవాడు శివుడు. పరమేశ్వరి ముఖపద్మము ఇప్పుడు

ఆ ఈశ్వరునకి కూడా వికారం కలిగిస్తున్నది ఈశ్వరునికి కూడా మదనతాపాన్ని రేపుతున్నది. అంటే ఆ ముఖసౌందర్యాన్ని వర్ణించ అలవి కాదు.

అందమైనముఖాన్ని వర్ణించేటప్పుడు సాధారణంగా శరత్కాలచంద్రునితో వర్ణిస్తారు. లేదా పూర్తిగా వికసించిన పద్మముతో పోలుస్తారు. ఇక్కడ శంకరులవారు అమ్మవారిముఖాన్ని పోల్చటానికి పద్మముకూడా సరికాదు అంటున్నారు. పద్మముకన్న ఆ దేవి ముఖము అందమైనది. ఎందుచేతనంటే, ముందుపద్మానికి, అమ్మవారి ముఖానికి గల లక్షణాలు, పోలికలు చూద్దాం.

1. పద్మం వికసిస్తుంది. చిరునవ్వునవ్వినపుడు దేవిముఖం కూడా వికసిస్తుంది.

2. పద్మానికి అందమైనకేసరములు ఉంటాయి. అమ్మవారిపలువరుసయే ఇక్కడ కేసరములు.

3. పద్మానికి సుగంధంఉంటుంది. దేవిముఖము నిత్యసుగంధభరితము.

4. పద్మములో తేనె ఉంటుంది. అమ్మవారి అధరములయందు తేనె ఉంటుంది. (తేనె లొలుకు మాటలు)

5. పద్మముపై తుమ్మెదలువాలతాయి. అమ్మవారి ముఖపద్మంమీద శివుని చూపులు అనే తుమ్మెదలువాలుతాయి.

6. పద్మములోని మధువు అయిపోగానే తుమ్మెద వేరొక పద్మాన్ని వెతుక్కుంటుంది. కాని శివుని దృష్టి మాత్రం అమ్మవారినుంచి సడలదు. ఇది ప్రత్యేకమైన లక్షణము.

7. సహజమైన ముంగురులు ఆ దేవి యొక్క ప్రత్యేకత. ఇవి పద్మానికి లేవు.

ఈ కారణాలవల్ల అమ్మవారి ముఖము పద్మముకన్న ఉన్నతమైనది.

**లలాటం లావణ్యద్యుతివిమల మాభాతి తవ యత్**
**ద్వితీయం తన్మన్యే మకుటఘటితం చన్ద్రశకలమ్ ।**
**విపర్యాసన్యాసా దుభయ మపి సమ్భూయ చ మిథః**
**సుధాలేపస్యూతిః పరిణమతి రాకాహిమకరః ॥ 46**

తల్లీ ! చంద్రకాంతులవంటి కాంతులు ప్రసరించుచున్న నీవదనాన్ని నేను రెండవ చంద్రఖండము అనుకుంటున్నాను. ఎందుకంటే మొదటిఖండము నీ కిరీటము నందు పొదగబడి ఉన్నది. ఈ రెండింటినీకలిపితే పూర్ణచంద్రబింబము ఏర్పడుతున్నది.

పరమేశ్వరి శిరస్సుమీద కిరీటంఉన్నది. ఆ కిరీటం ముఖాన్ని పైనుంచి కొంత వరకు కప్పివేస్తుంది. అప్పుడు దేవిముఖం అర్ధచంద్రాకారంగా కనిపిస్తుంది. అందుకే లలితా సహస్రంలోని 15వ నామంలో **"అష్టమీచంద్రభిభ్రాజదలికస్థలశోభితా"** అని చెప్పబడింది. అష్టమిరోజున చంద్రబింబము ఏరకంగా ఉంటుందో, అదే రకంగా దేవిముఖము అర్ధచంద్రాకారంగా ఉన్నది అనిఅర్ధం. పాడ్యమి నుంచి పౌర్ణమి వరకు తిథులు పదిహేను. చంద్రుడికి వృద్ధిక్షయాలుంటాయి. అమావాస్య వెళ్ళిన తరువాత పాడ్యమి. దీన్ని శుక్లపక్షము అంటారు. చంద్రునికళలు పదహారు. ఇవన్నీసూర్యునిలో కలిసి ఉంటాయి. శుక్లపక్ష పాడ్యమినాడు సూర్యుని నుంచి ఒకకళ వచ్చి చంద్రునిలో చేరుతుంది. అలాగే విదియనాడు రెండవకళ, తదియనాడు మూడవకళ. ఈ రకంగా పౌర్ణమి వచ్చేసరికి పదిహేనుకళలు వచ్చి చంద్రునిలో చేరతాయి. మరి పదహారవకళ ఏది ? అంటే **షోడశీతు కళాజ్ఞేయా సచ్చిదానంద రూపిణీ** పదహారవకళ సాక్షాత్తు ఆపరమేశ్వరి అయిఉన్నది. ఇదే విధంగా అమావాస్య వెళ్ళిన మరునాటి నుంచీ కృష్ణపక్షము. ఇక్కడ ప్రతిరోజూ చంద్రుని నుంచి ఒకకళ వెళ్ళి సూర్యునిలో చేరుతుంది. ఈ రకంగా అమావాస్య వచ్చేసరికి చంద్రునిలోని పదిహేనుకళలు సూర్యుని చేరతాయి. అందుచేత అమావాస్యనాడు చంద్రుడు కళావిహీనుడు. పౌర్ణమినాడు పూర్ణచంద్రుడు. ఈరకంగా చంద్రుడికి వృద్ధిక్షయాలున్నాయి. అయినప్పటికీ తిథులన్నింటిలోకి అష్టమి మధ్యన ఉన్నది. ఈ కారణంవల్ల శుక్లపక్షమైనా, కృష్ణపక్షమైనా అష్టమినాటి చంద్రుడు సమంగా ఉంటాడు. కాబట్టే అమ్మవారి ముఖము అర్ధచంద్రుని పోలి ఉన్నది. కిరీటంలో అర్ధచంద్రుడు, ముఖం అర్ధచంద్రుడు. ఈ రెండూ కలిపితే పూర్ణచంద్రుడు. అదే చంద్రమండలము. సహస్రారము. ఇక్కడ వృద్ధిక్షయాలు లేని చంద్రుడుంటాడు. సాధకుడు మూలాధారచక్రంలో ఉన్న కుండలినీ శక్తిని ప్రేరేపించి, గ్రంథిత్రయాన్ని భేదించి, అక్కడనుండి సహస్రదళపద్మం చేరతాడు. ఆధారచక్రంలో జాగృతమైన కుండలినీశక్తి షట్చక్రాలను దాటి, సహస్రారంచేరి,

సహస్రదళపద్మము యొక్క కర్ణికను తననోటితోకరచి పట్టుకుంటుంది. ఆపంటిగాట్ల నుంచి అమృతం జాలువారుతుంది. ఆఅమృతంవల్ల సాధకుని శరీరంలోని 72వేల నాడీమండలము తడుపబడుతుంది. ఇది సాధన ఫలితము.

అయితే పరమేశ్వరి వదనము అనే చంద్రుని ఉపాసించినవారికి అమృతము జాలువారి బ్రహ్మానందం కలుగుతుంది. అదే విషయాన్ని ఈశ్లోకంలో చెబుతున్నారు శంకరులవారు. పరమేశ్వరి లలాటాన్ని పూజించిన వారికి అమృతత్వం సిద్ధిస్తుంది.

**భ్రువౌ భుగ్నే కించిద్భువనభయభఙ్గవ్యసనిని**
**త్వదీయే నేత్రాభ్యాం మధుకరరుచిభ్యాం ధృతగుణమ్ ।**
**ధను ర్మన్యే సవ్యేతరకరగృహీతం రతిపతేః**
**ప్రకోష్ఠే ముష్టౌచ స్థగయతి నిగూఢాంతర ముమే ॥ 47**

ఓ తల్లీ ! కొంచెము వంగిఉండి, తుమ్మెదల వరుసలాగా నీలిరంగుకలిగి, అందమైన కనుగవచేతకట్టబడిన అల్లెత్రాడుతో కూడిన నీ కనుబొమలజంట, మన్మథుడు తన ఎడమచేతి పిడికిలితో పట్టుకున్నప్పుడు కనుపించకుండాఉన్న ధనుస్సు యొక్క మధ్యభాగము అని తలుస్తాను.

ఈ శ్లోకంలో ఆ దేవియొక్క కనుబొమలను వర్ణిస్తున్నారు. కనుబొమలు కొద్దిగా వంగి ఉన్నాయి. నీలిరంగులో ఉన్నాయి. ఈ కనుబొమలను మన్మథుని ధనుస్సుతో పోలుస్తున్నారు. ఆ ధనుస్సును మన్మథుడు ఎడమచేతితోపట్టుకున్నప్పుడు దాని మధ్యభాగం కనిపించదు. అయితే ధనుస్సు మధ్యభాగాన్ని పట్టుకున్నప్పుడు అది రెండుగా కనిపించినట్లే కనుబొమ్మలు కూడా రెండుగా కనిపిస్తున్నాయి. ఇక్కడ ఆ దేవి యొక్క కనుబొమ్మలను ధనుస్సుతోపోల్చి చెబుతున్నారు. పరమేశ్వరి సర్వకాల సర్వావస్థలయందు దీనులను, ఆర్తులను రక్షించటంలో నిమగ్నమైఉంటుంది. **సప్తశతి**లో శుంభనిశుంభులవధ జరిగిన తరువాత ఇంద్రాది దేవతలు పరమేశ్వరిని పరిపరివిధాల ధ్యానిస్తారు. అప్పుడు ఆ దేవి దేవతలతో

**ఇత్థం యదాయదా బాధా దానవోత్థా భవిష్యతి**
**తదాతదా వతీర్యాహం కరిష్యామ్యరి సంక్షయం**

ఈ రకంగా రాక్షసులవల్ల బాధ కలిగినప్పుడల్లా నేను అవతరించి రాక్షస సంహారం చేస్తాను. అంటుంది. ఈవిధంగా ఆమె ఎల్లవేళలయందు ఆ పన్నులను రక్షించే ప్రయత్నంలోనే ఉంటుంది కాబట్టే, ఆమెకనుబొమలు ధనుస్సుతో పోల్చబడినాయి.

లలితా సహస్రంలోని 17వ నామం **"వదనస్మరమాంగల్య గృహతోరణచిల్లికా"** ముఖమనే మన్మథగృహానికి కట్టబడిన మంగళతోరణములవలె నున్న కనుబొమలు గలది.

'చిల్లికా' అంటే కనుబొమ్మ. పరమేశ్వరి ముఖము మన్మథుని మంగళగృహము యొక్క బహిర్ద్వారతోరణము. పరమేశ్వరిముఖము అనే మన్మథగృహానికి కనుబొమ్మలు తోరణాలు. దేవిఆవిర్భవించినప్పుడు ప్రాతః సంధ్య, సాయంసంధ్యలు ఆమె కనుబొమ్మలుగా ఏర్పడినాయి. ఇక్కడ పంచప్రణవాలు చెప్పబడ్డాయి. పంచప్రణవాలు అంటే ఐం, క్లీం, సౌః, శ్రీం, హ్రీం

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఐం | – | వదనము | శ్రీం | – | గృహ |
| క్లీం | – | స్మర | హ్రీం | – | తోరణ |
| సౌ | – | మాంగల్య | | | |

షోడశిమహామంత్రంలో పంచప్రణవాలు అనులోమ విలోమంగా చెప్పబడ్డాయి.

ఈ నామంలో పరమేశ్వరి ముఖము మన్మథగృహము అనీ, కనుబొమలు ఆ గృహద్వారానికి కట్టిన మంగళతోరణాలు అని చెప్పబడ్డాయి. **'దేవీ మహిమ్నాస్తుతి'**లో దుర్వాసుడు దేవిముఖాన్ని వర్ణిస్తూ

**ఉద్యత్పూర్ణకలానిధి శ్రివదనం భక్తప్రసన్నం సదా**
**సంపుల్లాంబుజ పత్రకాంతి సుషమా ధిక్కార దక్షేక్షణం**
**సానందం కృతమందహాస మసకృత్ప్రాదుర్భవ త్కౌతుకం**
**కుందాకార సుదంతపంక్తి శశిభా పూర్ణం స్మరా మ్యంబికే ॥**

అప్పుడే ఉదయించిన సూర్యునిలాగా భక్తులకుప్రసన్నమై, తామరపూలకన్న మిన్నఅయిన నేత్రాలతో, చక్కనిపలువరసతో, మనోహరంగా నీముఖము ప్రకాశిస్తున్నది" అంటున్నారు.

**అహస్సూతే సవ్యం తవ నయనమర్కాత్మకతయా**
**త్రియామాం వామం తే సృజతి రజనీనాయకతయా ।**
**తృతీయా తే దృష్టి ర్దరదళితహేమామ్బుజరుచి**
**స్సమాధత్తే సన్ధ్యాం దివసనిశయో రన్తరచీరమ్ ॥ 48**

ఓ తల్లీ ! నీ కుడికన్ను సూర్యుడు. దీనివల్ల పగలు కలుగుతున్నది. ఎడమకన్ను చంద్రుడు. దానివల్ల రాత్రి కలుగుతున్నది. నీ మూడవ నేత్రము ఉభయ సంధ్యలకు ప్రతీకగా ఉన్నది.

ఈ శ్లోకంలో చంద్ర సూర్యాగ్నులు మూడుకనులై పగలు, రాత్రి, సంధ్యా సమయాలను కలిగిస్తున్నాయి అంటున్నారు. **బృహదారణ్యకోపనిషత్తు**లో ఒక కథ ఉన్నది. ఒకసారి యాజ్ఞవల్క్యుడు జనకుని ఆ స్థానానికి వచ్చాడు. జనకమహారాజు యాజ్ఞవల్క్యుని ఉచితరీతినసత్కరించి, 'గురుదేవా ! చిన్న సందేహము' అన్నాడు. ఏమిటో అడగమన్నాడు గురువుగారు.

**జ** – లోకంలో జీవునియొక్క కార్యక్రమాలు ఏరకంగా జరుగుతాయి?

**యా** – సూర్యునియొక్క వెలుగులతో

**జ** – మరి సూర్యుడులేనప్పుడు అనగా రాత్రులందు ఏ విధంగా పనులు చేస్తాయి?

**యా** – చంద్రకాంతులవల్ల

**జ** – సూర్యుడు, చంద్రుడు. ఇద్దరూ లేకపోతే ? అన్నాడు జనకమహారాజు

**యా** – అగ్నియొక్క వెలుగులతో. సూర్యచంద్రులు లేని కాలంలో అదే సంధ్యా సమయము. ఆ సంధ్యాసమయంలో అగ్నియొక్క వెలుగులతో జీవిచరిస్తాడు (దీపము వెలుగులతో)

**జ** – చంద్రుడు, సూర్యుడు, అగ్ని మూడు లేకపోతే

**యా** – శబ్దము. అదే వాక్కు. పై మూడు లేనప్పుడు ఒకజీవి శబ్దం చేస్తుంది. లేదా వాక్కును ప్రసరింపజేస్తుంది. ఆ వాక్కు ఆధారంగా జీవి నడచుకుంటాడు.

**జ** – సూర్యుడు, చంద్రుడు, అగ్ని, వాక్కు ఏవీలేకపోతే

**యా** – ఆత్మ–ఆత్మయొక్క వెలుగుతో జీవి తన పనులను చేసుకుంటాడు.

ఈ రకంగా సూర్యచంద్రాగ్నులవలన పగలు, రాత్రి, సంధ్యలు మూడు ఆ పరమేశ్వరి **కన్నులేను** అంటున్నారు భగవత్పాదులవారు. **'భైరవ యామళం'**లో పరమేశ్వరిని వర్ణిస్తూ

**తేషాం అనంతకోటీనాం మయూఖానాం మహేశ్వరీ**
**అష్టోత్తరశతం వహ్నే, షోడశోత్తరశతం రవేః**
**షట్త్రింశదుత్తరశతం, చంద్రస్య కిరణాశ్శివే**
**బ్రహ్మాండం భాసయంతస్తే పిండాండ మపిశాంకరి**
**దివాసూర్యౌ, స్తథారాత్రౌసోమో వహ్నిశ్చ సంధ్యయోః ॥**

ఆ పరమేశ్వరిశరీరంనుంచి లెక్కలేనన్ని కాంతికిరణాలు ప్రసరిస్తున్నాయి. ఈ కిరణాలవల్లనే బ్రహ్మాండమంతా ప్రకాశిస్తున్నది. ఆ కిరణాలలో 108 అగ్నిదేవుడు, 116 సూర్యుడు, 136 కిరణాలు చంద్రుడు తీసుకున్నారు. పగటిపూట సూర్యకాంతులతోను, రాత్రిపూట చంద్రునికాంతులతోను సంధ్యవేళలయందు ఈ అగ్నివల్ల జగత్తు ప్రకాశిస్తుంది. ఇది ఒక దినము. అలాగే

| | | |
|---|---|---|
| ఏడు రోజులు | – | ఒక వారం |
| రెండు వారాలు | – | ఒక పక్షం |
| రెండు పక్షములు | – | ఒక మాసము |
| రెండు మాసములు | – | ఒక ఋతువు |
| మూడు ఋతువులు | – | ఒక అయనము |
| రెండు అయనములు | – | ఒక సంవత్సరము |

ఈ రకంగా కాలప్రమాణము ఏర్పడుతున్నది. అంతేకాదు పగలు – జాగ్రదవస్థ. రాత్రి – సుషుప్తి, సంధ్యాసమయమందు స్వప్నావస్థ చెప్పబడ్డాయి. జాగ్రదవస్థలో అజ్ఞానాన్ని, సుషుప్తిలో అజ్ఞానాంధకారాన్ని తొలగించి, రాత్రిసమయంలో సమాధిస్థితికి సాధకుడు చేరతాడు.

అవస్థాత్రయాన్ని గురించి **'మహోపనిషత్తు'**లో వివరించటం జరిగింది. అజ్ఞానము ఏడురకాలుగా ఉంటుంది. వీటిలో జాగ్రదవస్థ మూడురూపాలు, స్వప్నావస్థ మూడురూపాలు కాగా ఏడవదిసుషుప్తి. వీటిమీద వివరణకు నాచే వ్రాయబడిన **ఆత్మసాక్షాత్కారము** గ్రంథంలో 71, 72 పేజీలు చూడండి.

**విశాలా కల్యాణీ స్ఫుటరుచి రయోధ్యా కువలయైః**
**కృపాధారాధారా కిమపి మధురా ఽ ఽ భోగవతికా ।**
**అవన్తీ సృష్టి, స్తే బహునగర విస్తారవిజయా**
**ధ్రువం తత్తన్నామవ్యవహరణయోగ్యా విజయతే ॥ 49**

దేవీ ! నీ నేత్రములు విశాలమై 1. విశాల అనే పేరుగల నగరాన్ని, కల్యాణవంతమై 2. కళ్యాణీనగరాన్ని, స్పష్టమైన కాంతి కలిగి నీలోత్పలములచే ఎదుర్కొనుటకు సాధ్యము కానిదై 3. అయోధ్యానగరాన్ని, కృపారమృత దారలకు ఆధారమై 4. ధారానగరాన్ని, అవ్యక్త మధురమై, ఇలాటిది అని చెప్పటానికి వీలు కాని 5. మధురానగరాన్ని, పరిపూర్ణత గలదై లోపల వైశాల్యము కలదై (అభోగము గలదై) అభోగవతీనగరాన్ని, భక్తజనావనమై, ఆశ్రితరక్షకమై 7. అవంతీనగరాన్ని విజయ సంకేతమై 8. విజయనగరాన్ని ఈ రకంగా ఎనిమిదినగరాల పేర్లను వ్యవహరించటానికి వీలవుతున్నది.

ఈ శ్లోకంలో పరమేశ్వరియొక్క దృష్టిని వివరిస్తున్నారు. విశాల మొదలు విజయ వరకుగల ఎనిమిదినగరాలు, ఎనిమిదిచూపులవుతున్నాయి.

1. అంతర్వికాసంతో కూడినది 'విశాలదృష్టి'
2. ఆశ్చర్యము, లేత చిరునవ్వులతో కూడినది 'కళ్యాణీదృష్టి'
3. మొలకనవ్వుతో కూడిన నల్లగ్రుడ్డు గలది 'అయోధ్యాదృష్టి'
4. అలసభావము లేక మాంద్యము గలది 'ధారాదృష్టి'
5. వక్రప్రసారము గలది. 'మధురాదృష్టి'
6. సుందరమైన స్నేహముతో కూడినది 'భోగవతీదృష్టి'
7. యవ్వనారంభంలో ఉన్న కన్యదృష్టి 'అవంతీదృష్టి'
8. కంటి చివరి భాగము తాకిన నల్లగ్రుడ్డు గలది 'విజయాదృష్టి'

ఈ రకంగా ఎనిమిది దృష్టులు అందరికీ ఉంటాయి. కాని పరమేశ్వరికి మాత్రము ఇవి విశేషంగా ఉంటాయి. ఇవి 1. సంక్షోభము 2. ఆకర్షణ 3. ద్రావణము 4. ఉన్మాదము 5. వశ్యము 6. ఉచ్చాటనము 7. విద్వేషణము 8. మారణము

పరమేశ్వరియొక్క దృష్టి ఈఎనిమిది కార్యములయందు ప్రత్యేకత కలిగి ఉన్నది.

1. దేవి ఏప్రదేశంలో ఉండి విశాల అనే దృష్టితో జనసంక్షోభము (కలత) కావించిందో, ఆ ప్రదేశము విశాల నగరమయింది.

2. ఏ ప్రదేశంలో కల్యాణి అనే దృష్టితో జనాకర్షణ గావించిందో అది కల్యాణీ నగరము.

3. ఏ ప్రదేశంలో అయోధ్యా దృష్టితో ద్రావణం కావించిందో అది అయోధ్య. (ద్రావణము - పారద్రోలుట, కరిగించుట)

4. ఏ ప్రదేశంలో ధారాదృష్టితో ఉన్మాదము తెప్పించిందో అది ధారానగరము. (ఉన్మాదము–వెర్రి)

5. ఏ ప్రదేశంలో మధురదృష్టితో వశీకరణ గావించిందో అది మధుర

6. ఏ ప్రదేశంలో భోగవతిదృష్టితతో శత్రువులకు ఉచ్చాటన చేసిందో అది భోగవతి. (ఉచ్చాటన - వెళ్ళగొట్టటం, పిశాచాదులను విడిపించటం)

7. ఏ ప్రదేశంతో అవంతీదృష్టితో విద్వేషణ చేసిందో అది అవంతి (విద్వేషణము–విరోధము, పగ)

8. ఏ ప్రదేశంలో విజయాఖ్యదృష్టితో శతృమారణం చేసిందో అది విజయానగరము. (మారణము–సంహారము)

ఈ రకంగా పరమేశ్వరి యొక్క దృష్టి వివిధ కర్మలకు సాధనభూతము. ఈ శ్లోకంలో అమ్మవారి దృష్టికి ఎనిమిది లక్షణాలను చెబుతూ, అవి భారతదేశంలోని ఎనిమిది నగరాలను సూచిస్తున్నాయి అన్నారు.

1. విశాల అంటే కళ్ళు పెద్దవిగా ఉండి ఎంత దూరమైనా ఎన్నివైపులకైనా ప్రసరించి, భక్తులను అనుగ్రహించగల దృష్టి. ఈ దృష్టి ఎక్కువగాప్రసరించింది విశాల నగరంలో. ఈ రోజున బదరిగా పిలువబడే నగరమే నాటి విశాల.

2. మంగళకరము, శుభప్రదము అయిన దృష్టి కల్యాణి. ఈ దృష్టి ప్రసరించిన భాగము బొంబాయి, నాసిక్‌ల మధ్య ప్రాంతము.

3. దృష్టిలోపం లేకుండా స్పష్టమైన, స్ఫుటమైన దృష్టి ప్రకాశము గలది. నల్లకలువలు కూడా జయించలేని సౌందర్యము గలది. ఈ దృష్టి ప్రసరించిన భాగము అయోధ్య. ఇది ఉత్తరప్రదేశ్‌లో ఉన్నది.

4. కరుణాపూరితమైన దృష్టి ప్రసరించిన భాగము. ధారానగరము. ప్రస్తుతము ఇది ధార్ ప్రాంతము.

5. చెప్పనలవిగాని మాధుర్య దృష్టి లక్షణము గలది. అదే మధురానగరము.

6. అంతరాంతరములలోకి ప్రసరించ గల లోతైన భోగవైభవాలు పొందే దృష్టిలక్షణము గలది. అదే భోగవతీనగరము. నేటి అమరావతి.

7. ఆశ్రితరక్షణ గల దృష్టి అవంతి. ఈ దృష్టి ప్రసరించిన ప్రదేశము అవంతీనగరము.నేటి ఉజ్జయినీ

8. చూపులతోనే ఎదుటివారిని జయించగల విజయలక్షణము గల దృష్టి విజయ. ఇది ఎక్కువగా ప్రసరించిన ప్రదేశమే విజయనగరము. నేటి విజయనగరము అంటూ దేవియొక్క దృష్టికి గల వివిధ లక్షణాలను వివరించారు.

**కవీనాం సన్దర్భస్తబక మకరన్దై కరసికం**
**కటాక్షవ్యాక్షేప భ్రమరకలభౌ కర్ణయుగళమ్**
**అముఞ్చన్తౌ దృష్ట్వా తవ నవరసాస్వాదతరళౌ**
**అసూయాసంసర్గా దలికనయనం కిఞ్చిదరుణమ్ ॥ 50**

అమ్మా ! కవీశ్వరుల రసవత్తరమైనరచనలు అనే పుష్పగుచ్ఛాలనుండి జాలువారిన తేనెయందుమాత్రమే ఆసక్తిని చూపే నీ చెవులను, కడగంటి చూపులు అనే నెపంతో నీరెండు కనులు అనే గండు తుమ్మెదలు, శృంగారానుభూతి పొందుట యందు ఆసక్తిగలవై, నీ వీనులజంటను విడువలేక ఉండగా, పై భాగాన ఉన్న లలాట నేత్రము ఇది చూసి మిక్కిలి అసూయ చెంది ఎర్రబడింది.

ఈ శ్లోకంలో అమ్మవారి కనులను వర్ణిస్తున్నారు. రెండు కనులు చెవులను తాకి ఉన్నాయి. వాటికి అమృతపానం లభించింది. మూడవ కన్ను దూరంగా ఉన్నది. దానికి అమృతపానం లభించలేదు. అందుచేత అసూయ పడుతోంది. అంటే పరమేశ్వరి కనులు ఆ కర్ణాంతములు.

కనుబొమ్మల క్రిందుగా ముక్కుదూలానికి రెండు వైపులా రెండు కనులున్నాయి. ఇవిరెండూ నల్లగాఉండి చెవులవరకు వ్యాపించి ఉన్నాయి. ఈ రెండూ కాక భ్రూమధ్య భాగంలో మూడవనేత్రం ఉన్నది. ఇది కొంచెం ఎర్రగా ఉన్నది. మొదటి రెండుకళ్ళు నల్లగా మూడవది ఎర్రగా ఉన్నాయి.

కవీశ్వరులు మంచి మంచి రసవత్తరమైన కావ్యాలు వ్రాసినప్పుడు, వాటి నుంచి ప్రవమించే తేనె ధారలను ఆస్వాదించటంలో ఆమె చెవులు. ఆసక్తి కలిగి ఉంటాయి. ఆ తేనెధారలుగ్రోలటానికి రెండుకళ్ళూ చెవులదాకా వెళ్లినాయి అంటున్నారు భగవత్పాదులవారు.

ఇక మూడవ నేత్రం లలాట మందున్నది. అది చెవులకు దూరంగా ఉన్నది. అందుచేత దానికి అమృతపానందక్కలేదు. ఈ కారణం చేత అది అసూయతో ఎర్రబడింది అన్నారు.

అయితే దేవికనులను వర్ణించేటప్పుడు లలితా సహస్రంలోని 18వ నామంలో **వక్త్ర లక్ష్మీ పరీవాహచల న్మీనాభలోచనా** ముఖకాంతి అనే ప్రవాహంలో కదలాడుతున్న చేపలజంటతో సాటిఅయిన కనులుగలది అని చెప్పబడింది.

**శివే శృఙ్గారార్ద్రా తదితరజనే కుత్సనపరా**
**సరోషా గఙ్గాయాం గిరిశ చరితే (నయనే) విస్మయవతీ ।**
**హరాహిభ్యో భీతా సరసిరుహ సౌభాగ్యజననీ**
**సఖీషు స్మేరా తే మయి జనని దృష్టిస్సకరుణా ॥ 51**

ఓ తల్లీ ! నీ కన్నులయొక్క దృష్టి శృంగార రసముతో శివుని మోహింప చేయుచున్నది. ప్రాకృతజనానికి బీభత్సము కలిగిస్తున్నది. సపత్ని అయిన గంగయందు రోషముతో రౌద్రరసము కలిగి ఉన్నది. శివునియొక్క విజయుగాథలు విని ఆశ్చర్యముతో అద్భుతరసము కలిగి ఉన్నది. శివునిమెడలోని సర్పహారములను చూచి, సర్పములయందు భయం కలిగి, భయానక రసము కలిగి ఉన్నది. ఎర్రకలువల కాంతి సౌందర్యమును ఉత్పాదించునదై వీరరసము కూడినట్లున్నది. సఖులకు లేతనగవుతోకూడిన హాస్యరసము కలిగి ఉన్నది. నిన్ను స్తుతించు భక్తుడనైన నాయందు కరుణారసము కలిగి ఉన్నది.

ఈ శ్లోకంలో పరమేశ్వరి దృష్టి ఒక్కొక్కరియందు ఒక్కొక్క రకంగా ఉన్నది అని చెబుతూ ఎనిమిది రకాల దృష్టులను (ఎనిమిది రసాలను) వివరిస్తున్నారు. రసాలు తొమ్మిది వీటినే నవరసాలు అంటారు.

1. శృంగారము 2. వీరత్వము 3. కరుణ 4. అద్భుతము 5. హాస్యము 6. భీభత్సము 7. భయానకము 8. రౌద్రము 9. శాంతము

శ్రీచక్రంలో తొమ్మిది ఆవరణలు ఉన్నాయని గతంలో చెప్పుకున్నాం. ఆ తొమ్మిది ఆవరణలలోను తొమ్మిది రసాలు ఉన్నాయి.

| | | | |
|---|---|---|---|
| 1. | భూపురము | – | శృంగారరసము |
| 2. | షోడశదళము | – | వీరరసము |
| 3. | అష్టదళము | – | కరుణరసము |
| 4. | మన్వస్రము | – | భయానకరసము |
| 5. | బహిర్దశారము | – | రౌద్రరసము |
| 6. | అంతర్దశారము | – | భీభత్సరసము |
| 7. | అష్టకోణము | – | హాస్యరసము |
| 8. | త్రికోణము | – | అద్భుతరసము |
| 9. | బిందువు | – | శాంతరసము |

నాట్యాచార్యుడైన భరతముని దృష్టిలో శాంతరసము వికారములు లేనిది. అందుచేత శాంతరసాన్ని లెక్కలోకి తీసుకోలేదు. కాబట్టి మిగిలినరసాలు ఎనిమిదే అవుతాయి. అందుచేతనే ఈ శ్లోకంలో ఎనిమిది రసాలను చెప్పి, శాంతరసాన్ని వదలివెయ్యటం జరిగింది. అయితే ఆలంకారికుల అభిప్రాయం ప్రకారం శాంత రసము కూడా ఒక రసమే. శాంతరసమునుంచే మిగిలిన రసాలన్నీ ఆవిర్భవించాయి. ఇవన్నీ శాంతరసంలోనే ఉన్నాయి. కాబట్టి శాంతరసాన్ని వేరుగా చెప్పనక్కరలేదని శంకరులభావన. అంతేకాకుండా పరమేశ్వరి ఎల్లవేళలయందు శాంత స్వభావురాలు. ఈ కారణంచేతకూడా ఇక్కడ శాంతరసాన్ని వదలెయ్యటం జరిగింది. ఇక్కడ చెప్పిన ఎనిమిది దృష్టులు శాంతరసంలోనే ఉన్నాయి. కాబట్టి, శాంతరసం కలిపి, నవరసాలు చెప్పినట్లే అని గుర్తించాలి.

శరీరంలోని అవయవాలన్నింటిలోకీ ప్రధానమైనది 'కన్ను'. అందుకే **సర్వేంద్రియాణాం నయనం ప్రధానం** అన్నారు. కంటిపాపకు విశేషమైన ప్రాముఖ్యత ఉన్నది. కళ్ళుచూసి మనిషిబ్రతికిఉన్నాడో, లేదో కూడా చెప్పవచ్చు. భావవ్యక్తీకరణలో కనులు ప్రధానపాత్ర పోషిస్తాయి. మాట్లాడేవారి ముఖాన్ని జాగ్రత్తగా పరిశీలిస్తే, వారిఆంతర్యము కొంతవరకు అర్థం అయిపోతుంది. వైఖరీ వాక్కు నోటినుండి బయటకువస్తుంది. కాని మనోభావము కళ్ళ నుండివస్తుంది. అందుకే శంకర భగవత్పాదులవారు ఈ శ్లోకంలో పరమేశ్వరి దృష్టిని ఎనిమిదిరకాలుగా చెప్పి, అవి ఎవరియందు ఎలా ప్రసరిస్తాయో వివరించారు. వీటన్నింటిలోకీ రసరాజము శృంగారము. అది శివునియందున్నది. తద్వారా లోకాలు సృష్టింపబడుతున్నాయి.

**గతే కర్ణాభ్యర్ణం గరుత ఇవ పక్ష్మాణి దధతీ**
**పురాం భేత్తు శ్చిత్తప్రశమరస విద్రావణఫలే ।**
**ఇమే నేత్రే గోత్రాధరపతి కులోత్తంసకలికే**
**తవాకర్ణాకృష్ట స్మరశరవిలాసం కలయతః ॥** **52**

పర్వతరాజు కులానికి శిగపూవైన ఓ దేవీ ! నేను ధ్యానంలో ఉన్నప్పుడు, నిన్ను నా హృదయకమలము నందు చూస్తాను. ఆ సమయంలో నీ కనులు చెవుల వరకు వ్యాపించి, కనురెప్పల వెంట్రుకలు బాణానికి రెండువైపులా కట్టే గ్రద్ద ఈకలులాగా ఉండి, పరమశివుని మనస్సులో నిస్పృహను పోగొట్టి, శృంగారరసాన్ని పెంపొందించటంలో సఫలీకృతము అవుతున్నాయి. ఆ కనులు ఆ కర్ణాంతము లాగబడిన మన్మథుని బాణములలాగా ఉన్నాయి.

మన్మథుడికి ఐదు బాణాలున్నాయి. అవన్నీ పూలబాణాలు

**కమలం కైరవంరక్తం కల్హారేన్దీవరే తథా**
**సహకారకమిత్యుక్తం పుష్పపంచకమీశ్వరీ**

| | | |
|---|---|---|
| కమలము | – | ఎఱ్ఱతామర |
| రక్తకైరవము | – | ఎఱ్ఱకలువ |
| కల్హారము | – | తెల్లకలువ |

ఇందీవరము - నల్లకలువ

సహకారము - మామిడిపూవు

ఇవన్నీ వసంతకాలంలో తాపాన్ని రేకెత్తించేవి. ఈ ఐదే మన్మథుని బాణాలు. అంతే కాని "స్త్రీల కడగంటి చూపు" అనే ఆరవ బాణంలేదు. మన్మథుడు శివుణ్ణి గెలవలేకపోయినాడు. శివుడిమీద తనబాణాలను ప్రయోగించి విఫలుడైనాడు. శివుడికి కోపంవచ్చి మూడవకన్నుతో మన్మథుణ్ణి భస్మం చేశాడు.

అంటే మన్మథుని బాణాలు ఏవీ శివునియందు పనిచెయ్యలేదు. కాని అమ్మవారి చూపులనుంచి మాత్రం తప్పుకోలేకపోయాడు శివుడు. అంటే ప్రకాశాంశ అయిన పరబ్రహ్మకు విమర్శాంశ అయిన దేవి సృష్టిరూపస్పందన కలిగిస్తున్నది.

పరబ్రహ్మ సృష్టి కోసం రెండు భాగాలయ్యాడు. 1. ప్రకాశాంశ - పురుషుడు 2. వివర్శాంశ - ప్రకృతి. పురుషుని యొక్క స్పందన లేనిదే సృష్టి ఆవిర్భావం జరగదు. అందుకని సృష్టికాలంలో పరమేశ్వరి పురుషునికి స్పందన కలిగించింది.

ఈ శ్లోకంలో కూడా అమ్మవారి కన్నులనే వర్ణించటం జరిగింది. ఆ కనులు చెవులవరకు సాగి ఆ కర్ణాంతము విశాలంగాఉన్నాయి. త్రిపురారి అయిన ఈశ్వరుని కూడా మోహింపచేస్తున్నాయి.

**విభక్తత్రైవర్ణ్యం వ్యతికరితలీలాఞ్జనతయా**
**విభాతి త్వన్నేత్రత్రితయ మిద మీశానదయితే ।**
**పునస్స్రష్టుం దేవాన్ ద్రుహిణహరిరుద్రానుపరతాన్**
**రజ స్సత్త్వం బిభ్ర త్తమ ఇతి గుణానాం త్రయమివ ॥ 53**

ఓ దేవీ ! నీ ముఖమునందు ఉన్న మూడు కనులు తెలుపు, నలుపు, ఎరుపు రంగులు కలిగి, గతంలో ప్రళయం సంభవించినప్పుడు నీయందు లీనమైన బ్రహ్మ విష్ణు రుద్రులను, మళ్ళీ ఈ జగత్తును సృష్టించటానికి గాను సత్త్వరజస్తమో గుణాలను ధరించినట్లు ప్రకాశిస్తున్నది.

సత్త్వగుణము తెలుపు, రజోగుణము ఎరుపు, తమోగుణము నలుపు రంగులలో ఉంటాయి. పరమేశ్వరి కనులలోని తెలుపు, ఎరుపు, నలుపు రంగులను సత్త్వ

రజస్తమో గుణములుగా చెబుతున్నారు భగవత్పాదులవారు. భగవతి కనుల యందున్న కాటుక దర్శనమువలననే సృష్టి స్థితిలయాలు జరుగుతున్నాయి. ఇక్కడ కుడికన్ను రజోగుణ ప్రధానము. ఎడమకన్ను సత్త్వగుణ ప్రధానము. ఇక ఫాలనేత్రము తమోగుణ ప్రధానము. ఈ మూడు కనులు తనలో విలీనమయిన బ్రహ్మ విష్ణు రుద్రులను సృష్టించటం కోసం తెలుపు, ఎరుపు, నలుపు రంగులుగా భావించబడతున్నాయి. ఈ విషయాన్ని పూర్తిగా తెలుసుకోవటంకోసం సృష్టిరహస్యాన్ని ఒక్కసారి పరిశీలిద్దాం. జగత్తుయొక్క సృష్టి గురించి **"లలితా రహస్యోపనిషత్తు"**లోని రెండవ అధ్యాయంలో చెప్పబడింది.

వికారాలు లేనిది, సత్యజ్ఞానానందమయమైనది, పరిపూర్ణమైనది, సనాతనముగా ఉన్నది, ఏకముగా ఉన్నది, రెండవది లేనిది, అదేపరబ్రహ్మ. నిరాకారమైన ఆ పరబ్రహ్మయందు ఎడారులలో ఎండమావిలాగా, స్థాణువునందు దొంగవాడిలాగా, స్ఫటికంలోని రేఖలులాగా అనిపిస్తూ, తెలుపు, ఎరుపు, నలుపు గల సమాన త్రిగుణాలు కలిగి, అనిర్వచనీయమైన మూలప్రకృతి ఉన్నది. ఆ మూలప్రకృతిలో ప్రతిబింబించిన పరబ్రహ్మమే సాక్షి చైతన్యము.

గతంలో ప్రళయం వచ్చినప్పుడు జగత్తంతా నాశనమై పోయింది. ఆ సమయంలో కర్మక్షయమైన జీవరాశి అంతటికీ మోక్షం సిద్ధించింది. కర్మక్షయం కాకుండా ఉన్న జీవరాశి, తమకర్మను తమతో మూట కట్టుకుని మాయలో కలిసిపోయింది. ఇప్పుడు భూమి జలంలోను, జలం అగ్నిలోను, అగ్నివాయువునందు, వాయువు ఆకాశమందు, ఆకాశము అహంకారమందు, అహంకారము మహత్తత్త్వముందు, మహత్తత్త్వము అవ్యక్తమందు లీనమయినాయి. ఈ అవ్యక్తమే 'మాయ' అనబడుతుంది. ఈ రకంగా పంచభూతాలను, జీవరాశిని తనలో లీనం చేసుకున్నదయిన మాయఅనబడేఅవ్యక్తము ఆ పరమేశ్వరిలో కలిసిపోయింది. అదే ఇప్పుడు మనంచెబుతున్న నిరాకారమై, సృష్టి ప్రారంభానికి ముందున్న పరమేశ్వరి.

ఈ పరమేశ్వర తత్త్వానికి రూపంలేదు. గుణంలేదు. లింగభేదం అసలే లేదు. ఇది తేజోమయమైన కాంతిపుంజము. బ్రహ్మవాదులు దీన్ని "పరమేశ్వరుడు" అని కూడా అంటారు. పరమేశ్వరుడు అన్నా, పరమేశ్వరి అన్నా ఒకటే. ఈ రెండు పదాలకు తేడాలేదు. అది శివశక్తుల లేదా ప్రకృతి పురుషుల ఏకీకృత రూపము.

సృష్టి ఆవిర్భావానికి ముందు, జగత్తునంతటినీ తనలో నిక్షిప్తం చేసుకున్న ఆ పరమేశ్వరి స్వరూపం ఒక్కటే ఉన్నది. ఆవిడ ఇప్పుడు సృష్టిచెయ్యాలి అనుకుంది. సృష్టి ఎందుకు చెయ్యాలి. తన లీలా వినోదం కోసం మాత్రం కాదు. అంతకుముందు ప్రళయం సంభవించినప్పుడు కర్మక్షయంకాకుండా, ఆకర్మతోపాటుగా తనలో లీనమై పోయిన జీవులన్నింటికీ కర్మక్షయంచేసి, వాటికి మోక్షంకలిగించాలనే ఉద్దేశ్యంతో ఈ జగత్తును సృష్టించాలనుకున్నది ఆ పరమేశ్వరి. ఇక సృష్టి ప్రారంభమైంది. నిరాకారంగా ఉన్న ఆ పరమేశ్వరి నుంచి సత్త్వగుణ ప్రధానమైన అవ్యక్తం బయటకు వచ్చింది. ఇదే మాయ. ఈ మాయ పరమేశ్వరి అధీనంలోనే ఉంటుంది. ఈ మాయ వల్లనే సృష్టి స్థితిలయాలు అన్నీ జరుగుతుంటాయి. ఇప్పుడు అవ్యక్తంనుంచి రజోగుణ ప్రధానమైన మహత్తత్త్వమువచ్చింది. అదే హిరణ్యగర్భుడు. ఈ మహత్తత్త్వమునుంచి తమోగుణ ప్రధానమైన అహంకారంపుట్టింది. అదే విరాడ్రూపము. ఈ రకంగా పరమేశ్వరినుంచి సత్త్వరజస్తమోగుణాలయిన అవ్యక్త మహత్తత్త్వ అహంకారాలు ఆవిర్భవించాయి. ఇదే విషయాన్ని ఈ శ్లోకంలో చెబుతూ మళ్ళీ జగత్తును సృష్టించటానికిగాను సత్త్వరజస్తమోగుణాలను ధరించినట్లున్నది అంటున్నారు. ఈ శ్లోకానికి శ్రీ కాటూరి వేంకటేశ్వరరావుగారు చక్కని అనువాదం చేశారు.

**కలుములనీను నీదు తిగకన్నుల గాటుకరేఖ దిద్దుటన్**
**దొలవెడి మూడువన్నియలు దోచెడి దీర్చినటుల్ నటేశ్వరీ ।**
**ప్రళయ విలుప్తరూపులగు బ్రహ్మహరీశ్వరులన్ సృజింపగా**
**దలచి రజమ్ము సత్త్వమును దామసమున్ ధరించి తేమొకో ॥**

**పవిత్రీకర్తుం నః పశుపతిపరాధీన హృదయే**
**దయామిత్రై ర్నేత్రై రరుణధవళ శ్యామరుచిభిః ।**
**నద శ్శోణో గఙ్గా తపనతనయేతి ధ్రువ మయమ్**
**త్రయాణాం తీర్థానా ముపనయసి సమ్భేద మనఘమ్ ॥** **54**

అజ్ఞానులైన ప్రాణులను కాపాడే పశుపతి యందు మనసు లగ్నంచేసిన ఓ దేవీ! దయారసముచే తడుపబడినవై, ఎర్రని, తెల్లని, నల్లని కాంతులుగల నీ మూడు

కనులచేత హిరణ్యవర్ణము గల (ఎరుపు) శోణభద్రానదీజలాలు, తెల్లని జల ప్రవాహం గల గంగానది, నీలిరంగు జలప్రవాహం గల యమునా నదులకు సంగమ స్థానమై, పాపులమైన మమ్ములను పవిత్రులుగా జేస్తున్నాయి.

ఈ శ్లోకంలో దేవి కనులనువర్ణిస్తున్నాడు. ఆమెకనులు తెలుపు ఎరుపు నలుపు వర్ణములు గలిగి ఉన్నాయి అన్నారు కదా. ఇప్పుడంటున్నారు "ఆ కనులు గంగ, శోణభద్ర, యమునా నదులయొక్క సంగమము. త్రివేణీ సంగమంలో స్నానం చేస్తే పాపాలన్నీ హరించిపోతాయి. దేవిభక్తవత్సల కాబట్టి తనయొక్క దృక్కులు భక్తులపై ప్రసరింపజేసి, వారి అజ్ఞానం అనేపాపాన్ని ప్రక్షాళనచేస్తున్నది.

ఇక్కడ త్రివేణీ సంగమము అంటే గంగా, యమునా, సరస్వతీ నదులు కలిసిన ప్రదేశము. కాశీపట్టణం దాటినతరువాత బీహారులో శోణభద్రానది కలుస్తుంది. అక్కడ దాన్ని 'సోన్' అంటారు. భక్తులను అనుగ్రహించటానికి పరమేశ్వరి త్రివేణీ సంగమమువంటి దృక్కులను కలిగి ఉన్నది. సాధారణంగా కంటిలో తెల్లగ్రుడ్డు-తెల్లగాను, నల్లగ్రుడ్డు-నల్లగాను, రక్తజీరలు-ఎర్రగాను ఉంటాయి. అమ్మవారి కనులు ఈ మూడు రంగులు కలిగి ఉంటాయి. వీటిలో తెలుపు- సత్త్వగుణము, ఎరుపు-రజోగుణము, నలుపు - తమోగుణము సూచిస్తుంది. ఈ త్రిగుణాలకు సంబంధించిన వారే త్రిమూర్తులు. బ్రహ్మ - రజోగుణము, విష్ణువు - సత్త్వగుణము, రుద్రుడు - తమోగుణములకు సంబంధించినవారు. వీళ్ళు సృష్టి స్థితి లయాలు చూస్తుంటారు. వీరు ముగ్గురూ ప్రళయకాలంలో దేవిలో లీనమయి, మళ్ళీ సృష్టిజరిగేటప్పుడు అమ్మ వారు తెరచిన కనుల నుండి వ్యక్తమై, ఆమె ఆజ్ఞ ప్రకారము వారి వారి కార్యక్రమాలు నిర్వరిస్తారు. ఈ రకంగా సృష్టి స్థితి లయాలను అమ్మవారు త్రిమూర్తులచేత చేయిస్తుంటుంది. ఈ కారణంచేతనే తన కనులయందు తెలుపు, ఎరుపు, నలుపు వర్ణాలు ధరించిందని గతంలో చెప్పుకున్నాం. అయితే ఆమె పశుపతి పరాధీన హృదయ. పశువు అంటే సంజకు కట్టి వేయబడిన స్వేచ్ఛ లేని జీవి. ఇతడు అజ్ఞాని. సంసారమనే గుంజకు కట్టివేయబడి ఉంటాడు. ఎంతసేపు తిరిగినా ఆగుంజ (సంసారం) చుట్టూనే తిరుగుతాడు. అంతేకాని ఆ పరిధి దాటి బయటకురాలేడు. అజ్ఞానంలోంచి బయటపడలేడు. అటువంటి అజ్ఞానులను పాలించేవాడు 'పశుపతి'. తనను నమ్మిన వారిని పాపకూపంలో పడకుండా చూసేవాడు. అజ్ఞానులను రక్షించేవాడు. ఇటువంటి పశుపతి యందు మనసు లగ్నం చేసింది అమ్మవారు.

అజ్ఞానంవల్ల ఇబ్బందులు పడేవారు, తెలిసిగాని తెలియకగాని పాపం చేసేవారు, జగత్తులో చాలామంది ఉంటారు. అటువంటి వాళ్ళకు సద్గతులు కలిగించటానికి ఆ దేవి త్రివేణీసంగమము వంటి తనకనులనుండి కరుణార్ద్రదృక్కులు ప్రసరిస్తున్నది.

**నిమిషోన్మేషాభ్యాం ప్రళయ ముదయం యాతి జగతీ**
**తవే త్యాహు స్సన్తో ధరణిధర రాజన్య తనయే**
**త్వదున్మేషాజ్జాతం జగదిద మశేషం ప్రళయతః**
**పరిత్రాతుం శఙ్కే పరిహృతనిమేషా స్తవ దృశః ॥ 55**

ఓ తల్లీ ! నువ్వు కళ్ళుమూస్తే ప్రళయము. కళ్ళుతెరిస్తే సృష్టి. ఈ రకంగా జగదుత్పత్తి, వినాశనము జరుగుతుంటాయి అని వ్యాసాది మహర్షులు చెబుతున్నారు. కాబట్టి నీవు కనురెప్పలు మాయకుండా ఈ జగత్తుకు ప్రళయం సంభవించకుండా కాపాడుతున్నావని భావిస్తున్నాను.

దేవతలు అనిమిషులు. వారికి రెప్పపాటు లేదు. అంటే కనులు మూయటం, తెరవటం వారికి తెలియదు. అయితే శంకర భగవత్పాదులవారు ఈ శ్లోకంలో పరమేశ్వరి కన్ను తెరిస్తే జగత్సృష్టి, కన్ను మూస్తే ప్రళయము అని చమత్కరిస్తున్నారు. అయితే దేవియొక్కమహిమ అవాఙ్మానస గోచరము. ఈ జగత్తంతా ఆమెచేతనే సృష్టించబడుతున్నది. లయింపబడుతున్నది. ఆమె కనుల నుంచి కరుణారసదృక్కులు ప్రవహించి లోకాలను రక్షిస్తాయి.

లలితా సహస్రంలో 281వ నామము **ఉన్మేష నిమిషోత్పన్న విపన్న భువనావళిః** ఉన్మేషము అంటే కనులు తెరవటము. నిమిషము అంటే కనులు మూయటం. అదే క్రమంలో సృష్టి జరుగుతుంది. అనగా పరమేశ్వరి కనులు తెరిస్తే సృష్టి, కనులు మూస్తే ప్రళయము సంభవిస్తుంది.

**యతోవా ఇమాని భూతాని జాయంతే యేన జాతాని జీవంతి**

పరమేశ్వరి కనులు తెరవటంవల్లనే ఈ బ్రహ్మాండం సృష్టింపబడుతున్నది. ఆమె రెప్పపాటు ఒక బ్రహ్మ కల్పమన్న మాట. సంకల్ప మాత్రంచేతనే సృష్టి, లయము చేయగల మహాశక్తి ఆ పరమేశ్వరి.

**తవాపర్ణే కర్ణే జపనయన పైశున్య చకితాః**
**నిలీయన్తే తోయే నియత మనిమేషా శ్శఫరికాః ।**
**ఇయంచ శ్రీ ర్బద్ధచ్ఛదపుట కవాటం కువలయం**
**జహాతి ప్రత్యూషే నిశిచ విఘటయ్య ప్రవిశతి ॥ 56**

ఓ అపర్ణా ! నీ చెవులవద్దకు పోయిన నీ కనులు, ఆ చెవులకు తమ రహస్యం చెబుతాయేమోనని భయపడినవై, ఆడబేసిన చేపలు, రెప్పపాటు లేకుండా నీటియందు దాగి ఉన్నాయి. నీ నేత్రాలను పొందిన సౌభాగ్యలక్ష్మి రాత్రి సమయంలో కలువల యందు దాగి, ఉదయాన ఆ కలువలను దళాలతో మూసివచ్చి పగలంతా నీ నేత్రాలలో ఉండి, మళ్ళీ రాత్రికి కలువలయందు చేరుతున్నది.

ఈ శ్లోకంలో పరమేశ్వరి కనులను బేడిస చేపలతోను, కలువలతోను పోల్చటం జరిగింది. పరమేశ్వరికనులు రెప్పపాటు లేనివి అంటున్నారు. ఇది దేవతల లక్షణము అని ఇందాకటి శ్లోకంలో చెప్పుకున్నాము. అదే విధంగా చేపలకు కూడా కనురెప్పలు ఉండవు. పరమేశ్వరి యొక్క 'రెప్పపాటులేకపోవటమ'నే లక్షణము చేపలు దొంగిలించాయి అంటున్నారు. ఈ రకంగా దొంగిలించి, ఆ విషయం ఆమెకనులు, చెవులకు చెబుతాయేమో అని, పారిపోయి నీటిలో దాక్కున్నాయట. అలాగే ఆమె కనులయందున్న సౌభాగ్యలక్ష్మి పగటిపూట ఆమెకనులయందు, రాత్రిపూట నీలోత్పలములయందు ఉంటుంది అంటున్నారు. కలువలు రాత్రులందు వికసిస్తాయి. కనులు పగటియందు వికసిస్తాయి.

నల్లకలువలు మొదటిసారిగా పరమేశ్వరిని చూసిన తరువాత, దేవియొక్క కంటితీరు, అందమునందు మనముసరిపోమని తలపోసి, ఇన్ని రోజుల నుండి తమ అందం అందరికీ తెలిసేటట్లు విప్పారిన ముఖముతో గొప్పగా తిరిగాము. ఇవాల్టినుండి మన విషయం అందరికీ ఎక్కువగా తెలిసే పగటి భాగంలో, తమ ముఖము కనపడకుండా ముకుళింప చేసుకుని, దాచుకోవటం ఉత్తమము అని తలచి, రాత్రిపూట మాత్రం మెల్లగా వికసించి, పగటిపూట. ఆదేవి కనులయందే ఉంటున్నాయి. అంటే ఆ దేవికనులు నల్లకలువలు.

**దృశా ద్రాఘీయస్యా దరదళితనీలోత్పల రుచా**
**దవీయాంసం దీనం స్నపయ కృపయా మా మపి శివే !**
**అనే నాయం ధన్యో భవతి నచతే హాని రియతా**
**వనేవా హర్మ్యేవా సమకరనిపాతో హిమకరః ॥ 57**

పర్వతరాజకుమార్తె అయిన ఓ పార్వతీ ! అతిపొడవై, నీలోత్పలముల యొక్క కాంతి కలిగి, నీకడగంటి చూపులోని కృపారసము దరిద్రుడనైన నామీద ఒకసారి ప్రసరింపచెయ్యితల్లీ ! అంతమాత్రంచేతనే నేను ధన్యుడనవుతాను. ఈ రకంగా నన్ను కనికరించటంవల్ల నీకు ఏవిధమైన ధనహాని ఉండదమ్మా ! చల్లదనాన్నిచ్చే చంద్రుడు రాజభవనంమీదగాని, నట్టడవిలోగాని ఒకేరకంగా తనకిరణాలను ప్రసరింపచేస్తాడు.

స్వచ్ఛమైన మనసుగలవారు అందరిపట్ల సమానమైనదృష్టి కలిగిఉంటారు. అందుకే భక్తుడు పరమేశ్వరిని అడుగుతున్నాడు. "ఓదేవీ నీ దయాదృష్టిని అందరితోపాటే నామీద కూడా ప్రసరింపచేయవలసింది."

పరమేశ్వరుడు సర్వసమానుడు. అందరిమీద సమభావాన్ని కలిగి ఉంటాడు. వీరు తనవారని, వీరు పరులనీ ఉండదు. దుర్మార్గులయందు, సన్మార్గులయందు కూడా సమభావమే కలిగిఉంటాడు. సూర్యచంద్రులు పరమేశ్వరి కనులు. చంద్రుడు ఆమెకు ఒక కన్ను అన్నమాట. పరమేశ్వరిశరీరంలో ఒకభాగమైన చంద్రునికే అందరిపట్ల సమదృష్టిఉన్నప్పుడు, ఆసమదృష్టి పరమేశ్వరికి కూడాఉన్నది అని వేరుగా చెప్పనవసరం లేదుకదా !

ఇక పరమేశ్వరిదృష్టి అతిపొడవైనది. అంటే దిగంతాలవరకు వ్యాపించి ఉంటుంది. కాబట్టి ఆమెదృష్టికి అందనిదిఅంటూ ఏదీలేదు. విష్ణుసహస్రంలో 969వ నామము **'సవితా'** అంటే సృష్టించువాడుఅని అర్థము. జగత్తులో సకల జీవులను సృష్టించువాడు.

ఋగ్వేదంలో ఇతడు చాలాసార్లు చెప్పబడ్డాడు. ఇతనిఅవయవాలు, సామగ్రి అంతా బంగారుమయం. ఈదేవత హిరణ్మయుడు. బంగారురంగులో కనులు, చేతులు, నాలుక వంటి అవయవములు కలవాడు. పెద్దపెద్దచేతులు గలవాడు.

పసుపుపచ్చని జుట్టుగలవాడు పసుపు, గోధుమరంగులు కలసిన కవచం ధరించిన వాడు బంగారురథంమీద లోకాలనుచూసి వస్తుంటాడు. ఆరథానికి కాడినికట్టే కర్రకూడా బంగారందే. ఈయన గుర్రాలు తెల్లనివి. ఈయన బంగారుమయమైన కాంతిని సర్వత్రావ్యాపింపచేస్తాడు. ఆయనచేతులు దిగంతాలదాకా వ్యాపించి ఉంటాయి. వాటితో అందరినీ నిద్రలేపి అనుగ్రహిస్తాడు." అని చెప్పబడింది. ఇతడే పరమేశ్వరుడు. కాబట్టి దిగంతాలదాకా వ్యాపించబడిఉంటాడు. అందుచేతనే పరమేశ్వరిదృష్టి దిగంతాలదాకావ్యాపించి ఉన్నది అనిచెబుతున్నారు.

ఇక్కడ భక్తుడు అడుగుతున్నాడు. అమ్మా ! నీ దృష్టి చాలాశక్తివంతమైనది. కాబట్టి నామీద కొంచెం ప్రసరించినా చాలు అంటున్నాడు. అంటే అమ్మవారిది అపారమైన అనుగ్రహము.

**అరాళం తే పాళీయుగళ మగరాజన్యతనయే !**
**న కేషా మాధత్తే కుసుమశరకోదణ్డ కుతుకమ్ ।**
**తిరశ్చీనో యత్ర శ్రవణపథ ముల్లఙ్ఘ్య విలసన్**
**అపాఙ్గవ్యాసఙ్గో దిశతి శరసన్ధానధిషణామ్ ॥** **58**

ఓ పార్వతీ ! వంకరగాఉన్న నీ కణతలజంట చూచినవారికి మన్మథ తాపాన్ని కలిగిస్తుంది. మన్మథుడి కోదండసౌభాగ్యముగా ఉంటుంది. ఎందుకనగా అది పూలబాణముఎక్కుపెట్టిన మన్మథుని వింటిసొగసేమో అనిపిస్తుంది. దీనికి కారణ మేమనగా వంగినవిల్లులాగా ఉండి, వంపుసొంపుల కణతలగుండా నీ కృపావీక్షణ విలాస ప్రకాశము బాణమువలె నీ చెవులను చేరుటయేగాక వాటిని దాటుతున్నది.

ఈ శ్లోకంలో అమ్మవారికణతలు వర్ణించబడినాయి. చెవులకు, కళ్ళకు మధ్య గల ప్రదేశాన్ని 'కణత' అంటారు. ఈ కణతలు అందంగా, మృధువుగా, వంపు తిరిగి ఉంటాయి. ఈ వంపుసొంపుల కణతలతీరు, కన్నులనుండి తిన్నగా, అడ్డంగా చెవులవరకువ్యాపించి, ఆ తరువాత ఆ చెవులనుకూడా దాటిన కృపావీక్షణ ప్రసారపు తీరును జాగ్రత్తగా పరిశీలిస్తే, ఎక్కుపెట్టినప్పుడు వలయాకారంగా వంగిన మన్మథుని ధనుస్సుయొక్క ఆకారంలో ఆ కణతలవంపుసొంపులు కనబడతాయని, అటువంటి తన ధనుస్సుకు మన్మథుడు ఎక్కుపెట్టిన బాణముగా, ఆ కృపా కటాక్ష వీక్షణ

ప్రసరిస్తున్నదని అంటున్నారు భగవత్పాదులవారు. అమ్మవారి ముఖంలోని భృకుటి, కనులు, వీక్షణలతో పాటు కణతలుకూడా మన్మథుని లక్ష్యసాధనకు ఉపకరణముగానే గోచరిస్తున్నది.

**స్ఫురద్గణ్డాభోగ ప్రతిఫలిత తాటఙ్కయుగళం**
**చతుశ్చక్రం మన్యే తవ ముఖమిదం మన్మథరథమ్ ।**
**య మారుహ్యాద్రుహ్యా త్యవనిరథ మర్కేన్దు చరణం**
**మహావీరో మారః ప్రమథపతయే సజ్జితవతే ॥ 59**

తల్లీ ! అద్దాలలాగా మిలమిలామెరుస్తున్న నీ చెక్కిళ్ళయందు ప్రతిబింబిస్తున్న నీ చెవులకమ్మలజంట గలిగిన నీముఖము మన్మథుడధిరోహించిన నాలుగు చక్రాలుగల రథంలాగా కనిపిస్తున్నది. ఈరథాన్ని అధిరోహించి మన్మథుడు, భూమిని రథంగా, రవిచంద్రులను చక్రాలుగా చేసుకుని త్రిపురాసురులతో యుద్ధం చేసిన త్రిపురాంతకునితో యుద్ధానికి సిద్ధమవుతున్నాడు.

ఈ శ్లోకంలో పరమేశ్వరిముఖము మన్మథునిరథముగా వర్ణించబడినది. ఈ రథాన్ని అధిరోహించి మన్మథుడు మహావీరత్వము పొందుతున్నాడు. త్రిపురాసుర సంహారంకోసం శివుడు భూమిని రథంగా చేసుకున్నాడు. దానికి సూర్యుడు, చంద్రుడు చక్రాలు. కాని ఇప్పుడు మన్మథుడధిరోహించినరథానికి నాలుగు చక్రాలున్నాయి. మన్మథుడు గొప్పఉపాసకుడు. శ్రీవిద్యను ఉపాసించితరించిన వారిలో మన్మథుడు ఒకడు. పంచదశీమహామంత్రాన్ని ఉపాసించి, తరించి, ఆ మంత్రాన్ని భూలోకానికి తెచ్చింది మన్మథుడే. ఆ మంత్రానికి అతడేఋషి. ఆ ఉపాసనా బలంతోనే శివుడంతటి వాడిని కూడా మోహపరచటానికి ఉద్యుక్తుడవుతున్నాడు. ఈ కార్యంకోసం దేవి ఆశీస్సులనేకాదు, నాలుగు చక్రాల రథాన్నికూడా పొందాడు.

సామాన్యులను ఎదుర్కోవటం, వారి తపస్సు భగ్నం చెయ్యటం, వారిని కామవశులను చెయ్యటం మన్మథుడికి అతితేలిక అయిన పని. కాని త్రిపురాంతకుడైన శివుణ్ణి వశం చేసుకోవటంకోసం, ఆయన మీదకు యుద్ధానికి వెళ్ళటం అత్యంత క్లిష్టమైన పని.

ఇటువంటి సమయంలో కావలసింది భుజబలము కాదు బుద్ధిబలం. మన్మథుడు సమయస్ఫూర్తి గలవాడు. ఉచితానుచితాలు తెలిసినవాడు. అందుకే ఈ పనికి పరమేశ్వరిముఖము అనే నాలుగుచక్రాలరథాన్ని అధిరోహించాడు. దుర్వాసులవారు తమ 'దేవీ మహిమ్నాస్తుతి'లో

**ఉద్యత్పూర్ణకలానిధిశ్రి వదనం భక్తప్రసన్నం సదా**

**సంపుల్లాంబుజ పత్రకాంతి సుషమాధిక్కార దక్షేక్షణం**

**సానందం కృతమందహాస మసకృత్ప్రాదుర్భవత్కౌతుకం**

**కుందాకార సుదంత పంక్తి శశిభా పూర్ణం స్మరా మ్యంబికే ॥**

అమ్మా ! నీ ముఖము అప్పుడే ఉదయిస్తున్న పున్నమినాటి నిండుచంద్రుని బోలి ఉన్నది. భక్తులవిషయంలో ప్రసన్నంగా ఉండేది, విచ్చిన తామరలకన్న మిన్నయైన నేత్రములు గలది, ఆనందముతోనిండి ఎప్పుడూ మందహాసము చేసేది, మాటిమాటికీ చూడాలనిపించేది, మల్లెమొగ్గలవంటి దంతపంక్తి గలది, చంద్రకాంతిని బోలు మనోహరమైన కాంతిగలది, అయిన నీముఖమును నాహృదయమున భావన చేయుదును.

శంకరులవారు ఈ శ్లోకంలో పరమేశ్వరయొక్క చెవులకమ్మలజంట చెక్కిళ్ళయందు ప్రతిఫలిస్తున్నది అంటున్నారు. లలితాసహస్రంలోని 22వ నామం **తాటంకయుగళీ భూతతపనోడుప మండలా** సూర్యచంద్రులే దేవికి కమ్మలజంటగా ఉన్నారు.

**తాటంకధారణంస్త్రీణాంభర్తృరాయుష్యవర్ధనమ్** సౌభాగ్యవతులు తాటంకములు అంటే చెవికమ్మలు ధరించాలి. అవి వారిసౌభాగ్యాన్ని వృద్ధిచేస్తాయి. దేవీభాగవతంలో మణిద్వీపంలో ఉన్న దేవిని వర్ణిస్తూ

**కనచ్ఛ్రీచక్ర తాటంక విటంక వదనాంబుజా**

శ్రీచక్రాకారముగల బంగారుతాటంకాలు ఆ పరమేశ్వరి చెవులకు ప్రకాశిస్తున్నాయి. అన్నారు.

**సరస్వత్యా సూక్తీ రమృతలహరీ కౌశలహరీః**

**పిబన్త్యా శ్శర్వాణీ శ్రవణచుళుకాభ్యా మవిరళమ్ ।**

**చమత్కార శ్లాఘా చలితశిరసః కుణ్డలగణో**

**ఝణత్కారై స్తారైః ప్రతివచన మాచష్ట ఇవ తే ॥ 60**

ఓ శర్వాణీ ! అమృత ప్రవాహపు పొంగులాగా, మృదుమధురంగా తేనెలొలుకు పలుకులతో సరస్వతీదేవిచేసే స్తోత్రాలను నువ్వువింటూన్నావు. ఆ స్తోత్రములు బాగున్నాయని శ్లాఘించటంకోసం నీశిరస్సును కదపగా, నీ కర్ణాభరణాలు ఒక్కసారిగా ఝణఝణత్కారాలు చేశాయి. ఆ శబ్దము నువ్వుచెప్పబోయే మాటలను బలపరుస్తున్నట్లుగా ఉన్నది.

సౌందర్యలహరికి 32 వ్యాఖ్యలు ప్రసిద్ధి చెందినవి ఉన్నాయి. వాటిలో మేలైనది లక్ష్మీధరవ్యాఖ్య. లక్ష్మీధరుడు ఈ శ్లోకానికి వ్యాఖ్యానిస్తూ "సరస్వతీదేవిచేసిన స్తోత్రాలను పరమేశ్వరి మెచ్చుకుంటుండగా, సరస్వతీదేవి ఔనన్నట్లుగా తలఊపింది. అప్పుడు ఆమెచెవులకున్న ఆభరణాలు పరమేశ్వరిచెప్పే విషయాన్ని ఆమోదిస్తున్నట్లుగా ఝణఝణత్కారాలు చేశాయి" అన్నారు అయితే మిగిలిన పండితుల అభిప్రాయం ప్రకారము "సరస్వతీ దేవి స్తోత్రాలను మెచ్చుకుంటుండగా, ఆ మాటలను ఆమోదిస్తూ, పరమేశ్వరికర్ణాభరణాలు ఝణఝణ శబ్దం చేశాయి."

పరమేశ్వరి కొలువు తీర్చింది. ఆ కొలువులో సరస్వతీదేవి గానకచేరీ చేస్తోంది. అమ్మవారు ఆగానాన్ని శ్రద్ధగావింటోంది. ఆ గానానికి ఆనందించి, సరస్వతీదేవిని ప్రశంసిస్తోంది. ప్రశంశ అనేది నాలుకతోచెయ్యాలి. కాని చెవులతోకాదు. అయితే ఈ గానాన్ని పరమేశ్వరి తనచెవులద్వారానే విన్నది. తాను విన్నమాధుర్యాన్ని, విన్నది విన్నట్లుగా తెలపాలంటే, దాన్నివిన్న చెవులకే సాధ్యం. అందుచేతనే ఆమె తలత్రిప్పి నప్పుడు ఆమెమాటలను ఆమోదిస్తూ చెవికమ్మలు విచిత్రమైనధ్వని చేస్తున్నాయి.

**అసౌ నాసావంశ స్తుహినగిరివంశధ్వజపటి**

**త్వదీయో నేదీయః ఫలతు ఫలమస్మాక ముచితమ్ ।**

**వహత్యన్త ర్ముక్తా శ్శిశిరకర నిశ్వాస గళితం**

**సమృద్ధ్యా య త్తాసాం బహిరపి స ముక్తామణిధరః ॥ 61**

ఓ పార్వతీ ! నీనాసాదండము మాకు, మాకుసంబంధించినవారికీ కోరిన కోరికలు తీర్చునుగాక. నాసాదండములోపల ముత్యాలుగల ఆభరణాలను ధరించింది. ఆ కారణంగా ఎడమముక్కు నుండి బయటకువచ్చే గాలివల్ల, బయటి ప్రదేశంకూడా ముత్యాలను ధరించినట్లయింది.

ఈ శ్లోకంలో అమ్మవారినాసికను వంశదండము (వెదురుబొంగు)గా వర్ణిస్తూ, నాసాదండములో ముత్యాలు ఉన్నాయి అంటున్నారు. ఎందుచేతనంటే వెదురు బొంగులో ముత్యాలుంటాయని రత్నశాస్త్రంచెబుతోంది. రత్నాలు ఆరువిధాలుగా దొరుకుతాయి.

**గజకుంభేషు వంశేషు ఫణాసు జలదేషుచ**
**శుక్తికాయాం ఇక్షుఖండే షోడా మౌక్తికసంభవా ॥**

1. ఏనుగు కుంభస్థలముల యందు 2. వెదురు బొంగులయందు, 3. పాము పడగలయందు, 4. మేఘములయందు, 5. ముత్యపుచిప్పలయందు, 6. చెరకుగడల యందు ముత్యాలు దొరుకుతాయి.

ఇక్కడ అమ్మవారిముక్కు వెదురుబొంగుతో పోల్చబడింది. అందులో ముత్యాలు ఉన్నాయి.

లలితాసహస్రంలోని 19వ నామము **నవచంపకపుష్పాభా నాసాదండ విరాజితా** అప్పుడే వికసించిన సంపెంగపూవువంటి నాసికగలది. సంపెంగ పువ్వు పొడవుగా ఉంటుంది. దేవిముక్కు కూడా పొడవుగాఉంటుంది. ఇది సాముద్రిక లక్షణం.

**నానాసూన వితాన వాసనల నానందించు సారంగము**
**ఏలామమ్మొలదటంచు గంధఫలి పల్కాకంబు తపంబొంది**
**యోషా నాసాకృతిబూనె**

అన్నిపూవులమీద తుమ్మెదలువ్రాలతాయి. వ్రాలి వాటిలోని మకరందాన్ని గ్రోలతాయి. అయితే సంపంగిపువ్వులో మకరందముండదు. ఆకారణంచేత తుమ్మెదలు దానిపైవాలవు. తుమ్మెదలు తమపై వాలటంలేదు అని సంపంగి పువ్వు బాధపడి చాలాకాలం తపస్సుచేసి అందమైన స్త్రీయొక్క ముక్కుగా రూపు చెందింది.

దాని కోరిక ప్రకారము తుమ్మెదలు దీన్నివెతుక్కుంటూ వచ్చి, ఇందులో మకరందం లేదు కాబట్టి అక్కడ ఆగిపోయినాయి. ఆ తుమ్మెదలే సుందరాంగి కనులు. పరమేశ్వరి మహాసౌందర్యవతి అందుచేతనే ఆమెముక్కు సంపంగిపూవులా ఉన్నది అంటున్నారు. ఇక లలితాసహస్రంలోని 20వ నామము **తారాకాంతి తిరస్కారీ నాసాభరణభాసురా** తారా అంటే కుజ, శుక్ర నక్షత్రాలు. ఇవి చాలా ప్రకాశవంతంగా ఉంటాయి. వాటికన్న కూడా ప్రకాశవంతమైన రత్నాలు, ముత్యాలతో కూర్చబడిన నాసాభరణము గలది. లేదా ముక్కెర ధరించినది. ముక్కు చివర పైవైపున ఉండేది ముక్కెర. రెండు ముక్కురంధ్రాలకు మధ్యఉన్న దూలానికి ఉండేది బులాకి. ఈ రెండూ నాసాభరణాలే.

**ప్రకృత్యాఽఽరక్తాయా స్తవ సుదతి దన్తచ్ఛదరుచేః**
**ప్రవక్ష్యే సాదృశ్యం జనయతు ఫలం విద్రుమలతా ।**
**న బిమ్బం తద్బింబ ప్రతిఫలనరాగా దరుణిమం**
**తులా మ ధ్యారోఢుం కథమివ న లజ్జేత కలయా ॥ 62**

చక్కని పలువరుసగల ఓ తల్లీ ! కెంపులవలె ఎర్రగాఉన్న నీపెదవులకు పోలిక చెప్పటానికి సాటియైనది ఈజగత్తులో ఏదీలేదు. నీ క్రిందిపెదవిని ప్రవాళఫలము (పగడపుపండు)తో పోల్చవచ్చును కాని పగడపండ్లు ఎక్కడా లేవు. దొండపండుతో పోల్చుదామంటే దానికి నీ పెదవులకాంతి సరికాదు. బింబము అంటే దొండపండు నీ అధరాలకు ప్రతిబింబము. కాబట్టి నీ పెదవులను పోల్చటానికి ఉపమానములేదు. వాటికి అవేసాటి.

ఈ శ్లోకంలో అమ్మవారి పెదవులకు పోలిక లేదు. వాటికి అవేసాటి అని చెప్పటమే ముఖ్యోద్దేశ్యము. ఇక్కడ విద్రుమలతాఫలము అన్నారు. అసలు విద్రుమలతయే లేదు. ఇంకా దానికి పండ్లు ఎక్కడనుండి పుడతాయి ? ఒకవేళ పొగడపండ్లు అంటూ ఉంటే అవి నీ పెదవులకు సరిపోతాయి. అలాగే దొండపండు ఉన్నది. కాని అది నీపెదవులకు ప్రతిబింబము. కాబట్టి అదీ పోలికకాదు. అంటున్నారు. మరి ఆమె పెదవులను దేనితో పోల్చాలి అంటే వాటికి అవేసాటి. సృష్టిలో కొన్నింటికి పోలికలుండవు. చిన్నవాటిని పెద్దవాటితో పోలుస్తాము. మరి పెద్దవాటిని దేంతో పోలుస్తాము ? అత్యంత విశాలమైనది అనిచెప్పటానికి ఆకాశాన్ని

ఉపమానంగా చెబుతాం. మరి ఆకాశాన్ని దేంతోపోలుస్తాం ? అలాగే సముద్రాన్ని దేంతోపోలుస్తాం ? భయంకరమైన యుద్ధము అంటే రామరావణసంగ్రామము అన్నాం. మరి రామరావరావణసంగ్రామాన్ని దేంతో పోల్చగలుగుతాము ? అందుకే

**గగనం గగనాకారం సాగరః సాగరోపమః**

**రామరావణయోర్యుద్ధం రామరావణ యోరివ ॥**

అందుకే ఆకాశానికి, సముద్రానికి, రామరావణసంగ్రామానికి పోలిక లేదు. వాటికవే సాటి, అలాగే పరమేశ్వరి పెదవులకు కూడా పోలికలేదు వాటికవేసాటి.

లలితాసహస్రంలోని 24వ నామంలో **"నవవిద్రుమ బింబశ్రీ న్యక్కారిరద నచ్ఛదా"** పరమేశ్వరిపెదవులు దొండపండ్లలాగా ఎర్రగా ఉన్నాయి అన్నారు. దుర్వాసుడు దేవి పెదవులను వర్ణిస్తూ

**"తాంబూలారుణ పల్లవాధరయుతం రమ్యంత్రిపుండ్రం"** తాంబూలము చర్వణముచేత ఎర్రబారినపెదవులుగలది అన్నారు.

**స్మితజ్యోత్స్నాజాలం తవ వదనచన్ద్రస్య పిబితాం**

**చకోరాణామాసీ దతిరసతయా చఞ్చుజడిమా ।**

**అతస్తే శీతాంశో రమృతలహరీ రామ్లరుచయః**

**పిబన్తి స్వచ్ఛన్దం నిశి నిశి భృశం కాఞ్జిక ధియా ॥ 63**

ఓ తల్లీ ! చంద్రబింబము వంటి నీ ముఖమునుండి చిరునగవు అనే వెన్నెల త్రాగుతున్న చకోరపక్షులు, ఆ వెన్నెలను త్రాగిత్రాగి రుచితెలుసుకొనేశక్తిని కోల్పోయినాయి. అందుచేత ఆ పక్షులు పులుపునందు కోరికగలవై చంద్రునివెల్లలను త్రాగుతున్నాయి.

చకోరపక్షులు చంద్రునియొక్క వెన్నెల కిరణాలను, అందులోని మంచును త్రాగుతాయి అనిప్రసిద్ధి. చంద్రుని వెన్నెలనుంచి జాలువారే కిరణాలకు 'సుధాధారలు' అని పేరు. అయితే చకోరపక్షులు పరమేశ్వరివదనమనే చంద్రబింబం నుంచివచ్చిన కిరణాలను గ్రోలుతున్నాయట. ఆకిరణాలు మృధుమధురంగా ఉన్నాయి. వాటిని త్రాగిత్రాగి, నోటికి రుచిపోయి, మార్పుకోసం చంద్రుని వెన్నెలకిరణాలను

త్రాగుతుంటే, అవి పుల్లగాఉన్నాయట. అంటే పరమేశ్వరిముఖ బింబము నుంచి వచ్చేకిరణాలకు చంద్రుని నుంచి జాలువారే కిరణాలకు ఏ రకంగానూ పోలికలేదు. చంద్రకిరణాలు చకోరపక్షులకు పుల్లగాఉన్నాయట అంటే చంద్రబింబము పరమేశ్వరి ముఖబింబానికి సాటిరాదు అంటున్నారు శంకర భగవత్పాదులవారు.

అమ్మవారి లేతనవ్వుల తీపిదనంతో పోలిస్తే చంద్రుని వెన్నెలలోని తీపిదనం 'అన్నపుగంజి'లా పుల్లగా ఉంటుంది.

**అవిశ్రాన్తం పత్యు ర్గుణగణకథా మ్రేడనజపా**
**జపాపుష్పచ్ఛాయా తవ జనని జిహ్వా జయతి సా ।**
**యదగ్రాసీనాయాః స్ఫటిక దృషదచ్ఛచ్ఛవిమయీ**
**సరస్వత్యా మూర్తిః పరిణమతి మాణిక్యవపుషా ॥ 64**

అమ్మా ! నీ జిహ్వనిరంతరము నీ భర్త అయిన సదాశివుని గుణగణాలను స్తుతించి దాసానిపువ్వులాగా ఎర్రగా అయింది. అటువంటి నీ జిహ్వాగ్రాన ఆసీనయైన సరస్వతీదేవి శుద్ధ స్ఫటికములాగా తెల్లగా ఉన్నప్పటికీ, ఆమె ఎర్రగా కనిపిస్తోంది.

ఇక్కడ అమ్మవారి జిహ్వారక్తవర్ణంలో ఉండి, జిహ్వామీదకు వచ్చిన వారిని కూడా రక్తవర్ణులుగా చేస్తున్నది. ఈ శ్లోకంలో పరమేశ్వరి నాలుక గురించి చెప్పబడుతున్నది. నాలుక సాధారణంగా ఎర్రగా ఉంటుంది. నాలుక అలా ఎరుపురంగులో ఉండటానికి కారణము ప్రత్యేకంగా ఏమీ చెప్పలేము. కాని ఇక్కడ శంకర భగవత్పాదులవారు కారణం చెబుతున్నారు. నిరంతరము సదాశివుని గుణగణాలను స్తోత్రం చెయ్యటం వలన ఆమె నాలుక ఎర్రబడిందట. ఎర్రని పదార్థాలు తిన్నప్పుడు నాలుక ఎర్రబడుతుంది. శివుడు ఎర్రని శరీరం గలవాడు. కాబట్టి అతని గుణగణాలను వర్ణించటంచేత పరమేశ్వరి నాలుక ఎర్రబడింది అంటున్నారు. అంటే అమ్మవారికి శివునిమీద గల ధ్యాస, శివుని చరిత్ర పై గల ఆసక్తి శివుని గుణగణాలను కీర్తించటం వల్ల వచ్చిన నాలుక ఎరుపుదనము ఇతరులెవరికీ ఉండవు. దీనికి కారణము ఏమంటే, పరమేశ్వరుని యందు దేవికి అమితమైన ఆసక్తి. లలితా సహస్రంలోని 33వ నామం **కామేశ్వర ప్రేమరత్నమణి ప్రతిఫణిస్తనీ** కామేశ్వరుని ప్రేమ అనే రత్నాన్ని స్తనమణులు అనే రెండు రత్నాలు ఇచ్చికొన్నదట. సామాన్యంగా వస్తువును తక్కువ ధరకు, చౌకగా

కొంటే, దానిమీద శ్రద్ధ పెరుగుతుంది. ఇక్కడ పరమేశ్వరి కామేశ్వరుని ప్రేమ అనే రత్నాన్ని, స్తనద్వయము అనే రెండు రత్నాలిచ్చి కొన్నది. అంటే రెండు రెట్లు ఎక్కువ చెల్లించింది కాబట్టి ఆమెకు కామేశ్వరుని పైన మక్కువ.

**రణే జిత్వా దైత్యా నపహృతశిరస్త్రైః కవచిభి**
**నివృత్తై శ్చణ్డాంశత్రిపురహర నిర్మాల్యవిముఖైః**
**విశాఖేన్ద్రో పేన్ద్రై శ్శశివిశద కర్పూరశకలాః**
**విలీయన్తే మాత స్తవ వదన తామ్బూల కబళాః ॥ 65**

ఓ తల్లీ ! యుద్ధంలో రాక్షసులను జయించి, శిరస్త్రాణాలను తీసి, కవచము ఇంకా ధరించిఉండి, చండుడు అనే ప్రమథుడు శివునియొక్కనిర్మల్యాన్ని అనుభవిస్తున్నాడు. కుమారస్వామి, ఇంద్రుడు ఉపేంద్రుడు మొదలైనవారు చంద్రుని లాగా స్వచ్ఛము, నిర్మలము అయి, కప్పూరపు తనుకలు గల నీ తాంబూలకబళమును తీసుకుంటున్నారు.

ఇక్కడ దేవదానవయుద్ధం జరిగింది. ఆ యుద్ధంనుంచి తిరిగివచ్చిన కుమార స్వామి, దేవేంద్రుడు, ఉపేంద్రుడు. ఈముగ్గురూ దేవికి పాదాభివందనం చెయ్యటానికి శిరస్త్రాణాలు తీశారు. వారి శౌర్యపరాక్రమాలకు సంతసించి ఆమె చిరునవ్వు నవ్వింది. ఆ సమయంలో ఆమెనోటియందున్న తాంబూలకబళములు క్రింద పడినాయి. వాటిని ఆముగ్గురూగ్రహించారు. 'చండుడు' శివనిర్మాల్యాన్ని తీసుకుంటూనే ఉంటాడు. కుమారస్వామి నిత్యము దేవి తాంబూల కబళములను తీసుకుంటాడు. కాని ఇంద్ర, ఉపేంద్రులకు అదనంగాపట్టిన అదృష్టమిది. కుమారస్వామి, ఇంద్రుడు, ఉపేంద్రుడు ఈ ముగ్గురూ తమతల్లిదగ్గరకే వచ్చారు. బిడ్డలయందు వాత్సల్యము చూపింది దేవి. పరమేశ్వరిని మాత్రురూపంలో ఉపాసన చెసినట్లైతే సత్వరమే ఫలంసిద్ధిస్తుంది.

ఈ శ్లోకంలో అమ్మవారి తాంబూలవిశేషము చెప్పబడుతున్నది. సాధారణంగా తల్లిదండ్రులు, తమపిల్లల యందు ఆసక్తిగలవారై, వారుశ్రమపడకుండా ఉండాలని, వారుతీసుకునేఆహారాన్ని మెత్తగాచేసి తినటానికివీలుగా నోటికి అందిస్తారు. అదేవిధంగా అమ్మవారు తాంబూలకబళములను తనబిడ్డలైన కుమారస్వామి, ఇంద్రుడు, ఉపేంద్రులకు అందిస్తోంది.

ఈ ముగ్గురూ యుద్ధంనుంచి తిరిగివస్తూ శివనిర్మాల్యాన్ని చూశారు. శివనిర్మాల్యము అంటే శివునిపూజించి తీసివేసినగంధము, తాంబూలము మొదలైనవి. అయితే ఈ నిర్మాల్యమంతా ప్రమథ గణాలలో ఒకడైన చండుడికి చెందుతుంది. అందుచేత కుమారస్వామి ఇంద్ర ఉపేంద్రులు ఆ నిర్మల్యాన్ని అతనికే వదలి, అమ్మవారి దగ్గరకువచ్చి గౌరవపురస్కారంగా శిరస్త్రాణాలు, తలపాగాలు తీశారు. ఆమె ప్రసన్నురాలై వారికి తాంబూల కబళాన్నిచ్చింది, ఈ రకంగా పరమేశ్వరి భక్తులను అనుగ్రహిస్తుంది.

**విపఞ్చ్యా గాయన్తీ వివిధమపదానం పశుపతే**
**స్త్వయారబ్ధే వక్తుం చలిత శిరసా సాధువచనే ।**
**తదీయై ర్మాధుర్యై రపలపిత తన్త్రీకలరవాం**
**నిజాం వీణాం వాణీ నిచుళయతి చోళేన నిభృతమ్ ॥ 66**

అమ్మా ! సరస్వతీదేవి నీ దగ్గర కూర్చుని శివునియొక్కవీరగాథలను వీణమీద వాయిస్తున్నది. ఆ సమయంలో సరస్వతీదేవి యొక్క వీణానాదం మృధుమధురంగా ఉన్నది అని చెప్పటానికి నువ్వు నోరు తెరచినప్పుడు, నీ నోటినుంచి వచ్చిన మాటలు, ఆ వీణానాదం కన్న గొప్పగా ఉన్నాయి. ఆవాక్కుముందు సరస్వతీదేవి యొక్క వీణానాదం వెలవెల పోయింది. అప్పుడు ఆసరస్వతీదేవి తన వీణను గవిసెనగుడ్డతో కప్పివేసింది. అంటే పరమేశ్వరియొక్క కంఠధ్వనిముందు వీణానాదం కూడా నిలువలేదు.

లలితా సహస్రంలోని 27వ నామం **"నిజసల్లా పమాధుర్య వినిర్భర్సిత కచ్ఛపీ"** కచ్ఛపి అంటే సరస్వతియొక్కవీణ. అమరకోశంలో

**విశ్వావసోస్సా బృహతీ । తుంబురోస్తు కలావతీ**
**సానారదశ్చ మహతీ । సరస్వస్యాస్తు కచ్ఛపీ ॥**

| | | |
|---|---|---|
| విశ్వావసుని వీణపేరు | – | బృహతి |
| తుంబురుని వీణపేరు | – | కలావతి |
| నారదుని వీణపేరు | – | మహతి |
| సరస్వతి వీణపేరు | – | కచ్ఛపి |

వీణలో అక్షరాలు స్పష్టంగా పలకకపోయినప్పటికీ, వ్రేళ్ళు మీటినప్పుడు వచ్చే స్వరము గతంలో మనకుతెలిసినఅక్షరాలను గుర్తుకు తెచ్చి రసానుభూతిని కలుగజేస్తుంది. అయితే మిగిలిన వాటికన్న సరస్వతీదేవివీణలో స్పష్టత ఎక్కువగా ఉన్నది. పరమేశ్వరిని సేవిస్తున్న సరస్వతీదేవి తనవీణఅయిన కచ్ఛపిని శృతిచేసి శివునియొక్క వీరగాథలు వాయిస్తున్నది. దానికి ఆనందించిన పరమేశ్వరినోటివెంట వచ్చినపలుకులు, ఆ వీణానాదం కన్న మనోహరంగా ఉన్నాయి. ఇదే విషయాన్ని ఈ శ్లోకంలో వివరించటం జరిగింది.

**కరాగ్రేణ స్పృష్టం తుహినగిరిణా వత్సలతయా**
**గిరీశే నోదస్తం ముహు రధరపానాకులతయా ।**
**కరగ్రాహ్యం శమ్భో ర్ముఖముకుర వృన్తం గరిసుతే**
**కథంకారం బ్రూమ స్తవ చుబుక మౌపమ్యరహితమ్ ॥ 67**

హిమవంతుని కుమార్తె అయిన హైమవతీ ! నీ తండ్రియైన హిమవంతునిచే అమిత వాత్సల్యముతో, మునివ్రేళ్ళతో పైకి పుణకబడినది, నీ భర్తఅయిన శివునిచేత మాటిమాటికీ పైకెత్తబడునది. అయిన సాటిలేనినీముఖమనే అద్దానికి పిడివంటిది అయిన నీచుబుకాన్ని పూజిస్తాను.

తల్లిదండ్రులకు బిడ్డలమీద ఉండేది వాత్సల్యము.

**పుత్రాదౌ వాత్సల్యం పత్నాదౌప్రేమ శిష్యదావనుగ్రహః అగ్రజాదౌ భక్తిః**

| | | |
|---|---|---|
| బిడ్డలయందుండేది | – | వాత్సల్యము |
| భార్యయందుండేది | – | ప్రేమ |
| శిష్యులయందుండేది | – | అనుగ్రహము |
| పెద్దవారియందుండేది | – | భక్తి |

హిమవంతుడు తన బిడ్డమీద ఉండే వాత్సల్యముతో ఆమె గడ్డం పట్టుకుని పైకెత్తుతున్నాడు. అలాగే అధరామృతపానం చెయ్యటం కోసం ముందుగా చుబుకాన్ని పట్టి ఎత్తుతున్నాడురుద్రుడు. ఓ తల్లీ నీ చుబుకాన్ని నీ తండ్రియైన హిమవంతుడు, నీ భర్త అయిన సదాశివుడు మాత్రమే నీ చుబుకాన్ని పట్టుకోగలిగారు. ఇతరులెవరూ

నీ చుబుకాన్ని స్పృశించరు. లలితా సహస్రంలోని 29వ నామము **అనాకలిత సాదృస్య చుబుకశ్రీ విరాజితా**

పరమేశ్వరి చుబుకాన్ని వర్ణించటానికి ఇంతవరకు ఉపమానమే దొరకలేదు. బ్రహ్మాది దేవతలందరూ కూడా నునుపైన చెక్కిళ్ళు గలిగి గుండ్రముగా ఉన్నటువంటి ముఖానికి ఈ చుబుకము తొడిమలాఉన్నది అన్నారు. అంతేకాని పరమేశ్వరి చుబుకానికి సరియైనఉపమానాన్ని చూపలేకపోయారు. అంటే పరమేశ్వరిచుబుకము సాటిలేనటువంటి అందముగలది. అద్దంలో చూసినట్లైతే దానిప్రతిబింబమే దానికి ఉపమానము.

**భుజాశ్లేషా న్నిత్యం పురదమయితుః కణ్టకవతీ**
**తవ గ్రీవా ధత్తే ముఖకమలనాళశ్రియ మియమ్ ।**
**స్వత శ్శ్వేత కాలాగరు బహుళజమ్బాలమలినా**
**మృణాళీ లాలిత్యం వహతి యదధో హారలతికా ॥ 68**

ఓ తల్లీ ! త్రిపురాంతకుడైన శివుడు నిన్ను కౌగిలించుకున్నప్పుడు గగుర్పాటు పొంది నీకంఠము ముఖపద్మానికి నాళము అవుతున్నది. కంఠము క్రిందిభాగాన ఉన్న తెల్లని ముత్యాలపేరు, అక్కడ పూయబడిన కృష్ణాగరుమొక్కనల్లదనంవల్ల తామరతూడులాగా నీలిరంగులో మెరుస్తున్నది.

ఇక్కడ రెండువిషయాలను వివరిస్తున్నారు.

1. గగుర్పాటు చేత పరమేశ్వరి కంఠము ముఖపద్మానికి నాళము అవుతున్నది.

2. కంఠానికి పూయబడిన కృష్ణాగరువల్ల, ఆమె మెడలోని తెల్లనిముత్యాలు నీలిరంగులో ప్రకాశిస్తున్నాయి.

మెడ అనేది తలను, మొండాన్ని కలిపే ఒకవంతెనలా ఉంటుంది. కాని పరమేశ్వరిలో లాలిత్యము ఎక్కువ. అందుచేత అది పుష్పానికి చెందిన ఒక భాగంగా వర్ణించారు శంకరులవారు. అమ్మవారి ముఖం తామరపువ్వులా ఉన్నది. ఆ పద్మానికి కంఠనాళము, కాడలాగా ఉన్నది. అలాగే సుగంధ పరిమళభరితమైన కృష్ణాగరు మెడకు రాయబడింది. అది నల్లగాఉంటుంది. ఆనలుపు సోకి, దేవి మెడలోని తెల్లని ముత్యాలహారము నీలపురంగులోని తామరతూడులాగా ప్రకాశిస్తోంది.

**గళే రేఖాస్తిస్రో గతిగమకగీతైక నిపుణే**
**వివాహవ్యానద్ధప్రగుణ గుణసఙ్ఖ్యా ప్రతిభువః ।**
**విరాజన్తే నానావిధ మధుర రాగకరభువాం**
**త్రయాణాం గ్రామాణాం స్థితినియమ సీమా నఇవ తే ॥ 69**

ఓ సంగీతసామ్రాజ్ఞీ ! నీ కంఠసీమలోని మూడు భాగ్యరేఖలూ వివాహ సమయాన శంభుడు కట్టిన అనేక దారములతో తయారుచేసిన మాంగల్యాన్ని గుర్తుకు తెస్తూ, నానావిధాలైన మధురమైన రాగాలకులయమైన షడ్జగ్రామ, మధ్యగ్రామ, గాంధార గ్రామాలకు ఉనికిగా ప్రకాశిస్తున్నది.

దేవీ ! మార్గము, దేశి అను రెండువిధములైన సంగీతమార్గములయందు స్వరసంచాలనము కలిగించు ధాతువు (శబ్దము లోనయినది) మాతువు, గీతులను గానము చేయుటయందు నైపుణ్యముగలదానా ! నీ కంఠసీమయందు గల మూడు ముడుతలు (రేఖలు) వివాహసమయమున, శంభుడు మంగళసూత్రము కట్టిన తరువాత, కంఠమును చుట్టి అనేక తంతువులచే నిర్మించబడిన త్రిసరముల (కంకణ తోరణములు) యొక్క సంఖ్యాత్రయమునకు ప్రతినిధులై, అనేకవిధాలైన, మనోహరములైన గ్రామరాగములు, ఉపరాగములు, జనకరాగములు, భాషారాగములు, విభాషారాగములు, అంతరములు, భాషలు అను ప్రసిద్ధములైన రాగములకు గనులై, స్వరస్థానములై, ఆశ్రయములై షడ్జగ్రామ, మధ్యగ్రామ, గాంధార గ్రామములను స్వర ఆరోహణ, అవరోహణ క్రమమున వర్తించు మూర్ఛనలకు ఆశ్రయములైన గ్రామములు మూడింటికి సరిహద్దులుగా నిర్మించబడిన సేతువులలాగా ఆ ముడతలు ప్రకాశిస్తున్నాయి.

ఈ శ్లోకంలో పరమేశ్వరిమెడమీద ఉన్న ముడుతలను వర్ణిస్తున్నాడు. ఈ ముడుతలు ప్రతిమానవుడికీ స్త్రీ పురుష భేదంలేకుండా అందరికీ ఉంటాయి. అమ్మవారి మెడలోని ఈ ముడతలు మాంగల్యసూత్రములోని మూడుదారములుగా వర్ణిస్తున్నారు.

వివాహసమయంలో వధువుయొక్కఎడమచేతికి తోరముకట్టి, మెడలో మూడువరుసల దారములనుకట్టటం జరుగుతుంది. ఈ సూత్రానికి తొమ్మిది పోగులు

ఉంటాయి. అయితే ఇది శాస్త్రీయంకాదు. జనాచారము. దీన్నే సంప్రదాయము అంటారు. ఈ సంప్రదాయము ప్రదేశాన్ని బట్టి మారుతుంటుంది.

**ప్రతిభువు** అంటే ఉత్తమమైన వాటికి బదులుగా, అంతకన్న తక్కువ అయిన వాటిని ఉదాహరణగా చెప్పటము. ఉదాహరణకు రాజప్రతినిధి. రాజుకన్న తక్కువ వాడు. అలాగే త్రిసరలు అంటే కంకణ తోరణములయొక్క మూడుసంఖ్యను తెలియజేస్తుంది. కాబట్టి ప్రతిభువు' అనిచెప్పబడింది.

పరమేశ్వరి వివాహసమయంలో, శంభునిచేకట్టబడిన మూడుదారాలు చూడటానికి మూడుముడుతలుగా కనిపిస్తున్నాయి. అవి **నానావిధ మధురాగ కరభువాం** అనేకవిధాలైన రాగములకు స్వరస్థానమై ఉన్నది.

గీతులు (గతులు) – 5, వాటివల్ల పుట్టిన గ్రామములు – 30, ఉపరాగాలు – 8, రాగములు – 20, జనక రాగములు – 15, భాషారాగములు–96, విభాషా రాగాలు – 20, అంతరములు, భాషలు – 3.

**ప్రసిద్ధమైన రాగములు :**

1. మధ్యమావతి 2. మాళవి 3. శ్రీ 4. భైరవి 5. వంగాళి 6. వసంత 7. ధన్యాసి 8. దేశి

**రాగాంగములు :** వేలావతి, శుద్ధవరాళి, పున్నాగవరాళి, నాట మొదలైనవి.

**భాషాంగములు :** రామక్రియ మొదలైనవి

**క్రియాంగములు :** ప్రవీధి, ద్రావిడి, ఘూర్ఘరి, వరాళి, మలహరి మొదలైనవి.

**ఉపాంగములు, ఉపరాగములు :** రాగశబ్దముచే సంగృహీతములైనవి.

స్వరాలు మూడు రకాలు : అవి

1. షడ్జగ్రామము 2. మధ్యగ్రామము 3. గాంధార గ్రామము. వీటిలో గాంధార గ్రామము దేవలోకంలోను, మిగిలిన రెండూ భూలోకంలోనూ ప్రసిద్ధి చెందినాయి.

స్వరము ఆరోహణ, అవరోహణ క్రమంతో కలిసిఉంటుంది. కాబట్టి 'గ్రామము' అనబడుతుంది. అదికూడా మంద్రము, మధ్యము, తారము అని మూడు విధాలు.

స్వరాలు ఏడు. అవి **స రి గ మ ప ద ని**

| | **స్వరము** | **భార్య** | **వాహనము** | **దేవత** |
|---|---|---|---|---|
| స | – షడ్జమము | గంధర్వస్త్రీ | హంస | అగ్ని |
| రి | – రిషభము | కిన్నెరస్త్రీ | సింహము | బ్రహ్మ |
| గ | – గాంధారము | యక్షస్త్రీ | గండభేరుండము | సరస్వతి |
| మ | – మధ్యమము | కింపురుష స్త్రీ | జింక | ఈశ్వరుడు |
| ప | – పంచమము | నాగస్త్రీ | సాళువ | శ్రీహరి |
| ద | – దైవతము | సురస్త్రీ | చిలుక | వినాయకుడు |
| ని | – నిషాదము | రాక్షసస్త్రీ | గోరింక | భాస్కరుడు |

ఈ సప్తస్వరాలను ఆరోహణ, అవరోహణక్రమంలో వర్తింపచేయటాన్ని 'మూర్ఛన' అంటారు.

పరమేశ్వరి కంఠసీమలోని మూడురేఖలూ – మాంగల్యంలోని మూడు ముడులకు ప్రతీకయై, స్వరస్థానములుగా ఉన్నాయి అంటున్నారు శంకర భగవత్పాదులవారు

ఈ శ్లోకంలో **గతిగణక గీతైక నిపుణే** అన్నారు ఇక్కడ

గతి – పదసహితము, రాగసందర్భము

గమకము – స్వరస్థాయీ పునః పునః పోషణమ్

గీతము – సముచితార్థ ప్రబంధ సందర్భము అని అర్థం.

**మృణాలీమృద్వీనాం తవ భుజలతానాం చతసృణాం**
**చతుర్భి సౌన్దర్యం సరసిజభవ స్స్తౌతి వదనైః**
**నఖేభ్య స్సన్త్రస్యన్ ప్రథమ మథనాదన్ధకరిపో**
**శ్చతుర్ణాం శీర్ణాణాం సమ మభయహస్తార్పణధియా ॥** **70**

ఓ తల్లీ ! పూర్వకాలంలో ఈశ్వరుడు బ్రహ్మయొక్క ఐదవశిరస్సును తన గోరుతో గిల్లివేయగా, అతడు మిగిలిన నాలుగుశిరస్సులను కూడా ఖండిస్తాడేమోననే భయంతో, అభయం ఇమ్మని నీ నాలుగుబాహువులను తన నాలుగుశిరస్సులతోను ఒక్కసారిగా ప్రార్థిస్తున్నాడు.

బ్రహ్మకు ఐదు శిరస్సులుండేవి. అందుచేత బ్రహ్మ అహంకరించగా శివుడు ఒకతలను త్రుంచి వేశాడు. శివుడు కోపంతో మిగిలిన నాలుగు శిరస్సులు కూడా ఖండిస్తాడేమో అనేభయంతో బ్రహ్మ పరమేశ్వరినిశరణుగోరి, తన నాలుగు శిరస్సులతోను ఆమె నాలుగుబాహువులను స్తుతి చేస్తున్నాడు.

బ్రహ్మతన నాలుగుముఖాలతోను వేదంవల్లిస్తుంటాడని ప్రతీతి. ఇక్కడ నాలుగుముఖాలతో దేవిబాహువులను స్తుతిస్తున్నాడు అంటున్నారు. ఇందులో ఏది నిజం ? అంటే రెండూనిజాలే. బ్రహ్మవేదాలను వల్లిస్తున్నాడు. వేదాలలో పరమేశ్వరి వర్ణన ఉన్నది. అందుకే ఆయన దేవిబాహువులను వర్ణిస్తున్నాడు అంటున్నారు. వేదాలలో పరమేశ్వర స్వరూపాన్ని వివరించారు. ఇప్పుడు ఈ శ్లోకంలో చెప్పినదాన్ని బట్టి ఆ దేవియే పరమేశ్వరి అనే విషయం అవగతమవుతున్నది.

**నఖానా ముద్యోతై ర్నవనళినరాగం విహసతాం**
**కరాణాం తే కాన్తిం కథయ కథయామః కథ ముమే ।**
**కయాచిద్వా సామ్యం భజతు కలయా హస్త కమలం**
**యదిక్రీడ ల్లక్ష్మీచరణ తలలాక్షారసచణమ్ ॥ 71**

తల్లీ ! అప్పుడే సూర్యోదయకాలంలో వికసించిన తామరపూవు యొక్క కాంతిని పరిహసిస్తున్న కాంతిగలగోళ్ళతో విలసిల్లుతున్న నీ హస్తములశోభ వర్ణింప వీలుకానిది. కమలము ఒకప్పుడు క్రీడిస్తున్న లక్ష్మీదేవిచరణాలలత్తుకరసము అంటినదైతే, అప్పుడు నీకరముల కాంతిలేశానికి కొంతవరకు పోలిక పొందగలుగుతుంది.

అమ్మవారి యొక్క రెండుచేతులు, వాటిగోళ్ళు అరుణారుణ ప్రభలతో శోభాయమానంగా ఉన్నాయి. ఇక్కడ శంకరభగవత్పాదులవారు అప్పుడే వికసిస్తున్న ఎర్రనిపద్మాలతో ఆ దేవిగోళ్ళనుపోల్చుతూ, ఆ చేతులగోళ్ళు స్వభావ సిద్ధంగా ఎర్రగా

ఉన్నాయి. ఈ విధంగా ప్రకాశించటానికి రాత్రి, పగలు అని తేడాలేదు. కాని పద్మాలు పగటిపూటే ప్రకాశిస్తాయి. రాత్రిపూట విచ్చుకోవు. పగటిపూట కూడా సూర్యరశ్మి తగిలితేనే విచ్చుకుంటాయి. కాని అమ్మవారి గోళ్ళు ఎప్పుడూ ప్రకాశిస్తూనే ఉంటాయి. భగవత్పాదుల వారికి అమ్మవారి గోళ్ళను పద్మాలతో పోల్చటం నచ్చలేదు. అందుకే పద్మాలు గోళ్ళకు సరికావు అంటున్నారు. ఒకవేళ అలాగే చెప్పవలసివస్తే, పద్మములో కూర్చునేటప్పుడు లక్ష్మీదేవికాళ్ళపారాణి ఆపద్మాలకుతగిలి అవి కొంతవరకు ఎర్రపడితే, ఈ పోలిక కొంతవరకు సమంజసము అంటున్నారు. లలితా సహస్రంలోని 44వ నామము **నఖదీధితిసంఛన్న నమజ్జన తమోగుణా** పాదాభివందనం చేసేవారికి దేవియొక్క కాలిగోళ్ళ కాంతులచేత అజ్ఞానము పటాపంచ లవుతుంది. 80వ నామము **కరాంగులినఖోత్పన్న నారాయణ దశాకృతిః** పరమేశ్వరి భండాసురినితో యుద్ధంచేస్తోంది. ఆ యుద్ధంలో భండాసురుడు రాక్షసాస్త్రాలను ప్రయోగించాడు. వాటికిప్రతిగా పరమేశ్వరిచేతిగోళ్ళనుంచి విష్ణుమూర్తి యొక్క దశావతారాలు ఆవిర్భవించి, రాక్షసాస్త్రాలను నాశనం చేసినాయి. అని చెప్పబడింది.

**సమం దేవి స్కన్దద్విప వదనపీతం స్తనయుగం**
**త వేదం నః ఖేదం హరతు సతతం ప్రస్నుతముఖమ్ ।**
**య దాలోక్య శఙ్కాకులితహృదయో హాసజనకః**
**స్వకుమ్భౌ హేరమ్బః పరిమృశతి హస్తేన ఝుటితి ॥** **72**

అమ్మా ! భగవతీ ! నీస్తన్యము పానముచేస్తున్న వినాయకుడు, తనతల్లి వక్షోజములను చూసి తనకుంభస్థలము ఇక్కడికెలావచ్చింది అనే అనుమానంతో, తనతుండముతో తలను తడివి చూసుకుంటున్నాడు. ఆ సంఘటన నీకు, నీ భర్త అయిన శివుడికీ నవ్వుపుట్టిస్తున్నది. ఏ స్తనద్వయము వినాయకుడికి, కుమారస్వామికీ ఒకేసారి స్తన్యము ఇస్తున్నదో ?, ఆస్తనద్వయము మమ్ములను రక్షించుగాక మా దుఃఖమును పోగొట్టునుగాక.

ఈ శ్లోకంలో అమ్మవారి స్తనాలు వర్ణించబడుతున్నాయి. 33వ నామము **కామేశ్వర ప్రేమరత్నమణి ప్రతిఫణిస్తనీ** కామేశ్వరునిప్రేమ అనేరత్నాన్ని ఆ దేవిస్తనములు అనే రెండురత్నాలిచ్చి రెట్టింపు ధరకు కొన్నదట

34వ నామము **నాభ్యాలవాలరోమాళి లతాఫలకుచద్వయీ** నాభినుంచి వక్షము వరకు వ్యాపించి ఉన్న రోమావళి అనే లతకు ఫలాలు ఈస్తనద్వయము అంటున్నారు. 36వ నామము. **స్తనభార దళన్మధ్య పట్టబంధవళిత్రయా** పరమేశ్వరి నడుము చుట్టూ మూడు ముడుతలు కనిపిస్తున్నాయి. అవి ఆమె స్తనముల భారముచేత వంగి విరిగిపోతుందెమో ? అనే భయంతో, నడుముచుట్టూ కట్లుబిగించారా ? అన్నట్లుగా ఉన్నదట. దుర్వాసుడు తన "దేవీ మహిమ్నః స్తోత్రము"లోని 33వ శ్లోకంలో దేవిస్తనాలను వర్ణిస్తూ

**కస్తూరీ ఘనసారకుంకుమ రజోగంధోత్కటై శ్చందనైః**
**రాలిప్తం మణిమాలయాऽదిరుచిరం గ్రైవేయ హారాదిభిః ।**
**దీప్తందివ్యవిభూషణై రగణితై ర్జోతిర్విభాస్వత్కుచ**
**వ్యాజస్వర్ణఘటద్వయం హరిహరబ్రహ్మాదిపీతం భజే ॥**

అమ్మా ! నీ స్తనద్వయము కస్తూరి, కుంకుమపూవు, పచ్చకర్పూరము మొ॥ సుగంధములతో ఒప్పారుతున్నది. మణులతో కూర్చిన కంఠహారములతో అత్యంత మనోహరముగాఉన్నది. బ్రహ్మాది దేవతలకు స్తన్యము నిచ్చేది. అయిన ఆ స్తనద్వయమును ఉపాసిస్తున్నాను.

**అమూ తే వక్షోజౌ వమృతరస మాణిక్యకుతుపౌ**
**న సన్దేహస్పన్దో నగపతిపతాకే మనసి నః ।**
**పిబన్తౌ తా యస్మా దవిదితవధూ సఙ్గరసికౌ**
**కుమారా వద్యాపి ద్విరద వదనక్రౌఞ్చదళనౌ ॥** **73**

ఓ హైమవతీ ! మాకు కన్పించుచున్న నీ చనుద్వయము అమృతముతో నిండిన మాణిక్యపు కుంభములు. ఈ విషయంలో మాకు ఏ విధమైన అనుమానము లేదు. ఎందుకంటే నీ చనుబాలుత్రాగినగజాననుడు, కుమారస్వామి ఇద్దరూ ఈ రోజుకు కూడా జవరాండ్ర చెలువలకూటమివలన ఆనందరసాస్వాదనము గావించిన రసికులుకానివారై బాలురుగనే ఉన్నారు.

ఈ శ్లోకంలో అమ్మవారి యొక్క వక్షోజాలను వర్ణిస్తున్నారు. అవివక్షోజములా లేక అమృతభాండములా అనే అనుమానంవచ్చి శోధించగా, అమృతభాండములే అని స్థిరపడింది. ఎందుచేతనంటే వాటిలోని అమృతాన్ని సేవించిన గణపతి, కుమారస్వామి ఇద్దరూ ఈ రోజుకు కూడా చిన్నపిల్లలుగానే ఉన్నారు. వాళ్ళకి బాల్యమే స్థిరమైపోయింది. అంతేకాని బాల్యకౌమారయవ్వనదశలు ఏవీరాలేదు.

అయితే పురాణాలలో వినాయకుడికి, కుమారస్వామికి వివాహము జరిగినట్లుగా ఉన్నది.

వినాయకుడి భార్యలు – సిద్ధి, బుద్ధి

కుమారస్వామి భార్యలు – వల్లి, దేవసేన

వీరు స్త్రీశబ్దవాచ్యులే కాని నిజంగా అంటే స్త్రీసుఖానిచ్చే భార్యలు కాదు. కేవలము శక్తిస్వరూపులు అది భ్రాంతిమాత్రదాంపత్యము అని మనం గ్రహించాలి.

శివశక్తియోగసాధనలో యోగియైన సాధకుడికి లభించే ఋతంభరా ప్రజ్ఞాభాండారానికి గణపతి అని పేరు. ఈ ప్రజ్ఞాభాండారము శివశక్తుల కుమారుడు. యోగికి ఋతంభరాప్రజ్ఞాలాభము కలిగినప్పుడు సిద్ధి, బుద్ధిలు వశమవుతాయి. ఇవి మోక్షమార్గాన్ని పాడుచేస్తాయి. ఆటంకాలు, విఘ్నాలు కలుగజేస్తాయి. వీరివలన విఘ్నములు నివారించేవాడై విఘ్నహంత అవుతున్నాడు.

కుమారస్వామిభార్యలు వల్లి, దేవసేన. వల్లి అంటే లత. ఆవిడ సర్పాకారంలో ఉండే కుండలినీశక్తి. దేవసేన అంటే తత్త్వసముదాయము.

గణపతి, కుమారస్వామి ఇద్దరూ నైష్ఠికబ్రహ్మచారులు. అందుచేతనే వీరి పూజావిధానంలో బ్రహ్మచారులను పూజించటం జరుగుతుంది.

కుండలినీ శక్తిని వ్యష్టి, సమిష్టిపరంగా చెప్పవలసి వచ్చినప్పుడు సర్పాకారముగా వర్ణిస్తాము. స్త్రీగాభావించినప్పుడు మాత్రం కౌమారిఅని, పురుషుడుగా భావించి నప్పుడు కుమారుడు. సమిష్టి కుండలినిని సర్పదేవతగా భావించి నాగులచవితి రోజున ఆరాధిస్తాము. ఈపూజ కుండలినీశక్త్యారాధనకు ప్రతీక. నాగపంచమినాడు పూజింపబడేది వ్యష్టికండలిని. కుమారస్వామి భార్య వల్లి.

కుమారస్వామి దేవసేనానాథుడు అంటే దేవసైన్యానికిఅధిపతి. తత్త్వ సముదాయమే దేవసేన. జగన్నిర్మాణానికి కావలసిన సామాగ్రే ఈ తత్త్వ సముదాయము. కల్పాంతాన ఈ తత్త్వసముదాయాన్ని ఉపసంహరించేది చాముండా.

ఋతంభరా ప్రజ్ఞామూర్తి బ్రహ్మకన్న వేరైనవాడుకాదు. సుబ్రహ్మణ్యముకూడా బ్రహ్మమే.

ఇక్కడ కొంతవిషయం విజ్ఞానశాస్త్రపరంగా కూడా చూడవలసిఉన్నది. భాద్రపద శుద్ధ చవితినాడు చంద్రుడు కన్యారాశిలోని హస్తా నక్షత్రంలో ఉంటాడు. ఆ రోజు రాత్రి ఆకాశంలో నక్షత్రాలను జాగ్రత్తగా పరిశీలిస్తే, హస్తానక్షత్రపు కూటమివద్ద జీడిపప్పు ఆకారంలో చంద్రుడు కనిపిస్తాడు. చంద్రుడు మనః కారకుడు. హస్తము అంటే చేయి. దీనిఅర్థం ఏమిటిటంటే భాద్రపదశుద్ధచవితినాడు చంద్రుడు అనే మనస్సు హస్తానక్షత్రమనే చేతిలో ఉంటాడు. కార్యాన్ని సంకల్పించేది మనస్సు చేసేది చేయి. మనస్సు చేతిలో ఉంటుంది అంటే సంకల్పము మనచేతిలోనే ఉంటుంది. ఇంకా వివరంగా చెప్పాలంటే సంకల్పం చేసే మనస్సు మనచేతిలోనే ఉంటుంది. అంటే ఇంక పనిఅయిపోయినట్లే కదా ? ఇదే కార్యసిద్ధి ఇటువంటి సిద్ధిని గలవాడు గణపతి. అందుకనే వ్యాసుడు భారతం చెబుతుంటే గణపతి ఆపకుండా వ్రాశాడు. సిద్ధి ఆయనకుభార్యవంటిది అనిచెబుతూ కథ వ్రాశారు.

ఇక బుద్ధి సంగతి చూద్దాం. వినాయకచవితి రోజున చంద్రుడు కన్యారాశిలో హస్తానక్షత్రంలో ఉంటాడు. ఉత్తరాత్రయోః హస్తా చిత్రార్ధం కన్య ఉత్తర 2, 3, 4 పాదాలు, హస్తా నక్షత్రంలోని నాలుగు పాదాలు, చిత్తా నక్షత్రంలోని రెండు పాదాలు వెరసి తొమ్మిది పాదాలు కన్యారాశి. హస్తానక్షత్రం రెండవపాదం బుధుడికి ఉచ్ఛ. దీన్నే డిగ్రీలలో చెబితే 15 డిగ్రీలు. మనస్సుఅనేచంద్రుడు నైపుణ్యము గల బుద్ధిని సూచించే బుధుని ఉచ్ఛస్థితి. ఆ సమయంలో గణపతికి అటువంటి వివేకము, నైపుణ్యము, గల బుద్ధి ఉంటుంది. ఇన్ని తెలివితేటలున్నాయి కాబట్టే తల్లిదండ్రులకు మూడుసార్లు ప్రదక్షిణచేసి భూప్రదక్షిణంచేశాను అన్నాడు. ఇటువంటి బుద్ధిని గలవాడు గణపతి. బుద్ధి అతని భార్యగా చెప్పబడింది.

ఇక కుమారస్వామి భార్యలైన వల్లీ, దేవసేన. ముందుగా వల్లిని చూద్దాం. శుక్రమును సూక్ష్మదృష్టితో గనక పరిశీలిస్తే శుక్రకణాలు చిన్న చిన్న సర్పాకారంలో

అనేకం కనిపిస్తాయి. కుమారస్వామి సర్వదేవత. ఇతడే సుబ్రహ్మణ్యేశ్వరుడు. అనగా 'మంచి వర్చస్సు గలవాడు.' అని అర్థము. ఈ వర్చస్సు కుండలినీశక్తివల్లనే వస్తుంది. అందుచేత కుమారస్వామి వ్యష్టికుండలినికి అధిపతి. ఈ కుండలినీశక్తి సర్పాకారంలో ఆధారచక్రానికి మూడున్నర చుట్లు చుట్టుకుని ఉంటుంది. ఇదే వల్లీదేవి. వల్లీనాథుడు కుమారస్వామి.

ఇక దేవసేన వజ్రాంగుని కుమారుడు తారకుడు. అతన్ని సంహరించటానికి కుమారస్వామి జన్మించాడు. దేవతలసేనకునాయకుడైనాడు. ఎప్పుడూ దేవసైన్యంతోనే ఉండేవాడు. ఇల్లుఇల్లాలు అంతా దేవసైన్యమే. అందుచేతనే దేవసేన అతని భార్య అన్నారు.

ఈ రకంగాచూస్తే వినాయకుడు, కుమారస్వామి ఇద్దరూ బ్రహ్మచారులే. ఇద్దరూ బాలురే. ఆబాల్యము దేవిదగ్గర అమృతం త్రాగటంతోనే వచ్చింది.

**వహ త్యమ్బ స్తమ్బేరమదనుజ కుమ్బ ప్రకృతిభిః**
**సమారబ్ధాం ముక్తామణిభిరమలాం హారలతికామ్ ।**
**కుచాభోగో బిమ్బాధరరుచిభి రన్త శ్శబలితాం**
**ప్రతాపవ్యామిశ్రాం పురదమయితుః కీర్తి మివ తే ॥ 74**

అమ్మా ! గజాసురుని శిరస్సు అనే కుంభస్థలమే జన్మభూమిగా గలిగిన, దోషములు లేని ముక్తామణుల హారమును నీ స్తనమండల మధ్యమున ధరించుచున్నావు. ఆ ముత్యాల హారము పరమశివుని ప్రతాపాన్ని, కీర్తిని ప్రతిబింబిస్తున్నది.

శివుడు గజాసురుని సంహరించాడు. అసలు ఈగజాసురుడు ఎవరు ? వజ్రాంగుని కుమారుడు తారకుడు. తారకాసుర సంహారం జరిగిన తరువాత కొంత కాలం ప్రశాంతంగానే ఉన్నది. కాని ఆవంశంలో గజాసురుడు ఉద్భవించాడు. ఇతడు శోణితపురాన్ని రాజధానిగా చేసుకుని లోకాలను పాలిస్తున్నాడు. ఇతడు గొప్ప శివభక్తుడు. శివుణ్ణిగురించి తపస్సుచేసి, ఈశ్వరుడు తన హృదయంలోనే నివాసము ఉండేటట్లుగా వరంపొందాడు. చివరకు అతని హృదయం చీల్చుకుని బయటకు వచ్చాడు. ఈ రకంగా గజాసుర సంహారం జరిగిన తరువాత అతని

కుంభస్థలంలో ఉన్నముత్యాలనుతెచ్చి శివుడు పరమేశ్వరికిసమర్పించాడు. ఆవిడవాటిని మాలగాగ్రుచ్చి మెడలోధరించింది. ఆ ముత్యాలు చిత్రవిచిత్ర కాంతులతో మెరుస్తూ శివునిప్రతాపానికి, కీర్తికి ప్రతీకగా ఉన్నాయి. అయితే ముత్యాలు ఏనుగు కుంభస్థలంలో దొరకటం ఏమిటి ? అంటే ముత్యాలు ఆరు రకాలుగా లభిస్తాయి అని రత్నశాస్త్రం చెబుతున్నది.

**గజకుంభేషు వంశేషు ఫణాసు జలధేషుచ**
**శుక్తి కాయాం ఇక్షుఖండే షోడా మౌక్తిక సంభవా ॥**

1. ఏనుగుల కుంభస్థలములయందు, 2. వెదురుబొంగుల యందు, 3. పాముల పడగలయందు, 4. మేఘములయందు, 5. ముత్యపుచిప్పల యందు, 6. చెరకుగడల యందు ముత్యాలు లభిస్తాయి.

**గజకుంభే కర్పురాభాః వంశే రక్తసితాః స్మృతా**
**ఫణాసువాసుకేరేవ నీలవర్ణాః ప్రకీర్తితాః ॥**
**జ్యోతిర్వర్ణాస్తు జలధే శుక్తికాయాం సితాస్మృతాః**
**ఇక్షుదండే పీతవర్ణాః మణయోః మౌక్తికాస్మృతా ॥**

| | | |
|---|---|---|
| ఏనుగు కుంభస్థలములయందు | – | కర్పూరకాంతి (చిత్రవిచిత్రమైన కాంతి) గలవి |
| వెదురుచెట్ల యందు | – | తెలుపుతో కూడిన ఎరుపురంగు గలవి |
| పాముపడగల యందు | – | నీలవర్ణము గలవి |
| మేఘములయందు | – | జ్యోతిర్వర్ణములు (మెరుపువన్నె) గలవి |
| ముత్యపుచిప్పల యందు | – | తెలుపురంగు గలవి |
| చెరకుగడల యందు | – | పసుపువర్ణము గలవి |

దీనిని బట్టి ఏనుగుల కుంభస్థలములయందు కర్పూరపుకాంతి అనగా చిత్ర విచిత్ర వర్ణములు గల ముత్యాలు లభిస్తాయి.

ఇదేవిషయం భాగవతంలో కూడా చెప్పబడింది. దశమస్కంధములో జరాసంధుడు మధురానగరం మీదికి 23 అక్షోహిణీల సైన్యంతో దండయాత్ర చేస్తాడు.

అప్పుడు శ్రీకృష్ణుడు తనకత్తితో ఏనుగుకుంభస్థలాలను నరుకుతుంటే, వాటిలోనుంచి మౌక్తికములు వడగళ్ళులాగారాలినాయి అని 1558వ పద్యం (వచనం)లో వ్రాశాడు పోతన.

ఏనుగు కుంభస్థలములలోని ముత్యాలలాగా చిత్రవిచిత్రంగా ఉన్నది పరమేశ్వరుని కీర్తి.

**తపస్తన్యం మన్యే ధరణిధరకన్యే హృదయతః**
**పయఃపారావారః పరివహతి సారస్వత మివ ।**
**దయావత్యాదత్తం ద్రవిడశిశు రాస్వాద్య తవ యత్**
**కవీనాం ప్రౌఢానా మజని కమనీయః కవయితా ॥ 75**

ఓ హైమవతీ ! నీచనుబాలను పైకి ప్రవహించే సారస్వతరూపమైన వాఙ్మయముగా భావిస్తున్నాను. అలాకానట్లైతే ద్రవిడదేశంలో పుట్టినవాడు ఇంత గొప్పకవి కాలేడు.

ఈ సందర్భంగా శంకరభగవత్పాదులవారిని ఒక్కసారి స్మరించుకోవలసి ఉన్నది. కేరళ రాష్ట్రంలో పూర్ణానదివడ్డున కాలడిఅనే గ్రామం ఉన్నది. ఆ గ్రామంలో ఆర్యాంబ, శివగురువు అనే నంబూద్రి దంపతులు ఉండేవారు. వారికి వృషాచలేశ్వరుని దయవల్ల ఒకకుమారుడు కలిగాడు. అతడికి శంకరుడుఅని నామకరణం చేశారు. పిల్లవాడి మూడవయేటనే తండ్రిమరణించాడు. ఐదవ ఏడురాగానే తల్లి శంకరుడికి ఉపనయనంచేసింది. ఆవిడ ప్రతిరోజూ తమఇంటి దగ్గర ఉన్న “మాణిక్యమంగళ కాత్యాయనీభగవతి” ఆలయానికి వెళ్ళేది. ఒకరోజు తనకు అనారోగ్యంచేసి కుమారుని ఆలయానికిపంపింది. శంకరుడు నైవేద్యానికి పాలుతీసుకువెళ్ళాడు. తాను సమర్పించిన పాలు దేవిస్వీకరించలేదని శంకరుడు దుఃఖించాడు. అప్పుడు తేజోరూపంతో ఆదేవి పాలుపూర్తిగాత్రాగేసింది. అది చూసిన శంకరుడు మళ్ళీఏడుపు మొదలుపెట్టాడు బాలుణ్ణి చూసి “ఎందుకు ఏడుస్తున్నావు?” అన్నది పరమేశ్వరి. “ప్రతిరోజూ నీకు పాలు నివేదన చేసి మిగిలిన వాటిని త్రాగటానికి నాకుఇచ్చేది. ఇవాళ్ళ పాలన్నీ నువ్వేత్రాగేశావు. మరి నేను ఏం త్రాగాలి ? అన్నాడట. ఆ

మాటలువిన్న పరమేశ్వరిహృదయం కరిగిపోయి, శంకరుడికి తనచనుబాలు ఇచ్చింది. ఆ చనుబాలు త్రాగినశంకరుడు మహాగొప్పదైన బ్రహ్మాండమైన కవిత్వం చెప్పాడు. కాబట్టి ఆమెచనుబాలు సారస్వతరూపమై ప్రవహిస్తున్నవాఙ్మయము అంటారు శంకర భగవత్పాదులవారు. అయితే శంకరుల గురించి ఇంకొకగాధకూడా ప్రచారంలో ఉన్నది. శంకరుడు ఆరునెలల వయసులో ఉన్నప్పుడు తండ్రి భిక్షాటనకు, తల్లి నీరు తెచ్చుకోవటానికి వెళ్ళారు. ఈ లోపల శంకరుడికి ఆకలివేసి పెద్దగా ఏడవసాగాడు. గగనమార్గాన విహరిస్తున్న పరమేశ్వరి అక్కడికివచ్చి శంకరుడికి చనుబాలుఇచ్చింది. ఏదిఏమైతేనేం ? శంకరుడు పరమేశ్వరిదగ్గర చనుబాలుత్రాగి గొప్పకవి అయినాడు.

**హరక్రోధజ్వాలావళిభి రవలీఢేన వపుషా**
**గభీరే తే నాభీసరసి కృతసఙ్గో మనసిజః ।**
**సముత్తస్థౌ తస్మా దచలతనయే ధూమలతికా**
**జన స్తాం జానీతే తవ జనని లోమావళి రితి ॥ 76**

తల్లీ ! పర్వతరాజపుత్రీ ! హరుని క్రోధాగ్నిజ్వాలలచే చుట్టబడిన శరీరముతో మన్మథుడు, తననుతాను కాపాడుకోవటంకోసం లోతైన నీ నాభిఅనేమడుగులో దూకాడు. ఆ సమయంలో కాలుతున్న అతని శరీరం చల్లారటంవలన వచ్చిన పొగ నీ నాభినుంచి పైకిప్రాకి కనిపిస్తున్నది. అలా పైకివెళ్ళిన పొగచారికనే ఈ లోకంలో నీ నూగారుగా వర్ణిస్తున్నారు.

ఈ శ్లోకంలో పరమేశ్వరి రోమావళిని ధూమావళిగా వర్ణిస్తున్నారు. జనసముదాయము ఆ ధూమవళిని రోమావళిగా భ్రాంతి చెందుతున్నారు.

సాధనాక్రమంలో గనక కామోద్దీపనము కలిగినట్లైతే, వెంటనే భ్రూమధ్యంలో అంటే ఆజ్ఞాచక్రంలో శివుని ధ్యానించినట్లైతే శాంతిలభిస్తుంది అనేది పరమ రహస్యము. జ్ఞానేనేత్రము అనేది భ్రూమధ్యమునందున్నది. అందుచేత అక్కడ శివుని ధ్యానించినట్లైతే, హృదయంలో కలిగిన కామతాపము నాభిస్థానానికిదిగి సాధకుడికి శాంతిలభిస్తుంది. హరుని క్రోధాగ్నిజ్వాలలకు చిక్కినవాడిని రక్షించగలిగేది ఆ పరమేశ్వరియే.

ఇంకొకవిధంగాచెప్పాలంటే, నాభి మణిపూరచక్రస్థానము. స్తనద్వయము – అనాహతచక్రము. స్తనాలు ఇడపింగళ నాడులు. నాభినుంచి పైకివెళ్ళేనూగారు సుషుమ్నా నాడి. కామప్రేరణ కలిగినట్లైతే, ఆజ్ఞాచక్రంలోని జ్ఞానస్థానము వలన వివేకము కలిగి కామతాపము నాభిచక్రానికి దిగుతుంది.

**యదే తత్కాళిన్దీ తను తరతరఙ్గాకృతి శివే**
**కృశే మధ్యే కిఞ్చి జ్జనని తవ య ద్భాతి సుధియామ్ ।**
**విమర్దా దన్యోన్యం కుచకలశయో రన్తరగతం**
**తనూభూతం వ్యోమ ప్రవిశదివ నాభిం కుహరిణీమ్ ॥ 77**

ఓ పరమశివునిపట్టపురాణీ ! కృశించిన నీనడుమునందు ఎదురుగా కనిపిస్తున్నది, సన్నని తరంగములాగా సన్ననైన నీ నూగారును చూసి మేధావులు "నీ చకుంభములు ఒకదానితోఒకటి ఒరిసిఉండటంవల్ల, వాటి మధ్యగల ఆకాశము నలిగిపోయి, నల్లబడి, సన్నగా నాభివరకు జారిపోయినట్లున్నది. అంటున్నారు.

కుచకుంభముల రాపిడివల్ల ఆకాశము నల్లబడి జారిపోయింది అంటున్నారు ఈ శ్లోకంలో శంకరులవారు, దాన్ని రోమావళిగా చెబుతున్నారు. దీన్ని 'జతులతా న్యాయము' అంటారు.

'జతులతా న్యాయము' అంటే లక్కను కరిగించి, దాన్ని లాగుతూ పోతే, అది తీగెలాగా సాగుతుంది. అది వచ్చినంతమేర రంగుఅంటిస్తుంది. అలాగే ఆకాశము కుచకుంభముల మధ్యనుంచి నాభివరకు నల్లని రంగుఅంటిస్తూ వెళ్ళింది.

లలితాసహస్రంలోని 34వ నామము **నాభ్యాలవాలరోమాళి లతాఫలకుచద్వయీ** నాభినుంచి వక్షము వరకు వ్యాపించిన రోమావళి అనేలతకు ఫలములు స్తనద్వయము అంటున్నారు. అజ్ఞానాంధకారంతో కప్పబడిన జీవరాశియే ఈ రోమావళి. మాయామయమైనజీవి అహంకారముతో లతలాగా విజృంభిస్తాడు. ఆధారంలేకపోతే లతనిలబడలేదు. అలాగే జీవికూడా నిలబడలేక కుప్ప కూలిపోతాడు. అటువంటి ఈజీవిని ఉద్ధరించటానికి జ్ఞానమనే క్షీరముగల స్తనద్వయము ఏర్పడింది.

నాభి అనేది ముఖ్యప్రాణము. రోమావళిలత అవ్యక్తమైనది. దీన్ని సుషుమ్న నాడితో పోల్చవచ్చును. అనాహతమందిరంలో రెండువైపులా ఉన్న ఇడపింగనాడులు

ఈ రోమావళి యొక్క ఫలాలు. దుర్వాసుడు తన దేవీమమిమ్నస్తుతలోని 33వ శ్లోకంలో పరమేశ్వరి స్తనయుగాన్ని కీర్తిస్తూ

**కస్తూరీ ఘనసార కుంకుమ రజోగంధోత్కటై శ్చందనై**
**రాలిప్తం మణిమాలయాఽతి రుచిరం గ్రైవేయహారాధిభిః**
**దీప్తం దివ్యవిభూషణై రగణితై ర్జోతిర్విభావస్వత్కుచ**
**వ్యాజస్వర్ణఘటం హరిహరబ్రహ్మాదిపీతం భజే ॥**

పరమేశ్వరి స్తనద్వయము కస్తూరి, కుంకుమ పువ్వు, కర్పూరము మొదలైన సుగంధ ద్రవ్యాలతో లేపనం గావించి అలంకరించబడినది. బ్రహ్మాది దేవతలకు స్తన్యము ఇచ్చునది.

**స్థిరో గఙ్గావర్తః స్తనముకుళ రోమావళిలతా**
**కలావాలం (కులావాలం) కుణ్డం కుసుమ శరతేజో హుతభుజః**
**రతేర్లీలాగారం కిమపి తవ నాభి ర్గిరిసుతే**
**బిలద్వారం సిద్ధే ర్గిరిశ నయనానాం విజయతే ॥** **78**

తల్లీ ! ఓ పార్వతీదేవీ ! నీయొక్కనాభి చలనము వినాశనము లేని స్థిరమైన గంగానది నీటిసుడి. పాలిండ్లు అనే పూలమొగ్గలు పూచిన నూగారు ఆ తీగెపాదు. మన్మథుని తేజస్సు అనే అగ్నికి హోమగుండము. రతీదేవికి విహారస్థానము. ఈశ్వరుని నేత్రములయొక్క తపస్సిద్ధికి గుహాముఖము. ఈ రకంగా వర్ణించటానికి వీలుకానిదై ఉన్నది.

శివునికనులకు ఫలము (తపస్సిద్ధి) మంచిదృశ్యాన్నిచూడటము. కాబట్టి అమ్మవారినాభి ఆయనచూపులకు ఫలసిద్ధిఅయింది. శివునిమూడవనేత్రము వల్ల దానికి భయంలేదు. ఎందుకంటే, అదివరకే అది అగ్నిగుండము. నాభికి దగ్గరగా, కొంచెందిగువన ఉన్నది స్వాధిష్ఠానచక్రము. అందులో భగవతిని ఉపాసిస్తారు. భగవతి నాభి బిలద్వారమే కాని బిలముకాదు. బిలముస్వాధిష్ఠానము. అక్కడ మన్మథుడు దేవినిఉపాసిస్తాడు. శివునితపస్సు కూడా అక్కడే సిద్ధిస్తుంది.

ఈ శ్లోకంలో అమ్మవారి నాభి వర్ణించబడింది. గంగానది ఎప్పుడూ గంభీరంగా ప్రవహిస్తుంది. ఆనదిలో ఏర్పడే సుడులుకూడా స్థిరంగాఉండక కదలాడుతూనే ఉంటాయి. ఒకవేళ గంగానదిలోనిసుడి కదలకుండా స్థిరంగాఉన్నట్లైతే, అది అమ్మవారిబొడ్డు అనుకోవచ్చు. గంగానది లోతుగాఉంటుంది. ఆ నదిలోని నీరు పరమ పవిత్రము. అమ్మవారిబొడ్డుకూడా లోతుగానేఉంటుంది. ఆమెలోని ప్రతి అణువూ పవిత్రమైనదే. విచిత్రం ఏమంటే గంగానది, అమ్మవారు. ఇద్దరూ హిమవంతుని సంతానమే. ఈ కారణంచేత పరమేశ్వరిబొడ్డును గంగానదిలోని సుడితో పోల్చిచెప్పటం జరిగింది.

అమ్మవారి నూగారు పూలతీగెలాగాను, బొడ్డు ఆతీగెకు పాదులాగాను, స్తనయుగము ఫలములుగాను చెప్పటంజరిగింది. ఇలా చెప్పటంలో రహస్యము ఏమంటే నాభి – మణిపూరము. స్తనములు – అనాహతము. నూగారు – సుషుమ్న మార్గము. నాభిఉండే మణిపూరముఅనేపాదుదగ్గర, ఈర్ష్య, అసూయ, ద్వేషము అనే కలుపు మొక్కలను ఏరిపారేసి, సరైనసాధన అనే నీరుపోసి కృషిచేసినట్లైతే, అనాహతంలోని ప్రేమపుష్పించి, ఫలించి, సాధనాల లక్ష్యము నెరవేరుతుంది.

మన్మథుడి అగ్నికి అమ్మవారిబొడ్డు హోమగుండములా ఉన్నది అంటున్నారు. మన్మథుని అగ్ని అంటే కామాగ్ని. సృష్టి కార్యక్రమం జరగాలంటే కామాగ్ని ప్రజ్వరిల్లాలి. అందుకే కామాగ్ని నిరగుల్కొల్పి, జీవులను సృష్టికార్యానికి తోడ్పడేటట్లుచేసి, పరమేశ్వరి సృష్టికార్యక్రమానికి సహకరించటమే మన్మథుడినిపని. తల్లికీ, సంతానానికి మధ్య భౌతికసంబంధాన్ని నాభి సూచిస్తుంది. అందుకే నాభిదగ్గర మన్మథుడు నిత్యాగ్ని హోత్రము చేస్తాడు.

అమ్మవారి బొడ్డు రతీదేవికి విలాసగృహము లేదా శృంగారగృహము అన్నారు. రతీదేవి తనపతికి అన్నివిధాలా తోడ్పడుతుంది. కామకార్యానికి జీవులలో రతిని పెంపొందింప చేస్తుంది. అలాచెయ్యటానికి అమ్మవారిబొడ్డుదగ్గరే విహరిస్తుంటుంది.

శివుని తపస్సిద్ధికి అమ్మవారిబొడ్డు గుహద్వారము అన్నారు. గర్భంలో ఉన్న బిడ్డకు ఆహారము ఈ నాభినుంచే అందుతుంది. అందుకే గర్భంలో సమాధిస్థితిలో గల జీవులరూపంలో ఉన్న శివుడికితపస్సిద్ధికి అమ్మవారినాభి గుహద్వారము అంటున్నారు భగవత్పాదులవారు.

**నిసర్గక్షీణస్య స్తనతటభరేణ క్లమజుషో**
**నమన్మూర్తే ర్నారీతిలక శనకైస్త్రుట్యత ఇవ ।**
**చిరం తే మధ్యస్య త్రుటితతటినీతీర తరుణా**
**సమావస్థా స్థేమ్నో భవతు కుశలం శైలతనయే ॥ 79**

అమ్మా ! స్వభావంచేతనే బాగా సన్ననైనది, వక్షోజముల బరువుచే వంగినట్లుగా ఉన్నది. విరిగిపోతున్నట్లుగా ఉన్నది, తెగిపోయిన ఏటిగట్టుపైనున్న చెట్టులాగా ఉన్న నీ నడుము చిరకాలము కుశలముగా ఉండుగాక.

ఈ శ్లోకంలో అమ్మవారి నడుమును వర్ణిస్తున్నారు. ఆవిడ సింహమధ్యమ సింహమువలె సన్ననైన నడుము గలది.

లలితాసహస్రంలోని 35వ నామము **లక్ష్యరోమలతాధారతాసమున్నే యమధ్యమా** కంటిచేచూడతగిన నూగారుతీగెకు ఆధారంకావటంచేత అక్కడ నడుమున్నది అని ఊహించటం జరుగుతున్నది. అంటే పరమేశ్వరి నడుము చాలా సన్ననైనది అని అర్థము. అజ్ఞానులకు ఆధారభూతమైనది. మాయాతీతమైనది.

కనిపించీ కనుపించని రోమావళి లత మాత్రం చేత ఊహించగదగిన శరీర మధ్యభాగము గలది. ఆధారంలేకుండా తీగెఉండదు అనేప్రమాణం ఆధారంగా తీసుకుని లతకుఆధారం నాభి. నాభికిమధ్యభాగమైన నడుము అక్కడ ఉండి ఉంటుంది అని ఊహిస్తున్నారు. స్త్రీలకు సన్ననినడుముఉండటం శుభసూచకము ఇది సాముద్రిక లక్షణం. పరమేశ్వరినడుము ఊహించటానికి వీలులేనంత సన్నగా ఉన్నది.

**కుచౌ సద్య స్స్విద్య త్తటఘటిత కూర్పాసభిదురౌ**
**కషన్తౌ దోర్మూలే కనకకలశాభౌ కలయతా**
**తవ త్రాతుం భంగా దలమితి వలగ్నం తనుభువా**
**త్రిధా నద్ధం దేవి త్రివళి లవలీవల్లిభిరివ ॥ 80**

ప్రకాశమానమైనరూపంగల ఓదేవీ ! చెమట పోసినప్పుడు వంటికి అంటుకుపోయిన రవికెను పిగుల్చుచున్నవి, బాహుమూలముల సమీపప్రదేశము

లందు ఒరుస్తున్నవి, బంగరుకలశముల కాంతులచే విరాజిల్లుతున్నవి, అయిన నీకుచములను నిర్మిస్తున్న మన్మథుడు, నీస్తనముల బరువువలన నడుముకు ఏ మాత్రము భంగపాటుకలుగరాదని ఆలోచించి, ఆనడుమును కాపాడటానికి మూడుకట్లువేశాడా అన్నట్లుగా నీపొట్టమీది ముడుతలు అనిపిస్తున్నాయి.

ఈ శ్లోకంలో అమ్మవారి నడుముకు ఉన్న ముడుతలను లవలీలతకట్లుగా సంభావిస్తున్నారు. మన్మథుడు తనుభవుడు. అంటే శరీరమందు నిత్యము నివసించేవాడు. అందుచేత శరీరముయొక్క యోగక్షేమాలను గమనిస్తూఉంటాడు. అటువంటి మదనుడు ఆ పరమేశ్వరిదేహంలో కూడా ఉంటాడు. ఆ దేహముయొక్క రక్షణ విషయంలో యుక్తాయుక్త విచక్షణగలవాడు. ఆమెయొక్క స్తనభారంచేత నడుముకు ఇబ్బంది కలుగుతుంది. ఆ భారాన్ని నడుముమోయలేదని తలచి లవలీలతలో మూడుకట్లుకట్టాడు.

లలితాసహస్రంలోని 36వ నామము **స్తనభారదళన్మధ్య పట్టబంధ వళిత్రయా** పరమేశ్వరి నడుము చుట్టూ ఉన్న మూడు ముడుతలు, ఆమె స్తనభారముచే వంగిన నడుముచుట్టూ వేసిన బంగారుకట్లుగా కనిపిస్తున్నాయి.

దేవిస్తనాలు సూర్యచంద్రులు. అవి పగలు, రాత్రి అనే భేదంతో కాలాన్ని తెలుపుతున్నాయి. ఒక పగలు, ఒక రాత్రి కలిపితే ఒకరోజు. ముప్పైరోజులు ఒక నెల. ఈ రకంగా కాలం లెక్కకట్టబడింది. పరమేశ్వరి కాలస్వరూపిణి. కాని ఆమె మాత్రం కాలాతీతమైనది. సాముద్రిక శాస్త్రప్రకారం.

**లలాటే చ గళేచైవ మధ్యే చాపి వళిత్రయమ్**
**స్త్రీపుంస యోరిదం జ్ఞేయం మహాసౌభాగ్య లక్షణమ్**

లలాటము, కంఠస్థానము, నడుములయందు మూడుముడుతలుండటమనేది సౌభాగ్యలక్షణము. నడుముచుట్టూ ఉన్న మూడుముడతలు సత్వరజస్తమోగుణాలకు ప్రతీక, స్థూల సూక్ష్మకారణ దేహాలకు ప్రతీక, మహాకాళి మహాలక్ష్మి మహాసరస్వతులకు ప్రతీక, త్రిమూర్తులకు, త్రిలోకాలకు ప్రతీక.

**గురుత్వం విస్తారం క్షితిధరపతిః పార్వతి నిజాత్**
**నితమ్బా దాచ్ఛిద్య త్వయి హరణ రూపేణ నిదధే ।**
**అతస్తే విస్తీర్ణో గురురయ మశేషాం వసుమతీం**
**నితమ్బ ప్రాగ్భార స్థగయతి లఘుత్వం నయతిచ ॥ 81**

తల్లీ ! పార్వతీదేవి ! పర్వతరాజైన నీతండ్రి హిమవంతుడు తననితంబ ప్రదేశము నుండి (కొండచరియ) కొంతగురుత్వమును, కొంతవైశాల్యమును తీసి వివాహ సమయంలో కానుకగా నీకుసమర్పించాడు. దానివల్ల నీపిరుదుల యొక్క సౌందర్యము చాలాగొప్పది, వెడల్పుఅయినది అయి ఈభూమినంతటినీ కప్పుతున్నది.

ఈ శ్లోకంలో అమ్మవారియొక్కపిరుదులను వర్ణిస్తున్నారు. హిమవంతుడు తనకుమార్తెయొక్క వివాహసమయంలో కొంతగురుత్వము, వైశాల్యము తన నితంబప్రదేశము నుండి అరణముగా ఇచ్చాడు. అరణము అంటే వివాహసమయంలో పెండ్లికుమార్తెకిచ్చే కానుక. ఇది రెండు రకాలు 1. అధ్యగ్ని – వివాహ సమయంలో అగ్నిదగ్గర తండ్రిమొదలైన వారు ఇచ్చే నూతనవస్త్రాలు ధనము మొదలైనవి. 2. అధ్యావహనికము – వివాహమైన తరువాత అల్లుడు, కూతురుని తన ఇంటికి తీసుకువెళ్ళేటప్పుడు తండ్రిమొదలైన వారిచ్చే ఆభరణాలు, కానుకలు. ఈ రెండూ అరణములే అని మనుస్మృతి చెబుతున్నది. ఈ రకంగా హిమవంతుడు తననితంబము నుండి కొంతభాగము తన కుమార్తెకుఇవ్వగా ఆమెనితంబము చాలాగొప్పదై ఈభూమిని ఆక్రమిస్తున్నది. అనగా ఈ భూమి పరమేశ్వరికి ఆసనమైనది అనిఅర్థం. దేవియొక్క నితంబ బింబశోభముందు సకల భూతబింబము చాలాచిన్నదే అవుతున్నది

హిమవంతుడు తననితంబమునుండి అరణమిచ్చాడు. నితంబము అంటే కాముకులచే ఏకాంతమందు కాంక్షింపబడునది. 1. పిరుదు 2. కటి మొల 3. మూపు 4. కటకము, 5. కొండ నడుమభాగము అని సూర్యరాయాంధ్ర నిఘంటువు. కాబట్టి హిమవంతుడు తనకుమార్తెకు నితంబము అరణంగాఇచ్చాడు అంటే తన రాజ్యంలోనుంచి కొంతభాగాన్ని ఇచ్చాడన్నమాట.

స్త్రీలకు నితంబము బరువుగాను, విశాలంగాను, నునుపుగాను, ఎత్తుగాను, అర్ధగోళాకారములోను ఉండటము సౌభాగ్యలక్షణము.

దుర్వాసులవారు తమ దేవీమహిమ్నస్తుతిలోని 32వ శ్లోకంలో అమ్మవారి నితంబాన్ని వర్ణిస్తూ

**ఆరక్తచ్ఛ వినాతిమార్దవ యుజా నిఃశ్వాస హార్యేణస**
**త్కౌశేయేన వచిత్ర రత్నఖచితైర్ముక్తాఫలై రుజ్జ్వలైః**
**కూజత్కాంచన కింకిణీభి రభితః సంనద్ధ కాంచీగుణై**
**రాదీప్తం సునితంబ బింబ మరుణం తేపూజ యామ్యంబికే ॥**

ఓదేవీ ! పరమశివునికి ఆహ్లాదం కలిగిస్తూ శోభిల్లే నీనితంబమును నా మనసున పూజిస్తాను. వాటి ఉత్కృష్టతను భావనచేసి ఆనందిస్తాను. ఆనితంబము ఎర్రనిరంగు గలది, మిక్కిలిమెత్తగాఉన్నది, నిట్టూర్పుగాలికి కూడా ఎగిరిపోయే పట్టువస్త్రముతో కప్పబడినది. చిరుగజ్జెలు, ముత్యములతో కూర్చబడిన మొలనూలుతో ప్రకాశించునది, అయిన నీనితంబమును నామనసునపూజిస్తాను.

**కరీన్ద్రాణాం శుణ్డాన్ కనక కదలీ కాణ్డపటలీం**
**ఉభాభ్యా మూరుభ్యా ముభయమపి నిర్జిత్య భవతి**
**సువృత్తాభ్యాం పత్యుః ప్రణతి కఠినాభ్యాం గిరిసుతే**
**విధిజ్ఞే జానుభ్యాం విబుధకరికుమ్భద్వయమసి ॥** **82**

గిరిరాజపుత్రీ ! నీయొక్కఊరువులు దిగ్గజేంద్రములయొక్క తొండములను, బంగారుఅరటిస్తంభములను మించి శోభిస్తున్నాయి. అలాగే నీ భర్త అయిన సదా శివునికి నమస్కరించటానికి వంగినప్పుడు నేలకు తగిలి, కఠినములైన నీ మోకాళ్ళు దిగ్గజముల కుంభస్థలములను మించిఉన్నాయి.

ఈశ్లోకంలో పరమేశ్వరియొక్క ఊరువులను, మోకాలిచిప్పలను వర్ణిస్తున్నారు. సాధారణంగా స్త్రీలఊరువులను ఏనుగుతొండాలతోను, అరటిబోదెలతోనూ పోలుస్తారు. అయితే ఇక్కడ ఒకచిన్న అవలక్షణంఉన్నది. ఏనుగుతుండములు పొడవుగా, లావుగా బలంగా ఉంటాయి. అయితే ఆతుండములమీద చర్మము మందంగా, ముతకగా, గరుకుగా ఉంటుంది. పైపెచ్చు తుండానికి స్థిరత్వముండదు. ఎప్పుడూ అటూఇటూ కదులుతూ ఉంటుంది. **విప్రహస్తం ఏనుగుతుండం స్థిరంగా**

**ఉండవు** అని సామెత. ఏనుగు తుండములాగానే బ్రాహ్మణుడి చెయ్యికూడా దానం తీసుకునేటప్పుడు క్రిందికీ, ఆశీర్వదించేటప్పుడుపైకి కదులుతూఉంటుంది. పరమేశ్వరి ఊరువులకు ఈరెండు అవలక్షణాలులేవు. అలాగే అరటిబోదెలు దొప్పలవల్ల ఏర్పడతాయి. అంతేగాని ఒకేభాగంగా, ఒకేకండగా ఉండవు. అంతేకాదు. అరటిచెట్టు క్రిందభాగము లావుగా పైకిపోయినకొద్దీ సన్నగా ఉంటుంది. ఈ అవలక్షణాలు పరమేశ్వరి ఊరువులకులేవు. ఆమెఊరువులు పైకి పోయిన కొద్దీలావుగా ఉంటాయి. ఈ కారణాల చేత ఆమె ఊరువులు ఏనుగు తుండములకన్న, అరటిబోదెలకన్న అందంగా ఉన్నాయి అంటున్నారు.

స్త్రీల మోకాలిచిప్పలు గుండ్రంగా, మృధువుగా, అందంగా ఉంటాయి. అయితే మాటిమాటికీ నేలను తాకటంవల్ల అవిగట్టిపడతాయి. పరమేశ్వరి యొక్క మోకాలి చిప్పలు, పరమశివునికి నమస్కరించటానికి ఆమె వంగినందువల్ల మాటిమాటికీ నేలను తాకి గట్టిపడి ఐరావతముయొక్క కుంభస్థలాలను మరపిస్తున్నాయి. అవి గట్టిపడి, తెల్లగా ఐరావతము కుంభస్థలములకన్న అందంగా ఉన్నాయి.

లలితాసహస్రంలోని 39వ నామము **కామేశజ్ఞాతసౌభాగ్య మార్దవోరు ద్వయాన్వితా** కామేశ్వరునికిమాత్రమేతెలియదగిన మార్దవము, లావణ్యము, కోమల మయిన ఊరుద్వయము గలది. 40వ నామము **మాణిక్యమకుటాకార జానుద్వయ విరాజితా** పరమేశ్వరి మోకాలిచిప్పలు మాణిక్యాలు కూర్చిన టోపీలులాగా ఉన్నాయి.

**పరాజేతుం రుద్రం ద్విగుణశరగర్భౌ గిరసుతే**
**నిషఙ్గౌ జఙ్ఘే తే విషమవిశిఖో బాఢమకృత ।**
**యదగ్రే దృశ్యన్తే దశ శరఫలాః పాదయుగలీ**
**నఖాగ్ర చ్ఛద్మాన స్సురమకుటశాణైకనిశితాః ॥ 83**

ఓదేవీ ! శివుని జయించటానికి మన్మథుడికి తనఐదుబాణాలు చాలలేదు. అందుచేత వాటిని రెండింతలు అంటే పదిగా చేసుకొనదలచి, నీపిక్కలు అంబుల పొదులుగా, కాలివ్రేళ్ళు బాణాలుగా, కాలివ్రేళ్ళ గోళ్ళు బాణపుములుకులుగా చేసికొని, నీకు నమస్కరించటానికి వచ్చిన దేవతలకిరీటములలోని మణులమీద ఆ బాణపు ములుకులకు పదునుపెడుతున్నాడు.

ఈ శ్లోకంలో అమ్మవారి పిక్కలు, కాలి[వ్రేళ్ళు, గోళ్ళు వర్ణించబడ్డాయి. మన్మథుడు తాపసులమీద యుద్ధానికిపోయి, వారితపస్సుభగ్నంచేస్తాడు. అతనిదగ్గర ఐదే బాణాలుంటాయి. అవికూడా పూలబాణాలు.

**కమలం కైరవం రక్తం కల్హారేన్దీవరే తథా సహకార మిత్యుక్తం**

| | | |
|---|---|---|
| కమలము | – | ఎ[రతామర |
| రక్తకైరవము | – | ఎ[రకలువ |
| కల్హారము | – | తెల్లకలువ |
| ఇందీవరము | – | నల్లకలువ |
| సహకారము | – | మామిడిపూవు |

ఈబాణాలతో తాపసులందరినీగెలిచాడు. అయితే శివుడిమీద ఇవి పనిచెయ్యలేదు. అందుచేత పరమేశ్వరి పిక్కలు, కాలివేళ్ళు, గోళ్ళు బాణాలుగా వాడుకున్నాడు. శివుడుకఠోరమైన తపస్సుచేస్తున్నప్పటికీ, అమ్మవారి స్పృహ కలిగినట్లైతే ఆవైరాగ్యంకాస్తా పటాపంచలై పోతుంది. పరమేశ్వరిని అర్చించిన వారిలో మన్మథుడుఒకడు. అసలు మన్మథుడే పంచదశీమహామంత్రాన్ని ఈ లోకానికితెచ్చాడని ప్రతీతి. కాబట్టి అతడికి అమ్మవారి స్థూలరూపము పూర్తిగా తెలుసు. అందుకే శివుణ్ణిగెలవటానికి అమ్మవారిసహకారం తీసుకుంటున్నాడు. లలితాసహస్రంలోని 41వ నామము **ఇంద్రగోప పరిక్షిప్త స్మరతూణా భజంఘికా** ఆరుద్రపురుగులవలె ఎ[రనికాంతులతో ప్రకాశించే మన్మథుని అమ్ములపొదులతో సమానమైన కాంతులతో ప్రకాశించుపిక్కలు గలది. 44వ నామము **నఖదీధితి సంఛన్న నమజ్జనతమోగుణ** పాదాభివందనంచేసేవారికి దేవియొక్క కాలిగోళ్ళు అజ్ఞానాన్ని పటాపంచలుచేస్తాయి. అనిచెప్పబడింది.

**శ్రుతీనాం మూర్ధానో దధతి తవ యౌ శేఖరతయా**
**మమాప్యేతా మాత శ్శిరసి దయ యా ధేహి చరణౌ ।**
**యయోః పాద్యం పాథః పశుపతి జటాజూటతటినీ**
**యయో ర్లాక్షాలక్ష్మీ రరుణహరి చూడామణి రుచిః ॥** **84**

ఓతల్లీ ! ఓజగన్మాతా ! వేదములకు శిరస్సులు అని చెప్పబడే ఉపనిషత్తులు అనే పూలను ధరించినవి, శివునిశిరమునుండి వచ్చే గంగాజలాన్ని పాదప్రక్షాళనానికి ఉపయోగించేవి, శ్రీమహావిష్ణువు ధరించే కౌస్తుభమణికాంతులు వెదజల్లేవి అయిన నీపాదములను నాశిరస్సునధరిస్తాను.

ఈ శ్లోకంలో అమ్మవారి పాదపద్మముల ప్రాముఖ్యతను వివరిస్తున్నారు. వేదాలు, శాస్త్రాలు, పురాణాలు, ఇతిహాసాలు చదివినంత మాత్రంచేత అమ్మవారి స్థూలరూపం తెలుసుకోగలుగుతాము అంతేగాని పరమేశ్వరితత్త్వంతెలియదు. ఉపనిషత్తులసారమే ఆమెతత్త్వము. లలితాసహస్రములోని 289, 290 నామాలనుచూడండి. **శ్రుతిసీమంతసింధూరీకృతపాదాబ్జధూళికా, సకలాగమసందోహాసుక్తిసంపుట మౌక్తికా.** వేదాలు, పురాణాలు చదివితే అమ్మవారి ఆకారం, స్థూలరూపం తెలుస్తుంది. కాని ఉపనిషత్తులసారమే ఆపరమేశ్వరితత్త్వము. అందుకే ఆమెపాదాలు ఉపనిషత్తులనే పూలతో పూజింపబడతాయి. అమ్మవారికి ప్రణయకోపంవచ్చింది. అప్పుడు శివుడు ఆమెకాళ్ళావేళ్ళాపడి బ్రతిమాలుతున్నాడు. ఆ సమయంలో, ఆయన శిరస్సున ఉన్న గంగాజలము అమ్మవారిపాదాలను కడిగింది. అలాగే శ్రీమహావిష్ణువు అమ్మవారి పాదాలకు శిరసువంచి నమస్కరించాడు. ఆమెపాదాలప్రకాశంచేత శ్రీమహావిష్ణువు దగ్గర ఉన్నకౌస్తుభరత్నం ఎర్రబడింది. అటువంటి ప్రకాశవంతమైన నీ పాదాలను నేనుఅర్చిస్తున్నాను అంటున్నారు భగవత్పాదులవారు. లలితాసహస్రంలోని 45వ నామము **పదద్వయప్రభాజాలపరాకృతసరోరుహా** తామరపూవులను కూడా తిరస్కరించే పాదములుగలది. 46వ నామము **శింజానమణిమంజీర మండిత శ్రీపదాంబుజా** మణులు మాణిక్యాలు పొదిగిన మంజీరములు ధరించినది.

దుర్వాసుడు తన దేవీ మహిమ్నస్తుతిలోని 31వ శ్లోకంలో

**శింజన్నూపుర పాదకంకణ మహాముద్రా సులాక్షరసా**
**లంకారాంకిత మంఘ్రిపంకజయుగం శ్రీపాదుకాలంకృతం**
**ఉద్భాస్వన్నఖ చంద్రఖండ రుచిరం రాజజ్జపాసన్నిభం**
**బ్రహ్మాది త్రిదశా సురార్చిత మహం మూర్ధ్నిస్మరామ్యంబికే ॥**

ఓతల్లీ ! అందెలు, కడియాలు, మహాముద్రలు, లత్తుకరసములతో అలంకరింపబడి, ప్రకాశవంతమైన గోళ్ళు అనే చంద్రఖండములతో మనోహరముగా ఉన్నాయి. అప్పుడేవికసించిన జపాపుష్పములాగాఉండి బ్రహ్మాదిదేవతలచే పూజింపబడే నీపాద పద్మాలను నాశిరసున ధరిస్తాను. అంటున్నారు.

**నమోవాకం బ్రూమో నయనరమణీయాయ పదయోః**
**త వాస్మై ద్వన్ద్వాయ స్ఫుటరుచిరసాలక్తకవతే ।**
**అసూయత్యత్యన్తం యదభిహననాయ స్పృహయతే**
**పశూనామీశానః ప్రమదవనకఙ్కేళితరవే ॥ 85**

తల్లీ ! ఏ నీ పాదములచేత తాడనము అపేక్షించుచున్న ఉద్యానవనంలోని అశోకవృక్షాన్నిచూసి పశుపతి అసూయపడుతున్నాడో, ఏనీపాదములు లత్తుకరసముతో ప్రకాశిస్తున్నవో ఆనీపాదద్వందానికి నమస్కారము.

ప్రణయకలహంలోనైనా దేవియొక్క పాదతాడనభాగ్యం కలుగకుండా, అది ఒక అచైతనమైనవృక్షానికిలభించింది అని శివుడు అసూయపడుతున్నాడు. ప్రణయకలహంలోకూడా పాదతాడనముచేయలేదని చెప్పటం దేవిపాతివ్రత్యానికి పరాకాష్ఠ. ఇటువంటిలక్షణము లక్ష్మీ, సరస్వతులకు లేదు.

అశోకవృక్షము పద్మినీజాతి స్త్రీల పాదతాడనమువల్ల పుష్పిస్తుంది. అందుచేత దానికి పాదతాడనము కావాలి. శివుడుకూడా ఆపాదతాడనము కావాలి అనుకుంటున్నాడు. అంటే పూర్వజన్మలోచేసిన సుకృతములేనిదే పాదతాడనము లభించదు. దానికోసం శివుడు ఎదురుచూస్తున్నాడు.

**మృషా కృత్వా గోత్రస్ఖలన మథ వైలక్ష్యనమితం**
**లలాటే భర్తారం చరణకమలే తాడయతి తే ।**
**చిరా దన్త శ్శల్యం దహనకృత మున్మూలితవతా**
**తులాకోటిక్వాణైః కిలికిలితమీశానరిపుణా ॥ 86**

తల్లీ ! నీపతి అయిన శివుడు నీదగ్గరఉండగా పొరపాటున నీసవతి పేరు ఉచ్ఛరించి, చేసినతప్పు ఏరకంగా దిద్దుకోవాలో తెలియక తొట్రుపడుతున్న

సమయంలో నీవు నీకాలితో అతనినుదుటన ఒక్కతాపుతన్నగా, శివునికి విరోధియైన మన్మథుడు, నీమంజీరధ్వని రూపంతో కిలాకిలారావములు చేశాడు.

ఒకసారి సదాశివుడు పరమేశ్వరితో శృంగారమందిరంలోఉండి, సమయా సమయాలనుమరచి, తనరెండవభార్యఅయిన గంగపేరు ఉచ్ఛరించాడట. ఆపేరును విన్న పరమేశ్వరి కోపంతో తనఎడమకాలితో శివునినుదుటన ఒక్క తన్నుతన్నిందట. గిరిజాకల్యాణం జరగటానికి ముందు శివునియొక్క మూడవ కంటి అగ్నిజ్వాలలకు భస్మమై అనంగుడైనమన్మథుడు శివునిమీద ప్రతీకారం తీర్చుకోవాలని ఎదురు చూస్తున్నాడు. ఇప్పుడు పరమేశ్వరి శివుణ్ణి తనకాలితో ఒక్క తన్నుతన్నగానే మన్మథుడు ప్రతీకారాపేక్షతో ఆమెకాలిమణిమంజీరములలో చిరుమువ్వగాప్రవేశించి కిలకిలానవ్వి శివుణ్ణి హేళనచేసి, అతనిమీద పగ తీర్చుకున్నాడు. (కాలు కదలినప్పుడు మంజీరములోని మువ్వలు చిత్రమైన శబ్దం చేశాయి.)

ఇక్కడ అమ్మవారు అంటే కుండలినీశక్తి. లలాటము – ఆజ్ఞాచక్రము. శివుడు – ఉపాసకుడైన జీవుడు. అమ్మవారు అనే కుండలినీశక్తి శివుడనే జీవునియొక్క లలాటస్థానము ఆజ్ఞాచక్రమందు కాలుమోపింది. అనగా కుండలినీశక్తి సాధకుని యొక్క ఆజ్ఞాచక్రంచేరింది అనితెలుసుకోవాలి. ఇంద్రియనిగ్రహశక్తిని పెంచి, ఉపాసకుడు కుండలినీశక్తిని సుషుమ్నామార్గముద్వారా పైకి అంటే ఊర్ధ్వగతిలో నడిపించి, ఆజ్ఞాచక్రముమీదగా సహస్రారానికిచేర్చుతాడు. ఈప్రయాణంలో కుండలినీశక్తి ఆజ్ఞాచక్రం చేరింది అని చెప్పటమే ఈ శ్లోక పరమార్థం.

**హిమానీహన్తవ్యం హిమగిరి నివాసైక చతురౌ**
**నిశాయాం నిద్రాణాం నిశి చరమభాగే చ విశదౌ ।**
**వరం లక్ష్మీపాత్రం శ్రియమతిసృజన్తౌ సమయినాం**
**సరోజం త్వత్పాదౌ జనని జయత శ్చిత్ర మిహ కిమ్ ॥ 87**

తల్లీ ! మంచుకొండయందు నివసించుటలో నేర్పుగలవి, రాత్రులందు, తెల్లవారుఝామున ప్రసన్నములైనవి, సమయాచారులైన నీభక్తులకు లక్ష్మీప్రదమైనవి అయిన నీ పాదాలు, మంచువలన నాశనముపొందునవి, రాత్రులందు ముడుచుకు

పోయేవి, లక్ష్మీదేవికి కొంచెము పీఠముగా నుండదగినవిఅయిన కమలములను జయిస్తున్నాయి. ఈ విషయంలో ఆశ్చర్యములేదు.

ఈ శ్లోకంలో అమ్మవారి పాదాలఅడుగుభాగాన్ని వివరిస్తున్నారు. ఆవిడ పుట్టింది, పెరిగింది, తిరిగింది, అంతా హిమగిరిమీదనే. కాబట్టి అక్కడఎంత చల్లగా ఉన్నప్పటికీ, ఆచల్లదనం ఆమెపాదాలను ఏమీచెయ్యలేదు. సామాన్యంగా పాదాలను పద్మాలతో పోల్చిచెబుతారు. కాని ఇక్కడ ఆపోలిక సరికాదు. ఎందుచేత అంటే మంచు అమ్మవారి పాదాలను ఏమీచెయ్యలేదు కాని పద్మాలుమంచుకు ముడుచుకుపోతాయి. కాబట్టి పద్మాలకన్నా అమ్మవారి పాదాలే శ్రేష్ఠమైనవి.

సూర్యచంద్రులిద్దరూ పరమేశ్వరి కనులు. కాబట్టి ఆమె దగ్గర సూర్యకిరణములకు, చంద్ర కిరణములకు భేదం లేదు. కాని సూర్యకాంతిలో పద్మాలు వికసించి, చంద్రకాంతితో ముడుచుకుపోతాయి. లక్ష్మీదేవి పద్మాలలో పగటిపూట మాత్రమే నివాసముంటుంది. అమ్మవారిపాదాలు అలంకారికవస్తువులుకావు. తనను నమ్మినవారికి సిరిసంపదలనుప్రసాదిస్తాయి. ఆదేవిపాదపద్మాలను శరణుకోరి తెల్లవారుఝామున ఆమెనుఉపాసించేభక్తులకు సకలాభీష్టాలు నెరవేరతాయి.

ఈ శ్లోకంలో **నిశిచరమభాగే చ విశదౌ** రాత్రిపూట చివరిభాగంలో పరమేశ్వరి ఉపాసన చెయ్యాలి. అప్పుడు ఆమె త్వరగా ప్రసన్నమవుతుంది అనిచెబుతున్నారు. ఇది సమయమతసిద్ధాంతము, శంకరుల పరమగురువయినగౌడపాదులవారు తమ **'సుభగోదయస్తుతి'**లోని 31వ శ్లోకంలో కూడా ఇదేవిషయాన్ని వివరించారు.

**అతః శుక్లేపక్షే ప్రతిదిన మిహత్వాం భగవతీం**

**నిశాయాం సేవంతే నిశిచరమభాగే సమయినః**

**శుచిః స్వాధిష్ఠానే రవిరుపరి సంవిత్సరసిజే**

**శశీచాజ్ఞాచక్రే హరహరివిధి గ్రంథయ ఇమే ॥**

పరమేశ్వరీ ! సమయమతస్తులు శుక్లపక్షతిథులరాత్రులందు చివరి భాగంలో ఉపాసనచేస్తారు. సమయమతం ప్రకారము రెండు రెండు చక్రాలకు ఒక గ్రంధి చొప్పున ఉంటూ ఆజ్ఞాచక్రందాటిన తరువాత రుద్రగ్రంధి ఉంటుంది.

శుక్లపక్ష రాత్రులందే కుండలినీప్రబోధం జరుగుతుంది. శరీరంలో దేవయానమైన ఇడానాడిలో చంద్రుడు, పిత్రుయానమైన పింగళానాడిలో సూర్యుడు సంచరిస్తుంటారు. ఈమార్గంలో చంద్రుడు సంచరిస్తున్నప్పుడు తనఅమృతపుధారలతో చంద్రుడు నాడీమండలాన్నితడుపుతుంటాడు. చంద్రునిచే స్రవింప చేయబడిన అమృతాన్ని సూర్యుడు హరించివేస్తుంటాడు. సూర్యచంద్రులు ఆరకంగా తిరుగుతూ నెలకుఒకసారి ఆధారచక్రంలో కలుస్తారు. అప్పుడు సూర్యకిరణాలు చంద్రకాంతుల్ని కప్పివేస్తాయి. ఆరోజు అమావాస్య. చంద్రకళలన్నీ చంద్రునివిడిచి సూర్యునిలో ప్రవేశిస్తాయి. ఆధారచక్రంలో అమావాస్య రోజున కుండలినీశక్తి నిద్రావస్థలో ఉంటుంది. సమయాచారులకు అమావాస్యరోజున ఉపాసన నిషేధము. కౌళాచారులు మాత్రం అమావాస్యనాడు కుండలినినిఉపాసిస్తారు. యోగి పద్మాసనంలో కూర్చుని, వాయువును బంధించినట్లైతే ఉచ్ఛ్వాసనిశ్వాసలు ఆగిపోతాయి. శరీరం అచేతన మవుతుంది. అప్పుడు నాడీమండలంలోని సూర్యచంద్రులగమనం ఆగిపోతుంది. ఎప్పుడైతే చంద్రునిగమనం ఆగిపోయిందో అప్పుడు అమృతధారలు స్రవించవు. ఈఅమృతాన్నే ఆహారంగా తీసుకుని నిద్రావస్థలో ఉండే కుండలినీశక్తి నిరాహారఅయి మేల్కొని గ్రంథిత్రయాన్ని భేదించి, సహస్రారం చేరి, అక్కడ అధోముఖంగా ఉన్న సహస్రదళపద్మాన్ని తన పళ్ళతో కరచిపట్టుకోగా, ఆపంటిగాట్లద్వారా చంద్రలోకం అనే సహస్రారంలోద్రవీభవించిన అమృతం క్రిందికి జాలువారి, యోగిశరీరంలోని 72 వేల నాడీమండలాన్ని తడుపుతుంది. ఇది సమయమతరహస్యము.

పరమేశ్వరిపాదపద్మాలను ఆశ్రయించిన సమయాచారులకు వారిఅర్హతను బట్టి ముక్తిలభిస్తుంది.

**పదం తే కీర్తీనాం ప్రపద మపదం దేవి విపదాం**
**కథం నీతం సద్భిః కఠినకమఠీకర్పరతులాం**
**కథంవా పాణిభ్యా ముపయమనకాలే పురభిదా**
**యదాదాయ న్యస్తం దృషది దయామానేన మనసా ॥ 88**

తల్లీ ! సత్కీర్తులకు స్థానమై, ఆపదలను తొలగించునట్టి నీ మీగాళ్ళను, కఠినమైన తాబేలువీపుచిప్పలతో ఏరకంగా పోలుస్తున్నారు ? దయాస్వరూపుడైన శివుడు వివాహసమయంలో మృధువైన నీపాదాలను సన్నె కల్లుమీద ఎలా ఉంచగలిగాడు?

ఈ శ్లోకంలో అమ్మవారి 'ప్రపదములు' అనగా ఉబ్బెత్తుగాఉండే పాదములపై భాగములను వర్ణిస్తున్నారు. సామాన్యంగా స్త్రీల ప్రపదములను తాబేటి వీపుచిప్పలతో పోలుస్తారు. తాబేలువీపు చాలాగట్టిగాఉంటుంది. ఆపదవచ్చినప్పుడు తాబేలు తన శరీరాన్ని ఆడిప్పలోపలికిలాక్కుంటుంది. చూడటానికి గట్టిగా ఉండి దేనితో కొట్టినా ఆడిప్ప పగలదు. క్షీరసాగరమథనం జరిగేటప్పుడు మందరగిరిసముద్రంలో మునిగిపోయింది. అప్పుడు శ్రీమహావిష్ణువు

**సవరనైలక్షయోజనముల వెడలుపైగడు కఠోరంబైన కర్పరమున**

**నదనైన బ్రహ్మాండమైన నాహరించు ఘనతరంబగు ముఖగుహ్వారంబు**

**సకల చరాచర జంతురాశుల నెల్ల మ్రింగి లోగొనునట్టి మేటికడుపు**

**విశ్వంబుపై వేరువిశ్వంబు పైబడ్డ నాగినకదలని యట్టికాళ్ళు**

**వెలికిలోనికి జనుదెంచు విపులతుండ**

**మంబుజంబుల బోలెడి యక్షియుగము**

**సుందరంబుగ విష్ణుండు సురలతోడి**

**కూర్మిచెలు వొందనొక మహాకూర్మమయ్యె ॥**

ఆదికూర్మమై మందరగిరినిమోశాడు. అందుకే స్త్రీలపాదాలను తాబేలు డిప్పలతో పోలుస్తారు. కాని అమ్మవారిపాదాలు చిగురుటాకులలాగా మెత్తగా ఉంటాయి. సన్నెకల్లు గరుకుగాఉంటుంది. అటువంటిసన్నెకల్లుమీద తల్లీ ! నీ పాదాలను ఆ శంకరుడు ఎలాఉంచగలిగాడు ? అంటున్నారు. లలితాసహస్రంలో 43వ నామము **కూర్మపృష్ఠ జయిష్ణు ప్రపదాన్వితా** తల్లీ నీపాదాలు తాబేలు చిప్పలకన్న అందంగా ఉన్నాయి. శరణుకోరిన వారికి, వాటి క్రింద ఆశ్రయం దొరుకుతుంది.

**నఖైర్నాకస్త్రీణాం కరకమలసఙ్కోచశశిభిః**
**స్తరూణాం దివ్యానాం హసత ఇవ తే చణ్డి చరణౌ ।**
**ఫలాని స్వస్థేభ్యః కిసలయకరాగ్రేణ దదతాం**
**దరిద్రేభ్యో భద్రాం శ్రియమనిశ మహ్నాయ దదతౌ ॥ 89**

చండీపేరుతో ప్రసిద్ధి చెందిన ఓదేవీ ! సకలసంపదలతో తులతూగుతున్న దేవతలకు మాత్రమే కోరికలుతీర్చే కల్పవృక్షాన్ని, దీనులై దరిద్రులైన జనానికి అధికమైన సంపదలనుఇచ్చే నీపాదాలు శచీదేవి మొదలైన దేవతాస్త్రీలకరపద్మాలను ముకుళింపచేసే గోళ్ళు అనే చంద్రులచేత పరిహసింపబడుతున్నాయి.

ఈ శ్లోకంలో అమ్మవారి పాదాలు, వాటి గోళ్ళను వర్ణిస్తున్నారు. దేవలోకంలో కల్పవృక్షమున్నది. అది దేవలోకవాసుల కోరికలు తీరుస్తుంది. అయితే స్వర్గలోక వాసులందరూ సంపన్నులే వారికి ఏ లోటూలేదు. వారికి కావలసినది కూడా ఏదీలేదు. అమ్మవారు భక్తులపాలిట కల్పవృక్షము. ఆశ్రితుల పాలిట కామధేనువు. తనను నమ్మినవారికి ఏది కావాలంటే అది ఇస్తుంది.

**శ్రీ సుందరీ సేవన తత్పరాణాం భోగశ్చ మోక్షశ్చ కరస్థ ఏవ ॥**

తనభక్తులకు ఇహంకావాలంటేఇహము, పరముకావాలంటేపరము ఇస్తుంది. కల్పవృక్షము సిరిసంపదలు, భోగభోగాలనిస్తుంది. కాని సాయుజ్యాన్ని మాత్రం ఇవ్వలేదు. ఆశక్తి పరమేశ్వరిపాదాలకు మాత్రమేఉన్నది.

శచీదేవి మొదలైన దేవతాస్త్రీలు అమ్మవారిపాదాలను అర్చించి అందమైన తమచేతులను చూసుకుని, అవి పద్మములవలెఅందంగాఉన్నాయని గర్వించారు. ఆసమయంలో చంద్రకిరణములను ప్రసరింపచేస్తున్న అమ్మవారి కాలిగోళ్ళ నుంచి వచ్చేకాంతులవల్ల దేవతాస్త్రీల కరపద్మములు ముడుచుకుపోయినాయి. అది చూసిన దేవతాస్త్రీలముఖాలు వాడిపోయినాయి. అంటున్నారు.

అమ్మవారి పాదపద్మములకు ఉన్న గోళ్ళనుండి చంద్రకాంతులు ప్రసరిస్తున్నాయి. యోగి సహస్రారం చేరగలిగినప్పుడు, ఆ చంద్రమండలం నుంచి అమృతపుధారలు కురుస్తాయి.

**దదానే దీనేభ్యః శ్రియమనిశ మాశానుసదృశీ**
**మమన్దం సౌన్దర్యప్రకర మకరన్దం వికిరతి ।**
**తవాస్మిన్ మన్దార స్తబక సుభగే యాతు చరణే**
**నిమజ్జ న్మజ్జీవః కరణచరణై ష్షట్చరణతామ్ ॥ 90**

తల్లీ ! దీనజనులకు ఎప్పుడూ వారుకోరినవిధంగా సిరిసంపదలను గ్రహించేది, అధికమైన లావణ్యము, సౌభాగ్యము అనే పూదేనియనుచల్లేది, కల్పవృక్షపు పూలగుత్తి లాగా అందమైనది, అయిన నీపాదపద్మమునందు, జ్ఞానేంద్రియాలు, మనస్సు వెరసి ఆరుపాదములుగాగల తుమ్మెదనై నివసిస్తాను.

ఈ శ్లోకంలో అమ్మవారిపాదపద్మాలను గురించి వివరిస్తున్నారు. దీనులకు వారు కోరినట్లుగా సిరిసంపదలను అందించేవి, లావణ్యము, సౌభాగ్యము గలవి, కల్పవృక్షపు పూలలాగా అందమైనవి ఆ పరమేశ్వరి పాదాలు. ఆ పాదాలనే పద్మాలమీద తాను తుమ్మెదలాగా తిరుగుతాను అంటున్నారు శంకరభగవత్పాదులవారు. తుమ్మెదకు ఆరుకాళ్ళుంటాయి. కాబట్టి జ్ఞానేంద్రియాలు ఐదు, మనస్సు మొత్తం ఆరుకాళ్ళుగా ఉంటాయి అంటున్నారు.

ఇక్కడ అమ్మవారిపాదాలకు ముఖ్యమైన మూడులక్షణాలున్నాయి. అవి 1. దీనుల కోర్కెలు తీర్చటం 2. లావణ్యము, సౌభాగ్యము 3. కల్పవృక్షపుష్పముల సోయగము. అటువంటి మహత్తరమైన పాదాలను సదా సేవిస్తుంటాను. అని శంకరుల అభిప్రాయము.

**పదన్యాసక్రీడా పరిచయమివారబ్ధుమనసః**
**స్ఖలన్త స్తే ఖేలం భవనకలహంసా న జహతి ।**
**అతస్తేషాం శిక్షాం సుభగమణిమఞ్జీర రణిత**
**చ్ఛలా దాచక్షాణం చరణకమలం చారుచరితే ॥ 91**

సుందరమైన చరిత్రగల ఓదేవీ ! నీ పెంపుడుహంసలు నీపదన్యాసక్రీడను అభ్యాసం చేయటానికి తొట్రుపడుతున్నప్పటికీ, నీవిలాస గమనాన్ని విడవటంలేదు.

అందువల్ల నీపాదాలకుగల ఆభరణాలలోని రత్నాలు, కెంపులు విచిత్రమైన శబ్దాలను చేస్తూ ఆహంసలకు శిక్షణ ఇస్తున్నట్టున్నది.

ఈశ్లోకంలో అమ్మవారి కాలిమువ్వలసవ్వడిని వివరిస్తూ, ఆశబ్దము రాజహంసలకు నడకలునేర్పటానికి ఇచ్చే శిక్షణలాగాఉన్నది అంటున్నారు. అమ్మవారి చరితమేకాదు నడకకూడా అతిమనోహరంగా ఉంటుంది. ఆవిడ వేసే ప్రతిఅడుగూ అందమైనదే. అందరికీ ఆనందముకలుగచేసేదే.

నడవటము అనేది ఒకకళ. హంసలు చాలా అందంగా నడుస్తాయి. నడవటాన్ని చెప్పేటప్పుడు హంసనడకలతోనే పోల్చుతారు. ఇక్కడ అమ్మవారు హంసలకు నడకలు నేర్పటంలేదు. ఆవిడ అంతఃపురంలో ఉండేహంసలు, ఆమె వెనకే తిరుగుతూ, ఆమెవేసే ప్రతిఅడుగునూ పరిశీలిస్తున్నాయి. చేతనయినంత వరకు ఆమెనడకను అనుకరిస్తున్నాయి. అయితే మధ్యలో తొట్రుపాటువల్ల తప్పటడుగులు కూడా వేస్తున్నాయి. అదిచూసి జాలిపడినపరమేశ్వరి నెమ్మదిగా, హంసలుపరిశీలించి నేర్చుకొనే విధంగా నడుస్తూఉంటే ఆమెకాళ్ళకుఉన్న మంజీరములలోని మణులు విచిత్రమైన శబ్దాలు చేస్తూ, ఆ హంసలకు ఆమె శిక్షణ ఇస్తున్నదా ? అన్నట్లున్నది అంటున్నారు భగవత్పాదులవారు.

లలితా సహస్రంలోని 46, 47 నామాలను చూడండి

**శింజాన మణి మంజీర మండిత శ్రీపదాంబుజా మరాళీ, మందగమనా**

మంజీరములు అనేవి స్త్రీలు కాళ్ళకుధరించే ఆభరణాలు. వీటిలో రాళ్ళు పొదగబడి ఉంటాయి. పక్షిజాతిలో ఉత్తమోత్తమమయింది హంస. అది చాలా అందంగా నడుస్తుందని ప్రతీతి. అటువంటి హంసలే ఆ పరమేశ్వరి దగ్గర నడకలకు శిక్షణ పొందుతున్నాయి.

ఈ హంసలు శ్రీచక్రరూపంలోఉన్న భవనంలో విహరిస్తున్నాయి. అవ్యక్తంగా మధురమైనకంఠంతో హంసమంత్రాన్ని వల్లిస్తున్నాయి.

**గమాగమస్థం గమనాదిశూన్యం । చిద్రూపదీపం తిమిరాపహారం**

**పశ్యామితే సర్వజనాంతరస్థం । నమామి హంసం పరమాత్మరూపమ్**

**దేహో దేవాలయః ప్రోక్తో జీవోదేవ స్సనాతనః**

**త్యజే దజ్ఞాననిర్మాల్యం సోహం భావేన పూజయేత్ ॥**

**హంస హంసాయ విద్మహే పరమ హంసాయ ధీమహి**

**తన్నో హంసః ప్రచోదయాత్ ॥**

'హంస' అంటే – పరమాత్మ, యోగవిశేషము, శరీర వాయువిశేషము, అంచ, తెల్లగుర్రము, మంత్రవిశేషము, మాత్సర్యము, అని 'సూర్యరాయాంధ్ర నిఘంటువు' చెబుతోంది.

శరీరంలో ఉండే వాయువును హంస అంటారు. ఉచ్ఛ్వాస నిశ్వాసలను బంధించే ప్రక్రియను ప్రాణాయామము అంటారు. యోగప్రక్రియలో ప్రాణాయామం ప్రధానమైనది. ప్రాణాయామంలో ఉన్నతస్థితికి చేరినవాడు అంటే శ్వాసమీద పట్టు సాధించినవాడిని "పరమహంస" అంటారు. శంకరభగవత్పాదులవారు పరమహంస పరివ్రాజకాచార్యులవారు. ఈశ్వాసను నెమ్మదిగా తీసుకోవాలి. ఆ విషయం పరమేశ్వరికి తెలుసు అందుకే ఆమె మరాళీ, మందగమనా అనబడింది.

ఇక్కడ హంసలుఅంటే సాధకులజీవాత్మలు. ఇవి ముక్తిపొందేవరకు అమ్మవారివెంటే తిరుగుతాయి. ఆమెమార్గంలోనే పయనిస్తాయి.

**గతా స్తే మఞ్చత్వం ద్రుహిణహరిరుద్రేశ్వరభృతః**

**శివ స్స్వచ్ఛచ్ఛాయాకపటఘటిత ప్రచ్ఛదపటః ।**

**త్వదీయానాం భాసాం ప్రతిఫలనరాగారుణతయా**

**శరీరీ శృఙ్గారో రస ఇవ దృశాం దోగ్ధి కుతుకమ్॥** **92**

ఓదేవీ ! బ్రహ్మ, విష్ణువు, రుద్రుడు, మహేశ్వరుడు అనే వారు నీమంచానికి కోళ్ళుకాగా, సదాశివుడు నీవు కప్పుకునే వస్త్రమయినాడు.

ఈ శ్లోకంలో పరమేశ్వరి సింహాసనానికిఉన్నకోళ్ళను వివరిస్తున్నారు. ముక్తి ఐదు విధాలుగా ఉంటుంది. వీటినే పంచవిధముక్తులు అంటారు. షట్చక్రాలలోను ఒక్కొక్క చక్రంలో పరమేశ్వరిని ఆరాధించే వారికి ఒక్కొక్క రకమైన ముక్తిలభిస్తుంది. ముక్తి అంటే విముక్తి. భవబంధాల నుండి విముక్తిపొందటమే ముక్తి.

ఆధార స్వాధిష్ఠానాలు అంధకారబంధురాలు. వాటిలో పరమేశ్వరిని కౌళులు ఉపాసిస్తారు. వీరికి ఇహమేకాని పరంఉండదు. ఇక్కడ సమయాచారులు పరమేశ్వరిని అర్చించరు. బాహ్యపూజ చేసేవారికి కేవలము ఐహికమైనకోరికలుమాత్రమే తీరతాయి. వీరికి ముక్తితోపనిలేదు. అంతరారాధన చేసేవారికి మాత్రమే ముక్తి లభిస్తుంది.

**1. సార్ష్టిరూపముక్తి :** మణిపూరంలో పరమేశ్వరిని అర్చించేవారు దేవి పురానికి దగ్గరగా ఇంకొక పురము నిర్మించుకుని ఉండగలుగుతారు.

**2. సాలోక్యముక్తి :** అనాహతంలో భగవతిని అర్చించేవారు దేవి ఉండే పురంలోనే ఒక మూల ఉండగలుగుతారు.

**3. సామీప్యముక్తి :** విశుద్ధిచక్రంలో దేవిని అర్చించే వారు దేవికి అతిదగ్గరగా ఉండి ఆమెను సేవించగలుగుతారు.

**4. సారూప్యముక్తి :** ఆజ్ఞాచక్రంలో దేవిని అర్చించేవారు ఆమెతోపాటుగా సమానమైన రూపం ధరించి భక్తుల కోరికలు తీరుస్తుంటారు.

**5. సాయుజ్యము :** సహస్రారంలో పరమేశ్వరిని అర్చించేవారు పరమేశ్వరిలో లీనమవుతారు. వారికి మరుజన్మ ఉండదు.

బ్రహ్మ విష్ణువు, రుద్రుడు, మహేశ్వరుడు, సదాశివుడు ఐదుగురు పరమేశ్వరికి అతిదగ్గరగా ఉండి సేవించాలనే తలంపుతో విశుద్ధిచక్రంలో ఆమెను ఉపాసించి, సామీప్య ముక్తి పొంది, పరమేశ్వరి సింహాసనానికి కాళ్ళు అయినారు. వీరు తమయొక్క శక్తికోల్పోయి అచేతనులైనారు. అందుకే అచేతనులైన వీరు ప్రేతములతోసమానము. కాబట్టి వీరిని పంచప్రేతములు అంటారు. వీరిలో మొదటినలుగురు పరమేశ్వరి సింహాసనానికికాళ్ళు కాగా సదాశివుడుకప్పుకునే దుప్పటిఅయినాడు. **రుద్రయామళంలో**

**బ్రహ్మావిష్ణుశ్చరుద్రశ్చ ఈశ్వరశ్చ సదాశివః**
**ఏతే పంచ మహాప్రేతా భూతాధి పతయో మాతాః ॥**

దేవీ భాగవతంలో మణిద్వీపాన్ని వర్ణిస్తూ

**చింతామణి గృహేరాజన్ శక్తి తత్త్వాత్మకైః పరైః**
**సోపానైః దశభిర్యుక్తో మంచకోప్యధిరాజితే**
**బ్రహ్మ విష్ణుశ్చ రుద్రశ్చ ఈశ్వరశ్చ సదా శివః**
**ఏతే పంచఖురాః ప్రోక్తాః ఫలకశ్చ సదా శివః ॥**

చింతామణి గృహంలో శక్తితత్త్వాత్మకమైన పదిమెట్లవరుసతో దివ్యకాంతులు వెదజల్లే ఆసనమున్నది. బ్రహ్మ, విష్ణువు, రుద్రుడు, ఈశ్వరుడు దానికి పాదాలు (కోళ్ళు) కాగా, సదాశివుడు దానిపైపలకగా ఉన్నాడు.

**249. పంచప్రేతాసనాసీనా** పంచప్రేతములే ఆసనముగా గలది. బ్రహ్మ, విష్ణువు, రుద్రుడు, మహేశ్వరుడు, సదాశివుడు వీరు ప్రేతలయినారు. వీరు ఎప్పుడైతే తమశక్తినికోల్పోయారో, అప్పుడు ప్రేతములవుతున్నారు. దేవీభాగవతంలో చిన్నకథ ఉంది. మధుకైటభులను సంహరించిన తరువాత పరమేశ్వరి తనఅంశాలైన శక్తులను వీరికి తోడుగా ఇచ్చి, వీరిని ఎప్పుడూ అవమానించకండి. వీరు లేకపోతే మీరు అశక్తులు, శక్తిహీనులవుతారు అని చెప్పింది. కాలాంతరంలో ఆ శక్తులు అవమానింపబడి వెళ్ళిపోతాయి. అప్పుడు వీరంతా అశక్తులై పంచప్రేతములైనారు

**250. పంచబ్రహ్మ స్వరూపిణీ** పంచబ్రహ్మలయందు ఐక్యముగలది. **త్రిపురా సిద్ధాంతము**లో పరమేశ్వరుడు తన మాయావిలాసంవల్ల పంచబ్రహ్మలుగా పిలువబడుతున్నాడు. సద్యోజాత, వామదేవ, అఘోర, తత్పురుష, ఈశానములు వారి మంత్రాలు.

**లింగపురాణం**లో జీవ, ప్రకృతి, బుద్ధి, అహంకారము, మనస్సులను పంచబ్రహ్మలు అంటారు. వీటియొక్క స్వరూపమే పరమేశ్వరి.

**గరుడపురాణం**లో దుష్టశిక్షణ కోసం శ్రీమహావిష్ణువు 1. నారాయణ 2. సంకర్షణ 3. వాసుదేవ 4. ప్రద్యుమ్న 5. అనిరుద్ధులు అయినాడని చెప్పబడింది. పరమేశ్వరియొక్క లీలలు పంచపురుషులైనారు. వారే పంచబ్రహ్మలు. వారి స్వరూపమే దేవి. అందుకే ఆమె పంచబ్రహ్మస్వరూపిణి.

లలితా సహస్రంలోని 947వ నామం **పంచప్రేతమంచాధిశాయినీ** ఐదు ప్రేతములను ఆసనంగాకలిగినది.

ఆధార స్వాధిష్ఠానాల తరువాత – బ్రహ్మగ్రంధి

మణిపూర, అనాహతాల తరువాత – విష్ణుగ్రంధి

విశుద్ధి ఆజ్ఞాచక్రాల తరువాత – రుద్రగ్రంధి

లలాటంపైన – ఈశ్వరగ్రంధి

సహస్రారంలో – సదాశివగ్రంధి

ఇవే పంచప్రేతాసనాలు. వీటిపైన బైందవస్థానంలో మహాకామేశ్వరుడు, అతని వామాంకముమీద మహాకామేశ్వరి ఉంటారు.

58వ నామం పంచబ్రహ్మాసనస్థితా. పంచబ్రహ్మలచేత చేయబడిన ఆసనం మీద కూర్చున్నది. పంచబ్రహ్మలనే కోళ్ళుగాగల ఆసనంమీద కూర్చున్నది.

**అరాళా కేశేషు ప్రకృతసరళా మందహసితే**
**శిరీషాభా చిత్తే దృషదుపలశోభా (దషదివకఠోరా) కుచతటే ।**
**భృశం తన్వీ మధ్యే పృథురురసిజారోహవిషయే**
**జగత్త్రాతుం శమ్భో ర్జయతి కరుణా కాచిదరుణా ॥ 93**

తల్లీ ! 'అరాళా' అనే అనిర్వచనీయమైన శక్తి నీకురులలో ప్రకాశిస్తున్నది. చిరునవ్వులో ప్రకృతి స్వభావంచేతనే 'సరళా' అనే శక్తి ప్రకాశిస్తున్నది. చిత్తములో మహామృదువైన శక్తి ప్రకాశిస్తున్నది. స్తనమండలంలో సన్నికల్లు శోభగల శక్తి ప్రకాశిస్తున్నది. కుచములయందు, పిరుదులయందు స్థూలశక్తి ప్రకాశిస్తున్నది. ఈ జగత్తును రక్షించటానికి 'అరుణ' అనే శక్తి, 'కరుణ' అనే శక్తి ప్రకాశిస్తున్నాయి.

ఈ శ్లోకంలో దేవియొక్క పూర్తి శరీరాన్ని ధ్యానము చేస్తున్నారు. ఓజగన్మాతా! నీకుంతలములలో మాత్రమే కొంచెము వక్రతఉన్నది. మరెక్కడాలేదు. అరాళము అనగా వంకర. **అరాళాకేశేషు** నీకేశములందు మాత్రమే వంకర ఉన్నది. అంటే పరమేశ్వరి కేశములు నొక్కులు నొక్కులుగా ఉన్నాయిట. ఆమె చిరునవ్వు సరళమైనది. చిత్తము శిరీష పుష్పములా మృదువైనది. స్తనమండలము బరువైనది. కుచములు, పిరుదులు స్థూలమైనవి.

ఇప్పటిదాకా పరమేశ్వరిని నఖశిఖ పర్యంతము వర్ణించిన భగవత్పాదులవారు ఈ శ్లోకంలో కేశములనుంచి నితంబముదాకా వర్ణించారు. ఎవరినైనా వర్ణించేటప్పుడు క్రిందినుంచి పైకివెళ్ళాలా, లేక పైనుంచి క్రిందికిరావాలా అనే అనుమానం ఉదయిస్తుంది. **'కావ్యకల్పలత'** అనే అలంకారిక గ్రంథంలో **మౌళితోమానవా దేవాశ్చరణః పునః** మానవులనైతే శిరస్సుదగ్గర మొదలుపెట్టి పాదాలదాకా, అదే దేవతలనైతే పాదాలనుండి పైకి వర్ణించాలి. ఇది శాస్త్రబద్ధము అయితే **లలితా సహస్రం**లో అమ్మవారిని 12వ నామంలో **నిజారుణ ప్రభాపూర మధ్యద్బ్రహ్మాండ మండలా** అరుణారుణచ్ఛాయలతో ఆమెప్రకాశిస్తున్నది అని చెప్పి 13వ నామం **చంపకాశోక పున్నాగ సౌగంధి కలశత్కచా** అంటూ కేశాలను వర్ణిస్తూ ఆ తరువాత కిరీటము, ముఖము, చివరకు పాదాలదాకా **మరాళీ మందగమనా, మహాలావణ్యశేవధిః** అంటూ వర్ణించటం జరిగింది.

పరమేశ్వరి అగ్నిగుండం నుంచి ఆవిర్భవించింది. ఆకుండంలో ముందుగా తలపైకి వచ్చింది. అందుచేతనే దేవిని వర్ణించేటప్పుడు తలదగ్గర నుంచి పాదాలదాకా వర్ణించటం జరిగింది.

ఇక్కడ ఇంకొకవిషయంకూడా గమనించాలి. పరమేశ్వరి కరుణామయి. కరుణకు కుటిలత్వము, కఠోరత్వము, హింసత్వము, క్షీణత్వము పనికిరావు. అందుచేత కరుణాస్వరూపిణి అయిన పరమేశ్వరికి ఆరాళత్వము – వంకరతనము జుట్టునందు మాత్రమే కనిపిస్తోంది. కేశములు వెనుకకుత్రోసివేసింది. ఆకుటిలత్వము దేవి కేశములశోభను వృద్ధి పరుస్తున్నది. మందత్వాన్ని చిరునవ్వునందు బిగించివేసింది. మందత్వము దేవినవ్వుకు సొగసుతెస్తున్నది. ఆమెహృదయము శిరీషపుష్పములా మృదువైనది. శిరీషపుష్పము నలిగి నాశనమవుతుంది. ఆనాశనము పుష్పాని కేపరిమితము. ఈ పుష్పము శుభసూచకము. ఆశుభాన్ని మనసునందు ధరించినది. అలాగే కఠినత్వము పాలిండ్లకే. జగత్తులోని జీవరాశిఅంతా ఆమెసంతానమే. ఎల్లకాలములయందు ఆమె తనసంతానాన్నిపోషించాలి. ఆమె పాలిండ్లు తరిగిపోరాదు. అందుకే అవికఠినములు. కృశించటము అనేది నడుముకు మాత్రమే కరుణకు కాదు. అలాగే నితంబములకు స్థిరత్వమున్నది అంటున్నారు భగవత్పాదులవారు

**కళఙ్కః కస్తూరీ రజనికరబిమ్బం జలమయం**
**కళాభిః కర్పూరై ర్మరకతకరణ్డం నిబిడితమ్ ।**
**అతస్త్వద్భోగేన ప్రతిదిన మిదం రిక్తకుహరం**
**విధి ర్భూయోభూయో నిబిడయతి నూనం తవ కృతే ॥ 94**

తల్లీ ! ఈ లోకంలో జనులు చంద్రమండలాన్ని చూసి అజ్ఞానంతో చంద్రుడని, చంద్రునిలో కళంకమని, చంద్రకిరణాలని, చంద్రబింబమని అనుకుంటున్నారు. నిజానికి అది చంద్రమండలం కాదు. నువ్వు కస్తూరిమొదలైన ద్రవ్యాలు పెట్టుకోవటానికి పచ్చలతో చేయించినపెట్టె. అక్కడ కళంకముగా భావించేది కస్తూరి. నువ్వు జలకాలాడటానికి పన్నీరునింపిన కుప్పెనే చంద్రుడు అనుకుంటున్నారు. పచ్చకర్పూరపు పలుకులను చంద్రకళలుగా భావిస్తున్నారు. ఈ వస్తువులను నువ్వు వాడుతుంటే, తరిగిపోతాయి. అప్పుడు నీ సేవకుడైన బ్రహ్మ మళ్ళీ వాటిని నింపుతున్నాడు.

93వ శ్లోకంలో అమ్మవారి స్థూలరూపాన్ని వర్ణించి, ఈ శ్లోకంలో ఆమె నిత్యము వాడుకొనే కస్తూరి, కాటుక, పచ్చకర్పూరము, వీటన్నింటిని పెట్టేభరిణె. వీటిని వర్ణిస్తున్నారు.

ఆకాశంలో మనం చూసేది చంద్రమండలం కాదు. అది అమ్మవారు కస్తూరి మొదలైన అలంకరణ సామాగ్రి పెట్టుకునే భరిణె. చంద్రునిలో నల్లటి మచ్చని చూస్తాం. అది మచ్చకాదు. అమ్మవారు నుదుటిపై ధరించే కస్తూరి. చంద్రునినుంచి చల్లని మంచుబిందువులు వస్తున్నాయి. అసలు అది చంద్రుడేకాదు. అమ్మవారు స్నానంచెయ్యటానికి ఏర్పాటుచేసిన పన్నీటి తొట్టె. మనంచూసేవి చంద్రకళలుకాదు. ఆమెఉపయోగించే పచ్చకర్పూరపు ముక్కలు. చంద్రునికళలు పెరుగుతూ, తరుగుతూ ఉంటాయికదా ? అమ్మవారు నిత్యము ఈసామగ్రిని వాడటంవల్ల అవితరిగిపోతాయి. బ్రహ్మదేవుడు మళ్ళీ వాటిని పూరిస్తుంటాడు. అంటున్నారు భగవత్పాదులవారు.

**పురారాతే రన్తఃపురమసి తతస్త్వచ్చరణయో**
**స్సపర్యామర్యాదా తరళకరణానా మసులభా ।**
**తథా హ్యేతే నీతా శ్శతమఖముఖా స్సిద్ధి మతులాం**
**తవ ద్వారోపాన్తస్థితిభి రణిమాద్యాభి రమరాః ॥ 95**

ఓతల్లీ ! నీవు త్రిపురాంతకుడైన పరమేశ్వరుని పట్టపురాణివి. అందువల్ల నీ చరణ సపర్య చపలచిత్తులకు లభించదు. ఆ కారణంచేతనే ఇంద్రాదిదేవతలు నీ ద్వారపాలకులైన అణిమాది అష్టసిద్ధులను కొలిచి, దానివల్ల సాటిలేని అభీష్టఫలసిద్ధి పొందారు.

ఈ శ్లోకంలో అమ్మవారి పాదసేవాభాగ్యము గురించి చెబుతున్నారు. పరమేశ్వరి అర్చన రెండు విధాలుగా జరుగుతుంది. 1. కౌళాచారము 2. సమయాచారము ఐహికమైన కోరికలు గలవారు కౌళాచారులు. ఈ కౌళాచారాన్న గతంలో వివరించటం జరిగింది. వీరిభావనలో భగవంతుడువేరు, భక్తుడువేరు. వీరికి అష్టసిద్ధులు, నవనిధులు, అధికారము, భోగభాగ్యాలు కావాలి. పరమేశ్వరి శ్రీచక్రంలోఉంటుంది. **శ్రీచక్రరాజ నిలయా, శ్రీచక్రసంచారిణీ, శ్రీచక్ర నగర సామ్రాజ్ఞీ** శ్రీచక్రంలో తొమ్మిదవ ఆవరణ అయిన బిందువు నందుంటుంది ఆదేవి. సాధకుడు దేవిఅర్చన ప్రారంభించి శ్రీచక్రంలో ప్రవేశించగానే, ముందుగా మొదటి ఆవరణ అయిన భూపురములోని ప్రధమరేఖలో అష్టసిద్ధులుంటాయి. అవివశమవుతాయి. చపలచిత్తులైన వాళ్ళు ఈసిద్ధులు పొంది, లోకంలో తమ ప్రజ్ఞాపాటవాలు ప్రకటించుకుంటారు. వీరు వట్టి అజ్ఞానులు. ఇంద్రాదిదేవతలు ఈకోవకు చెందినవారే. కాని వైదికులు, బ్రహ్మవాదులు తమశరీరమే శ్రీచక్రముగా భావించి పరమేశ్వరిని అహంబ్రహ్మాస్మి నేనే పరబ్రహ్మ స్వరూపాన్ని అని భావన చేసి, చరాచరజగత్తును తమలోనే చూస్తూ, 'తత్త్వమసి' అంటూ తమను తామే అర్పించుకుంటారు. వీరు సమయమతస్థులు. వీరి దృష్టిలో శివుడికి శక్తికి సామ్యమున్నది. పరమేశ్వరుడు ఎక్కడోలేడు. తానే పరబ్రహ్మ. వీరు మోక్షవాదులు. వీరికి అష్టసిద్ధులు, నవనిధులతో పనిలేదు. సాయుజ్యంకావాలి. అదే వీరిధ్యేయం. ఎంతటి చపలచిత్తులైనా, అజ్ఞానులైనా దేవిని అర్చించినవారికి వారికోరికలు తీరతాయి. వీరికి లోపలికి ప్రవేశంలేని కారణంచేత దేవిదర్శనం జరగదు. మనోనిగ్రహము, ధ్యానాదిశక్తులు లేనివారికి పరమేశ్వరి సాక్షాత్కారము, సాయుజ్యము దుర్లభము.

**కళత్రం వైధాత్రం కతికతి భజన్తే న కవయః**
**శ్రియో దేవ్యాః కోవా న భవతి పతిః కైరపి ధనైః**

**మహాదేవం హిత్వా తవ సతి సతీనామచరమే**

**కుచాభ్యా మాసఙ్గః కురవకతరో రప్యసులభః ॥ 96**

పతివ్రతలలో శ్రేష్ఠురాలా ! మహాకవులు సరస్వతీదేవిని పొంది సరస్వతీ వల్లభులమని చెప్పుకుంటున్నారు. కొందరు బాగా ధనముసంపాదించి లక్ష్మీపతి అని చెప్పుకుంటున్నారు. కాని నిన్ను ఆలింగనం చేసుకోవటము కురవక వృక్షానికి (గోరింట చెట్టు) కూడా లభించదు. కవి సరస్వతీపతి అవుతాడు. ధనవంతుడు లక్ష్మీపతి అవుతాడు. కాని పార్వతీపతి మాత్రం మహాదేవుడొక్కడే.

వేదవిద్య, మంత్రము, జపము, తపము మొదలైన వాటితో జ్ఞానము సాధించినవారు సరస్వతీ వల్లభులనబడతారు. అలాగే బాగా ధనార్జన చేసిన వారిని లక్ష్మీపతి అంటారు. కాని పార్వతీపతి ఒక్కడే. అతడేపరమేశ్వరుడు. మహాదేవుడు. ఈ రకంగా లక్ష్మి సరస్వతులయొక్క పాతివ్రత్యము చెడిపోయింది. కాని పరమేశ్వరి పాతివ్రత్యము ఘనమైనది.

గోరింటచెట్లు మూడు రకాలు

1. కురవకము – ఎర్రగోరింట, 2. కురంటకము – పచ్చగోరింట

3. ఖుంటి – నీలిగోరింట

ఒక్కొక్కసారి ఈ గోరింటచెట్లు పూలుపూయవు. అటువంటప్పుడు ఉత్తమ స్త్రీలు గనక ఈ చెట్టును కౌగిలించుకున్నట్లైతే అవిపూస్తాయి అని సమాజంలో ఒక నమ్మకము. చేతులను ఎర్రగాపండించే అవకాశముగల కురవకవృక్షము పూత పెరగటానికి కూడా పరమేశ్వరి దాన్ని కౌగిలించదట. ఈ విషయంలో కూడా అమ్మవారు పాతివ్రత్య ధర్మాన్ని దృష్టిలో ఉంచుకుని వ్యవహరించిందన్న మాట. ఒకవేళ ఆదేవి స్పర్శ తగిలి అదే కౌగిలింత అనుకుందామన్నప్పటికీ, పరమేశ్వరి శరీరంలోసగభాగం శివునిదే. అందుచేత ఆ స్పర్శ శివునిదే కాని, ఆమెదికాదు.

అమ్మవారిని ఆశ్రయించి సేవించే వారికి జ్ఞానము వికసించి, రసానుభూతి కలుగుతుంది. అంతేకాని కురవకులు అంటే కుతర్కవాదము చేసేవారు, ఎర్రగోరింట లాగా కాషాయాంబరము ధరించి పిడివాదము చేసేవారికి జ్ఞానము లభించదు. లోకంలో ఎవరైనా సులభంగా లక్ష్మీపతి లేదా సరస్వతీవల్లభుడు కావచ్చు కాని జగజ్జనని కృపకు మాత్రం పాత్రుడుకాలేడు.

గిరా మాహు ర్దేవీం ద్రుహిణగృహిణీ మాగమవిదో
హరేః పత్నీం పద్మాం హరసహచరీ మద్రితనయామ్
తురీయా కాపి త్వం దురిధిగమ నిస్సీమమహిమా
మహామాయా విశ్వం భ్రమయసి పరబ్రహ్మ మహిషి ॥ 97

ఓ పరబ్రహ్మ మహిషీ ! బ్రహ్మవాదులు నిన్నే బ్రహ్మదేవునిభార్య, వాక్కుకు అధిష్ఠానధాత్రివైన సరస్వతి అంటున్నారు. విష్ణుమూర్తిభార్య అయిన లక్ష్మీదేవి అంటున్నారు. శివునిభార్య అయిన పార్వతి అంటున్నారు. కాని నీవుమాత్రం ఈ ముగ్గురూకాకుండా, వీరికన్నవేరైనది, అనిర్వచనీయమైనది, అతికష్టము చేత మాత్రమే పొందదగినది, అపారమహిమగలది అయిన శుద్ధవిద్యాతత్త్వమై, మాయామయమైన ఈ ప్రపంచాన్ని భ్రమింపచేస్తున్నావు.

ఆగమవిదులు, బ్రహ్మవిదులు పరబ్రహ్మను వేదాలలో చెప్పినట్లుగా ఉపాసిస్తారు. అసలు వేదాలలో ఏం చెప్పబడింది. “పరమేశ్వరుడు నిరాకారుడు, నిర్గుణ స్వరూపుడు. సత్యము నిత్యము శాశ్వతము అయినవాడు. అతడు ఈజగత్తునంతా ఆవరించి ఉన్నాడు. సృష్టిప్రారంభానికిముందు ఈజగత్తంతా శూన్యంగాఉండేది. ఆ శూన్యాన్ని పరమేశ్వరుడు ఆక్రమించిఉన్నాడు. ఆతరువాత కొంతకాలానికి, గతంలో ప్రళయం జరిగినప్పుడు కర్మక్షయం కాకుండా, తమకర్మను తమతో మూటకట్టుకుని, తనలో లీనమైపోయిన జీవరాశికి, కర్మక్షయంగావించి, మోక్షం కల్పించాలనేతలంపుతో ఈసృష్టిచేయసంకల్పించాడు.

మొదటిసారి సృష్టిజరిగినప్పుడు కూడా పరమేశ్వరుడు తానే స్త్రీ పురుషులుగా విడిపోయి ఈచరాచర జగత్తును, అందులోని 84 లక్షల జీవరాశినీ సృష్టించాడు. తానే అన్ని జీవులయందు ప్రవేశించి సర్వాంతర్యామి అయినాడు. జగత్తంతా తానే అయి ఉన్నాడు.” ఈ విషయాన్ని దాదాపుగా ప్రపంచంలోఉన్న అన్నిమతాలు ఒప్పుకుంటున్నాయి. ప్రపంచంలో అతిపెద్దమతంగా చెప్పబడే క్రైస్తవులుకూడా దీన్ని సమర్ధిస్తున్నారు. యహోవా ‘అగుగాక’ అనే మాటతో ఈజగత్తును నిర్మించాడు. అందులోని జీవులను, చివరకు మానవుడినిసృష్టించాడు. ఆమానవుడు చెడుమార్గాన పోకుండా, ఎప్పటికప్పుడు దేవదూతలద్వారా సందేశాలుపంపాడు. చివరకు తానే

యేసు రూపంలో దిగివచ్చాడు. అలా వచ్చి తన రక్తసాదృశ్యమైన ద్రాక్షాసారాయినీ, మాంసా దృశ్యమైన రొట్టెలను అందరికీపంచి, తద్వారా తానుఅందరియందు అన్ని జీవులయందు ప్రవేశించాడు. ఈరకంగా సర్వేశ్వరుడు సర్వాంతర్యామి అయినాడు.

**ఏకమేవాద్వితీయంబ్రహ్మ** ఉన్నది ఒక్కటే. అదే పరబ్రహ్మ స్వరూపము. నిరాకారము నిర్గుణము అయిన పరబ్రహ్మ. ఈ సృష్టిలో ప్రతిజీవి, ప్రతిప్రాణి, ప్రతి వస్తువు పరబ్రహ్మ స్వరూపమే. లౌకిక జీవనావిధానంలో జీవించటానికి కావలసిన జ్ఞానాన్ని ఇచ్చేది సరస్వతి, ధనాన్ని ఇచ్చేది లక్ష్మి, శక్తినిచ్చేది పార్వతి. వీరు పరమేశ్వర స్వరూపంకాదు. వీరు జ్ఞానాన్ని, ధనాన్ని శక్తిని మాత్రమే ఇస్తారు. కాని మోక్షమివ్వలేదు. మోక్షాన్ని ఇవ్వగలిగింది పరమేశ్వరుడుఒక్కడే. అదేపరమేశ్వరి. పరమేశ్వర స్వరూపానికి లింగబేధం లేదు. పరమేశ్వరుడుఅన్నా, పరమేశ్వరిఅన్నా ఒకటే. మహాకాళి, మహాలక్ష్మి, మహాసరస్వతులు సృష్టి స్థితి లయాలకు ప్రతీకలు. వీరి భర్తలుగా చెప్పబడే త్రిమూర్తులు సృష్టి స్థితి లయాలకు అధిపతులు. పరమేశ్వర స్వరూపానికి కొన్నిలక్షణాలున్నాయి. అవి జగత్తంతా ఆక్రమించిఉండటము, సర్వాంతర్యామి, అధర్వణ వేదంలో దేవి ఉపనిషత్తు చెప్పబడింది. అందులో దేవతలంతా దేవిని సమీపించి "అమ్మా ! నీవెవరవు ?" అని అడుగుతారు. అప్పుడు ఆ దేవి **'అహం బ్రహ్మస్వరూపిణీ'** నేను బ్రహ్మస్వరూపిణిని. నావల్లనే ప్రకృతి పురుషాత్మకమైన జగత్తు ఆవిర్భవించింది. శూన్యము, అశూన్యము నేనే. ఆనందము, దుఃఖము నేనే. జ్ఞానము అజ్ఞానము కూడానేనే. పంచభూతాలు నేనే. అఖిలజగత్తు నేనే. వేదము, అవేదము నేనే. విద్య అవిద్య నేనే. క్రింది భాగము, పైభాగము, మధ్యభాగము అంతా నేనే. నిలువు అడ్డము నేనే. నేను వసువులలో, ఆదిత్యులలో, విశ్వదేవతలలో ఉంటాను. మిత్రావరుణులను, ఇంద్రాగ్నులను, అశ్వనీ దేవతలను నేనే భరిస్తాను. సోముడు, త్వష్ట, పూషుడు, భగుడు, విష్ణువు, వామనుడు, బ్రహ్మ, ప్రజాపతి వీరందరినీ ధరిస్తాను. నాకు కారణము నేనే." అంటుంది.

ఋగ్వేదంలోని బహ్వృచోపనిషత్తులో ఈ విధంగా ఉన్నది. "సృష్టికి ముందు ఆ దేవి ఒక్కతేఉన్నది. ఆమెయే ఈబ్రహ్మాండాన్ని సృష్టించింది. ఆమెయే శృంగారకళ, కామకళ, సాదాఖ్యకళ, ధృవకళ, బ్రహ్మకళ, చిత్కళ. ఆమెనుండియే బ్రహ్మ పుట్టాడు. ఆమెనుండియే విష్ణువు, రుద్రుడు, సకల మరుద్గణాలు, గంధర్వులు, యక్షులు,

కిన్నెరలు, కింపురుషులు, సిద్ధులు, సాధ్యులు, అండజములు, స్వేదజములు, ఉద్భిజములు, జారజములు, స్థావరములు, జంగమములు అన్నీ పుట్టినాయి. ఆవిడే పరాశక్తి. ఆమెయే శాంభవీవిద్య, హాదివిద్య, కాదివిద్య. జీవులశరీరాల్లో ప్రవేశించి ప్రకాశిస్తున్నది." పరమేశ్వరి అంటే ఆవిడ. పరమేశ్వరుని లక్షణాలు సృష్టి, స్థితి, లయ, తిరోదాన, అనుగ్రహాలు. లలితాసహస్రంలో 264 నుంచి 274 నామాల వరకు పరమేశ్వరి పంచకృత్యపరాయణ అంటారు.

**సృష్టికర్త్రీ బ్రహ్మరూపా గోప్త్రీగోవిందరూపిణీ**
**సంహారిణీ రుద్రరూపా తిరోధాన కరీశ్వరీ**
**సదాశివానుగ్రహదా పంచకృత్యపరాయణా**

అవస్థలు ఐదు. వీటినే అవస్థా పంచకము అంటారు. అవి 1. జాగ్రదవస్థ 2. స్వప్నావస్థ 3. సుషుప్తి 4. తురీయము 5. తురీయాతీతము

లలితాసహస్రంలోని 256 నుంచి 263 వ నామం దాకా అవస్థాపంచకము వివరించబడింది.

**విశ్వరూపా జాగరిణీ స్వపంతీ తైజసాత్మికా**
**సుప్తాప్రాజ్ఞాత్మికా తుర్యా సర్వావస్థా వివర్జితా**

జాగ్రస్వప్న సుషుప్తుల తరువాత తురీయము, తురీయాతీతము. వీటిలో సాధకుడు తురీయాతీతాన్ని చేరినట్లైతే ఆత్మసాక్షాత్కారంకలుగుతుంది. నేనే పరబ్రహ్మను. నాకన్న వేరైనది ఏదీలేదు. అనేభావన కలుగుతుంది. అదే పరమేశ్వర సాక్షాత్కారము. అటువంటి సాధకుడు మరణానంతరము సాయుజ్యం పొందుతాడు. అతడి సర్వకామ్యాలు నెరవేరతాయి. అతడికి పునర్జన్మఉండదు. అతనిజీవాత్మ పరమాత్మలో లీనమవుతుంది. ఈరకంగా సాధకుల అర్హతను బట్టి వారికి, సిరిసంపదలు, భోగభాగ్యాలు, సాయుజ్యము ఇచ్చేది పరమేశ్వరి.

అందుకే ఈ శ్లోకంలో "అమ్మా ! లక్ష్మి, సరస్వతి, పార్వతీదేవతలకన్న మిన్నయై, ఎప్పుడూ తురీయాతీతస్థితిలోనే ఉండి, సాధకులకు సాయుజ్యాన్నిప్రసాదించేది ఆ పరమేశ్వరి.

**కదా కాలే మాతః కథయ కలితాలక్తకరసం**

**పిబేయం విద్యార్థీ తవ చరణ నిర్ణేజనజలమ్ ।**

**ప్రకృత్యా మూకానా మపి చ కవితా కారణతయా**

**కదా ధత్తే వాణీ ముఖ కమల తామ్బూల రసతామ్ ॥ 98**

తల్లీ ! నీ పాదాలకు పైపూతగా పూసిన ఎర్రనిలత్తుకరసముతో కూడిన పాదాలను కడిగి, ఆ పాదోదకాన్ని, బ్రహ్మవిద్యనర్థించే విద్యార్థినైన నేను మరణించే లోపల ఎప్పుడు పుచ్చుకోగలుగుతాను ? నీ పాద ప్రక్షాళితజలం స్వాభావికంగానే చెవిటివారికి వినే శక్తిని, మూగవారికి మాట్లాడేశక్తిని, కలిగించినదై, వారికి కవచమునకు హేతువవటం చేత వాణీముఖకమల తాంబూలరససారస్యమును ఎప్పుడు స్వీకరించగలుగుతాను?

పరమేశ్వరిపాదాలకు లత్తుకరసము పూసిఉంటుంది. ఆపాదాలు కడిగిన జలము లత్తుకరసముతో కలిసి ఎర్రనిదై, సరస్వతీదేవి తాంబూలరసములాగా ఉన్నది. ఇది కవీశ్వరులకు కవిత్వాన్నిపెంపొందింపచేస్తుంది. ఆరసాన్ని ఆస్వాదించిన కవీశ్వరుడు 'పుంభావసరస్వతి'లాగా ప్రకాశిస్తాడు. శంకరభగవత్పాదులవారు ఆ నిర్ణేజనజలము మళ్ళీకావాలని అమ్మవారినిప్రార్థిస్తున్నారు. ఇది సమయమత సిద్ధాంతము. కౌళాచారంలో దేవిసాక్షాత్కారములేదు. అక్కడ సాధకుడికి కావలసినది ఐహికవాంఛ. అంతేకాని వారికి భగవస్సాక్షాత్కారముతోపనిలేదు. కాని సమయమతంలో అలాకాదు. ఇక్కడ కావలసింది భగవసాక్షాత్కారము, సాయుజ్యము. యోగిషట్చక్రభేదనం చేయగానే, కుండలినీశక్తి గ్రంధిత్రాయిన్న భేదించుకుని సహస్రారంచేరి అక్కడ తనభర్తఅయిన సదాశివునితోసుఖిస్తుంది. ఆసమయంలో చంద్రమండలంనుంచి జాలువారిన అమృతపుబిందువులచే యోగిశరీరంలోని 72వేలనాడీమండలము తడుపబడుతుంది. ఇదిఅనుభవైకవేద్యము. ఎవరికి వారు అనుభవించి తెలుసుకోవాలి. అంతేకాని చెప్పటానికి, వినటానికి వీలుండదు.

పరమేశ్వరి తాంబూల వీటికఇచ్చి అనుగ్రహించింది కాబట్టి మూగవాడైన 'మూకుడు' అనేకవి అమ్మవారి మీద ఐదుశతకాలను ఆశువు చెప్పాడు. దీన్నే **'మూకపంచశతి'** అంటారు. సరస్వతీదేవితాంబూలరసాస్వాదనము వంటిదైన పరమేశ్వరి పాదజలము త్రాగగలనా అంటున్నారు శంకర భగవత్పాదులవారు. ఆనీరు త్రాగటంవల్ల నాలుక పూర్తిగా సరస్వతీ కటాక్షము పొందుతున్నది అని భావన.

**సరస్వత్యా లక్ష్యా విధిహరి సపత్నో విహరతే**
**రతేః పాతివ్రత్యం శిథిలయతి రమ్యేణ వపుషా ।**
**చిరం జీవన్నేవ క్షపిత పశు పాశ వ్యతికరః**
**పరానన్దాభిఖ్యం రసయతి రసం త్వద్భజనవాన్ ॥ 99**

ఓతల్లీ ! నిన్ను అర్చించిన సాధకుడు సరస్వతీదేవితోను, లక్ష్మీదేవితోను విహరించువాడై, బ్రహ్మకు విష్ణువుకు అసూయ పుట్టిస్తున్నాడు. మన్మథునితో సమానమైనసౌందర్యము గలిగి రతీదేవినికూడా మోహింపచేసి, ఆమెపాతివ్రత్యానికి భంగంకలిగిస్తున్నాడు. చివరకుఅవిద్యా సంబంధిత భావాలనువదిలి, జీవన్ముక్తుడై పరమానందాన్ని అనుభవిస్తున్నాడు.

ఈ శ్లోకంలో ఫలశ్రుతి చెబుతున్నారు. పరమేశ్వరిని ఆరాధించినవాడికి ఏది కావాలంటే అది ఒనగూడుతుంది. అతడి వాంఛితార్ధము నెరవేరుతుంది. అతడు ఈలోకంలో గొప్పకవి, పండితుడు అవుతాడు. ఆరకంగా సరస్వతీవల్లభుడై, ఆమెతో విహరించి బ్రహ్మకుఅసూయ తెప్పిస్తున్నాడు. ఈలోకంలో ధనంబాగా సంపాదించి, మహాధనవంతుడై లక్ష్మీపతి అనిపిలువబడుతూ, లక్ష్మీదేవితో విహరిస్తూ, ఆమెభర్తఅయిన విష్ణువుకు అసూయతెప్పిస్తున్నాడు. అమితమైన సౌందర్యముగలవాడై రతీదేవిని కూడా మోహింపచేస్తున్నాడు. అంటే పతివ్రతల మనసును క్షోభపెట్టి వారిపాతివ్రత్యాన్ని పాడుచేస్తున్నాడు. చివరకు అజ్ఞానం వదలి అంటే సంసారబంధనాలను వదలించుకుని, జీవన్ముక్తుడై, పరమానందము పొందుతాడు.

పరమేశ్వరిని అర్చించినవారికి ఏదికావాలంటే అదిసిద్ధిస్తుంది. వారి వాంఛితము నెరవేరుతుంది. పుడుతూనే ప్రతివాడూ జ్ఞానికాదు. అందరూ ఊర్ధ్వరేతస్కులై సనకసనందనాదులకు మల్లే సంసారబంధనాలు మాకువద్దు అంటూ తపస్సు చేసుకోవటానికి వెళ్ళిపోరు. ప్రతివాడు సంసారచక్రంలోపడి తిరిగేవాడే. అటువంటి వాడికి ముందుగా ఐహికమైన కోరికలు తీరాలి. బ్రహ్మసూత్రాలలో చెప్పింది కూడా ఇదే. ముందుగా సాకారబ్రహ్మని అర్చించి, యజ్ఞయాగాలవంటి క్రతువులు పూర్తిచేసి, వాటి ఫలితాలుపొంది, ఈలోకంలో సర్వసుఖాలు అనుభవించి, ఆతరువాత కర్మలుచెయ్యటంవల్ల వచ్చే ఫలితము కర్మలు చెయ్యకపోయినా, వస్తుంది. అంటే

యజ్ఞయాగాది క్రతువులు బాహ్యంగా అవసరంలేదు. మానసికంగా చేసినా చాలు ఆ ఫలితాన్ని పొందవచ్చు అని తెలుసుకుని, సన్యసించి, ఇప్పుడు నిరాకార బ్రహ్మను వెతకాలి. వేదాలు, శాస్త్రాలు పూర్తిగా అధ్యయనం చేసి, వాటిని వదలివేసి, తత్త్వశోధన చెయ్యాలి. అప్పుడు పరమాత్మసాక్షాత్కారం కలుగుతుంది. అదే ఆత్మసాక్షాత్కారం. ఈరకంగా మానవుడు క్రమముక్తినిపొందాలి.

ఇందులో భాగంగా ముందు సాకారబ్రహ్మోపాసన చెయ్యాలి. పరమేశ్వరుడు నిరాకారుడు, నిర్గుణస్వరూపుడు. మరి అతడు సాకారుడెలా అవుతాడు ? అంటే **సాధకానాం హితార్థాయ బ్రహ్మణో రూపకల్పనా** సాధకుల కోరికలు తీరటానికి పరబ్రహ్మకు ఒకరూపం కల్పించబడింది. అదే విష్ణువు, శివుడు, ఇలా అనేక పేర్లతో పిలువబడుతోంది. వినాయకుడు, ఆంజనేయుడు, సుబ్రహ్మణ్యేశ్వరుడు. అంతదాకా ఎందుకు ? మనం ఏపేరుతో పిలిచినా ? ఏ దేవతను అర్చించినా అవన్నీ ఆ పరమేశ్వరునికే చెందుతాయి. మనకుతెలిసిన, ప్రసిద్ధిచెందిన దేవతలదగ్గర నుంచీ, గ్రామదేవతలదాకా అంతా ఆపరమేశ్వరునిరూపాలే. కొంతమంది సాయిబాబా, పుట్టపర్తిబాబా వంటివారిని పూజిస్తుంటారు. కొంతమంది అసలు ఈ దేవుడు ఎవరు? మానవసేవయే మాధవసేవ దేవుడికిపెడితే తింటాడా ? మేము అనాధాశ్రమంలోని పిల్లలకుపెడతాం. వృద్ధాశ్రమంలో వృద్ధులకి సేవ చేస్తాం. ఇది అసలైనసేవ అంటారు. మిగిలినవారు వీరిని చూసిన నవ్వుతుంటారు? ఇదంతా ఏమిటి ? అనాధులను వృద్ధులను సేవిస్తే ఆ పరమేశ్వరుణ్ణి సేవించినట్లు ఎలా అవుతుంది ? అంటారు ఇది చాలా తప్పు. పరమేశ్వరుడు సర్వాంతర్యామి. సర్వమయుడు. అన్నిజీవులయందు ఉన్నాడు. నీకు ఏ ఆకారమునందు మనసు లగ్నమైతే, ఆ ఆకారాన్ని పూజించు. షిర్డిసాయి, పుట్టపర్తిసాయి అందరూ పరమేశ్వర స్వరూపులే. వీరినిసేవించినప్పటికీ ఆసేవలు ఆయనకేచెందుతాయి. భక్తుని కోరికలుతీరతాయి. పరమేశ్వరుడు తనను వివిధరూపాలుగల దేవతలుగా ప్రతిష్ఠించుకుని, భక్తులయొక్క పూజలందుకుని, వారికోరికలు తీరుస్తాడు. గ్రామదేవతలైన అంకాలమ్మ, పెద్దింటమ్మ, పైడితల్లి, తిరుపతమ్మ వంటి వారు కూడా అంతే. వీరిని అర్చించినా భక్తుల కోరికలుతీరతాయి. అందుకే వీరందరికీ ఊరూరా జాతరలు జరుగుతాయి. అర్చనావిధానంలో తేడా ఉండవచ్చు. అసలు అర్చన రెండు రకాలుగా ఉన్నది.

**అర్చనం ద్వివిధంచైవ వామదక్షిణ భేధతః**
**వామేన వా దక్షిణేన పూజయంతు యథారుచిః**

భగవంతుని అర్చనావిధానం రెండు రకాలు 1. వామాచారము 2. దక్షిణాచారము. వీటిలో నీకు ఏదినచ్చితే ఆ విధానంలోనే పూజించు. నీ కోరికలు తీర్చుకో. అంతేకాదు భగవంతుడుగా ఎవరిని అర్చించాలి ? అంటే నీ కంటికి ఏ రూపం నచ్చిందో ? ఎవరిని అర్చిస్తే నీకు ప్రశాంతత ఏర్పడిందో ? ఎవరి సన్నిధిలో నీకు మనశ్శాంతి దొరుకుతుందో ? ఆ రూపాలే భగవంతుడుగా అర్చించు తప్పులేదు. లోకంలోనిజీవులన్నీ పరమేశ్వరస్వరూపమే. కాబట్టి పదిమందికీ ఉపయోగించే పనిచెయ్యి. అనాధులకుచేయూతనివ్వు. కష్టంలోఉన్నవారిని చూసి జాలిపడు. చేతనైన సాయంచెయ్యి. సంఘంలో నిరాదరణకుగురిఅయినవృద్ధులకు చేయూత ఇవ్వు. ఇదంతా పరమేశ్వరుడికే చెందుతుంది. కొంతమంది గోపూజ చేస్తారు. గోశాలలకు చందాలిస్తారు. పరవడి రోజులలోను, పండగలకు, వాటికి మేతవేస్తారు. ఇదంతా పరమేశ్వరునికే చెందుతుంది అనిమరచిపోవద్దు. కాబట్టి భగవంతుని అర్చనా విధానంలో అనేకపద్ధతులున్నాయి. నీకుఎలాఅనిపిస్తే అలాఅర్చించు.

ఆ తరువాత యజ్ఞయాగాది కర్మలనాచరించు. ఆ కర్మలవల్ల ఫలితము అనుభవించు. జీవితంలో అన్ని రకాల సుఖాలు అనుభవించి, చివరకు సాయుజ్యం వైపు దృష్టిమరల్చు. ముక్తినిగురించి ఆలోచించాలంటే అనేకజన్మలలో చేసిన పుణ్యఫలంకావాలి. అందుకే మొదటి శ్లోకంలో చెప్పారు చూడండి.

**ప్రణంతుం స్తోతుంవా కథమకృతపుణ్యాప్రభవతి**

ఓదేవీ ! నీకు నమస్కరించాలన్నా, నిన్ను గురించిన నాలుగు మాటలు వినాలన్నా, నీపేరు తలచాలన్నా పూర్వజన్మలలో సుకృతం (పుణ్యకార్యాలు) చేసి ఉండాలి. లేకపోతే ఆ పని చెయ్యలేడు.

ఇక ముక్తి మార్గం. ముక్తి అంటే ఏమిటి ? విముక్తి సంసార బంధనాలనుండి, లౌకిక విషయాలనుండి విముక్తి. ఈబంధనాలను త్రెంచివేసుకోవటం. ముక్తి ఐదు విధాలుగా ఉన్నది. ఒక్కడ పూజ రెండు రకాలు 1. బాహ్యపూజ, 2. అంతఃపూజ

1. బాహ్యపూజ అంటే ఎదురుగా భగవంతుని పటము, విగ్రహము పెట్టుకుని చేతనైన విధానంలో దానిని అర్చించటం. ఇక్కడ ముఖ్యమైనది అర్చనావిధానం కాదు. మనస్సు. మనస్సును భగవంతునిపై కేంద్రీకృతంచేసి, ఏకాగ్రతతో అర్చన చెయ్యాలి. అప్పుడే సరియైనఫలితంవస్తుంది. ఇక్కడకావలసినది ఏకాగ్రత అచంచలమైనభక్తి, విశ్వాసము. ఇలా అర్చించిన వారికి ఐహికమైన కోరికలు అన్నీ తీరతాయి.

2. అతఃపూజ. దీన్నే అంతరారాధన అంటారు. వైదికులు, బ్రహ్మవాదులు మాత్రమే దీన్నిచేస్తారు. వీరి అంతిమలక్ష్యం సాయుజ్యం. అదే ముక్తి

అంతరారాధన అంటే శరీరంలోని షట్చక్రాలలోను పరమేశ్వరస్వరూపాన్ని ఊహించి, భావనాపరంగా అర్చించటం. షట్చక్రాలలో ఆధారస్వాధిష్ఠానాలు అంధకార బంధురాలు. అక్కడ కేవలము కౌళాచారులు మాత్రమే అర్చన చేస్తారు. సమయులకు అక్కడ ప్రవేశం లేదు. సమయాచారులు అంటే శివుడికీ, శక్తికీ ఐదు రకాల పోలిక ఉన్నది. వారు 1. ఒకేచోట ఉంటారు. 2. ఒకే పని చేస్తారు. 3. ఒకే అవస్థలో ఉంటారు. 4. ఒకే రూపంలో ఉంటారు. 5. ఒకే పేరుతో ఉంటారు. అని నమ్మేవారు. వీరు షట్చక్రాలలోను పరమేశ్వరుని ఆరాధిస్తారు. వీరిపూజ మణిపూరం నుంచి మొదలవుతుంది. ఇప్పుడు ముక్తి ఐదు రకాలు.

**1. సార్షిరూపముక్తి :** మణిపూరంలో పరమేశ్వరిని అర్చించేవారు ఆమెయొక్క పురానికి దగ్గరలో ఒకగృహం నిర్మించుకుని అందులో నివసిస్తారు.

**2. సాలోక్యముక్తి :** అనాహతంలో పరమేశ్వరిని అర్చించేవారు ఆమెపురంలోనే ఒకమూల ఇల్లునిర్మించుకుని అందులో నివసిస్తారు.

**3. సామీప్యముక్తి :** విశుద్ధిచక్రంలో పరమేశ్వరిని అర్చించేవారు పరమేశ్వరికి అతిదగ్గరగా సేవకులుగా ఉంటారు. పంచబ్రహ్మలు ఈరకంగానే పరమేశ్వరిని అర్చించారని 92వ శ్లోకంలో చెప్పుకున్నాం.

**4. సారూప్యముక్తి :** ఆజ్ఞాచక్రంలో పరమేశ్వరిని అర్చించేవారు పరమేశ్వరి వంటి రూపాన్ని ధరించి ఈలోకంలో పూజలందుతూ, భక్తులకోరికలు తీరుస్తుంటారు. షిర్డీసాయిబాబావంటి మహనీయులు ఈకోవకుచెందినవారు.

**5. సాయుజ్యము :** సహస్రారంలో పరమేశ్వరిని అర్చించేవారు సాయుజ్యం పొందుతారు. వీరి వాంఛితంనెరవేరుతుంది. వీరికి పునర్జన్మఉండదు.

సమయాచారులకు షట్చక్రపూజ నియతం కాదు. వారు ఆధారచక్రంలో ఉన్న కుండలినీశక్తిని జాగృతంచేసి, గ్రంధిభేదనం చేసి, కుండలినీ శక్తిని సహస్రారానికి చేర్చాలి అక్కడ పరమేశ్వరి పరమేశ్వరునితో విహరిస్తుంది. ఇదే జీవాత్మపరమాత్మల ఏకీకరణ. ఆధారచక్రంలో నిద్రావస్థలోఉన్న కుండలినీశక్తిని జాగృతం చెయ్యాలి. అప్పుడు అది బుసలుకొడుతూ పైకిలేస్తుంది. ఇది ప్రయాణించటానికి ఒకటే మార్గమున్నది. అదే 'సుషుమ్నానాడి' సుషుమ్నగుండా ఊర్ధ్వముఖంగా బయలు దేరుతుంది. షట్చక్రాలలో ప్రతిరెండు చక్రాలకు తరువాత ఒక గ్రంథి ఉన్నది. ఆ రకంగా బ్రహ్మగ్రంధి, విష్ణుగ్రంధి, రుద్రగ్రంధి. ఈ గ్రంధిత్రయాన్ని బేధించుకుని కుండలినీ శక్తి సహస్రారంలోకి ప్రవేశిస్తుంది. సహస్రదళ పద్మము క్రిందివైపుకు తిరిగి ఉంటుంది. అక్కడకుచేరిన కుండలిని తననోటితో సహస్రదళ పద్మముయొక్క దుద్దును కరచిపట్టుకుంటుంది. కుండలిని జాగృతమైనప్పుడు స్వాధిష్ఠానంలో ఉన్న అగ్ని ప్రజ్వరిల్లి, ఆవేడి సుషుమ్నద్వారా సహస్రారంచేరుతుంది. సహస్రదళ కమలము చంద్రలోకము. ఇక్కడ పూర్ణచంద్రుడుంటాడు. అతడికి వృద్ధిక్షయాలు ఉండవు. ఇతడు నిత్యషోడశకళాయుక్తుడు. అక్కడ అమృతముంటుంది. చంద్రుని యొక్క చల్లదనానికి ఆఅమృతము ఘనీభవించి ఉంటుంది. స్వాధిష్ఠానంలో ప్రజ్వరిల్లిన అగ్నియొక్క వేడివల్ల సహస్రదళ పద్మంలోని అమృతం ద్రవరూపం పొందుతుంది. కుండలిని తననోటితో సహస్రదళపద్మముయొక్క దుద్దునుకరచి పట్టుకున్నప్పుడు, ఆపంటిగాట్లద్వారా, అక్కడ ద్రవరూపంలో ఉన్న అమృతము జాలువారి, యోగి శరీరంలోని 72వేలనాడీమండలాన్ని తడుపుతుంది. అప్పుడు యోగిపొందే ఆనందముఅనిర్వచనీయము. అది అనుభవైకవేద్యము.

సమయాచారులు అంటే ముక్తిని కోరేవారు చేయవలసినది షట్చక్రపూజ కాదు. సహస్రదళంలో పూజ. సహస్రారంలోనే పరమేశ్వరిని సేవించాలి. ఇక్కడికి చేరిన వారికి ఐహికబంధనాలుండవు. వారిసంకల్పము నెరవేరుతుంది. వారికి సాయుజ్యం లభిస్తుంది. పునర్జన్మఉండదు. వారిజీవాత్మ గాలిలోగాలిలాగా, నీటిలోనీరులాగా, ఆకాశంలోఆకాశంలాగా పరమాత్మలోలీనమైపోతుంది. ఇదే సాయుజ్యము, ముక్తి, కైవల్యము, పరమపదము.

ఇక్కడికి చేరినవ్యక్తి పరమానందస్థితిలో ఉంటాడు. అదేబ్రహ్మానందము. వయసులోఉన్నవాడు, చదువుకున్నవాడు, యుక్తాయుక్తవిచక్షణగలవాడు, సంపన్నుడు, బలమైనవాడు, ఆరోగ్యవంతుడు అయిన మానవుడు ఈ లోకంలో పొందేఆనందాన్ని మానుషానందము అంటారు. దానికి కొన్ని కోట్లరెట్లుంది బ్రహ్మానందం. అతడు పరమేశ్వరునిలోలీనమై ఎప్పుడూ బ్రహ్మానందస్థితిలోనే ఉంటాడు.

కాబట్టి ఓతల్లీ ! నిన్ను అర్చించేవాడు మొదటగా లౌకికమైన విద్య, పాండిత్యము, జ్ఞానము, సంపద, భోగభాగ్యాలు అనుభవిస్తాడు.

దుర్వాసులవారు తమ దేవీ మహిమ్న స్తుతిలోని 40వ శ్లోకంలో

**ఏవం యః స్మరతి ప్రబుద్ధ సుమతిః శ్రీమత్స్వరూపంపరం**

**వృద్ధోప్యాసు యువా భవ త్యనుపమ స్త్రీణా మనంగాయతే**

**సోఽష్టైశ్వర్య తిరస్కృతాఖిల సురః శ్రీజృంభితాత్మాలయః**

**పృథ్వీపాల కిరీట కోటి వలభీ పుష్పార్చితాంఘ్రిర్భవేత్ ॥**

అమ్మా నిన్ను అర్చించినవాడు ముదసలివగ్గు అయినాసరే, నవమన్మథుడై స్త్రీలను మోహింపచేస్తాడు. అష్టైశ్వర్యాలుపొంది సంపదలలో దేవతలనుకూడా అధిగమిస్తాడు. రాజులు, మహారాజులు, అందరూ అతనికి పాదాభివందనం చేస్తారు. 47వ శ్లోకంలో

**సురపతి పురలక్ష్మీ జృఃభణాతీత లక్ష్మీః**

**ప్రసరతి నిజగేహే యస్యదైవం త్వమార్యే ।**

**వివిధ బహు కలానాం పాత్రభూతస్యతస్య**

**త్రిభువన విదితా సాజృంభతే స్ఫూర్తి రచ్చా ॥**

అమ్మా ! నిన్ను అర్చించేవాడి గృహంలో దేవేంద్రుని ఐశ్వర్యంకన్నా ఎక్కువ సంపద ఉంటుంది. అతడికి అన్ని కళలోను ప్రావీణ్యముంటుంది. అన్నివిషయాలు తెలుసుకొనే జ్ఞానముంటుంది.

కాబట్టి సాధకుడు ఈ భోగాలన్నీ అనుభవించి, ఇవన్నీ మిధ్య అని తెలుసుకుని, అజ్ఞానాన్ని వదలి, ముక్తిమార్గంవైపు నడిచి సాయుజ్యముపొందుతాడు. అందుకే దుర్వాసులవారు తమ **'దేవీ మహిమ్నస్తుతి'**లోని 50వ శ్లోకంలో

**ప్రసీద పరదేవతే మమహృది ప్రభూతంభయం**
**విదారయ దరిద్రతాం దలయ దేహిసర్వజ్ఞతాం**
**విదేహి కరుణానిధే । చరణపద్మయుగ్మం స్వయం**
**విదారిత జరామృతి త్రిపురసుందరి శ్రీశివే ॥**

దేవీ ! నాయందు అనుగ్రహము చూపి, నాయందు గల సంసారభయాన్ని చీల్చివెయ్యి. దారిద్ర్యాన్నిబ్రద్దలుచెయ్యి. సర్వజ్ఞతనుసిద్ధింపచేయి, అమ్మా ! జరామరణనాశకమగు నీ పాదపద్మాలను నాకు సాక్షాత్కరింప చేయవలసినది. అని ప్రార్థించారు ఈ రకంగా పరమేశ్వరిని అర్చించినవారి కోరికలుతీరతాయి.

**ప్రదీపజ్వాలాభి ర్దివసకరనీరాజనవిధిః**
**సుధాసూతే శ్చన్ద్రోపలజలలవై రర్ఘ్యరచనా ।**
**స్వకీయైరమ్భోభి స్సలిలనిధి సౌహిత్యకరణం**
**త్వదీయాభి ర్వాగ్భి స్తవ జనని వాచాం స్తుతి రియమ్ ॥ 100**

తల్లీ ! నేను ఇంతవరకు నిన్ను చేసిన స్తోత్రమంతా నీవు నాకిచ్చిన వాక్కులచేత, నీవిచ్చిన జ్ఞానంచేత, బుద్ధిచేతచేసినదే. ఈ స్తోత్రమంతా కూడా సూర్యుడికి దివిటీ వెలిగించినట్లుగా, చంద్రకాంతశిలలనుండి జాలువారే బిందువులచేత చంద్రునికి అర్ఘ్యమిచ్చినట్లుగా, సముద్రంలోని జలం తీసి సముద్రుడికి తర్పణలిచ్చినట్లుగా ఉన్నది.

ఈ శ్లోకంలో శంకరులవారు తన నిరహంకారాన్ని వెలిబుచ్చుతున్నారు. ఆ పరమేశ్వరి శక్తి ఇంత అని లెక్కించలేనిది ఆవిడ అపారమయిన శక్తిమంతురాలు. అందుకని అమ్మా నీశక్తిసామర్థ్యాలను నేను పూర్తిగాచెప్పలేకపోయాను. ఇంతవరకు చెప్పినవాటిలో ఏదీ నా సొంతంకాదు. అన్నీనీవే. నువ్వు నాకు ప్రసాదించినవే. నువ్వు ఇచ్చిన మాటలతో, నువ్విచ్చిన జ్ఞానంతో, నువ్విచ్చిన బుద్ధితోనే నేను ఈస్తోత్రం చేశాను. అంతేకాని ఇందులో నాగొప్పతనం ఏమీలేదు." అంటూ సర్వస్వాన్నీ ఆ దేవికి అర్పణ చేస్తున్నారు.

నాయనలారా ! **'సౌందర్యలహరి'**లో నాకు తెలిసిన విషయమంతా **'శ్రీవిద్యాలహరి'**గా మీకు వివరించాను. ఇదేదో నా గొప్పతనంకాదు. ఆ పరమేశ్వరి

కృపచేత నాకు తెలిసినంతవరకు, నా బుద్ధికి తోచినంతవరకు, నాకు గుర్తున్నంతవరకు, సౌందర్యలహరివ్యాఖ్యను మీకు వివరించాను. మీజన్మధన్యమైంది. శ్రీవిద్యను ఆసాంతం తెలుసుకున్న మీకు ఆపరమేశ్వరి ఆయురారోగ్య ఐశ్వర్యాలను, సుఖశాంతులను, భోగభాగ్యాలను, సిరిసంపదలను ప్రసాదించాలని ఆకాంక్షిస్తూ **'లోకాసమస్తా స్సుఖినో భవన్తు'** అంటూ సౌందర్యలహరి వ్యాఖ్యను పూర్తిచేశాడు రత్నాకరుడు. ఆ వ్యాఖ్యను ఆసాంతం అత్యంత భక్తిశ్రద్ధలతో విన్నవారై, గురువుగారికి ప్రదక్షిణలు చేసి, పాదాభివందనాలర్పించి, సాక్షాత్తు పరమేశ్వరీస్వరూపమైన రత్నాకరుణ్ణి పరిపరివిధాలసత్కరించి సెలవుతీసుకున్నారు అతడి శిష్యులైన నారాయణభట్టు, కృష్ణశర్మ.

హరితస గోత్రీకుడు, శ్రీక్రోవి పురుషోత్తమ శర్మ, శ్రీమతి లక్ష్మీనరసమ్మగార్ల పౌత్రుడు, శ్రీ క్రోవి కృష్ణమూర్తి శ్రీమతి సత్యపర్వతవర్ధనమ్మగార్ల జ్యేష్ఠపుత్రుడు, **'పరమానందనాథ'** దీక్షానామధేయుడు అయిన **క్రోవి పార్థసారథి** సర్వజనామోదము పొందునట్లుగా, సులభశైలిలో వ్రాసిన **'శ్రీవిద్యాలహరి'** అను సౌందర్యలహరి వ్యాఖ్య సమాప్తము.

సర్వేజనా స్సుఖినోభవన్తు, సమస్త సన్మంగళాని భవన్తు

ఓం తత్సత్